శ్రీ ర స్తు

శ్రీదక్షిణా మూర్తి గురవేనమః

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము

నామ వళీ సహిత...

త్రైలింగ దేశస్థ సంప్రదాయ జీర్ణోద్ధారక దక్షిణాచార
ప్రవర్తక ప్రకాశానందనాథ చరణారవింద సేవా పరాయణ
కౌశిక గోత్రోద్భవ భాగీరథీరాయ ద్వితీయ
పుత్రులును కామకళానుత్ర మహా శ్రీచక్ర విశేషాద్యనేక
తత్త్వగ్రంథ రహస్యార్థ ప్రకాశకులునగు,

కీ. శే. బ్రహ్మశ్రీ

## సింహంభట్ల రామమూర్తిశాస్త్రి గారిచే

ర చిం ప బ డి న

పరిష్కరణ, ఆంధ్రతాత్పర్యసహితము.



వి జ యా వా డ

శ్రీగానుగపాటి నరసబ్రహ్మారావు

చారిటబుల్ ట్రస్టు

1 9 8 9

1౯౮౭. ఎప్రియల

ప్రతులు : 200

వెల - 50.00

Financed by Sri B. V. S. S. Mani
Director : Swadhar na Swaarajya Sangha,
29, Broad way, Madras

ప్రతులకు.
జి.వి. హానినాథ్.
"సౌందర్య లహరి"
కస్పావారివీధి,
గవర్నరుపేట,
విజయవాడ - 2

ముద్రణ
క్వాలిటి ప్రింటింగ్ & బైండింగ్ వర్క్సు
గవర్నరుపేట, విజయవాడ - 2



శ్రీ రాజరాజేశ్వరీ మహాలక్ష్మీదేవి

చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే

పుండ్రేక్షుపాశాంకుశ పుష్పబాణహస్తే నమస్తే జగదేక మాతః



జననం
2-10-1900

మరణం
8-3-1986

## శ్రీ గానుగపాటి పరబ్రహ్మరావు చారిటబుల్ ట్రస్టు

"సౌందర్యలహరి"

తిప్పావారివీధి, గవర్నరుపేట, విజయవాడ—520 002



శ్రీ చక్రము

## ఉద్ధారము

శ్లో :- బిన్దు త్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వస్ర నాగదళ షోడశ పత్రయుక్తం
వృత్తత్రయంచ ధరాసదనత్రయంచ
శ్రీచక్రరాజఉదితః పరదేవతాయాః



శ్రీ బి. ఎ. ఎస్. ఎస్. మణి,

డైరెక్టర్

'ధర్మ స్వారాజ్య సంఘం.

౭౭. బ్రాడ్వే, మద్రాసు.

శ్రీ గణేశాయ నమః

శ్రీ లలితాసహస్రనామస్తోత్రము

# ఉపోద్ఘాతము

ఆర్యులగు పంచద్రావిడ విద్వన్మహాజనులకు విజ్ఞాపనము :-

౧. సర్వేశ్వరుని సంకల్పప్రభావమువలన ఉత్పన్నమైన ఈ సృష్టియొక్క విచిత్రమును మనము విచారించి చూచుటవలన ఇది పుణ్యపురుషులకు బ్రహ్మానందప్రాప్తికి సాధనముగను పామరజనులకు బంధహేతువుగను ఉన్నది

బాలురయొక్క క్రీడలు పెద్దలకు వినోదకరమైనట్లు ఈశ్వరుని ఇచ్ఛాశక్తివలన కలిగిన సృష్టి స్వేదజములు (చెమటవల్లకలిగే పేను మొదలగునవి) అండజములు (గ్రుడ్లవల్ల పుట్టినపక్షులు మొదలగునవి) ఉద్భిజ్జములు (తృణగుల్మలతావృక్షాదులు) జరాయుజములు (మనుష్యపశుమృగాదులు) అను ఈ నాలుగువిధముల సృష్టియు సత్వము రజస్సు తమస్సు అనే మూడుగుణములు పృథివ్యప్తేజోవాయురాకాశములను అయిదు భూతముల మేళమువలన శీతోష్ణములను సుఖదుఃఖములు వృద్ధిక్షయములు బంధమోక్షములు కలిగి ౮౪ (యెనుబదినాలుగు) లక్షల జాతులుగా జీవసముదాయము ఒకదానినామరూపములు రెండవదానికి లేక చిత్రవిచిత్రముగా సృష్ట్యాదిని ఏకకాలమందు సృజింపబడినవి.

శిశువు పుట్టకమునుపే స్తన్యము కలిగినట్లు ఈ ప్రాణి

కోటి కర్మలనేర్పరచి వానికి అనుగుణమైన ఫలను నేర్పరచి దానివల్ల జీవనము ఆహారము వృద్ధిక్షయములు నీచోచ్చజన్మలు పైనిచెప్పిన ద్వంద్వములును ఏర్పరిచి సృజించబడినవి.

పైనిచెప్పిన స్వేదజాది నాలుగు జాతులలో ఒకదాని కన్న రెండవది ఉత్తమముగా నున్నది. ఆయువుమొదలగు అన్నిధర్మములందు మనుష్యులు ఉత్తములు. వారిలో అగ్ర వర్ణులు భూసురులు అనే బిరుదులు కల బ్రాహ్మణులు ఉత్త ములు. ఈప్రాణులకు సృష్ట్యాదినుంచి ప్రకృత కాలమువరకు ఎన్నిజన్మములైనవో లెక్కలేదు.

సుఖదుఃఖములు ఆహార నిద్రాభయాదులు పైనిచెప్పిన జీవసముదాయమునకంతకు సమానము. వీనిలో మనుష్యుల యందు బుద్ధి అనే సత్వభాగము అధికముగానున్నది. దానిని వృద్ధిచేసినపుడు మోక్షసాధనముగను, ఉపేక్షించినపుడు నీచ జన్మలకు కారణముగను ఉన్నది. దాని వృద్ధిక్షయములు ఆహారవిభేదముల వలనను కర్మలవలనను నడతవల్లను కలుగు చున్నవి.

౨. పైనిచెప్పినకర్మలు కర్మఫలములు సుఖదుఃఖములు కలవనుటకు లోకము అనేకరీతులుగా ఉండడమే మనకునిదర్శ నముగా నున్నది.

సకలజనులుసుఖమునుకోరి అన్నివిధముల ప్రయత్నించు చున్నారు. ఈ సుఖము నిత్యము అనిత్యము అని రెండువిధము

లుగా నున్నది. సాధారణముగా శరీరోపయోగమైన ధనాదులు అనిత్యసుఖములు ఉత్తరక్షణమందు దుఃఖప్రదములు. కాయ క్లేశము ధనవ్యయమువలన సాధ్యములు. వీనిని కోరుట సర్వ సామాన్యముగా నున్నది.

ఇఁక రెండవది నిత్యసుఖము బ్రహ్మానందస్వరూపము. అదిలభించిన పైని నాశనములేనిది. ఇప్పడును శరీరాంతమందును సుఖము కలది. అది జీవన్ముక్తిఅని మోక్షమని బ్రహ్మజ్ఞాన మని స్వస్వరూపజ్ఞానమని సంజ్ఞలుకలది. అట్టి గొప్పఫలము మనకు లభించునాఅని సంశయించరాదు. ఏచెట్టును వేసిపెంచిన వాఁడు ఆఫలముననుభవించినట్లు ఏ కర్మచేసినవాఁడు ఆ ఫలము ననుభవించును.

జనులు పామరులు పండితులు బ్రహ్మవేత్తలు అని మూఁడువిధములుగా నున్నారు. ప్రపంచజ్ఞానము మాత్రము అనఁగా శరీరమే నేననే జ్ఞానముకలవారు పామరులు. జీవత్వము నంగీకరించినవారు విధినిషేధములు. పూర్వోత్తరజన్మలు స్వర్గ నరకములు కలవని నమ్మినవారు పండితులు.

ఇఁక బ్రహ్మవేత్తలు సకలమును తెలుసుకొని ప్రాపంచి క శరీరాదులు మాయాకల్పితములని నామరూపముల నుపే క్షించి వానియందున్న సత్తాను చిన్మయముగా భావించి బ్రహ్మాకారవృత్తితో చిదానందస్వరూపులై స్వేచ్ఛాచారులై సర్వమును బ్రహ్మముగా బోధించుచు జీవన్ముక్తులుగా నున్నారు.

కా. అట్టి బ్రహ్మజ్ఞానము లభించుటకు అందరును అధికారులుగా ఉన్నారు. ఎట్లనిన: పామరులు కర్మనిష్ఠులు కావలెను. కర్మనిష్ఠులు బ్రహ్మనిష్ఠకు అధికారులుగా నున్నారు.

బ్రహ్మజ్ఞానమునకు కర్మ, ఉపాసనా అని రెండుమార్గములుగలవు. అందు కర్మకన్న ఉపాసనకాండము సన్నిహితము, సుఖకరమును అయియున్నవి. ఈ రెండింటివల్లనూ దైవము కలండనే పరోక్షజ్ఞానము కలుగును. అట్టి ఈశ్వరోపాసనము కలవారికి ఈశ్వరానుగ్రహము వలన ఆత్మవిచారణయందు ఆసక్తియు, ఐహిక భోగములందు విరక్తియు కలుగును. అందువల్ల బ్రహ్మజ్ఞానము లభించును.

ఉపాసనమునకు సప్తకోటి మహామంత్రములు శైవ వైష్ణవ శాక్తాది దేవతలు కలరు. అవి అన్నియు శ్రీ విద్యకు శ్రీదేవి రాజరాజేశ్వరీ దేవికి అంగ దేవతలుగా నున్నారు.

సప్తకోటి మహామంత్రములు శ్రీచక్రమునకు నాలుగు ద్వారములందును ఉన్నట్లు షడామ్నాయములు చెప్పుచున్నందున శ్రీవిద్యోపాసన ఇహపరసుఖములకు ముఖ్యసాధనముగా నున్నది

ఉపాసనమనగా త్రికరణములందు ఆచరణగా నున్నది. భాష్యాదుల శ్రవణముపైని వానిఅర్థానుసంధానమే ఉపాసనముగా నున్నది. ఉపాసనములేని శ్రవణాదులవలన లాభములేదు.

బ్రహ్మవిద్యకు మహావాక్యోపదేశము పూర్ణముగా

నున్నది. అట్టి మహావాక్యప్రాప్తి తురీయాశ్రమమందో లేక శ్రీవిద్యాపూర్ణదీక్షయందు కలుగునుగాని తదితరమైన మూఁడ పదార్థమందు కలుగదు.

గృహస్థునకు మహావాక్యప్రాప్తికి శ్రీవిద్యాపూర్ణదీక్ష వల్ల మహాపాదుకయందు బ్రహ్మజ్ఞానసాధన పరికరమంతయు లభించుచున్నది.

న్యాయముగా ఆలోచించగా క్రమమైన మహావాక్యోప దేశము లేనిది భాష్యపఠనపాఠనాధికారము కూడా అగుపడదు. అది అనుపనీతుని వేదాభ్యాసము వంటిది.

పై అంశములను ననుసరించి శ్రీవిద్య బ్రహ్మవిద్యగాను, ఇహపరసుఖములకు పూర్ణవిద్యగాను జగత్ప్రసిద్ధముగా నున్నది.

ఈ బ్రహ్మవిద్యను ఆదిని పరమేశ్వరుఁడు స్వాంశభూత మైన పరాశక్తికి ఉపదేశించినట్లును పరాశక్తివలన రుద్ర విష్ణు బ్రహ్మలకు పరంపరగాను బ్రహ్మవలన వసిష్ఠ సనకాదులకు లభించి క్రమక్రమముగా శంకరాచార్యాది స్వస్వగురుపరం పరగా విస్తరించి వారందఱును జీవన్ముక్తులై బ్రహ్మత్వమును పొందిరి. ఇట్లు కామకలా సూత్రములందు శ్రీవిద్యాగురుపరం పర తెలియుచున్నది

౪. ఒకకాలమందు శ్రీవిద్యోపాసనా ధురంధరులగు

ఆగస్త్యులవారు వారిగురుపులును శ్రీవిష్ణుస్వరూపులునగు హయ గ్రీవులను ప్రార్థించగా వారు ఈ లలితారహస్యనామ సహస్ర స్తోత్రమును అగస్త్యులవారికి ఉపదేశించినట్లు వారినుంచి పరం పరగా జగత్ప్రసిద్ధిగానున్నట్లు పూర్వపీఠికవల్లను నామస్తోత్ర ఫలము ఉత్తరపీఠికవల్లను స్పష్టమగుచున్నది

మన్త్రమహోదధి మొదలగు మంత్రశాస్త్రములందు అనేక మహామంత్రములకు, హృదయము కవచము మాలాపంజ రము అష్టోత్తరశతనామ స్తోత్రము సహస్రనామస్తోత్రము అను షడంగములు కలవు.

అందువలన శ్రీవిద్యకు ఈ రహస్యనామసహస్ర స్తోత్రము అంగభూతముగానున్నది విద్యలలో శ్రీవిద్య బ్రహ్మ విద్యగా ఎట్లున్నదో సహస్రనామములలో ఇది అనేక రహస్యా ర్థములు కలిగి నామపారాయణఫలమాత్రమే గాక సాధకజను లకు బ్రహ్మజ్ఞానసాధనభూతమైన ఒక వేదాంత గ్రంథముగా నున్నది. శ్రీవిద్యయందుగల మన్త్రసంకేత చక్రసంకేతపూజా సంకేతములనే సంకేతత్రయమును పిండాండబ్రహ్మాండ సామ రస్యము అంతరంగవస్తువివరముజీవబ్రహ్మైక్యము మహావాక్యా ర్థవిభాగము మొదలగు అనేకరహస్యములిందు వివరించబడినవి గనుక యిది మహాగ్రంథముగా నున్నది.

ముక్త్యపేక్షగల సాధకజనులు శ్రద్ధాభక్తులు కలిగి శ్రీవిద్యోపాసనపరులై ఈనామముల అర్థవిచారణ వలన బ్రహ్మ జ్ఞానము స్వస్వరూపజ్ఞానము కలిగి ఇహపరసుఖముం పొంద

లరు.

ఈ రహస్యనామ సహస్రస్తోత్రమునకు ఇదివరలో భట్ట భాస్కరమనే ఒక సంస్కృతవ్యాఖ్యమాత్రము పుట్టినది. అది పండిత జనసాధ్యము కాని పామరజనులకు అసాధ్యముగా నున్నందునను, అర్థాపేక్ష సర్వజన సామాన్యమైనందునను ఆంధ్రభాషతో ఈ గ్రంథమునకు తాత్పర్యమును వ్రాయమని అనేకులు ప్రోత్సాహపరిచినందునను పరదేవత నాయందనుంగహబుద్ధితో నానిమిత్తము ఇంతవరకు ఇతరులకు ప్రేరేపించక యుండ నాకు ఆజ్ఞనొసంగి నాచే వ్రాయించినది. ఈ నామములందుగల రహస్యార్థములలో ఒకసహస్రాంశమును అల్పజ్ఞుడనగు నేను తెలుసుకుని వ్రాసినట్లు తలంచెదను, సర్వజ్ఞులగు విద్వాంసులు పూర్ణముగా గ్రహించగలరు. భట్టభాస్కర వ్యాఖ్యానాంశములకన్న అచ్చటచ్చట కొన్ని విశేషాంశములు విశేషించి ఇందు వ్రాయబడినవి.

ఇందుగల బ్రహ్మణీ, బ్రహ్మజననీ, బ్రహ్మాత్మైక్యస్వరూపిణీ, శివశక్త్యాత్మికా ఇత్యాది నామములచేత శుద్ధాద్వైత బ్రహ్మము ప్రతిపాదించ బడుచున్నది. గాయత్రీ, వ్యాహృతిః, సంధ్యా, ఛందస్సారా, శాస్త్రసారా మంత్రసారా, సర్వోపనిషద్దృష్టా ఇత్యాదినామముల చేత కేవల సమయదక్షిణాచార పరులు శ్రీవిద్యోపాసకులు మాత్రము ఈనామోపాసనాధికారుల నియు, చతురాశ్రమవాసులకు అవశ్యకమనియు తెలియు చున్నది.

కులోత్తీర్ణా కౌళమార్గతత్పరసేవితా ... 

తత్పర సేవితా అను ఈ యేడునామములును కౌలాచారము శ్రీవిద్యయందు కలదని సూచించుచున్నవి గానిఅంతమాత్రము చేత కౌల వామాచారపరులగు శూద్రాదుల కధికారము లేదు. శ్రుతి వేదమందు. "బ్రాహ్మణోఽస్యముఖమాసీత్,..... పద్భ్యాగ్ంశూద్రో అజాయత. పశుమ్లేచ్ఛా దయోపిచ" ఇత్యాది ప్రయోగము లున్నందున నాలుగు వర్ణముల ప్రసంగము వేదమందున్నను ఎట్లు వేదాధికారము శూద్రాదులకు లేదో ఆ రీతినే ఇచటను గ్రహించతగినది. 'బ్రహ్మ గ్రంథివిభేదినీతుర్యా సర్వావస్థా వివర్జితా' ఇత్యాదినామములచేత గ్రంథత్రయరూపమైన శరీరత్రయాభిమానత్యాగము షట్కలమలవిభాగము మొదలగు అంతరంగ వస్తువిచారణయు, శుద్ధబ్రహ్మవస్థయు తెలియుచున్నందున ఇది బ్రహ్మజ్ఞాన సాధన గ్రంథములలో ముఖ్యముగా నున్నది. శ్రీ విద్యోపాసనయు, రహస్యనామపారాయణయు, అనేక జన్మల పుణ్యముచేత చరమజన్మయందు లభించును, స్వరూపజ్ఞానము బ్రహ్మత్వము వారికి సిద్ధించునని తెలియుచున్నది.

వామదక్షిణాచార భేదమునుగురించి:-

౫. ఇట్టి సులభమైన బ్రహ్మవిద్యను మన పూర్వాచార్యులగు శంకరాచార్య విద్యారణ్యాద్యాచార్యులు మొదలగు శిష్టజనుల ఆచరణలోనున్న బ్రహ్మవిద్యను ప్రకృతమందున్న శిష్టజనులు విచారణరహితులగు ఛాందసులుదీనికి దూరముగా నుండవలెనని భ్రమను పొందు చున్నారు. ఇందుకు

కారణము. మన బ్రాహ్మణులలో కొందఱు అవివేకులు శూద్రాదులకొఱకు తంత్రశచోదితమైన వామాచారధర్మముల నవలంబించి సురాపానాది నీచకృత్యముల నాచరించుచు శ్రీవిద్యకు ఇదియేధర్మమని వేదోక్తమని తమతమ గురుపరంపరవంశపరంపరగా నున్నదని లోకమాతకుకూడా భ్రమను కలుగజేయుచున్నందున ఇది బ్రహ్మవిద్య అగుయు, ఇందు సమయదక్షిణాచారములు వామకౌళములు అని నాలుగాచారము లున్నవనే విభాగము తెలియని శిష్టజనులు భ్రమను పొందు చున్నారు.

ఈదురాచారము బ్రాహ్మణులలోనికి వచ్చినకారణము

శ్లో. ఆంధ్రద్రావిడకర్ణాటాః మహారాష్ట్రాశ్చ ఘూర్జరాః,
పంచైతే ద్రావిడాః ప్రోక్తాః వింధ్యాద్దక్షిణవాసినః
సారస్వతాః కాన్యకుబ్జా గౌడాఉత్కలమైథిలాః,
పంచగౌడా ఇతిప్రోక్తా వింధ్యస్యోత్తరవాసినః.

ఈ ప్రమాణము ననుసరించి బ్రాహ్మణులు ఆయా దేశస్థులు పది విధములుగా నున్నారు. వీరందఱును ఆదిని ఉత్తరదేశమందు సరస్వతీనదీతీరమైన నైమిశారణ్యవాసులే యైనను క్రమక్రమముగా వృద్ధిని పొందినకొలఁది ఆయాదేశములందున్న వారికి ఆయానామములు కలిగినవి.

కొంతకాలమునుండి పంచగౌడుల ఆచారము విభిన్నముగాను వేదవిరుద్ధముగా నున్నందున ద్రావిడగౌడభేదము కలిగి

నది. మరికొంతకాలమునకు ఉత్తర దేశమందు మ్లేచ్ఛప్రభుత్వము కలిగి హిందూ ధర్మములకును దేవాలయమునకును వర్ణములకును హాని కలిగినది. వింధ్యదక్షిణవాసు లగు బ్రాహ్మణులు వారికి దూరముగా నున్నందున వారిధర్మములకు హానిరాలేదు. ఇట్లుండగా

ప్రపంచమునందుగల ౮౪ లక్షలజీవసముదాయమున్ను సత్వరజస్తమస్సులనే మూడుగుణములయొక్క వాళ్ళ భేదము చేత అనేకరీతులు కలిగియున్నది. అటులనే దేవతలు మంత్రములుకూడా ఆయా గుణప్రధానము ననుసరించి మూడువిధములుగా నున్నారు. శుద్ధాద్వైతపరములు వేదోక్తములగు బ్రహ్మపరమైనమంత్రములు. ఆయా దేవతలు సాత్వికములుగాను, ద్వైతపరమైన రాజసములుగాను, కాళీ శ్యామలా వారాహీ ఛిన్నమస్తా ధూమావతీ ప్రేతవారాహీ చండీ తారా మొదలగునవి తామసములుగాను ఉన్నవి. గాయత్రీ శ్రీవిద్యా శివపంచాక్షరీ నారాయణాక్షరీ ఇవి బ్రహ్మపరములు. శ్రీదేవి గుణాతీత అయినందున వీరందరును పరాశక్తి పరిచారకులుగాను అంగదేవతలుగాను ఉన్నారు.

౭. పరమేశ్వరుడు లోకములను సృజించి భూలోకమందు జనులు తమఛాయగానున్న మాయాశక్తికి స్వాధీనములో నుండగలందులకు ౬౪ చతుష్షష్టి తంత్రములను వారికనుగుణమైన మంత్రములను దేవతలను ఏర్పరిచినాడు. ఈతంత్రములు మంత్రములు ప్రపంచమందు గలకామ్యములకు ఒక్కొక్కటి

ఆయా కామ్యములకు ఏర్పడినవి. ఇవి రాజస, తామసప్రధానములు. వేదబాహ్యమైన వామకౌలాచారములు కలిగియున్నందున శ్రీదేవి పరశివుని తిరిగి స్వామీ వేదసమ్మతమున్ను ఒకదానివల్లనే ఇహపరసుఖములన్నియు సిద్ధించునదియు ఉపదేశించుమని ప్రార్థించగా స్వతంత్ర తంత్రమని శ్రీవిద్యలో కాదివిద్యను, సిద్ధవ్రజమనే శ్రీచక్రమును ఉపనిషదర్థానుసారమైనవి. వేదమార్గసమ్మతములు వీనిని సృజించినారు. వీనిఆచారము సమయాచారమని దక్షిణాచారమని తక్కిన ౬౪ తంత్రములు వేదబాహ్యములు కౌలమని వామాచారమని సంజ్ఞలు కలవి. శ్రీవిద్య పూర్ణ గాయత్రీవల్లనే కాదివిద్య యొక్క ఉత్పత్తి గనుక సాత్వికవిద్యగానుండి సనకాదిమహాఋషులనుంచి పరంపరగా బ్రాహ్మణాచరణలో నుండి సమయదక్షిణాచారములు కలిగియున్నది.

౬౪(అరువదినాలుగు)తంత్రములలో చేరి రాజసతామస మంత్రములు ఆయా దేవతలలో కొన్ని మిశ్రమములుకలవు. మిశ్రమములందు శ్రీవిద్యాపంచదశమంత్రమున్ను నిత్యా దేవతలు ప్రచారము కలిగినను వామాచారముగా నున్నందునను క్షత్రియాది త్రైవర్ణికుల ఆచరణలో నున్నవి.

పరశురామ దత్తాత్రేయ కపిల దూర్వాసాదులు కౌల వామాచారపరులై ఈ రెంటు ఆచారములగురించి కులార్ణవము మొదలగు అనేక గ్రంథములను వ్రాసినారు.

సనకసనందనాదులువసిష్ఠాదులుసమయదక్షిణాచారపరులు

వీరు బ్రాహ్మణులకొఱకు సనకాది అయిదు సంహితలను వేద మార్గ సమ్మతముగా వ్రాసినారు. ఇందువలన బ్రాహ్మణులు తంత్రమార్గమందు ఆయామంత్రోపాసన కూడదనియు క్షత్రియాది త్రైవర్ణికులకు తురీయాశ్రమాధికారమందు మహావాక్యోపదేశము లేనట్లు శ్రీవిద్యాషోడశాక్షరీ విద్యయు మహామనుకయు వారికి ఉపాసించుటకు అధికారము లేదు.

వీరు ఎవరికి విహితమైన ఆచారమును వారు ఆచరించుటకే అధికారులు. శూద్రాదులు దక్షిణాచారమును, బ్రాహ్మణులు వామకౌలముల నాచరించినపుడు శాస్త్రమయీ వర్ణాశ్రమ విధాయినీ అనే నామాధిదేవతయగు శ్రీదేవియొక్క ఆజ్ఞోల్లంఘనదోషు లగుదురు.

౩. బ్రాహ్మణులు ఐహికఫలాపేక్షకలిగి తంత్రవచనములను ప్రమాణముగా గ్రహించి వామకౌలాచారమందు ప్రవేశింతురనియు, శుభాగమ పంచకానుసారమే బ్రాహ్మణులకు శ్రేయస్కరమనియు, వేదవిరుద్ధాచరణ బ్రాహ్మణులు ఆచరించినపుడు వారు భ్రష్టులగుదురనియు, సురాపాన ప్రాయశ్చిత్తార్హులగుదులనియు, అపాంక్తేయులగుదురనియు, వారిని బహిష్కరించమని శ్రీగౌడపాద శంకరాచార్య విద్యారణ్యాదులు తమతమ గ్రంథములందు వక్కాణించిరి.

ఇటుల అనేక ప్రమాణములున్నను మన బ్రాహ్మణులలో కొందఱు సాహసులు శ్రీవిద్యోపాసనలో వామాచారము

నవలంభించి సురామాంసాదులతో దేవతార్చనాదుల నాచరిం మచు సురాపానము చేయుచు నిర్లజ్జతో తాముసు శిష్టజనుల మేయని తిరుగుచు లోకులనుకూడా భ్రష్టులుగా జేయు చున్నారు వీరినిచూచి శ్రీవిద్యయే దురాచారమనియు దానిని తెలచకూడదనియు శిష్టజనులకు సంశయమును భయమును కలుగజేయుచున్నారు.

వీరిమూలముగా బ్రహ్మవిద్యయగు శ్రీవిద్యకు గొప్ప అప్రతిష్ఠ కలిగినది. ఇట్టిపూజ్యమైన సర్వోత్తమమైన బ్రహ్మ విద్యగానున్న శ్రీవిద్యయం దధికారులగు మనదేశములయం దున్న పంచద్రావిడబ్రాహ్మణులకు శూద్రార్హమైన వామా చార మెట్లు తటస్థించినదని పెద్దలతో యోచించగా తెలిసిన దేమనగా :—

కాశ్యాది ఉత్తరదేశమందును వంగమైథిలాది దేశము లందును ఆదినుంచియు శూద్రాభైరాగులు కాపాలికులు మొదలగువారును గౌడబ్రాహ్మణులు తురుష్క-రాజ్య పాలన చేత వేదబాహ్యులై తంత్రమార్గముల నవలంభించి వామా చారమతావలంబనకలవారై ఉన్నారు. పంచద్రావిడబ్రాహ్మణు లలో మహారాష్ట్రులు కరాడీలు కొంకణస్థులు దేశస్థులు అని మూడు తెగలుగా నున్నారు. వారిలో కొందఱు పరశురామ సృష్టిలో వారు పరశురామ సూత్రప్రకారము, మరికొందఱు దత్తాత్రేయతానుసారముగను ఈ రెండు తెగలవారు వామా చారముగా శ్రీవిద్యా శ్రీచక్రార్చనలను ఆచరించుచున్నారు.

తక్కిన దేశస్థుల కొందఱు ద్వైతమతావలం బులు, కొందఱు అద్వైతమతావలంబులు కలరు. వారిలో అద్వైతమతస్థులు సమయదక్షిణాచార ప్రకారము శ్రీవిద్యోపాసనకలవారనేకులు గలరు.

ఇంక ఘుర్జరులు గౌడదేశమధ్యస్థులు నవీనమైన వల్లభమతస్థులుగా నున్నందున వారు శ్రీవిద్యాచరణలోను వామాచారపరులుగా నున్నారు. దక్షిణ దేశస్థులగు ద్రావిడ బ్రాహ్మణులు సమయదక్షిణా చారపరులుగా నున్నారు. ఒకానొకరు వామాచారులున్నచో వారు బ్రాహ్మణబృంద ముచే బహిష్కరించబడి యున్నారు.

కర్ణాటక ఆంధ్ర దేశములందు నివసించునట్టివారిలో కొందఱు కాశీ నవద్వీపములకు విద్యాభ్యాసముకొఱకు వెళ్ళి విద్వాంసులై గౌడ (ఆ) బ్రాహ్మణులవద్ద శ్రీవిద్యాపూర్ణదీక్షను పొంది వామాచారపరులై శ్రీవిద్యయందు సమయదక్షిణాచార భేద మున్నదనే జ్ఞానమే లేక ఈ వామాచారమే ఈ విద్యకు ప్రధానమనేనమ్మకము కలవారై ఆచరించుచు వారు మన స్వదేశమునకు వచ్చి తమశిష్యులకు కోరినవారికి కోరనివారికి కూడ వామాచారముగా శ్రీవిద్యామంత్రదీక్షల నిచ్చుటవల్ల యీ దురాచారము అంతకంతకు ప్రబలమైనది.

ఇందు మద్యపానమత్తతయు స్వస్త్రీ పరస్త్రీ భేదరహితము మొదలగు దురాచారములున్నందున ఇహమందు పరమందుకూడ సుఖము నిచ్చునని వారు సంతసించుచు శ్రీవిద్యో

వామ అనే మిషపైని త్రాగుబోతులై లజ్జావిహీనులై తిరుగు చున్నారు.

ఇటులనే రామానుజమతమనే పేరుతో కొందఱు వైష్ణవులు జాతిభేదము లేకుండ మద్యపానముచేసి స్థూలశరీరాభిమానము స్వపరభేదము లేనివారై స్వేచ్ఛాచారులై ఆనందించు చున్నారు.

కనుక యిట్టి వామాచారముగలవారికి ప్రాజ్ఞులు దూరముగా నుండి బాగుగ గురుసంప్రదాయమును తెలుసుకొని సర్వసామాన్యముగానున్న వేదమార్గమైన శ్రీవిద్యాదీక్షను పొంది ఆత్మానాత్మవిచారణ గలవారును దైవానుగ్రహముకల వారునై ఇహపరసుఖములను పొందగలరు.

౮. శుభాగమపంచకమను సనకాది సంహితలు అంతట లభించుట లేదుగదా ఈ వామదక్షిణాచారభేద మెట్లు తెలుసుకోవడమనిన మనలో అందఱును వేదాభ్యాసము ధర్మశాస్త్ర జ్ఞానము కలవారు కారు. పండితులు పామరులు కూడ గలరు ప్రతి గ్రామమందు నాలుగు వర్ణములవారును నివసించి యున్నను ఎవరి ఆచారప్రకారము వారు ఉండలేదా? అటులనే శిష్టాచారము వేదసమ్మతము గలదిసమయాచారమనియు; లోకనింద్యము వేదబాహ్యము వామమనియు గ్రహించవలెను.

శ్రీవిద్యోపాసకులలో వామదక్షిణాచారములను

తెలుసుకొనే లక్షణములు .—

## సమయాచారస్వరూపము.

ఈ సహస్రనామావిభాగమం దచ్చటచ్చట సూక్ష్మము ఈవిభాగము మాచే సూచింపఁబడినది. దానినే కొంచెము గా విస్తరించి నిరూపింపఁబడుచున్నది.

సమయశబ్దమును పూర్వాచార్యులు వేదపరముగా అన్వయించిరి. బ్రహ్మాత్మైక్యభావనయే సమయశబ్దనిర్వచనము. వేదసమ్మతముగా శ్రీచక్రార్చనాదులు జరుపుట బాహ్యపూజాకలాపము దక్షిణాచారమని అంతర్ముఖులై అంతరంగ వస్తు విచారణ చేసి సహస్రారకమలమందు శ్రీచక్రము నైక్యము సంపాదించి బిందుమండలమగు ద్వాదశాంతమందు చిచ్చంద్రునితో పరాస్వరూపిణ్ణి ఐక్యమును భావించి అందు బ్రహ్మాత్మైక్యమును భావించుట సమయాచారమని రూఢి ఇది అంతర్యాగము. ఈ అంతర్యాగబహిర్యాగములు రెండును కౌల సమయాచారులకు భేదముగానున్నవి.

దక్షిణాచార సంప్రదాయమందు దక్షిణామూర్తి ఋషి, కామేశ్వరీ కామేశ్వరు లధిదేవతలు. కల్పసూత్రప్రకారము వేదసమ్మతముగా రాజోపచార దేవోపచారములను జరుపుట దక్షిణహస్తముతో పూజాకలపము కలశ సామాన్యార్ఘ్యము, విశేషార్ఘ్యములనే పాత్రత్రయము. శ్లో. విప్రాః క్షోణి భుజో విశ స్తదితరే క్షీరాజ్య మధ్వాసవైః, శ్రీచక్రేయజనంక్రమేణ

హితంత త్రతత్కాలీనైర్నరైః. ఇత్యాదివసిష్ఠ సంహితోక్త ప్రకారము బ్రాహ్మణులు క్షీరద్రవ్యముతో విశేషార్ఘ్య పాత్రాసాదనము పూజాకాలమునందు, సువాసినీ బ్రాహ్మణ భోజనాదికము. ఈ ధర్మములుకలది సమయ దక్షిణాచారము లని తెలుసుకొనవలెను.

## కౌల వామాచారలక్షణములు.

భైరవఋషి భైరవ భైరవు లధిదేవతలు. పరశురామ సూత్ర ప్రకారము పూజాకలాపము ౬-౧౦-౧౧ వరకు పాత్రా సాదనము వామహస్తముతో తర్పణాదికము సురామాంసాది కముతో పూజ, ప్రత్యక్షయోని పూజయు దేవీవామహస్త హస్తమందు పూజాసమర్పణము. యవనికాభ్యంతరము తెర చాటున పూజ నానాజాతి స్త్రీలయందు సువాసినీపూజ కుల స్త్రీనియామకము ఈ లక్షణములుకలది వామాచార కౌలా చారములనియు; అంతర్యాగమందు స్వాధిష్ఠానకమలమందు బిందుస్థాన భావనయు వీరిమతము. కౌళులలో పూర్వ కౌళు లని ఉత్తరకౌళులని భేదముకలదు. వారివారి ఆచార భేదములు స్మరణార్థములు కానందున వ్రాయలేదు.

పైని ఉదహరించిన అంశములను పూర్వాచార్యులు ఆయాగ్రంథములందు వాడుకొనిరి.

౮. సమయాచారమందు బ్రహ్మవిద్యా గురుపరంపర:—

శ్లో. ప్రకాశరూపం శివమాదినాథం పరాంబికాం శంకరమాది

దేవం,

నారాయణం పద్మభువం వసిష్టంశక్తించ తత్పుత్రపరా
శరం చ

వ్యాసం శుకం గౌడపదం మహాంతం గోవింద యోగీంద్ర
మథాస్య శిష్యం,

శ్రీశంకరాచార్య మథాస్య పద్మపాదంచ హస్తా మలకంచ
శిష్యం,

తంత్రోటకం వార్తిక కారామన్యా వస్మద్గురూ — సంతత
మానతో ౽ స్మి.

వసిష్ఠసంహితాయాం .—

ఇందు పూర్ణదీక్షాక్రమము:—

శ్లో. శుద్ధాబాలాచ మాతంగీ గురవోగణప స్తథా,
సౌభాగ్యవిద్యావారాహి తిరస్కరిణికాతథా
లోపాముద్రా తురీయాంబా ప్రాసాదాసహ షోడశీ,
శ్రీపరాషోడశీచైవ శ్రీమహాపాదుకాస్తథా,
ఏవం పూర్ణాభిషిక్తానాం జపక్రమ ఉదాహృతః,
ఇట్లు (౧౬) పదియారుమంత్రములు పూర్ణదీక్షకలవి.

శ్యామలావారాహీలను ప్రత్యేకము పీఠవిద్యలుగా గ్రహించినపుడు వామమార్గముగా పూజనీయములైనను ఇచట శ్రీవిద్యాంగ దేవతలుగా గ్రహించుటవలన దక్షిణమార్గము గనే పూజింపఁబడుచున్నారు. ఇది శ్రుతిస్మృతివిహితమై, శిష్ట జనాదరణీయములో నున్నది.

బ్రాహ్మణ స్త్రీలకును, క్షత్రియాది త్రైవర్ణికులకు బాలా పంచదశీలవరకే అధికారము. బ్రాహ్మలకు తప్ప ఇతరులకు షోడశీనుంచి పై మంత్రాధికారములేదు.

ఇంక వామాచారమందు గురుపరంపరాక్రమము :-

శ్లో. శ్రీనాథాదిగురుత్రయం గణపతిం పీఠత్రయం భైరవం,
పీఠాద్యష్ట చతుష్షష్టినవకం వీరావళీపంచకమ్,
శ్రీమన్మాలిని మంత్రరాజసహితం వందేగురోర్మండలమ్,

వీరికి (౩౨) ముప్పదిరెండు మంత్రములు పూర్ణదీక్ష అని వాడుక గలదు.

శ్లో "శుద్ధాబాలాచమాతంగీ ద్వాదశార్ధామతంగినిత్యాది క్రమేణా నత్త
రావత్యనా ద్వాత్రింశద్దీక్షాస్తంత్రేషు ప్రసిద్ధాః సంప్ర దాయ
క్రమాయాతద్వాత్రింశ ద్దీక్షాదీక్షితాంతః కరణైః పురుష ధారే నైమ కేవలఖ్యానా న్యైరితి."

ఈ ప్రకారము భట్టభాస్కర వ్యాఖ్యానమందు (౨౫) ఇరవై అయిదవనామము. 'శుద్ధవిద్యాంకురాకారద్విజపఙ్క్తి ద్వయోజ్జ్వలా' అను నామవ్యాఖ్యానమందు వ్రాసినారు. వీనిలో శ్రుతిస్మృతి విరుద్ధాచారములు గలవి చాలా ఉన్నందునను, శుద్ధమైన కౌలవామాచారములందు శ్రీవిద్యాషోడసాక్షరీ మహాపాదుకామహావాక్యాదులు లేనందునను, ఈ (౩౨) ద్వాత్రింశ

దీక్షాపద్ధతివారు సంహితలలో చెప్పిన దక్షిణాచారపరులు కారు. శుద్ధకౌళవామాచారులును కారు.

వేదోక్తమైన శ్రీవిద్యోపాసకులగు కొందఱు బ్రాహ్మణులు సమయాచారదీక్షలో చెప్పిన షోడశీమహాపాదు కాదులను వామాచార కౌలాచారములలో చెప్పిన మాలినీ మొదలగుమంత్రములు కలవి ముప్పదిరెంగు మంత్రములు, 3 అదీక్షలు కలవని ప్రత్యక్ష వామాచారపరులై వాడుచున్నారు. కానవీరిది సంకరమతముగా నగుపడున్నందున శ్రుతిస్మృతి బాహ్యము వామములోనే చేరియున్నది.

వసిష్ఠసంహితాయాం:-

శ్లో. భగవన్ సర్వతంత్రాణి భవతోక్తాని వై పురా,
తేషామన్యోన్యసాపేక్షా జ్ఞాయతే మతివిభ్రమః
తస్మాత్తు నిరపేక్షంవై తంత్రం తాసాం వద ప్రభో.
ఇతి దేవ్యాప్రార్థిత ఉవాచశంకరః :-

శ్లో. శృణు కాదిమతంత్రం త్వం పూర్ణామన్యానపేక్షయా,
గోప్యం ప్రయత్నేన గోపనస్తంత్రచోదితః
లలితావిద్యయా విద్యామన్యాం యంత్రేణవాఽమునా,
యంత్రమన్యత్సమంవేత్తి యోసౌస్యాన్మూఢచేతనః

శ్లో. గురుశిష్యపదేస్థిత్వా స్వయమేవ సదాశివః,
ప్రశ్నోత్తరపరైర్వాక్యైస్తంత్రం సమవతారయత్.

శ్రీవిద్యాతంత్రం స్వతంత్రతంత్రమితి శ్రీచక్రం సిద్ధవ జ్రమితి శ్రుతిస్మృతిపురాణ సిద్ధానిబహూని వచనానిసంతి.

ప్రకృతమందు యుగధర్మము ననుసరించి జనులకు విప రీతాచారములందాసక్తియు, సదాచారములందు ఉపేక్షయు కలుగుచున్నవి. "ఆచారః ప్రథమోధర్మః. ఆచారహీనం నపునంతివేదాః. ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః. వీనిననుసరించి ప్రాజ్ఞులు వివేచనకలవారై సదాచార ప్రవృత్తి గలవారగుదురు గాక. అని పరదేవతను ప్రార్థించుచున్నాను.



# పరిహారము.

## సురాపాన ప్రాయశ్చిత్తము.

సర్వాధికారముగల పంచద్రావిడ బ్రాహ్మణులందు వామాచార ప్రవృత్తిసంభవము ఆదియందు అజ్ఞానకృతము గాని బుద్ధిపూర్వకముగాదని పైనిచెప్పిన ఆగమనకారణముల వల్ల తెలియుచున్నది. ఇది పరంపరగా వ్యాపించినందున స్వధర్మము సమయాచారము కలదనే జ్ఞానము లేనందున శ్రీవిద్యకు ఇదియే ధర్మమని నమ్మికతో తరువాతవారుకూడా పరమార్థమందు కోరికతోనే ఆచరించుచున్నారు. ఇందువల్ల

శ్రీవిద్యకు గొప్ప అప్రతిష్ఠ కలిగినది.

వీరిలో పశ్చాత్తాపముగలవారుయుక్తాయుక్తవిచక్షణకల వారుగ ఒక తెగగాను, జిహ్వాచాపల్యము మద్యపానాసక్తినో నాచరించువారు ఒ రెండవతెగ ఇట్లు రెండువిధములుగా నున్నారు

వృద్ధి మిచ్ఛన్మూలచ్ఛేదః వృద్ధికోరుతూ మూలమును చ్ఛేదించినట్లు అణుమాత్రముగ సత్వగుణముకలవారు దానిని ఆహారాదుల చేత వృద్ధినిక్షయమునుకూడ పొందించవచ్చును జలహోమము చేత అగ్ని శాంతించినట్లు తమోగుణమునుబుద్ధి మాంద్యమును చిత్తభ్రమ మొదలగు దుర్గుణములుగల మద్య పానమువలన మునుపున్న అణు మాత్రముకూడ నశించి చండాల ప్రాయుండగును.

దురహంకారులకు పానాసక్తులకు పరిహారము లేదు. వీరిలో ఒకటవతరగతిగలవారు వివేకము కలిగి దారాచారము అజ్ఞానవశముచే సంభవించినచో పశ్చాత్తాపముగలవారై నప్పుడు దినుక నుదహరించినప్రకారము శ్రుతిస్మృతి విహితమైన సమ యాచారములోనికి రాగలరు.

వీరికిగురుపరంపరయు మంత్రములు మూరసక్కర లేదు మనము చేసినసత్కర్మలవల్ల మన పితృ దేవతలు ఎట్లుతరించు చున్నారో ఆరీతిని వీరు వివేకులై సదాచారసంపన్నులైనందున వారి గురుపరంపరయు పితృదేవతలుకూడ నరకకుండములనుంచి తప్పినవారై ఉత్తమలోకములను బడుపొందగ.

"పశ్చాత్తాపేనశుధ్యతి" అనిధర్మశాస్త్రము. అట్టి పశ్చాత్తాపములేనివారికి అధోగతియు నరకకుండములు సిద్ధముగనే యున్నవి.

వీరు మోహినీమాయలో మునిగి మనకు కొన్ని సమాధానములు చెప్పుచున్నారు. వాని నిజస్థితిని విచారించిన వారిది భ్రమ అని తెలియుచున్నది.

౭. వామాచారమువల్ల ఇహమందు సకలైశ్వర్యము కలుగునని ఆ రీతినే పరమున్ను కలుగునని; దీనిని విచారించగా ఉత్తమాధికారుల సత్కుటుంబములలో వారు అంధపరంపరగా ఎవరు వామాచార ప్రవృత్తిలో దిగిరో వారికి వంశహీనముగాని పూర్వస్థితిమారి దరిద్రము గాని త్వరలోనే సంభవించి వారి వంశస్థులు దారిద్ర్యబాధల ననుభవించడము ప్రత్యక్షముగా చూచుచున్నారము.

స్వకులాచారమందున్న వారి పుణ్య తారతమ్యానుసారముగా ఇహపరసుఖములుకలుగుచున్నవి శ్రీవిద్యోపాసకులకు బ్రహ్మజ్ఞానసంపత్తి జీవన్ముక్తిప్రత్యక్షముగానున్నది. వర్ణాశ్రమ విధాయినీ అన్నదా వసుదా జ్ఞానరూపిణీఅనేబిరుదులుగల శ్రీదేవి భక్తులకు ఇహపరసుఖముప్రత్యక్షముగాకలదు. ప్రతికూలముగా నడచినవారు శ్రీదేవికి ఆగ్రహపాత్రులు మరికొందరు వామాచారప్రకారము తీర్థప్రసాదములు స్వీకరించిన వారికి అందరికిని జ్ఞానిమహిమవల్ల పరాహంతా చిదానందలాభము కలుగునని చెప్పుచున్నారు. అది సురాపానగుణమగు మతిభ్రమగా నున్నది.

త్రాగుబోతులు గానము నృత్యము మోహము రోదనము హాసము ప్రలాపము ఆశుకవనము ఇత్యాదిచేష్టలు కలిగియుండుదురు. పరస్త్రీలు దుష్కులస్త్రీలు వీరికి కులాపూజాంగనలు ఇట్టి ఆనందము శునకసూకరాదులుకూడ సదా పొందుచున్నవి. ఆయానందము క్షణికము గాన వీరి స్వేచ్ఛాచారము మృగములు పక్షుల ఆనందమువంటిది.

కౌలవామాచారములుకూడ వేదోక్తములని యాగాదులందు సోమపానము మాంసభక్షణము ఎట్లు విహితమో ఆరీతిని తమది దేవీయాగమని నందుకు సురాపానముకు తేజసివిరన్యాయము. "శ్రు. నసురాం పిబేత్, నకలంజంభక్షయేత్, నపరదారాగచ్ఛేత్." యాగములు వీరివలె తెరచాటునచేయుట లేదు. స్త్రీలుకూడ నిందింతురని వీరికి తెరచాటుతంత్రచోదితము. వీరివలెను సురామాంసాదులతో యాగములు నిత్యము చేసేవారు లోకములో మాలమాదిగలు మ్లేచ్ఛులు యానాదిగ మొదలగు హీనజాతు లనేకులుగలరు వారికె స్వకులాచారము గాన వారికన్న వీరికి ఎక్కువఫలము సిద్ధించడము నిజము. "శ్రు. త్రిపురోపనిషత్తులో—పరిస్రుతంఝషమాజంపలంచ.... సుకృతసిద్ధిమేతి." ఇందుగల పరిస్రుతం; ఝషం, ఆజంపలం, చ ఈశబ్దము వీరు సురా. మత్స్య. ఛాగమాంసములకు అన్వయించి భ్రమను పొందుచున్నారు. పరిస్రుతం=జీవభావము మత్స్యపం=జీవభావము, అజ పలం=మూలప్రకృతి ఇంద్రియ సముదాయము న్న. ఇదిరహస్యార్థము. ఈ శ్రుతికి అర్థమును విద్యారణ్య

లవారు సదాచారదీపికలోను విరివిగా వ్రాసినారు. ముందు చూడఁగలరు.

మాచే వ్రాయఁబడిన కామకలాసూత్రముల ఆంధ్రవ్యాఖ్యానమందు విరివిగానున్నది. కాన వీరిభావము శ్రమగా నున్నది.

పశ్చాత్తాపము గలవారికి పరిహారము

వసిష్ఠసంహితాయాం— శ్లో. కృతస్యాఖిలపాపస్యజ్ఞానతోఽజ్ఞానతోఽపివా, ప్రాయశ్చిత్తం పరంప్రోక్తం పరాశక్తేః పదస్మృతిః. తత్రైవ. ఇదంచ శృణు దేవేన్ద్ర రహస్యం పరమం మహత్, సర్వేషామేవపాపానాం యోగపద్యేననాశనం, భక్తిశ్రద్ధాసమాయుక్తః స్నాత్వాఽన్తర్జలసంస్థితః అష్టోత్తరసహస్రంతుజపేత్పంచదశాక్షరీం, ఆరాధ్యపరమాంశక్తింముచ్యతే సర్వకిల్బిషైః. ఇత్యాద్యనేకవచనాని శ్రుతిస్మృతిధర్మశాస్త్రసిద్ధానిసంతి.

తా. అజ్ఞానవశమున బ్రాహ్మణుఁడు వామాచారపరంపరలో శ్రీవిద్యాదీక్షను పొందినపుడు సమయదక్షిణాచారములు అగ్రవర్ణోచితములుగలవని తెలిసినపుడు దక్షిణాచారమందు చేరుటకు కోరికకలిగినపుడుస్నానముచేసి నిత్యకర్మానుష్ఠానానంతరము సకలదురితక్షయార్థము సంకల్పముచేసి శ్రీలలితాంబను పూజచేసి, అష్టోత్తరసహస్రము (౧౦౦౦ వేయిన్ని ఎనిమిది

మారులు) శ్రీవిద్యాపంచదశీమన్త్రమును జపించి శ్రీదేవికి సమర్పించి అంతటినుంచి వామాచారమును పరశురామ తంత్రమును మాని కల్పసూత్రప్రకారము శ్రీచక్రార్చనాదులను జరపవలెను. అట్లుచేసినవారు పరిశుద్ధులగుదురు.

పైనుదహరించిన అంశములందు గలలోపములును విమర్శించి నాకు తెలిపినచో సమాధానమును తెలుపగలను

ఇట్లు, విద్వజ్జనవిధేయుడు,
సింహాంభట్ల రామమూర్తిశాస్త్రివారు

శ్రీ లలితాసహస్రనామస్తోత్ర

# అకారాది నామసంఖ్యానుక్రమణిక.

అకారాదినామాని.

౩౯.

౭౬౦ అకాన్తా

౯౪ అకులా

౪౮౯ అక్షమాలాది

౫౫౩ అగ్రగణ్యా

౫౫౪ అచిన్త్యరూపా

౯౯౩ అజ్ఞానధ్వాన్త దీపికా

౮౬౬ అజా

౬౬౩ అజాజైత్రీ

౫౦౮ అతిగర్వితా

౬౪౯ అదృశ్యా

౯౮౮ అద్భుతచారిత్రా

౯౮౨ అనఘా

౫౦ అనవద్యాఙ్గీ

౯౨౬ అనర్ఘ్యకైవల్యపద దాయినీ

౨౯ అనాకలితసా

౨౯౬ అనాదినిధనా

౪౮౫ అనాహతాబ్జ

౮౧౫ అనిత్యతృప్తా

౨౭౩ అనుగ్రహదా

౪౫౧ అనుత్తమా

౬౨౦ అనేకకోటి

౯౪౨ అపరిచ్ఛేద్యా

౬౬౯ అపర్ణా

౪౧౩ అప్రమేయా

౯౯౦ అభ్యాసాతిశయ జ్ఞాతా

౫౩౭ అమతిః

౮౧౪ అమూర్తా

౪౮౩ అమృతాది

౬౧౬ అమేయాత్మా

౪౨౭ అయ్యై
౮౯౬ అయోనిః
౩౭ అరుణారుణ
౬౮౪ అవరదా
౩౯౮ అవ్యక్తా
౯౯౨ అవ్యాజకరుణామూర్తిః
౬౭ అశ్వారూఢా
౧౫ అష్టమీచన్ద్ర
౬౬౨ అష్టమూర్తిః
౫౧౫ అస్థిసంస్థితా

ఆకారాదినామాని. ౧౦.

౧౦౩ ఆజ్ఞాచక్రాన్తరాళ
౫౨౧ ఆజ్ఞాచక్రాబ్జనిలయా
౬౧౭ ఆత్మనే
౫౮౩ ఆత్మవిద్యాయై
౬౧౫ ఆదిశక్తిః
౭౨౯ ఆనందకలికా
౯౯౪ ఆబాలగోపవిదితా
౨౮౫ ఆబ్రహ్మకీటజననీ
౪౭౯ ఆరక్తవర్ణా
౯౭౨ ఆశోభనా

ఇకారాదినామాని. ౩.

౬౫౮ ఇచ్ఛాశక్తిజ్ఞానశక్తి
౪౧ ఇన్ద్రగోపపరిక్షిప్త
౫౬౪ ఇన్ద్రధనుఃప్రభా

ఈకారాదినామాని. ౨.

౭౧౨ ఈశా
౨౭౧ ఈశ్వరీ

ఉకారాదినామాని. ౫.

౮౪౮ ఉదారకీర్తిః
౬ ఉద్యద్భాను
౮౪౯ ఉద్దామవైభవా
౨౮౧ ఉన్మేషనిమిషోత్పన్న
౬౩౩ ఉమా

ఏకారాదినామాని. ౧.

౬౬౫ ఏకాకినీ

ఓకారాదినామాని. ౨.

౭౬౩ ఓజోవతీ
౭౬ ఓడ్యాణపీఠనిలయా

కకారాదినామాని. ౮౧.

౮౬ కంఠాధఃకటిపర్యన్త
౫౯౦ కటాక్షకింకరీభూత

అంకారాదినామాని. .

౫౮౭ అంకుశాదిప్ర

లోకకల్పిత
౮౨ కామేశ్వరాస్త్రనిర్దగ్ధ
౩౨౧ కామాక్షీ
౮౬౨ కార్యకారణనిర్ముక్తా
షమ్యా
౪౬౪ కాలకంఠీ
౫౫౭ కాలహన్త్రీ
౪౯౧ కాళరాత్ర్యాదిశక్త్యౌ
౭౯౮ కాన్యకలా
౬౧౩ కావ్యాలాపవినోదినీ
౮౫౯ కాష్ఠా
౭౦ కిరిచక్రరథా
౬౨౨ క్లీంకారీ
౧౧౦ కుణ్డలినీ
౪౪౨ కుమారగణనాథా
మ్బా
౪౩౮ కురుకుల్లా
౧౪ కురువిన్దమణి
౭౪౦ కులకుణ్డాలయా
౯౧ కులసంకేతపాలినీ
౯౨ కులాంగనా
౯౩ కులాన్తస్థా
౯౦ కులామృతైక
౯౫ కులయోగినీ
౮౯౬ కులరూపిణీ

౪౩౯ కులేశ్వరీ
౭౧౪ కులోత్తీర్ణా
౪౩౬ కుశలా
౮౯౬ కూటస్థా
౪౩ కూర్మపృష్ఠజ
౩౭౪ కృతజ్ఞా
౬౨౩ కేవలా
౬౨౫ కైవల్యపదదాయినీ
౭౨౧ కోమలాఙ్గీ
౪౩౭ కోమలాకారా
౬౯౦ కోశనాథా
౪౪౧ కౌళమార్గతత్పరసే
వితా
౯౪ కౌళినీ
౯౨౫ కౌళినీకేవలా
౧౬౯ క్రోధశమనీ
౯ క్రోధాకారాఙ్కుశో

ఖకారాదినామాని. ౧.

౪౭౮ ఖట్వాఙ్గాదిప్రహరణా

గకారాదినామాని.

౨౪.

౮౫౪ గంభీరా
౮౫౫ గగనాన్తస్థా
౭౧౯ గణామ్బా
౬౩౬ గన్ధర్వసేవితా

గకారాదినామాని.

చకా.

ముఖీ

౨౦ తారాకా నితిరస్కారి

౨౭౦ తిరోధానకరీ

౧౨౬ తుభ్యం

౨౬౨ తుర్యా

౪౪౩ తుష్టిః

౪౫౨ తేజోవతీ

౨౫౯ తైజసాత్మికా

౮౮౨ త్రయీ

౫౮౮ త్రికూటా

౯౮౬ త్రికోణగా

౫౯౭ త్రికోణాన్తరదీపికా

౯౮౩ త్రిఖండేశీ

౭౬౪ త్రిగుణాత్మికా

౯౮౪ త్రిగుణా

౬౨౭ త్రిజగద్వన్ద్యా

౯౨౯ త్రిదశేశ్వరీ

౪౫౩ త్రినయనా

౮౬౫ త్రిపురమాలినీ

౬౨౬ త్రిపురా

౯౭౬ త్రిపురాంబికా

౯౭౮ త్రిపురాశ్రీవశంకరీ

౧౮౭ త్రిదేశా

౬౨౭ త్రిమూర్తిః

౪౧౭ త్రిలోచనా

౭౬౦ త్రివర్గదాత్రీ

౮౧౩ త్రివర్గనిలయా

౮౧౪ త్రిస్థా

౭౬౨ త్రింశికా

౬౬౦ త్ర్యక్షరీ

౩౮౧ త్వక్స్థా

ధకారాదినామాని.

౩౩.

౧౮౭ దంష్ట్రోజ్జ్వలా

౬౦౦ దక్షయజ్ఞవినాశినీ

౯౨౩ దక్షిణాదక్షిణా

౭౨౫ దక్షిణామూర్తిరూ

పిణీ

౬౦౮ దణ్డనీతిస్థా

౫౧౨ దధ్యన్నాసక్తహృ

౫౮౧ దయామూర్తిః

౬౦౨ దరహాసోజ్జ్వ

౧౪౭ నిరాశ్రయా
౧౫౫ నిరీశ్వరా
౩౮౯ నిరుపమా
౧౪౩ నిరుపప్లవా
౧౫౪ నిరుపాధిః
౧౩౯ నిర్గుణా
౧౮౦ నిర్నాశా
౧౭౪ నిర్భవా
౧౭౮ నిర్భేదా
౧౫౮ నిర్మదా
౧౬౪ నిర్మమా
౧౩౫ నిర్మలా
౧౬౨ నిర్మోహా
౩౯౦ నిర్వాణసుఖదా
యినీ
౧౭౬ నిర్వికల్పా
౧౪౫ నిర్వికారా
౬౬౩ నిర్ద్వైతా
౧౩౪ నిర్లేపా
౧౭౧ నిర్లోభా
౧౬౦ నిశ్చిన్తా
౧౫౩ నిష్కళంకా
౧౪౦ నిష్కళా
౧౮౨ నిష్క్రియా
౧౮౩ నిష్పరిగ్రహా
౧౮౬ నిష్ప్రపఞ్చా
౧౪౨ నిష్కామా
౧౬౫ నిష్కారణా
౧౬౭ నిష్పాపా
౧౬౮ నిష్క్రోధా
౧౭౨ నిస్సంశయా
౪౨౯ నిస్సీమమహిమా
౧౮౪ నిస్తులా
౭౮౯ నిస్త్రైగుణ్యా
౧౫౬ నీరాగా
౧౮౫ నీలచికురా
౯౦౦ నైష్కర్మ్యా

పకారాదినామాని.

౮౦.

౨౭౪ పఞ్చకృత్యప
౪౨౮ పఞ్చకోశాన్తరస్థితా
౨౧ పఞ్చతన్మాత్ర
౯౪౭ పఞ్చప్రేతమఞ్చాధి
శాయినీ

బకారాదినామాని.

౨౪.

౫౯౩ భాలస్థా
౮౪౧ భావజ్ఞా
౧౧౩ భావనాగమ్యా
౬౮౦ భావాభావవివర్జితా
౬౭౮ భాషారూపా
౨౯౪ భువనేశ్వరీ
౬౬౬ భూమరూపా
౧౭౯ భేదనాశినీ
౨౭౬ భైరవీ
౨౯౩ భోగినీ

## మకారాదినామాని.

౧౧౨.

౯౩౩ మఙ్గళాకృతిః
౫౨౪ మజ్జాసంస్థా
౪౪౫ మతిః
౫౭౬ మత్తా
౧౦౧ మణిపూరాంత
౪౯౫ మణిపూరా
౪౩౨ మదఘూర్ణిత
రక్తాక్షీ
౧౫౯ మదనాశనీ
౪౩౩ మదపాటల
౪౩౫ మదశాలినీ
౫౧౦ మధుప్రీతా
౭౧౮ మధుమతీ
౭౩౧ మధ్యమా
౯౭౧ మనస్వినీ
౨౩౮ మనువిద్యా
౨౦౭ మనోన్మనీ
౯౪౧ మనోమయీ
౧౦ మనోరూపేక్షు
౪౧౫ మనోవాచామ
౮౪౬ మన్త్రసారా
౭౮౬ మన్త్రిణీన్యస్తరాజ్య
ధూః
౭౫ మన్త్రిణ్యమ్బా
౨౮ మన్దస్మిత
౭౭౬ మన్దారకుసుమ
౧౬౫ మమతాహన్త్రీ
౪౭ మయశీమంద
౪౫౮ మలయాచలవాసి
౭౭౪ మహతీ
౫౮౪ మహాప్రియా
౪౦౩ మహాకామేశనయన

౩౦౬ రాజ్ఞీ
౬౮౫ రాజ్యదాయినీ
౬౮౯ రాజ్యలక్ష్మీః
౬౮౬ రాజ్యవల్లభా
౩౧౯ రామా
౧౦౪ రుద్రగ్రన్థివిభేదినీ
౨౬౯ రుద్రరూపా
౪౯౦ రుధిరసంస్థితా
౭౪౮ రోగపర్వత

లకారాదినామాని ౧౮.

౩౫ లక్ష్యరోమలతా
౭౪౦ లజ్జా
౭౩౯ లయకరీ
౧౦౦౦ లలితామ్బికా
౫౦౩ లాకిన్యమ్బా
౭౩౮ లాస్యప్రియా
౬౩౮ లీలాక్లృప్తబ్రహ్మాణ్డ
౮౬౫ లీలావిగ్రహధారిణీ
౯౬౬ లీలావినోదినీ
౬౬౪ లోకయాత్రా
౯౬౦ లోకాతీతా
౬.౬ లోపాముద్రార్చితా
౧౭౧ లోభనాశినీ
౪౫౪ లోలాక్షీకామ

వకారాదినామాని. ౯౭.

౧౮ వక్త్రలక్ష్మీపరీవాహ ప్రదాయనీ
౪౯౭ వజ్రాదికాయు
౯౪౪ వజ్రిణీ
౪౬౮ వజ్రేశ్వరీ
౪౯౬ వదనత్రయ
౪౮౭ వదన ద్వయా
౧౭ వదనస్మర
౪౭౯ వదనైకసమన్వితా
౩౪౬ వన్దారుజన
౩౪౮ వన్ద్యా
౪౦౦ వయోఽవస్థా
౩౩౧ వరదా
౫౧౮ వరదాదినిషేవితా
౮౫౦ వర్ణరూపిణీ
౧౨౯ వర్ణాశ్రమ
౬౭౦ వసుదా
౩౫౨ వహ్నిమణ్డల
౯౮౯ వాంఛితార్థ

శవర్ణాదినామాని ౬౦.

షకారాది. ౫.



సవర్ణాదినామాని ౧౨౨

హకారాదినామాని.

౧౧.

క్షకారాదినామాని. ౮.

శ్రీ ర స్తు

శ్రీ గణేశాయ నమః.

# శ్రీ లలితా
# సహస్ర నామస్తోత్రమాహాత్మ్యము

## పూర్వభాగము

—*—

## ప్రథమోఽధ్యాయము.

శ్లో. శ్రీవిద్యాం జగతాం ధాత్రీం సర్గస్థితిలయేశ్వరీం,
నమామి లలితాం నిత్యం మహాత్రిపురసున్దరీమ్, ౧

తా. శ్రీవిద్యా లలితా, పంచదశీ, షోడశాక్షరీ ఇని శ్రీ విద్యాస్వరూపములు. శ్రీ బీజప్రధానమైనవి గనుక శ్రీవిద్య అనే సంకేతము. రాజరాజేశ్వరీ మంత్రమునకు షోడశాక్షరీ అనియు ప్రసిద్ధిగలదు. శ్రీదేవీ ప్రతిపాదికములు గాన, బాలా, పంచదశీవిద్యలకును శ్రీవిద్యలను వాడుకగలదు. మంత్రదేవతల కభేదము గాన శ్రీవిద్యాస్వరూపిణి అనియు, చతుర్దశభువనములకు తల్లి అనియు సృష్టిస్థితిసంహారములకు ఈశ్వరియనియు,

నాశరహితమైనదియు నగు త్రిపురసుందరీ స్వరూప లలితాంబను గూర్చి నమస్కరించుచున్నానని భావము. సుందరమైన స్వరూపముగలది గనుక 'లలితా' యనునామము కలిగినది అని భావము.

ఉద్యత్కోటి రవిప్రఖ్యాం మహాత్రిపురసున్దరీం,
పాశాఙ్కుశేక్షు కోదణ్డ ప్రసూనవిశిఖాం స్మరేత్.　　౨

తా. వామోర్ధ్వకరమందు పాశమును, దక్షిణోర్ధ్వకరమందంకుశమును, వామాధఃకరమందు చెఱుకువిల్లును, దక్షాధఃకరమందు పుష్పబాణములును గలదియుకోటి సంఖ్యగల ఉదయకాలసూర్యులతో సమానమైన ఎఱ్ఱనికాంతిగలదియు నగు శ్రీమహాత్రిపురసుందరీ దేవిని స్మరించుచున్నానని ధ్యానింపవలెను.

బ్రహ్మవిద్యాగురుపరంపరావర్ణనము

శ్లో. ప్రకాశరూపం శివమాదినాథం
పరామ్బికాం శంకర మాదిదేవమ్,
నారాయణం పద్మభువం వసిష్ఠం
శక్తించ తత్పుత్ర పరాశరం చ.

వ్యాఖ్యాతృ కృతస్తుతిః.

శ్రీమత్సత్యానన్దనాథమస్త్రదీక్షాభిధాధరమ్,　　౧
అస్మద్గురువరం సర్వపురుషార్థదమాశ్రయే.
సింహాంభట్ల సువంశ్యేన రామమూర్తిమనీషిణా,
శ్రీజ్ఞానానన్దనాథేతి దీక్షానామవిరాజినా　　౨

విదుషాం పరితోషాయ క్రియతే దేశభాషయా,
లలితానామసహస్రరహస్యార్థప్రకాశనమ్ 3
సన్తోఽనుగృహ్య గృహ్ణన్తు స్వరూపజ్ఞానదాయకం,
లలితా ప్రీతయే నిత్య మనుసంధానమాచరేత్. ౪
ఏకధా చద్విధాచైవ త్రిధా షోడశధా పునః,
బహుధా యా కళా ప్రోక్తా శ్రీకళామాం సదాఽవతు. ౫

తాత్పర్యము. సకలభూతములందును జీవస్వరూపముగా నుండు నదియు, మోక్షలక్ష్మీస్వరూపమైనదియు సచ్చిదానందలక్షణములు గలదియు నగు ఏ బ్రహ్మకళ, ఏకధా=ఏకాకారముగాను. శ్రు 'ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ' అనే శ్రుతులచేతను ఏకాకారముగాను; ద్విధా = ప్రకృతిపురుషులనియు, శివశక్తులనియు ప్రకాశవిమర్శలనియు భార్యాభర్తలనియు మాతాపితరులనియు కార్యకారణములనియు,ద్వంద్వరూపమును ఏకళ పొందినదో; త్రిధా=గుణత్రయము, మూర్తిత్రయము, బీజత్రయము, జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు, మన్త్రి, దేవతోపాసకులు, మాతృమానమేయములు, దేవత, భక్తానుగ్రహములు మొదలగు త్రిపుటీస్వరూపముగా ఏకళ సకల నిగమాగమములందు ప్రసిద్ధముగనున్నదో,ఏది షోడశధా = పదియాఱుకళలుగా చంద్రునియందున్నదో కామేశ్వర్యాది చిత్రాన్తము పంచదశనిత్యలు, బిందుస్థానమందున్న కళ మహానిత్య మహాకామేశ్వరిదేవితో షోడశనిత్యలుగను అట్టి నిత్యాస్వరూపముగా ఏకళ చెప్పఁబడుచున్నదో బహుధా ఏది అణిమాది దేవతలుగాను అనంతకోటి బ్రహ్మాండములుగాను అనంతకోటి జీవరాసులుగాను అనంతదేవతానామములుగాను ఏ కళయందు ఉన్నవని నిగమాగములు

చెప్పుచున్నవో అట్టి శ్రీలలితారూపము గల కామకళా స్వరూపమైన శ్రీ రాజరాజేశ్వరీదేవి మమ్ములను సర్వదా రక్షించుగాక అని వ్యాఖ్యాత ఇష్ట దేవతను ప్రార్థించుచున్నాడు.

**పారాయణక్రమః.**

ఆగస్త్య ఉవాచ.—

అశ్వానన మహాబుద్ధే సర్వశాస్త్ర విశారద,
కథితం లలితాదేవ్యా శ్చరితం పరమాద్భుతమ్.        1

అవ:—తమగురువైన హయగ్రీవును గూర్చి అగస్త్యులవారు ప్రశ్న వేయుచున్నారు.—

తా పూర్వకాలమందు నైమిశారణ్యమందు మహాసత్రయాగమందు బ్రహ్మాండపురాణ శ్రవణకాలమందు శౌనకాదిఋషులకు సూతులు హయగ్రీవ అగస్త్యసంవాదమును ఉపదేశించుచున్నారు. సకలశాస్త్రములు తెలిసిన మహాబుద్ధిశాలివైన ఓహయగ్రీవస్వామీ! తమరు అత్యద్భుతమైన లలితాదేవియొక్క చరిత్రమును సెలవిచ్చినారు.

పూర్వం ప్రాదుర్భవో మాతు స్తతః పట్టాభిషేచనం,
భండాసురవధశ్చైవ విస్తరేణ త్వయోదితః.        2

తా. శ్రీదేవి ప్రాదుర్భావముచెప్పినారు తరువాత శ్రీదేవికి దేవతలు ఋషులు త్రైలోక్యసామ్రాజ్యపట్టాభిషేకమునొనర్చుట చెప్పినారు. భండాసురయుద్ధమును భండాసురసంహారమును చెప్పినారు

వర్ణితం శ్రీపురంచాపి మహావిభవవిస్తరం,
శ్రీమత్పంచదశాక్షర్యాః మహిమా వర్ణిత స్తథా.        3

తా. సకలైశ్వర్యయుక్తమైన శ్రీపురము వర్ణింపఁబడినది. శ్రీవిద్యా పంచదశాక్షరీ మంత్రమహిమ వర్ణింపఁబడినది.

షోఢాన్యాసాదయో దేవ్యాః న్యాసఖండే ప్రకీర్తితాః,
అంతర్యాగక్రమశ్చైవ బహిర్యాగక్రమస్తథా. ౪

తా. న్యాసఖండమందు షోఢాన్యాసాదులు చెప్పఁబడినవి. అన్తర్యాగ క్రమము బహిర్యాగక్రమమును సెలవిచ్చినారు.

మహాయాగక్రమశ్చాపి పూజాఖండే సమీరితః
పురశ్చరణఖండేతు జపలక్షణమీరితమ్. ౫

తా. పూజాఖండమందు మహాయాగక్రమమును చెప్పినారు. పురశ్చరణఖండమందు జపలక్షణము చెప్పఁబడినది.

హోమఖండే త్వయా ప్రోక్తో హోమద్రవ్యవిధిక్రమః,

తా. హోమఖండమందు హోమద్రవ్యభేదములు చేయువిధానము చెప్పిరి

చక్రరాజస్య విద్యాయాః శ్రీదేవ్యా దేశికాన్మనోః. ౬
రహస్యఖండే తాదాత్మ్యం పరస్పరముదీరితం,
స్తోత్రఖండే బహువిధాస్స్తుతయః పరికీర్తితాః. ౭

తా. రహస్యఖండమందు శ్రీచక్రమునకు శ్రీవిద్యకు శ్రీదేవి గురుశిష్యులకు అన్యోన్యతాదాత్మ్యమును సెలవిచ్చినారు. స్తోత్రఖండమందు అనేక స్తోత్రములు చెప్పఁబడినవి.

మంత్రిణీదండినీ దేవ్యోః ప్రోక్తేనామసహస్రకే.
నతు శ్రీలలితాదేవ్యాః ప్రోక్తంనామసహస్రకమ్.     ౮

తా, మంత్రిణీదేవియగు శ్యామలాంబా సహస్రనామమును దండినీ దేవియగు వారాహీదేవి సహస్రనామములను సెలవిచ్చితిరిగాని లలితాదేవి సహస్రనామములను మాత్రము నాకుపదేశించ లేదు.

తత్ర మే సంశయోజాతో హయగ్రీవదయానిధే,
కిం వా త్వయావిస్మృతం తత్జ్ఞాత్వా వా సముపేక్షితమ్ ౯

తా. దయాసముద్రులైన ఓహయగ్రీవస్వామీ: ఈ విషయమై తమరు పరాకు చిత్తగించినారా? లేక జ్ఞాపకమున్నను ఉపేక్షించినారా? అని సంశయము కలిగినది.

మమవాయోగ్యతానాస్తి శ్రోతుంనామసహస్రకం,
కిమర్థం భవతానోక్తం తత్రమేకారణం వద.     ౧౦

తా. లలితాసహస్రనామము వినడానికి నాకు యోగ్యతలేదా? ఏల తమరు సెలవియ్యలేదు. దానికిఁ గారణము సెలవియ్యవలె ననిఅగస్త్యుఁడడిగెను.

సూత ఉవాచ :—

ఇతిపృష్టో హయగ్రీవోమునినా కుంభజన్మనా,
ప్రహృష్టో వచనం ప్రాహ తాపసం కుంభసంభవమ్. ౧౧

తా. అగస్త్యులచేత హయగ్రీవులీరీతిని అడుగఁబడినవారై సంతోషించి అగస్త్యులను గురించి వచనమును పలుకుచున్నారు.

శ్రీహయగ్రీవ ఉవాచ —

లోపాముద్రాపతేఽగస్త్య సావధానమనాశ్శృణు,
నామ్నాం సహస్రం యన్నోక్తం కారణం తద్వదామి తే. ౧౨

తా. శ్రీదేవీభక్తులలో ముఖ్యురాలయిన లోపాముద్రకు భర్తవైన ఓఅగస్త్యమహర్షీ! లలితాసహస్రనామములను నీకు ఇదివరలో చెప్పక పోవుటకుఁ గారణమును చెప్పెదను. సావధానమైన మనస్సుకలవాఁడవై వినుము.

రహస్యమితి మత్వాఽహం నోక్తవాంస్తేనచాన్యథా.
పునశ్చ పృచ్ఛతే భక్త్యాతస్మాత్తత్తేవదామ్యహమ్. ౧౩

తా. ఆ లలితాసహస్రనామములు రహస్యములని నీకు చెప్పలేదు. కాని మరి ఏకారణమునులేదు అయినను నీవు భక్తిశ్రద్ధలుకలిగి అడిగితివి గనుక నీకు ఇప్పుడు ఉపదేశించుచున్నాను.

బ్రూయాచ్ఛిష్యాయ భక్తాయ రహస్యమపి దేశికః,
భవతా న ప్రదేయం స్యాదభక్తాయ కదాచన. ౧౪

తా. గురువు ఎట్టి మంత్రరహస్యమునైనను భక్తిగలశిష్యునకుఁ చెప్పవలెను. నీకు నేను చెప్పఁబోవు లలితాసహస్రనామములను నీవు భక్తి

లేనివారికి యెన్నఁడు నుపదేశించకూడదు.

న శఠాయ న దుష్టాయ నావిశ్వాసాయ కర్హిచిత్,
శ్రీమాతృభక్తియుక్తాయ శ్రీవిద్యారాజవేదినే. ౧౭
ఉపాసకాయ శుద్ధాయ దేయం నామసహస్రకమ్,

తా, శఠుఁడనగా గురువుచెప్పిన రహస్యార్థమును తెలిసికొనియిది వఱకే నాకుఁదెలియునని గాని, తెలిసియు తెలియలేదని గాని గురువును తిరస్కరించెడివాఁడు. దుష్టుఁడన గురూపదేశము వలనఁ గలిగిన నిశ్చయమును తాను వెల్లడించి దానిని హేళన చేయువాఁడు. అవిశ్వాసుఁడనగా చెప్పినరహస్యమును దాను తెలిసికొని యారహస్యార్థమందును, గురువు వందును విశ్వాసము లేనివాఁడు. ఇట్టివారికి రహస్యము నుపదేశింపఁ గూడదు. శ్రీదేవియందుఁ భక్తికలిగి గురుముఖంగా పంచదశీమంత్రరాజమును పొందినట్టి శ్రీవిద్యోపాసకులకు మాత్రమే నీవు ఉపదేశింపవలెను.

యాని నామసహస్రాణి సద్యస్సిద్ధిప్రదాని వై. ౧౮
తంత్రేషు లలితాదేవ్యాస్తేషు ముఖ్యమిదం మునే,

తా, కోటిసంఖ్యలుగల దేవీసహస్రనామముల సముదాయమునందు బాలా, గంగా, శ్యామలాది దశవిధసహస్రనామములు మాత్రము తత్కాలమునందే సిద్ధినిచ్చునవియని ప్రసిద్ధిగలవి యని శ్రీవిద్యాతంత్రములందు పరిగ్రహింపఁబడినవి. వానిలో ఈలలితా సహస్రనామములు ముఖ్యతమములు.

శ్రీవిద్యైవతు మంత్రాణాం తత్ర కాది ర్యథాపరా. ౧౯

పురాణాం శ్రీపురమివ శక్తీనాం లలితాయథా,
శ్రీవిద్యోపాసకానాంచ యథా దేవః పరశ్శివః. ౧౮
తథా నామసహస్రేషు వరమేతత్ ప్రకీర్తితం,

తా. మంత్రములలో శ్రీవిద్య ఏరీతిని ముఖ్యమో, శ్రీవిద్యలలో కాదివిద్య ఏలాగు ముఖ్యమైనదో, పురములలోపల శ్రీపురము ఏలాగు శ్రేష్ఠమైనదో, శక్తులలో పల లలితాదేవి యేప్రకారము శ్రేష్ఠమైనదో శ్రీ విద్యోపాసకులలోపల పరమశివుఁడెట్లు శ్రేష్ఠుఁడో అదేవిధముగా దేవీసహస్ర నామములోపల యీలలితా సహస్రనామములు శ్రేష్ఠములయినవని భావము.

యథాఽస్య పఠనాద్దేవీ ప్రీయతే లలితాంబికా. ౧౯
అన్యనామసహస్రస్య పాఠాన్న ప్రీయతేతథా,
శ్రీమాతుః ప్రీతయే తస్మా దనిశం కీర్తయేదిదమ్. ౨౦

తా. ఈలలితాసహస్రనామపాఠమువలన శ్రీలలితాదేవి యేవిధముగా సంతోషించునో ఆవిధముగా ఇతరసహస్రనామముల పఠించుటవలన లలితాదేవి సంతోషింపఁజాలదు కనుక శ్రీలలితాంబిక యొక్క ప్రీతికొఱకు నిత్యము ఈలలితాసహస్రనామ పారాయణము చేయవలయును.

బిల్వపత్రైశ్చక్రరాజే యోఽర్చయేల్లలితాంబికాం,
పద్మైర్వాతులసీపత్రై రేభిర్నామ సహస్రకైః ౨౧
సద్యః ప్రసాదంకురుతే తస్యసింహాసనేశ్వరీ,

తా. శ్రీచక్రమునందు లలితాంబను బిల్వదళములచేతను పద్మముల

చేతను తులసీదళములచేతను ఈ లలితాసహస్రనామములతో యెవ్వఁడు పూజించునో వానియందు శ్రీమద్రాజరాజేశ్వరీదేవి తత్కాలమునందే అనుగ్రహముకలదియగును.

చక్రాధిరాజమభ్యర్చ్య జప్త్వా పంచదశాక్షరీమ్. ౨౨
జపాంతే కీర్తయేన్నిత్య మిదం నామ సహస్రకం.
జపపూజాద్యశక్తశ్చేత్పఠేన్నామసహస్రకమ్. ౨౩

తా. శ్రీచక్రార్చన చేసి పంచదశాక్షరీ జపము చేసి తరువాత సహస్రనామ పారాయణము చేయవలెను. పూజయు జపమును చేయుటకు అశక్తుఁడైనపుడు ఈ సహస్రనామ పారాయణమును మాత్రము చేయవలెను.

సాంగార్చనే సాంగజపే యత్ఫలం తదవాప్నుయాత్.
ఉపాసనే స్తుతీ రన్యాః పఠే దభ్యుదయో హి సః. ౨౪

తా. ఈనామపారాయణమాత్రము చేత సంపూర్ణపూజవలనను సంపూర్ణజపమువలనను కలిగేఫలమును పొందుదురనియు, పూజా జపములను చేసి ఈ స్తోత్రమును పఠించినపుడు, విశేషశ్రేయస్సనియు భావము.

ఇంద నామసహస్రంతు కీర్తయే న్నిత్యకర్మవత్.
చక్రరాజార్చనం దేవ్యాః జపోనామ్నాం చ కీర్తనమ్. ౨౫

తా. శ్రీచక్రార్చనము, శ్రీవిద్యాజపము, సహస్రనామపారాయణము సంధ్యావందనాదికృత్యములవలె ముఖ్యముగాఁ జేయవలెను. నామపారాయణమునైనను ఉపాసకులు తప్పక చేయవలెను.

భక్తస్య కృత్యమేతావ దన్యదభ్యుదయం విదుః,
భక్తస్యావశ్యక మిదం నామసాహస్రకీర్తనమ్. ౨౬

తా. శ్రీవిద్యోపాసకులైన భక్తులకు పూజా, జప, నామపారాయణములు అవశ్యకములు. తక్కినన్యాసస్తోత్రాదులు చేసినయెడల క్షేమమే. భక్తునకు సహస్రనామ పారాయణము ముఖ్యముగా చేయవలసినదని భావము.

తత్ర హేతుం ప్రవక్ష్యామి శృణు త్వం కుంభసంభవ;
పురా శ్రీలలితాదేవీ భక్తానాం హితకామ్యయా. ౨౭

తా. నామసహస్రపారాయణము అత్యావశ్యకమైనందులకు కారణమును చెప్పుచున్నాము. ఓ అగస్త్యఋషీ వినుము- పూర్వమందు శ్రీదేవి భక్తులకు శ్రేయస్సును కలుగఁజేయు కోరికచేతను :

వాగ్దేవీవశినీముఖ్యాస్సమాహూయేద మబ్రవీత్,
వాగ్దేవతా వశిన్యాద్యా శ్శృణుధ్వం వచనం మమ. ౨౮

తా. వశిన్యాదివాగ్దేవతలను పిలిపించి ఈ ప్రకారము సెలవిచ్చెను. ఓ వశిన్యాది వాగ్దేవతలారా 1 మా వాక్యమును వినవలసినది.

భవంతో మత్ప్రసాదేన ప్రోల్లసద్వాగ్విభూతయః
మద్భక్తానాం వాగ్విభూతిప్రదానే వినియోజితాః. ౨౯

తా. మీరు మాయనుగ్రహమువలన పొందిన సత్యసంపలవిదాత్తి

గలవారు గనుక మా భక్తులకు సకలవిద్యా సంపత్తికొఱకు మాచేత ఆజ్ఞా పింపఁబడుచున్నారు.

మచ్చక్రస్య రహస్యజ్ఞా మమ నామపరాయణాః.
మమస్తోత్రవిధానాయ తస్మా దాజ్ఞాపయామి వః. 30

తా. మీరు మా శ్రీచక్రరహస్యమును తెలిసినవారును మానామ పారాయణమందాసక్తిగలవారును గనుక స్తోత్రమును చేయుటకు మీకాజ్ఞా పించుచున్నాము.

కురుధ్వ మంకితం స్తోత్రం మమ నామసహస్రకైః,
యేభక్తైః పఠితేనా మే సద్యః ప్రీతిః పరా భవేత్. 31

తా మారహస్యార్థములతోఁగూడిన సహస్రనామస్తోత్రమును మీరు రచింపవలెను ఎట్టిస్తోత్రమును భక్తులు పఠించిన మాకు తత్కాలమందే ప్రీతిగలుగుచున్నదో అట్టిస్తోత్రమును చేయవలెను.

ఇత్యాజ్ఞప్తా వచోదేవ్యః శ్రీదేవ్యా లలితాంబయా,
రహస్యైర్నామభిర్దివ్యై శ్చక్రుః స్తోత్ర మనుత్తమమ్ 32

తా. శ్రీ లలితాదేవిచేత ఈరీతిని వశిన్యాది వాగ్దేవతలు అజ్ఞాపింపఁ బడినవారై శ్రీదేవియొక్క రహస్యనామముల చేతను శ్రీదేవీస్తోత్రమును రచించిరి.

రహస్యనామసాహస్ర మితి తద్విశ్రుతం పరం,

**తతః కదాచి త్సదసి స్థిత్వా సింహాసనేఽంబికా,** 33

తా. ఆస్తోత్రము రహస్యనామసాహస్రమని అతివ్యాపకమును పొందినది. తరువాత ఒకసమయమందు లలితాంబ సభలో సింహాసనమందు గూర్చుండి:

స్వసేవావసరం ప్రాదా త్సర్వేషాం కుంభసంభవ!,
సేవార్థ మాగతా స్తత్ర బ్రహ్మాణీబ్రహ్మకోటయః. 34

తా. శ్రీదేవీసేవానిమిత్తము దర్శనము నిరీక్షించుచున్న దేవతల నందఱకును దర్శనమున కనుజ్ఞనిచ్చెను. శ్రీదేవియొక్క సేవకొఱకు అనేకకోట్ల సంఖ్యగల బ్రహ్మసరస్వతులు నిరీక్షించుచున్నారు.

లక్ష్మీనారాయణానాంచ కోటయః సముపాగతాః,
గౌరీకోటిసమేతానాం రుద్రాణామపికోటయః. 35

తా. కోట్లు సంఖ్యగల లక్ష్మీనారాయణులు, కోట్లు సంఖ్యగల గౌరీరుద్రులు ఆ సేవార్థము వచ్చియున్నారు

మంత్రిణీదండినీముఖాః సేవార్థంచ సమాగతాః,
శక్తయోవివిధాకారా స్తేషాం సంఖ్యా న విద్యతే. 36

తా. మంత్రిణీదేవియగు శ్యామలాంబయు, దండనాయికయగు వారాహీ దేవియు, మఱియు నానారూపములు అనేకనామములుగల అనేక శక్తిసముదాయములును దర్శనము నిమిత్తము నిరీక్షించుచున్నారు- అశక్తు

లసంఖ్య చెప్ప శక్యము కాదు.

దివ్యౌఘా మానవౌఘాశ్చ సిద్ధౌఘాశ్చ సమాగతాః,
తత్ర శ్రీలలితా దేవీ సర్వేషాం దర్శనం దదౌ. ౩౭

తా. దివ్యౌఘమయిన బ్రహ్మాదులును, సిద్ధౌఘమైన సనకాదులును మానవౌఘమైన వ్యాసాదులును వచ్చి యుండఁగా, ఆసభలో అందఱికును శ్రీదేవిదర్శనము నిచ్చెను.

తేషు దృష్ట్వోపవిష్టేషు స్వేస్వే స్థానే యథాక్రమం,
తత్ర శ్రీలలితా దేవీ కటాక్షాక్షేపచోదితాః. ౩౮

తా. వచ్చినదేవతలందఱు శ్రీదేవిదర్శనమును చేసి వారివారిస్థానములందు యథా క్రమముగాఁ గూర్చొని యుండఁగా శ్రీలలితాదేవియొక్క కటాక్షముతోఁ గూడిన నేత్రసంజ్ఞచేత ప్రేరితలయిన,

ఉత్థాయ వశినీముఖ్యా బద్ధాంజలిపుటా స్తదా,
అస్తువ న్నామసాహస్రైః స్వకృతై ర్లలితాంబికామ్. ౩౯

తా. వశిన్యాదివాగ్దేవతలు లేచినిలువఁబడి జోడించిన అంజలికలవారలయితాము రచించిన సహస్రనామములచేతను లలితాదేవిని స్తోత్రముచేసిరి.

శ్రుత్వా స్తవం ప్రసన్నాఽభూ ల్లలితా పరమేశ్వరీ,
తే సర్వే విస్మయం జగ్ము ర్యేతత్ర సదసి స్థితాః. ౪౦

తా. లలితాపరమేశ్వరి, ఆస్తోత్రమును విని చాల సంతోషపడెను ఆసభ లోపల ఉన్నవారందఱును ఆశ్చర్యమును పొందిరి.

తతః ప్రోవాచ లలితా సదస్యాన్ దేవతాగణాన్,
మమాజ్ఞయైవ వాగ్దేవ్యశ్చక్రుస్స్తోత్ర మనుత్తమమ్. ౪౧
అంకితం నామభిర్దివ్యైర్మమ ప్రీతివిధాయకైః,
తచ్ఛృణుధ్వం సదా యూయంస్తోత్రం మత్ప్రీతివృద్ధయే.
౪౨

తా. తరువాత ఆసభలోపలనున్న దేవతాసమూహమును గాంచి శ్రీలలితాదేవి ఓదేవతలారా! వినుఁడు. ఈ ఉత్తమమైన స్తవమును వశిన్యాదివాగ్దేవతలు మా ఆజ్ఞ చేతనే చేసినారు. మాకు సంతోషమును కలుగఁజేయు నానానామములతో కూడిన నామసహస్రస్తోత్రపారాయణమును మీరు సర్వదా మా ప్రీతికొఱకు చేయవలెను ఇది మాఆజ్ఞ మీరు అందఱు వినవలసినది అని శ్రీదేవి దేవతలకు సెలవిచ్చె .

ప్రవర్తయధ్వం భక్తేషు మమ నామసహస్రకమ్. ౪౩

తా. ఓసభ్యులారా ! వినుండు. మీరు మాభక్తులయందు మానామములతోఁ గూడిన ఈసహస్రనామస్తోత్రమును, ఉపదేశించి వృద్ధిచేయవలయును.

ఇదం నామసహస్రం మే యోభక్తః పఠతేసకృత్. ౪౪
సమేప్రియతమో జ్ఞేయ స్తస్మై కామాన్దదామ్యహం,

తా. మాయొక్క ఈ నామసహస్రమును ఏబుద్ధుఁడు ఒకమాఱైనను పఠించునో వాఁడు మా అనుగ్రహమునకు పాత్రుఁడు వానికి అన్నికోరికలను ఇచ్చుచున్నాను.

శ్రీచక్రేపూజాం సమభ్యర్చ్యజప్త్వా పంచదశాక్షరీమ్. ౭౭
పశ్చాన్నామసహస్రం మేకీర్తయేన్మమ తుష్టయే,

తా. శ్రీచక్రమందు నన్ను పూజించి, పంచదశాక్షరీమంత్రమును జపించి తరువాత సహస్రనామపారాయణ చేయవలెను.

మా మర్చయతు వా వా విద్యాంజపతువానవా. ౭౮
కీర్తయేన్నామసాహస్ర మిదం మత్ప్రీతయె సదా,
మత్ప్రీత్యా సకలాన్కామాన్ లభతే నాత్ర సంశయః.
౭౯

తా, శ్రీచక్రార్చనమునుచేసినను మంత్రజపముచేసినను లేక పోయినను వా ప్రీతికొఱకు సహస్రనామపాఠమును సదాచేయవలెను. వారు మా ప్రీతిచేనెల్లకోరికలు పొందఁగలరు. దీనికి సంశయము లేదు.

తస్మా న్నామసహస్రం మే కీర్తయధ్వం సదాఽఽదరాత్,
తా. దానివలన మాయొక్క సహస్రనామమును ప్రేమగలవారై సదా పారాయణ చేయవలెను.

శ్రీహయగ్రీవ ఉవాచ—

ఇతి శ్రీలలితేశానీ శాస్తిదేవాన్ సహానుగాన్. ౮౦

తా. ఇట్లు పరివారములతోఁగూడిన సకలదేవతలకును లలితాపరమేశ్వరి ఆజ్ఞాపించెను.

తదాజ్ఞయా తదాఽఽరభ్య బ్రహ్మవిష్ణుమహేశ్వరాః,
శక్తయో మంత్రిణీముఖ్యా ఇదం నామసహస్రకమ్. ౨౮

తా. శ్రీదేవి ఆజ్ఞ ప్రకారము ఆదిమొదలు బ్రహ్మవిష్ణురుద్రులు శ్యామలాంబాది శక్తులను ఈలలితాసహస్రనామస్తోత్రమును.

పఠంతిభక్త్యా సతతం లలితాపరితుష్టయే,
తస్మాదవశ్యం భక్తేన కీర్తనీయ మిదం మునే. ౨౯

తా. లలితాప్రీతికొఱకు సతతము పఠించుచున్నారు. దానివలన ఓ అగస్త్యఋషీ భక్తునిచేత ముఖ్యముగా ఈసహస్రనామస్తోత్రము పఠింపవలసినది.

ఆవశ్యకత్వే హేతుస్తే మయా ప్రోక్తో మునీశ్వర,
ఇదానీం నామసాహస్రం వక్ష్యామి శ్రద్ధయ శృణు ౩౦

తా. ఈ సహస్రనామపారాయణము అత్యావశ్యకమైనందులకు కారణమును చెప్పితిని. ఈపైని సహస్రనామములను చెప్పుచున్నాను సావధానుఁడవై వినుమని అగస్త్యునకు హయగ్రీవులు నామావళిని ఉపదేశించుచున్నారని భావము.

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే, హయగ్రీవాగస్త్యసంవాదే,

లలితాసహస్రనామస్తోత్ర పూర్వభాగోనామ
ప్రథమోఽధ్యాయః,

శ్రీమత్పదవాక్యప్రమాణ పారావారపారీణధురీణ సర్వతంత్ర స్వతంత్ర త్రైలింగ్యదేశస్థ సమయాచార జీర్ణోద్ధారక దక్షిణాచారప్రవర్తక ప్రకాశానందనాథ చరణారవింద సేవాపరాయణసత్యానందనాథకరకమలసంజాతాంతేవాసియు కౌశికస గోత్రోద్భవ భాగీరథీరాయద్వితీయపుత్రులును, జ్ఞానానందనాథ దీక్షానామవిరాజమానులును కామకలాసూత్ర, మాతృకాచక్ర వివేకాద్యనేక తత్త్వగ్రంథరహస్యార్థ ప్రకాశకులునగు బ్రహ్మశ్రీసింహం భట్లరామమూర్తిశాస్త్రుల వారిచేత శ్రీలలితా సహస్రనామస్తోత్ర పూర్వ భాగమునకు పరిమళమను తాత్పర్యము సంపూర్ణముగా రచింపఁబడినది.

శ్రీలలితాంబా పరదేవతార్పణమస్తు.

శ్రీరస్తు

# శ్రీలలితాసహస్రనామస్తోత్రమ్

## న్యాసమ్

అస్య శ్రీ లలితా సహస్రనామస్తోత్ర మాలామన్త్రస్య వశిన్యాది వాగ్దేవతా ఋషయః, అనుష్టుప్ఛన్దః, శ్రీలలితా పరా భట్టారికా మహాత్రిపురసున్దరీ దేవతా. ఐం-బీజం, సౌః-శక్తిః, క్లీం-కీలకం మమ చతుర్విధ పురుషార్థ సిద్ధ్యర్థే జపే వినియోగః. ఐం-అంగుష్ఠాభ్యాం నమః క్లీం-తర్జనీభ్యాం నమః, సౌః-మధ్యమాభ్యాం నమః, సౌః-అనామికాభ్యాం నమః, క్లీం కనిష్ఠికాభ్యాం నమః, ఐం-కరతలకరపృష్ఠాభ్యాంనమః ఐం-హృదయాయ నమః, క్లీం-శిరసేస్వాహా, సౌః-శిఖాయైవషట్ సౌః-కవచాయహుం, క్లీం-నేత్ర త్రయాయవౌషట్, ఐం-అస్త్రాయఫట్ భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

## ధ్యానమ్.

అరుణాం కరుణాతరఙ్గితాక్షీం
ధృతపాశాఙ్కుశ పుష్పబాణచాపామ్,
అణిమాదిభి రావృతాం మయూఖై
రహ మిత్యేవ విభావయే మహేశీమ్

ధ్యాయేత్పద్మాసనస్థాం వికసితవదనాం పద్మపత్రాయతాక్షీం
హేమాభాం పీతవస్త్రాం కరకలితలసద్ధేమపద్మాం వరాంగీం
సర్వాలంకారయుక్తాం సకలమభయదాం భక్తనమ్రాం
భవానీం
శ్రీవిద్యాం శాన్తమూర్తిం సకలసురనుతాం సర్వ
సంపత్ప్రదాత్రీమ్.

సకుంకుమవిలేపనా మళికచుంబికస్తూరికాం
సమందహసితేక్షణాం సశరచాపపాశాంకుశామ్
అశేషజనమోహినీ మరుణమాల్యభూషోజ్జ్వలాం
జపాకుసుమభాసురం జపవిధౌస్మరేదంబికామ్

లమిత్యాది పంచపూజాం విభావయేత్, తద్యథా:—

లం-పృథివీతత్త్వాత్మికాయై, శ్రీలలితాదేవ్యై గంధంపరికల్ప యామి హం-ఆకాశతత్త్వాత్మికాయై, శ్రీలలితాదేవ్యై పుష్పంపరికల్పయామి యం-వాయుతత్త్వాత్మికాయై, శ్రీలలితాదేవ్యై ధూపం పరికల్పయామి రం-వహ్నితత్త్వాత్మికాయై శ్రీలలితాదేవ్యై దీపం పరికల్పయామి. వం-అమృతతత్త్వాత్మికాయై. శ్రీలలితాదేవ్యై అమృత నైవేద్యం పరి కల్పయామి.

సం-సర్వతత్త్వాత్మికాయై, శ్రీలలితా దేవ్యై తాంబూలాది సర్వోపచారాణ పరికల్పయామి.

ఇతి స్తోత్రాదౌ ఋష్యాదిన్యాసపంచపూజాన్తం కృత్వా సహస్రనామ
స్తోత్ర పారాయణం శ్రీ దేవ్యా దక్షిణహస్తే జలధారా
పూర్వకం సమర్పణం కుర్యాత్ , శ్రీ దేవీం
స్వాభిన్నాం ధ్యాత్వా విహరేత్
సర్వత్ర విజయః.

---

ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ,
చిదగ్నికుండసమ్భూతా దేవకార్యసముద్యతా. ౧

ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహుసమన్వితా,
రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాఙ్కుశోజ్జ్వలా. ౨

మనోరూపేక్షుకోదండా పంచతన్మాత్రసాయకా,
నిజారుణప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా, ౩

చమ్పకాశోకపున్నాగ సౌగన్ధికలసత్కచా,
కురువిన్దమణిశ్రేణీకనత్కోటీరమణ్డితా ౪

అష్టమీచన్ద్రవిభ్రాజదళికస్థలశోభితా
ముఖచన్ద్రకళఙ్కాభమృగనాభివిశేషకా ౫

వదనస్మరమాఙ్గళ్యగృహతోరణచిల్లికా,
వక్త్రలక్ష్మీపరీవాహచలన్మీనాభలోచనా. ౬

౧౬. ముఖచంద్రకళంకాభమృగనాభివిశేషకాయై నమః.

తా. ముఖమనే చంద్రబింబమందున్న కలంకమువంటి కస్తూరీతిలకముగలది. (షోడశాక్షరము.)

౧౭. వదనస్మరమాంగళ్యగృహతోరణచిల్లికాయై నమః.

తా. అమ్మవారిముఖమనే మన్మథుని మాంగళ్యగృహముయొక్క మొదటిద్వారము. భ్రూలత, కనుబొమలు తోరణముగా నున్నవి. (షోడశాక్షరము.)

౧౮. వక్త్రలక్ష్మీపరీవాహచలన్మీనాభలోచనాయై నమః

తా. ముఖకాంతి యను ప్రవాహమునందు సంచలించుచున్న మత్స్యములవంటి నేత్రములు గలది. (షోడశాక్షరము.)

౧౯. నవచంపకపుష్పాభనాసాదండవిరాజితాయై నమః.

తా. నూతనమైన; లేక అప్పుడే వికసించిన; లేక సగమువికసించిన సంపెంగమొగ్గతో సమానమైన నాసికాదండముచేత ప్రకాశించుచున్నది. సంపెంగమొగ్గవంటి నాసికము కలది. (షోడశాక్షరము.)

౨౦. తారాకాంతితిరస్కారినాసాభరణభాసురాయై నమః.

తా. శుక్రాంగారకులనే నక్షత్రములకాంతులను తిరస్కరించుచున్న మాణిక్యమౌక్తికములచేత కూర్చఁబడిన నాసాభరణము (అనఁగా బులాకు) కలది. (షోడశాక్షరము.)

౨౧. కదంబమంజరీక్లృప్తకర్ణపూరమనోహరాయై నమః.

తా. కర్ణోపరిభాగమందుగల చిన్న కదంబపూగుత్తిచేత ప్రకాశించుచున్నది. (షోడశాక్షరము.)

౨౨. తాటంకయుగళీభూతతపనోడుపమండలాయై నమః.

తా. సూర్యచంద్రమండలములే తాటంకద్వయము (అనఁగా చెవులయందు ధరించుకమ్మలు) అను అభరణవిశేషముగాఁగలది. బ్రహ్మాండాకార

మైన పరాశక్తియొక్క చెవియందలి కమ్మలు అను ఆభరణములు చంద్ర సూర్యమండలములుగా నున్నవని భావము. ఇట్టిసంపద మఱి ఏదేవతలకు లేదు. (షోడశాక్షరము.)

౨౩. పద్మరాగశిలాదర్శపరిభావికపోలభువే నమః.

తా. కామేశ్వరీదేవి గండస్థలములు(అనఁగా చెక్కిళ్లు)అతినిర్మలము గాను, నునుపుగాను, ఎఱ్ఱనికాంతిగలవిగాను ఉన్నందున, దగ్గఱను, ఎదురుగాను ఉన్న తనభర్తఅయిన కామేశ్వరుని స్వరూపము, ఆచెక్కిళ్లయందు ప్రతిఫలించుచున్నదిగాన, అద్దమందు ఇంతబాగుగాఁ బ్రతిబింబ మగుపడదనియు, పద్మరాగఫలకములకు ఇంత నునుపు ఎఱ్ఱనిరంగు లేదనియు, కనుక ఆరెంటిని అమ్మవారి చెక్కిళ్లు ఆక్షేపించుచున్నవనియు, శ్రీదేవి చెక్కిళ్లు అద్దముకన్న నునుపును పద్మరాగముకన్న ఎఱ్ఱనికాంతియు గలవనిభావము. (షోడశాక్షరము.)

౨౪. నవవిద్రుమబింబశ్రీన్యక్కారిరదనచ్ఛదాయై నమః.

తా. శ్రీదేవి ఓష్ఠద్వయము (రెండుపెదవులును) ఉన్నతముగాను, అధికమైన ఎఱ్ఱనిరంగు కలవిగాను ఉన్నందున నూతనముగాఁ బుట్టిన పగడపుఁదీగయొక్క శోభను సుందరత్వమును బాగుగాపండిన దొండపండు వంటి ఎఱ్ఱఁదనమును పగడపుఁదీగవంటినడుపును · ఉన్నతమును గలది. (షోడశాక్షరము.)

౨౫. శుద్ధవిద్యాంకురాకారద్విజపంక్తిద్వయోజ్జ్వలాయై నమః.

తా. ౧. శ్రీవిద్యాపూర్ణదీక్షయందు, ప్రధానవిద్య షోడశాక్షరీవిద్య శుద్ధవిద్య మూఁడుబీజములుకలదని ప్రసిద్ధిగానున్నది. షోడశాక్షరీవిద్యకును శుద్ధవిద్య అనేపదము వర్తించుచున్నది. అందుఁగల పదియాఱుబీజములు అంకురములు శ్రీదేవి దంతపఙ్క్తియందును సాముద్రికలక్షణప్రకారము, పదియాఱుచొప్పున ఉన్నందున శ్రీవిద్యావర్ణములేఅమ్మవారిదంతపఙ్క్తిగా ఉన్నవని చెప్పినారు. ప్రతిబీజమందును శివశక్తిభాగములు రెండును రెండు దళములుగా ఉన్నందున దంతపఙ్క్తులు రెండుగాఅయినవికలిసి ముప్పది

రెండు అగుచున్నవి. శ్రీరాజరాజేశ్వరీ మంత్రవర్ణములు, ఆమెయొక్క దంతపఙ్క్తులుగా ఉన్నవి.

౨. ద్విజశబ్దము దంతములందును, బ్రాహ్మణులందును వర్తించుచున్నందున వేదాదిసకలవిద్యలును, బ్రాహ్మణులను పొందినవనియు వారినుండి ఇతరులకు ఉపదేశపరంపరగా విస్తరించినందున, బ్రాహ్మణులు విద్యాంకురస్వరూపులనియు, వారును బ్రహ్మస్వరూపిణియగు పరదేవత ముఖమునుండియే జన్మకలవారు గాన అంబాముఖమందున్నదంతపఙ్క్తిద్వయము బ్రాహ్మణాకారమనియు ద్విజశబ్దమువలన శ్లేషార్థము.

౩. లేక, 'శుద్ధవిద్యాచ బాలాచ ద్వాదశార్ధా మతంగినీ.' ఇత్యాది అనుత్తరాపర్యంతములగు ముప్పదిరెండుదీక్షలు తంత్రశాస్త్రములందు సుప్రసిద్ధములయియున్నవి. అట్టి ౩౨ దీక్షలచేత సంస్కరింపఁబడినవారిచేతనే పొందఁదగినది యని భావము.

☞ సమయాచారము, దక్షిణాచారము, కౌళాచారము, వామాచారము అని శ్రీవిద్యోపాసనలో నాలుగు మార్గములున్నవి. అంతర్యాగ బహిర్యాగములు రెండును వీనికి భేదములుగా నున్నవి. సమయదక్షిణములు రెండును వేదసమ్మతములు. బ్రాహ్మణార్హములు; తక్కిన రెండును శూద్రులకును బైరాగులకుఁ త్రైవర్ణికులకుఁ దంత్రములయందుఁ జెప్పఁబడినవి. వేదబాహ్యములు. ఈకౌలవామాచారములు ముందు కౌళపదనామవ్యాఖ్యానమందు వివరింపఁబడును గాన ఇచట విస్తరింపలేదు.(షోడశాక్షరము.)

౨౬. కర్పూరవీటికామోదసమాకర్ష ద్దిగంతరాయై నమః.

తా. ౧. శ్రీదేవియొక్క ముఖమందు కర్పూరాదిసుగంధద్రవ్యసంయుతమగు కర్పూరవీటిక గలదు.

శ్లో. ఏలా లవంగ కర్పూర కస్తూరీ కేసరాదిభిః,
జాతీఫలదలైఃపూగైః లాంగల్యామణనాగరైః,

చూర్ణైః ఖదిరసారైశ్చ యుక్తా కర్పూరవీటికా.

అను ప్రమాణవచనము ననుసరించి ఏలకులు, లవంగములు, పచ్చకర్పూరము, కస్తూరి, కుంకుమపువ్వు, జాజికాయ, జాపత్రి, చలవమిరియాలు, కుంతి, కాచు, పోకలు మున్నగు ద్రవ్యములను చూర్ణముచేసి యట్టి చూర్ణముతోడ తాంబూలము సేవించిన కర్పూరవీటిక యనంబడును. అట్టి కర్పూరవీటికను శ్రీదేవి సేవించియుండుటచేత తద్వీటికాపరిమళము పది దిక్కు లందు వ్యాపించియున్నదని భావము.

౨. పరదేవతా ముఖకమలమునుండి బయలుదేరిన తాంబూలకబళనమునుగాని పరిమళమును గాని ముందుగా గ్రహింపుటయందు దశదిగ్దేవతలు ఆసక్తికలిగియున్నారు. (అమ్మవారి తాంబూలకబళనమును ఆపరిమళమును కోరి దిగ్దేవత లాశ్రయించియున్నారని భావము.)(షోడశాక్షరము.)

౨౭. నిజసల్లాపమాధుర్యవినిర్భర్త్సితకచ్ఛప్యై నమః.

తా. శ్రీదేవియొక్క వాక్యములందున్న మాధుర్యముచేత వీణానాదమందున్న మాధుర్యము తిరస్కరింపఁబడుచున్నది. వీణానాదమాధుర్యమందు శుకశారికాదినాదమువలె నే స్వరము మాత్రము కొంచెము పోలికకలిగియుండును అంబావాక్యములందు వర్ణవిభాగము స్పష్టతరముగా నున్నందున మాధుర్యము అధికముగా నున్నదనియు, దేవీవాక్కులు వీణానాదమును తిరస్కరించుచున్నవనియు భావము. (షోడశాక్షరము.)

౨౮. మందస్మితప్రభాపూరమజ్జత్కామేశమానసాయై నమః.

తా. ౧. శ్రీదేవియొక్క ముఖము సర్వదా చిఱునవ్వుతోఁ గూడియున్నందున ఆమందహాసముయొక్క కాంతిప్రవాహమునందు శ్రీదేవి భర్తఅయిన కామేశ్వరుని మనస్సు, మునుఁగుచు తేలుచు ఆస్వాధీనముగా నున్నది. (షోడశాక్షరము.)

౨. శ్రీదేవిహాసము మోహినీదేవతాస్వరూపముగావునస్వామునుగా;

శ్రు. 'ఆనందో బ్రహ్మేతివ్యజానాత్.' అను శ్రుతివలన ఈపరాశక్తి ఆనంద స్వరూపము గలది గనుక లోకులవలెను భర్తను బూర్ణముగా స్వరూప విస్మృతునిగాఁ జేయలేదని భావము. 'కామేశః' అనే పదమందున్న కామ శబ్దము మన్మథవాచకముగాని త్రిమూర్తులలో నున్న రుద్రపరముగాని కాదనియు కామకలారూప పరశివవాచకమనియు గ్రహింపవలెను. కామ కలా భేదములు ముందు వివరింపఁబడును. (షోడశాక్షరము.)

౨౯. అనాకలితసాదృశ్య చుబుక శ్రీవిరాజితాయై నమః.

తా. శ్రీదేవి చుబుకమునకు సమానవస్తువులే దొరకనందున అద్దము నందు గల వర్తులత్వము కొంచెము సామ్యముగాఁ జెప్పఁదగినదిగా నున్నది. అట్టిశోభచేతఁ బ్రకాశించుచున్న చుబుకము కలది. (షోడశాక్షరము.)

౩౦. కామేశబద్ధమాంగళ్య సూత్రశోభితకన్ధరాయై నమః.

తా. (కామేశ్వరుని) అనఁగా పరమశివునిచేఁ గట్టఁబడిన మంగళ సూత్రముచేఁ బ్రకాశించుచున్న కంఠము కలది. (ఈమాంగళ్యసూత్రము కామోజ్జీవనహేతుభూతమగు సౌభాగ్యాభరణము.) సకలాభరణములకును ఇది ప్రథమాభరణముగా నున్నది. (షోడశాక్షరము.)

౩౧. కనకాంగదకేయూర కమనీయభుజాన్వితాయై నమః.

తా. ౧. సువర్ణముచేత నిర్మింపబడిన నాలుగుభుజకీర్తులచే మనో హరమైన భుజములు గలది.

౨. లేక సువర్ణనిర్మితములగు అంగదము, కేయూరము అను భూష ణములచేత అలంకరింపఁబడిన బాహువులు గలది యనియు చెప్పవచ్చును. (షోడశాక్షరము.)

౩౨. రత్నగ్రైవేయచిన్తాకలోలముక్తాఫలాన్వితాయై నమః.

తా. శ్రీదేవి కంఠాభరణములు వర్ణింపఁబడుచున్నవి. నవరత్న ములచేఁ గూర్పఁబడిన కంఠమాలయు, సువర్ణమయమైన చింతాకము,

(మెఱుపుఁదీగె; ఇది ఆంధ్రదేశమందు స్త్రీలచేత ధరింపఁబడుచున్న ప్రాచీనాభరణము.) ముత్యాలహారమనే మూఁడు కంఠాభరణములు కలవి. (షోడశాక్షరము.)

33. కామేశ్వరప్రేమరత్న మణిప్రతిపణ స్తన్యై నమః.

తా. జగన్మాత తనభర్తయయిన కామేశ్వరుని ప్రేమ అనే రత్నమును కొనుటకు జగజ్జీవనభూతములైన, తన స్తనద్వయము నే ప్రతిపణముగా (అనఁగా మూల్యముగా) నిచ్చినది. ఒక ప్రేమరత్నమునకు రెండురత్నములను మూల్యముగా నిచ్చికొన్నందున మూల్యము ద్విగుణమైనది. అట్టి వస్తువునందు నెన్నఁడును పరాకు (అనఁగా ఉపేక్షయు) ఉండదనియు శ్రీకామేశ్వరునియందు లలితాదేవి బద్ధానురాగ యయియుండునని శ్రీదేవియొక్క పాతివ్రత్యాతిశయము సూచితమగుచున్నదని భావము. (షోడశాక్షరము.)

34. నాభ్యాలవాలరోమాళి లతాఫలకుచద్వయ్యై నమః.

తా. శ్రీమాతయొక్క తుమ్మెదలవంటి రోమరాజి (అనఁగా నూగారు) అనే లతకుఁ దన నాభిప్రదేశము ఆలవాలము పాదుగా నున్నది. అట్టి రోమరాజి అనే లతకుఁ గుచద్వయము ఫలముగా ఉన్నది. సాముద్రికశాస్త్రప్రకారము సులక్షణములు గలది. (షోడశాక్షరము.)

35. లక్ష్యరోమలతాధారతాసమున్నేయమధ్యమాయైనమః.

తా. శ్రీదేవికి మధ్యప్రదేశము, (అనఁగా పూర్వకాయ, ఉత్తరకాయములకు సంధిస్థలము) కలదా? లేదా? అని సందేహము కలుగఁగా, ఉన్నదని నిశ్చయించుటకు వెల్లడిగా అగుపడుచున్న నూగారువలన (నూగారు మధ్యప్రదేశమం దుత్పత్తిగలదిగాన) మధ్యప్రదేశము కలదని ఊహించుట కాధారమైనది. సూక్ష్మమధ్యయని భావము. సన్నమైన నడుము కలుగుట స్త్రీలకు శుభలక్షణముగా నున్నది. (షోడశాక్షరము.)

36. స్తనభారదళన్మధ్యపట్టబన్ధవళిత్రయాయై నమః.

తా. శ్రీదేవి మధ్యభాగమందు వళిత్రయమున్నది. ఈవళిత్రయము

మీఁది శరీరమందున్న స్తనభారముచేత, మధ్యప్రదేశ మల్పమైనందున వంగిపోవునేమో అని సువర్ణవస్త్రముచేత, మధ్యప్రదేశ దార్ఢ్యముకొఱకు ముమ్మారు త్రిప్పి కట్టినట్టుగా తోఁచుచున్నదని భావము. ఇందువలన సూక్ష్మమధ్యవళిత్రయము ఉన్నతకుచములు, ఇట్లు స్త్రీసాముద్రికశాస్త్రోక్త సులక్షణములన్నియు గలదని అభిప్రాయము. (షోడశాక్షరము.)

3౭. అరుణారుణకౌసుంభ వస్త్ర భాస్వత్కటీతట్యై నమః

తా. శ్రీదేవి అత్యంతము ఎఱ్ఱనైన కుసుంబారంగు చీరచేఁ బ్రకాశించుచున్న కటిప్రదేశము గలది. కుసుంబారంగు వస్త్రమందు, ప్రీతి గలిగి ధరించినదని భావము. (షోడశాక్షరము.)

3౮. రత్నకింకిణికారమ్యరశనాదామభూషితాయై నమః.

తా. శ్రీలలితాదేవిరత్నమయములయిన చిఱుగంటలచేఁ బ్రకాశించుచున్న బంగారు మొలనూలు చేత అలంకృతయైయున్నది. (షోడశాక్షరము.)

3౯. కామేశజ్ఞాతసౌభాగ్యమార్దవోరుద్వయాన్వితాయై నమః.

తా. కామేశ్వరునిచేత మాత్రమే తెలియఁబడుచున్న సౌభాగ్య మార్దవ గుణములుగల ఊరుద్వయము గలది. (షోడశాక్షరము.)

౪౦. మాణిక్యమకుటాకార జానుద్వయవిరాజితాయై నమః.

తా. అఖండమయిన మాణిక్యముచేత నిర్మింపఁబడిన టోపీవలె ప్రకాశించుచున్న జానువులు (అనఁగా మోకాళ్ళు)చేత ప్రకాశించుచున్నది. (షోడశాక్షరము.)

౪౧. ఇంద్రగోపపరిక్షిప్త స్మరతూణాభజంఘికాయై నమః.

తా. అమ్మవారి జంఘలు వర్షకాలమందు ఆర్ద్రిపురుగులు అనుమిక్కిలి యెఱ్ఱని ధాతువుగల క్రిమిజాతిచే నిర్మింపఁబడిన మన్మథుని అమ్ముల పొదివలె నున్నవని భావము. అధికమైన ఎఱ్ఱనిరంగు కలవి. (షోడశాక్షరము.

౪౨. గూఢగుల్ఫాయై నమః.

తా. శ్రీదేవిగుల్ఫములు పాదపృష్ఠభాగములు. (మీగాళ్లు) పిక్కలు దట్టముగా మాంసపూరితములుగా నున్నవి. (చతురక్షరము.)

౪౩ కూర్మపృష్ఠజయిష్ణుప్రపదాన్వితాయై నమః.

తా. శ్రీదేవి పాదములు తాఁబేలువీపును జయింప ఇచ్ఛకలవని తోఁచుచున్నది. కూర్మపృష్ఠముకంటె నెత్తుగా నున్నపాదముల ఊపరి భాగము (మీగాళ్లు) కలది. ఇది సాముద్రికశాస్త్రముప్రకారము శుభ కరము. (ద్వాదశాక్షరము.)

౪౪. నఖదీధితిసంఛన్న నమజ్జనతమోగుణాయై నమః

తా. జగన్మాత పాదములందుగల చంద్రతుల్యములగు నఖముల యొక్క కాంతిచేతను నమస్కరించు భక్తులైన బ్రహ్మవిష్ణు మొదలగు జను లందున్న తమోగుణము నశించుచున్నది. పగలు సూర్యునికాంతిచేతను పూర్ణిమనాటి రాత్రి చంద్రునికాంతి చేతను అంధకారము పూర్తిగా నశించిపోవుచున్నది. అట్టులే, శ్రీ దేవినఖచంద్రకాంతి చేత నమస్కరించు భక్తజనుల అజ్ఞానము పూర్తిగా నశించుచున్నది. బ్రహ్మాదిదేవతాబృందము భక్తజనులుగనున్నారు. (షోడశాక్షరము.)

౪౫. పదద్వయప్రభాజాల పరాకృతసరోరుహాయై నమః.

తా. ౧. శ్రీదేవియొక్క సౌష్ఠవాదిగుణములుగల చరణయుగళము యొక్క కాంతిసమూహముచేత పద్మములు తిరస్కరింపఁబడినవి. పద్మముల కంటె చక్కఁగా శోభించు పాదయుగళములుగలది శ్రీదేవి యని భావము.

౨. శ్రీదేవి పాదద్వంద్వమందు, దక్షిణపాదము ప్రకాశాంశము, శుక్లచరణము వామము, విమర్శాంశమురక్తచరణము, రెండుకాంతుల మేళ నము రక్తశుక్లప్రభామిశ్రకాన్తి కమలకాన్తిని దిరస్కరించుచున్నది. కమలకాన్తియు రక్తశుక్ల మేళనముకలది. అయినను ఇంతశోభలేదు. (షోడశాక్షరము.)

౪౬. శింజానమణిమంజీరమండితశ్రీపదాంబుజాయై నమః.

తా. మంజీరము అనఁగా 'అందెలు' అను పాదాభరణ విశేషము. అవి గజ్జలు చేర్చఁబడినయెడల 'గజ్జెలందెలు' అని వ్యవహరింపఁబడును. గజ్జెలకు బదులుగా రత్నములే ఇచట సమకూర్చఁబడియున్నవి. ధ్వని చేయుచున్న మణులుగల అందెలతో అలంకరింపఁబడిన పాదారవిందములు గలదని భావము. (షోడశాక్షరము.)

౪౭. మరాళీమందగమనాయై నమః.

తా. శ్రీదేవి స్త్రీజాతిహంసయొక్క నడకవంటి మందగమనము కలది. హంసల జాతియు మందగమనము కలది. అందులో ఆడుహంసలు మిక్కిలి మందమైన నడక కలవిగాన 'మరాళీ మందగమనా' అని ప్రయోగము. (అష్టాక్షరము.)

౪౮. మహాలావణ్యశేవధయే నమః. 20

తా. శ్రీదేవి శరీరముయొక్క ఆకారము, విశేషసౌందర్యము కలిగి ఉన్నందునను, మృదువుగా నున్నందునను, సౌందర్యనిధివలె నున్నది. శ్రీదేవిశరీరమునుండి సౌందర్యము బయలుదేరి కరచరణాద్యాకారమును పొంది ప్రకాశించుచున్నదని భావము. (అష్టాక్షరము.)

౪౯. సర్వారుణాయై నమః.

తా. శ్రీమాత కుసుంభారంగువస్త్రము, రక్తచందనము, మాణిక్య రచితాభరణములు, మందారపుష్పమాలికలు సహస్రసూర్యకాంతి కలిగి యున్నందువలన, సర్వారుణ అని ప్రసిద్ధి కలిగినది. శ్రీదేవికి ఎఱ్ఱనిరంగు నందు అధికప్రీతి గలదని భావము. (చతురక్షరము.)

౫౦. అనవద్యాంగ్యై నమః.

తా. శిరస్సునుండి పాదనఖములపర్యంతమయిన సకలావయవములు

సులక్షణములుగలవి. ఒకటైనను నింద్యముకాదు. కనుకనే, లలితాంబిక యను సార్థకనామ మేర్పడెను. లలితమనఁగా సుందరమని అర్థము. (చతురక్షరము.)

### ౫౧. సర్వాభరణభూషితాయై నమః.

తా. శ్రీదేవి చూడామణి మొదలుకొని పాదాంగుళీయకపర్యంతము, కల్పసూత్రమందుచెప్పిన చతుష్షష్ట్యుపచారములందున్న మహాపతకచ్ఛన్నవీరాది సర్వాభరణములచేత అలంకరింపఁబడియున్నందువలన సర్వాభరణభూషిత అని చెప్పఁబడుచున్నది. (స్త్రీల ఆభరణములు ౪౪ అని కాళికాపురాణమునందు పేర్కొనఁబడినవి. కల్పసూత్రములందు మఱికొన్ని చెప్పఁబడినవి.) లోకమందున్న స్త్రీలలో వారి వారి అధికారానుసారము, ఆయావస్తువులను ధరించుట శ్రేయస్కరముగా నున్నది. కొన్ని వస్తువులు పూజించుటకు మాత్రమే గాని, ధారణాధికారము అందఱకు లేదు. శ్రీదేవికి అన్నివస్తువులను ధరించుటకు సర్వాధికారము గలదు. (అష్టాక్షరము.)

ఈ పైరీతిని శ్రీలలితాదేవి స్థూలరూపమును వర్ణించి ఆలలితాదేవి యొక్క ఉనికిస్థానములను వర్ణించుచున్నారు.—

### ౫౨. శివకామేశ్వరాంకస్థాయై నమః.

తా. పరాశక్తిరూపములేనిదైనను, తేజోమయమైనదర్పణమందవయవస్ఫూర్తియు, శ్వేతరక్తనీలాదిరూపభేదమును ప్రత్యక్షముగా నున్నట్లు స్థూలశరీరము గల భండాసుర, మహిషాసురాదుల వధాదికమును కరచరణరూపమును ధరించిగాని చేయుటకు సాధ్యముకాదు గాన ఆరీతిని ప్రత్యక్షమైనది. స్థూలసూక్ష్మపరాభేదము లనునవి శ్రీదేవికి యథార్థముగా లేవని భావము. శివకామ ఈశ్వరశబ్దములు ప్రజ్ఞానస్వరూపబ్రహ్మపరములు. అట్టి కామేశ్వరుని వామోరువునందు ఉనికిగలది. (అష్టాక్షరము.)

### ౫౩. శివాయై నమః.

తా. ౧. కామేశ్వరీకామేశ్వరులు సమానధర్మములు గలవారు గనుక వారిరువురకును భేదములేనందున శ్రీదేవికి శివా అని నామము కలిగినది.

౨. సకలసంపదలను ఇచ్చునదిగనుక, శివ అనియు; సర్వసంపదలే స్వరూపముగా గలదనియు;

౩. ఉత్తమమయిన మోక్షమను బ్రహ్మపదవిని స్వరూపజ్ఞానమును ఇచ్చునది గనుక శివ అనియు;

౪. మంగళప్రదమైన సుగుణములు గలిగి యున్నందున శివ అని వాడుక గలిగినది.

౫. 'శివ' అనగా ముక్తిస్వరూపమని త్రిపుటీయందు మధ్యమపదము జ్ఞానము, అదియే ప్రజ్ఞానము అట్టి యాకారము కలది. (ద్వ్యక్షరము.)

౫౪. స్వాధీనవల్లభాయై నమః.

తా. తనయందు శక్తిలేనపుడు ఎవరుగాని తమతమ కార్యముల యందు సమర్థులు కాలేరనియు, శివశక్తులకు ధర్మధర్మిభావము సహజమనియు తెలియుచున్నది. శ్రీచక్రమందున్న బిందువు శివరూపము. త్రిభుజాచక్రము శక్తిరూపముగా నున్నందున బిందువు త్రిభుజాచక్రాధీనముగా నున్నందున, ఈనామము సార్థకమైనది. బిందుప్రభృతియే ఈ శ్రీ చక్రాకారముగాఁ బరిణమించినందున, కామేశ్వరీకామేశ్వరులు అన్యోన్యకారణము గలవారు. కనుక లలితాదేవికి తనభర్తయగు కామేశ్వరుఁడు స్వాధీనుఁడని భావము. (షడక్షరము.)

౫౪. శ్రీదేవికి కామేశ్వరుని వామోత్సంగము నివాసస్థానమని ఇది వఱకు చెప్పఁబడినది. ఇఁక ఇతరస్థలముల చెప్ప నారంభించినారు.—

౫౫. సుమేరుశృంగమధ్యస్థాయై నమః

తా. శ్రీచక్రమందు యూర్ధ్వకోణములు నాలుగు శివచక్రములనియు అధోముఖకోణములు అయిదు శక్తిచక్రములనియు సంకేతముగలదు ఆరీతిని మేరుశిఖరమందును మూఁడుశృంగము లున్నవనియు, వానిమధ్యన ఉన్నతమైన నాలుగవశృంగము నాలుగువందలయోజనముల విస్తీర్ణము

గల్గియున్నదనియు, దానియందు భర్తయగు కామేశ్వరునితోఁగూడ కామేశ్వరీదేవి ఉన్నదనియు భావము. శ్రీచక్రబ్రహ్మాండపిండాండములు సమానధర్మములు కలవి. (అష్టాక్షరము.)

అవ. శ్రీలలితాదేవి నివసించుపట్టణము నిరూపింపఁబడుచున్నది.—

౫౬. శ్రీమన్నగరనాయికాయై నమః.

తా. ౧. శ్రీమహాలక్ష్మివలెఁ బ్రకాశించునది శ్రీనగరము. అది రెండు విధములుగా ఉన్నది. ఒకటి మేరుపర్వతశిఖరమం దున్నదనియు, రెండవది సకల బ్రహ్మాండములపైని, సుధాసాగరమధ్యమున్న రత్నద్వీపమందు శ్రీదేవి నివాసస్థానమైన శ్రీనగరమున్నదనియు భావము.

౨. నగరశబ్దము శ్రీచక్రపరమని గౌడపాదసూత్రములం దున్నందున శ్రీచక్రపరముగా చెప్పినందునను శ్రుతిసిద్ధముగానున్నందున శ్రీచక్రమునకు అధ్యక్షురాలు.

౩. శ్రీలలితా సహస్రనామస్తోత్రమందు రహస్యనామములని ఉన్నందున బాహ్యార్థము, రహస్యార్థము అని రెండర్థము లున్నట్లు స్పష్టమగుచున్నది. అందు శ్రీదేవ్యవతారము, భండాసురయుద్ధము దేవతలు శ్రీదేవిని స్తుతించుట మొదలగు పురాణోక్తమైనకథ బాహ్యార్థముగాను; స్వరూపజ్ఞానసాధనము ఆధ్యాత్మికపరముగానున్నది. రహస్యార్థముగాను గ్రహింపవలయును. ప్రథమశతకమందు నామములందు తరుమ రహస్యార్థమును అచ్చటచ్చట బాహ్యార్థమును కనఁబడుచున్నవి. అందువలన శ్రీనగరశబ్దము శ్రీచక్ర పరమైనందున బ్రహ్మాండపిండాండములు, మాతృకా శ్రీచక్రములు సమానధర్మములు కలవైనందున ఈ నాలుగును శ్రీనగరములుగానే యున్నవి. ఈనాలిగింటికి శ్రీదేవి ప్రభువనియు, ఇది శ్రీదేవికి నివాసస్థానములనియు భావము. (అష్టాక్షరము.)

౫౭. చిన్తామణిగృహాన్తస్థాయై నమః.

తా. ౧. కోరినఫలములను ఇచ్చునదిగనుక చింతామణి యని పేరు. అట్టి

రత్నజాతిశిలచేత రచింపబడిన ప్రాకారముగల గృహమందు శ్రీదేవి వసించుచున్నందున ఈనామము గలిగినది.

౨. గౌడపాదాచార్యవిరచితసూత్రభాష్యమందు జింతితార్థప్రదములైన మంత్రములకు ఉత్పత్తిస్థానమనియు, అట్టి మంత్రనిర్మాణక్రమము విస్తరింపబడినది. అందువలన శ్రీచక్రము మాతృకాచక్రమని ప్రసిద్ధి గనుక శ్రీచక్రబ్రహ్మాండపిండాండములు సమానధర్మములు గలవైనందున ఈనాలుగును చింతామణిగృహములుగానే ఉన్నవి. అన్నిటికిని శ్రీదేవి ప్రభువుగా ఉన్నది. (అష్టాక్షరము.)

౫౮. పంచబ్రహ్మాసనస్థితాయై నమః.

తా. ౧. పంచబ్రహ్మలచేత నిర్మింపబడిన మంచాకారమైన ఆసనమందు శ్రీరాజరాజేశ్వరీదేవి ఉన్నదని, రుద్రయామిళాదిగ్రంథములందును, సనకవసిష్ఠాదిసంహితలందును సకలాగమసిద్ధముగా నున్నది. బ్రహ్మ, విష్ణు, రుద్రేశ్వరులు నలుగురు నాలుగు పాదములుగా నున్న మంచాకారముగను, సదాశివుడు పర్యంకాకారముగను, తదుపరి భాగమందు, రాజరాజేశ్వరీదేవి ఉన్నది గనుక ఈనామము సార్థకముగా నున్నది.

౨. శ్రీచక్రమధ్యభాగమందు, అధోముఖముగానున్న విమర్శాంశకోణపంచకము బ్రహ్మాది సదాశివాంతపంచబ్రహ్మమయమంచకము, సదాశివుడుపర్యంకము. అది శ్రీరాజరాజేశ్వరీదేవి నివాసస్థానము కావున నిట్లు చెప్పబడినది.

౩. శ్రీదేవిస్థూలాకారమందున్న మూలాధారస్వాధిష్ఠానముల ఉపరి బ్రహ్మగ్రంథియు, మణిపూరానాహతములపైని విష్ణుగ్రంథియు విశుద్ధ ఆజ్ఞా కమలములపైని, రుద్రగ్రంథియు, లలాటమునుండి శిరోమధ్యభాగపర్యంతమందు ఈశ్వరస్థితియు, తదుపరి ద్వాదశాంతమందుబిందుస్థానమందుసదాశివస్థానమనియు,ఆపైనిచిత్కలారూపముగా శ్రీదేవిఉన్నది,గనుకపంచబ్రహ్మ

కార ఆసనత్వము శ్రీదేవికి సిద్ధించినది. బిందువునకు క్రిందుగా బ్రహ్మాదులు ఆయాస్థానములందు గ్రంథిరూపముగా నిమీలితాక్షులై శ్రీదేవీధ్యాన పరులై, తుర్యతురీయాతీతదశలను బొంది, బ్రహ్మానందానుభవములో నున్నందున ఈ నామసిద్ధి అని తాత్పర్యము. బ్రహ్మాదిసదాశివాంతపంచ బ్రహ్మలు, పృథివ్యాది పంచభూతమయములు వానియందున్న సత్తా 'శ్రీదేవి' అని రహస్యార్థము.

४. సద్యోజాతాదిపంచబ్రహ్మమంత్రములు పర్యంక సహితమైన నాలుగు పాదములుగల మంచాకారమైన ఆసనరూపముగా ఉన్నవనియు, దానిపైని శ్రీదేవి స్వరూపానందానుభవము కలిగి ఉన్నది.

౫. పృథివ్యాదిపంచభూతములును పంచబ్రహ్మాకారములు గనుక వీనితోకూడిన బ్రహ్మాండము నాలుగుపాదములు పర్యంకముగల మంచా కారమయిన ఆసనముపైని శ్రీదేవి బ్రహ్మానంద మనుభవించుచున్నదని అందు వలన నీ 'పంచబ్రహ్మాసనస్థిత' అను నామము కలిగినది. (అష్టాక్షరము.)

౫౯. మహాపద్మాటవీసంస్థాయై నమః.

తా. ౧. గొప్పపద్మములయొక్క వనమందుగల పద్మమధ్యమం దున్నదని తాత్పర్యము. రుద్రయామళాదిగ్రంథములందు, మణిపురవర్ణన మందు, బ్రహ్మాండోపరిభాగమందు మూఁడులక్షలయోజనముల విస్తీర్ణము గల పద్మాటవి కలదనియు, ఆపద్మాటవియందుఁగల పద్మములు తాళఫల ప్రమాణమైన కేసరములు కలిగి మకరంద ప్రవాహమును స్రవించుచుండు ననియు చెప్పఁబడినది. ఇట్టి గొప్ప పద్మవనమునందు శ్రీదేవి నివసించు చున్నది.

౨. బ్రహ్మరంధ్రస్థిత సహస్రారకమలము పద్మాటవి అనియు, అందు గల బిందుస్థానమందు శ్రీదేవి ఉన్నందునను పిండాండబ్రహ్మాండములు సమానధర్మములుకలవని అరుణోపనిషత్తునందు జెప్పఁబడియున్నది గనుక నీనామము కల్గినది. (అష్టాక్షరము.)

౬౦. కదంబవనవాసిన్యై నమః.

# శ్రీ లలితాసహస్రనామావళి

తా. కదంబవనమందున్న సదనమందు శ్రీదేవి ఉనికిగలది.

వామకేశ్వరవచనము:—

"బిందుస్థానం సుధాసింధుః పంచయోన్యః సురద్రుమాః." అని.

## ౬౧. సుధాసాగరమధ్యస్థాయై నమః.

తా. ౧. బ్రహ్మాండోపరిభాగమందు సుధాసముద్రము కలదు, తన్మధ్యప్రదేశమందు రత్నద్వీపమున్నది. ఆరత్నద్వీప మధ్యభాగమునందు గల చింతామణి గృహమందు శ్రీదేవి యున్నది.

౨. పిండాండమందు సహస్రారకమలకర్ణికారూపచంద్రమండలమే అమృతసరస్సనియు; రత్నద్వీపము, చింతామణిగృహము, పద్మవనము, నీపవనము మున్నగునవి యన్నియు అచ్చటనే యున్నవనియు అచట శ్రీదేవి నివసించుచున్నది అని యర్థము.

౩. రుద్రయామిళాదిగ్రంథములందు శ్రీచక్రమధ్యబిందువు సుధాసింధువనియు, పంచయోనులు నీపశ్రేణియనియు, అష్టదళషోడశదళాది మహాపద్మవనమనియు, రత్నద్వీపము చింతామణిగృహమందున్నదనియు భావము. (అష్టాక్షరము.)

## ౬౨. కామాక్ష్యై నమః.

తా. ౧. శ్రీదేవికి చంద్రసూర్యాగ్నిమండలములు నేత్రములుగా నున్నవి. మనోహరమైనట్టి సుందరమైనట్టి నేత్రములు కలది. (శ్రీదేవి యొక్క కటాక్షమే భక్తులకు సకలకోరికలను ఇచ్చుచున్నదని భావము. (త్ర్యక్షరము.)

౨. కాంచిపీఠము నధిష్ఠించియున్న శ్రీకామాక్షీదేవతాస్వరూప యని భావము.

## ౬౩. కామదాయిన్యై నమః.

తా. భక్తజనులకు కోరికలను ఇచ్చునదియనిగాని, తనభక్తులకు,

కామేశ్వరరూప సాక్షాత్కారము కలుగఁజేయునదియనిగాని, ఈశ్వరాభేదజ్ఞానమును కలుగఁజేయునదియనిగాని చెప్పవచ్చును. (పంచాక్షరము.)

## ౬౪. దేవర్షిగణసంఘాత స్తూయమానాత్మవైభవాయై నమః.

తా. ౧. శ్రీదేవి సర్వలక్షణసంపన్నయు, సర్వాలంకారభూషితయు, సాయుధయు, సకలపరివారచతురంగ సేనాసహితయునయి, బ్రహ్మాదిదేవతల ప్రార్థనల నంగీకరించి, చిదగ్నికుండమునుండి శ్రీచక్రమధ్యమందుండి, ప్రత్యక్షమైన స్వరూపమును, బ్రహ్మాదిదేవతలు వసిష్ఠాది మహర్షులు నారదాది దేవఋషులు జయజయధ్వనులతో పరాశక్తివైభవమును, అనంతశక్తిసామర్థ్యమును వర్ణించుచు స్తోత్రము చేసిరి.

౨. శ్రీదేవి స్థూలరూపకార్యములను స్పష్టముగా వర్ణించుచు, పరరూప పక్షమందు, దేవఋషిసంఘముచేత స్తుతింపఁబడినదని, విశేషణము వలన ఆత్మపరమందు దేవాదిసకలప్రాణులయం దుండునదియు, అందఱకును పరిచయముగలదియు, సకలప్రేమలకు ఆస్పదమైన తమతమ ఆత్మయే దేవతగా ఉన్నదని రహస్యార్థము. లలితాదేవి ప్రపంచమే శరీరముగా కలదని సనత్కుమారసంహిత ప్రమాణము. 'స్వాత్మైక్యరూపాధీర్దేవతేతి' భావనోపనిషత్. ఈరీతిని కొన్ని నామములు ఉభయార్థములుగలవిగలవు. (పంచాక్షరము.)

అవ. శ్రీదేవి దేవకార్యమందు ఉద్యుక్తురాలని, ఏస్థూలశరీరకార్యములు చెప్పఁబడినవో వానిని స్పష్టపరచుచున్నారు.—

## ౬౫. భండాసురవధోద్యుక్త శక్తిసేనాసమన్వితాయై నమః.

తా. ౧. భండుఁడను రాక్షసుని యుద్ధము మొదలగునవి లలితోపాఖ్యానమందు విస్తరింపఁబడినవి. రుద్రకోపాగ్నిచే మన్మథదహనానంతరమందు ఆ భస్మమును చిత్రకర్మ అను ప్రమథుఁడు విగ్రహాకారముగా రచించెను. దానిని బ్రహ్మచూచి 'భణ్డభణ్డ' అని నిషేధవాక్యమును పలికెను. అంతట ఆవిగ్రహము సప్రాణమై, భండుడను నామముగలవాఁడై, రుద్రకోపానలముచేఁ బుట్టినం

దున ఉగ్రకర్మకలవాఁడై రాక్షసులకు రాజై దేవతల బాధించుచుండె నని పురాణగాథ. అభండ రాక్షసవధయందు ఉద్యుక్తమైన బ్రాహ్మ్యాది శక్తిసేనాసమూహముతోఁగూడి లలితాదేవి ప్రకాశించుచున్నది.

౨. రహస్యార్థముగ తన స్థూలశరీరమే నే నని లేక సూక్ష్మమైన జీవత్వమే నేనను అజ్ఞానసహితమైన జీవభావమే భండాసురుఁడు. స్వాత్మయే లలితాదేవి. శమదమవైరాగ్యబోధోపరమములు శక్తిసేనా సమూహము. తన నిజరూపమును మరచి ఆత్మయందు అనాత్మబుద్ధియు, అనాత్మలైన దేహేంద్రియాదులందు ఆత్మయనెడి బుద్ధికలుగుట ఆణవ మలము. అట్టి అజ్ఞానమే బంధము. అట్టి బంధకారణమైన జీవభావమును సమూలముగా జయించుటయం దుద్యుక్తులైన భక్తసముదాయము కల దని తాత్పర్యము. బాల్యమందు పుంస్త్వశక్తి లీనమైయుండి యౌవనమందు వికసించినట్లు సకలశక్తులు ఆత్మయందు లీనమైయున్నవి. మోక్షేచ్ఛగలిగి నపుడు ఆశక్తులన్నియు స్ఫుటమగుచున్నవి. అంతర్గుహయందు దేవసేనలు రాక్షససేనలు రెండుబలములు, అన్యోన్యజయకాంక్ష కలిగి ఉన్నవనియు, సద్వృత్తులు దేవసేనగాను దుర్వృత్తులు రాక్షససేనగాను సర్వవృత్తి సాక్షిగా శ్రీదేవి యున్నదని భావము. (షోడశాక్షరము.)

౬౬. సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితాయై నమః.

తా. ౧. సంపత్కరీ అనేదేవత కలదు. ఆదేవత శ్రీదేవి అంశ శముచలనఁ గల్గినది. గజసేనలయం దధికారిణిగానుండి రణకోలాహలమనే గజము నధిష్ఠించి, కోటిసంఖ్యగల భద్ర మంద్ర మృగాదిభేదములుగల గజసేనాసమూహముతోఁ గూడి సన్నద్ధయై శ్రీదేవిని సేవించుచున్నది.

౨. రహస్యార్థము-సుఖసంపన్మయియగు చిత్తవృత్తి, సంపత్కరీ దేవతగా నున్నది. దానియం దధిష్ఠించిన గజసమూహరూపవిషయసముదా యముచేత సేవింపఁబడుచున్నదని భావము. (షోడశాక్షరము.)

౬౭. అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటికోటిభిరావృతాయై నమః.

తా. ౧. ఆగమములందు 'అశ్వారూఢ' అనే దేవతయు మంత్రమును కలవు. ఆదేవత 'అపరాజితా' అనే అశ్వము నధిష్ఠించి, వాయు వేగముగల కోటికోట్లు అశ్వారూఢలైన, శక్తిసేనల కధికారిణిగానుండి ఆసేనలతోఁగూడ శ్రీదేవిని సేవించుచున్నది.

౨. ఇంద్రియములే అశ్వములు. మనస్సే అశ్వారూఢ అను దేవత. అట్టి ఇంద్రియాశ్వముల నధిష్ఠించిన మనస్సు, మనస్సునకు ఇంద్రియముల ద్వారా వృత్తినిర్గమమువలన ఒకమనస్సుచేతనే అనేక ఇంద్రియముల నధిష్ఠించుచు అనేకవృత్తుల ననుభవించుచున్నది. ఇన్ద్రియాధిష్ఠితమైన మనశ్శక్తి ఆత్మదేవతను సేవించుచున్నదని భావము. (షోడశాక్షరము.)

౭౮. చక్రరాజరథారూఢ సర్వాయుధపరిష్కృతాయై నమః.

తా. ౧. చక్రరాజమనఁగా శ్రీచక్రము. మంత్రిణియగు శ్యామలాంబ రథము గేయ చక్రము; దండనాయికయగు వారాహీరథముకిరి చక్రము; ఆనంద ధ్వజము నవపర్వములు నవావరణములు పదియోజనముల ఉన్నతము నాలుగుయోజనముల విస్తీర్ణము కలది; మంత్రిణీరథము వారాహీరథము సప్తపర్వములు నాలుగుయోజనములు కలది. దేవీరథమున నుభయపార్శ్వములయందును ఈ రెండురథము లుండును. ఈమూఁడును అనపాయములుగా సర్వదా కలసేయుండును. ఇట్టి చక్రరాజము, శ్రీదేవి ఆయుధములను సకలాస్త్రములును కలిగియున్నందున ఆయుధములచే, అలంకరింపఁబడిన రథముకలది శ్రీదేవి యని భావము.

౨. ఆత్మపరము.—చిత్కళారూపము ఆత్మశక్తికి, స్థూలసూక్ష్మకారణముల నే శరీరత్రయము రథత్రయముగా నున్నది. మనస్సు మన్త్రిణీదేవి, బుద్ధి వారాహీదేవి, జ్ఞానసాధనములు, సత్యధర్మములు, ఆత్మానాత్మవిచారణయు, మంత్రములు ఆయుధములుగా నున్నవి. బాహ్యదృష్టిచే జగత్తును చిన్మయముగాచూచుట, ఈశ్వరత్వము సర్వమును చిన్మయముగా

చూచుట సదాశివత్వము. త్రిపుటీరహితమైన చిన్మయానుభవస్థితి, శుద్ధవిద్యగా నున్నది. ఇదియే తురీయాతీత మనఁబడును. (షోడశాక్షరము.)

౭౯. గేయచక్ర రథారూఢ మంత్రిణీ పరిసేవితాయై నమః.

తా. ౧. గేయచక్రమను రథమందున్న మంత్రిణీస్వరూపమైన శ్యామలాదేవిచేత సేవింపఁబడుచున్నది.

౨. రహస్యము—శ్రీచక్రమందు బిందువు నాక్రమించియున్న త్రికోణచక్రము గేయచక్రము, త్రిపురామంత్రిణీశక్తి, మంత్రార్థమును తమప్రభువైన ఆత్మను బోధించునది. ఆత్మాభిముఖమైన బుద్ధియే మంత్రిణీశక్తి శరీరపక్షము సూక్ష్మశరీరాభిమాని యని భావము. (షోడశాక్షరము.)

౮౦. కిరిచక్ర రథారూఢ దండనాథపురస్కృతాయై నమః.

తా. ౧. కిరి అనఁగా వరాహము. అట్టి ఆకారముగాని, లేక వరాహములచేత లాగబడునట్టి రథము నధిష్ఠించిన దండనాథయగు వారాహీదేవిచేత సేవింపఁబడుచున్నది.

౨. శ్రీచక్రమం దష్టకోణాది చక్రములు, స్థూలశరీరములు, వారాహీరథము, ఆత్మపరమైన విచారణ గలమనస్సే దండనాయిక సృష్టిలయములు ఆత్మదేవతి నిమేషోన్మేషములు బంధమోక్షములు వీరి అధీనములుగా నున్నవని గ్రహింపవలెను. (షోడశాక్షరము.)

౮౧. జ్వాలామాలినికాక్షిప్త వహ్నిప్రాకారమధ్యగాయై నమః

తా. ౧. చంద్రకళలు (౧౫) పదునైదును నిత్యాశక్తులుగా నున్నవి. షోడశీకళమహానిత్యగా నిత్యలు పదియాఱుగా నున్నవి. అదియే శ్రీదేవి స్వరూపము. పదునాలగవది జ్వాలామాలిని శ్రీదేవిచేత ఆజ్ఞాపింపఁబడి, నూఱుయోజనములు విస్తీర్ణము, ముప్పదియోజనములు ఉన్నతముగా అగ్నిప్రాకారము యుద్ధభూమియందు నిర్మింపఁబడినది. ఆమధ్యను చతురంగసేనాసహితముగా శ్రీదేవి ఉన్నదని భావము.

భా. వహ్నిశబ్దము దినరూపము. ప్రాకారశబ్దము రాత్రిరూపము. ఈ దినము రాత్రియును ప్రపంచముయొక్క సృష్టిలయములనుదెలుపుచున్నవి. పరాశక్తి ఈరెంటిమధ్యను వీనితో సంబంధములేనిదై సాక్షిస్వరూపముగా నున్నది. చిదానందస్వరూపిణి అని భావము. (షోడశాక్షరము.)

౭౨. భండసైన్యవధోద్యుక్త శక్తివిక్రమహర్షితాయై నమః.

తా. ౧. భండాసురుని చతురంగబలముయొక్క వధయం దుద్యుక్తలైన బ్రాహ్మ్యాది ఆఱువదినాలుగుకోట్ల శక్తిసేనల పరాక్రమము చూచి సంతోషించుచున్నది.

భా. భండుఁడనఁగా జీవభావము, వానిసైన్యము ద్వైతవృత్తులు వానిపరాక్రమముచూచి అట్టి ద్వైతవృత్తులను వధించుటయందు దాసక్తిగల తమసేనలను అద్వైతవృత్తులను చూచి, ఆత్మదేవత ఆనందించుచున్నది అని భావము. (షోడశాక్షరము.)

౭౩. నిత్యాపరాక్రమాటోప నిరీక్షణసముత్సుకాయై నమః.

తా. ౧. నిత్యలనఁగా కామేశ్వర్యాది చిత్రాంతమైన పంచదశ నిత్యాధిదేవతలు. అనిత్యాధిదేవతలు దమనకుఁడు మున్నగు పదునైదుగురు భండాసుర సేనానాయకులను వారివారి సేవలతోఁగూడ వధించిరి. అట్టి వారి పరాక్రమాటోపము చూచుటకు ఉత్సాహము గలది అని భావము.

భా. అనాదిసిద్ధమైన ఆత్మశక్తులు వారిపరాక్రమము చూడఁగా ప్రతిక్షణమందును సంతోషము కలుగుచున్నది. స్వస్వరూపమైన చిత్కళ ఒకమారు స్ఫురించినయెడల ఇతరద్వైతవృత్తులు కలుగవు. క్రమముగా జ్ఞానము వృద్ధియగుచున్నది. (షోడశాక్షరము.)

౭౪. భండపుత్రవధోద్యుక్త బాలావిక్రమనందితాయై నమః.

తా. ౧. భణ్డాసురునికుమారులు చతుర్బాహుఁడు మొదలు ఉపమాయుఁడువఱకు ముప్పదిమంది, వారిని శ్రీలలితాదేవి కుమార్తె అయిన తొమ్మిది

సంవత్సరములు వయస్సుగల బాలాత్రిపురసుందరి వధించినది. ఆవృత్తాంతమును విని శ్రీదేవి సంతోషించినది.

౨. విమర్శశక్తి బాలాస్వరూపము. అట్టి విమర్శవలన మోక్షమునకు ముఖ్య ప్రతిబంధరూపములగు ద్వైతవృత్తులు, అవిద్యావృత్తులు నశించుచున్నవి. అందువలన ఆత్మకు ఆనందము కలుగుచున్నది అని రహస్యార్థము. (షోడశాక్షరము.)

౭౫. మంత్రిణ్యంబావిరచిత విషంగవధతోషితాయై నమః.

తా. ౧. విషంగుఁడని విశుక్రుఁడని భండాసురుని భ్రాతలు. విషంగునిపైకి మంత్రిణీదేవిని విశుక్రునితో దండినీదేవిని యుద్ధముచేయుటకు శ్రీదేవి ఆజ్ఞాపించెను. శ్యామలాంబ విషంగుని వధించినదని విని లలితాంబ సంతోషించినది.

౨. రహస్యార్థము.—వాక్యార్థవిచారయుక్తబుద్ధివలనద్వైతవృత్తి భేద జ్ఞానము నశించినదని భావము. (షోడశాక్షరము.)

౭౬. విశుక్రప్రాణహరణ వారాహీ వీర్యనందితాయై నమః.

తా. ౧. విశుక్రుఁ డనురాక్షసుని దండిని యను వారాహీదేవి వధించినది. ఆదండినీదేవి పరాక్రమము విని శ్రీదేవి సంతోషము కలదైనది.

౨. బాలాంబచేత హతులైన భండపుత్రులు ఆణవాదిమలస్వరూపులు, విషంగుఁడు విషయాభిలాషి, విశుక్రుఁడు అహంకారస్వరూపుఁడు, బాలామంత్రిణీదండినీలు అంతర్వృత్తి విశేషములుగా నున్నారు అని రహస్యార్థము. సద్వృత్తులవలన విషయాభిలాషక్షయమగుటచేత స్వాత్మ దేవత ఆనందమును పొందుచున్నది. (షోడశాక్షరము.)

౭౭. కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరాయై నమః.

తా. ౧. పూర్వనామమందుదహరించిన విశుక్రుఁడు దేవతలకు జయవిఘ్నముకొఱకు గవ్యూతి (రెండుక్రోసులు) వెడల్పుగల శిలాపట్ట

మందు అలసాది దేవతాష్టక సంపుటితమైన (అష్టకోణనామకం యంత్రం విలిఖ్య దేవీ సేనామధ్యే స్థాపితం) అష్టకోణములుగల జయవిఘ్నమను యన్త్రమును శ్రీ దేవియొక్క సేనామధ్యభాగమునందు స్థాపించినాఁడు. శ్రీ దేవి విఘ్నబాహుళ్యమును చూచి, ఆశ్చర్యపడి అపాంగదృష్టిచేత కామేశ్వరముఖచంద్రుని చూడఁగానే, ఉభయముఖచంద్రకిరణమేళనము చేత మహాగణపతి ప్రాదుర్భవించెను.

ర. ఆత్మపరమందు గూఢమైన విమర్శ మొదలగు ఆత్మవృత్తులచేత ప్రపంచదేహజీవాదులందుఁ గల సత్యత్వజ్ఞానము నశింపఁగా స్వాత్మదేవతకు ఆనందము కలుగుచున్నదని పూర్వము చెప్పఁబడినది. ప్రపంచాది సత్యత్వ వృత్తులు తిరిగి ఉత్పన్నము కాకుండ నశించుటకు శివసూత్రము నందు చెప్పినరీతి భావింపవలెను. ప్రపంచము పుర్యష్టకాత్మకము. ప్రపంచ దేహజీవాదులు చిన్మయములు గాన విశ్వాన్తర్యామి గణపతి. చిత్కలాస్వరూపుఁడు కామేశ్వరుఁడు సర్వము చిన్మయముగా అఖండాకార జ్ఞానమువలన జీవత్వసంక్షయమువునని జీవరూపచిత్ప్రతిబింబము నిత్యము గాన జీవునకు నాశనము చెప్పఁగూడదు. కాన నేను జీవస్వరూపుఁడ నను జీవత్వ మజ్ఞాననాశనము చెప్పఁబడినది. ఆత్మప్రతిబింబమను జ్ఞానోదయమే జీవత్వసంక్షయము. జీవత్వసత్యజ్ఞానమే పునర్జన్మకారణము గాన చిద్రూపనిశ్చయజ్ఞానోదయమువలన అవిద్యానివృత్తివలన దేహేంద్రియాదులు ఉన్నపుడే జీవన్ముక్తావస్థను పొందుచున్నారు. ౩౦

౭౨. మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితాయై నమః.

తా. ౧. మహాగణపతిచేతను పూర్తిగా అసుర ప్రయుక్తమగు విఘ్న యంత్రము చూర్ణముగా చేయఁబడినందున శ్రీ దేవి సంతోషించినది.

ర. రహస్యార్థము:— ప్రపంచజీవాదులయందు చిద్రూపజ్ఞానము కలిగినను మరల సంశయజ్ఞానము కలుగుచున్నందున తన్నివృత్తికి ఉపాయము

చూపించుచున్నారు. పుర్యష్టకాధిపతి గణపతి యుదయించినందున విఘ్న యంత్రము చూర్ణమైనది. అందువలన శ్రీదేవి సంతోషించినదని చెప్పి నందున పుర్యష్టకము చిన్మయము గాన సర్వమును చిన్మయముగా భావనా ధార్ఢ్యముగా నున్నపుడు చిదానందలాభము కలుగునని దానికి మధ్య వికాసహేతువని మధ్యవికాస మనఁగా వికల్పక్షయరూపమైన చిదాత్మ భావన యని త్రిపుటియందు జ్ఞానము మధ్యపదము. అది విస్తృతమును పొందఁగా, పూర్వోత్తరములందున్న జ్ఞాతృజ్ఞేయములు జ్ఞానమందు లీన మగుచున్నవి. కాన అది చిదానందలాభకరము.

౩. మఱియు తురీయావస్థ జాగ్రత్సుషుప్తుల మధ్యవర్తిగాన, అది వృద్ధినిపొందినపుడు జాగ్రత్సుషుప్తులు తన్మయమగుచున్నవి. తురీయులు శివస్వరూపులు. తురీయాతీతమును పొందినవారు సదాశివులు అని భావము. వీరు జీవన్ముక్తులుగా నున్నారు. (షోడశాక్షరము.)

౭౯. భండాసురేంద్రనిర్ముక్తశస్త్రప్రత్యస్త్ర వర్షిణ్యై నమః.

తా. ౧. భండాసురుని కుమాళ్లు, భ్రాతలు, సేనానాయకులు, సేనలు శక్తిసమూహముచేత నశింపఁజేయఁబడిరి. తరువాత భణ్డాసురుఁడే శ్రీదేవితో యుద్ధముచేయుచు అస్త్రములు శస్త్రములు ప్రయోగింపఁగా శ్రీదేవి వానికి ప్రతికూలమైన అస్త్రశస్త్రములను వర్షముగా వర్షించుచు విజృంభించుచున్నది.

౨. విమర్శజ్ఞానము కలవారికి శూన్యభావము ప్రపంచదేహజీవాదు లందు సత్యములను ద్వైతవృత్తులు కలిగినను సర్వము బ్రహ్మస్వరూపమని చిన్మయజ్ఞానము ప్రతికోటిగానుండి వానిని నశింపజేసి ఆత్మను సచ్చిదా నందమయముగాఁ జేయును. (షోడశాక్షరము.)

౮౦. కరాంగులినఖోత్పన్న నారాయణ దశాకృతయే నమః.

తా. ౧. భండాసురుఁడు సకల రాక్షసరాజులను పుట్టించు సర్వాసు రాస్త్రము ప్రయోగింపఁగా సోమకాసుర బలి రావణ హిరణ్యాక్షాది రాక్ష

సులు పుట్టి యుద్ధమునకు వచ్చియుండఁగా శ్రీదేవి తన దశసంఖ్యగల తన చేతివ్రేలిగోళ్లనుండి మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, రామాది దశావతారముల విష్ణ్వంశచేత పుట్టింపఁగా వారు ఆయారాక్షసులను వధించిరని భావము.

౨. జీవసంబంధమైన సుషుప్త్యాద్యవస్థాపంచకమును ఈశ్వరసంబంధమైన సృష్ట్యాది పంచకృత్యములును శ్రీదేవి నఖాగ్రములవలన కలిగినవి. (అనఁగా నిరాయాసముగా సృజించినదని తాత్పర్యము.) ఈ రెండుపంచకములు ముక్తికి ప్రతిబన్ధకములు. చిన్మయభావన ప్రతిబన్ధరాహిత్యమని భావము. (షోడశాక్షరము.)

౮౧. మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనికాయై నమః.

తా. ౧. పాశుపతాస్త్రము పైది మహాపాశుపతాస్త్రము సదాశివదైవతము. శ్రీదేవి దానిని ప్రయోగింపఁగా మిగిలిన రాక్షససేనానాయకు లందఱును ఆ యస్త్రమువలనఁ బుట్టిన అగ్నివలన దగ్ధమైరి.

౨. అభ్యాస తారతమ్యముచేత కలిగిన శ్రేష్ఠమైన అద్వైతవృత్తి యనే మహాపాశుపతాస్త్రాగ్నిచేత ద్వైతవృత్తులు నశించి భస్మావశేషమైనవని రహస్యము. ఆత్మానాత్మవిచారణయే మహాపాశుపతాస్త్రాగ్నిగా నున్నది. దుర్వాసనాక్షయమైనదని రహస్యము. వాసనాక్షయము కానిది స్వరూపజ్ఞానము తురీయము స్థిరపడదు. (షోడశాక్షరము.)

౮౨. కామేశ్వరాస్త్రనిర్దగ్ధ సభండాసురశూన్యకాయై నమః.

తా. ౧. సదాశివాస్త్రముకంటె ఉత్తమమైన కామేశ్వరాస్త్రమును కామేశ్వరీదేవి భండునిమీఁదికి ప్రయోగింపఁగా ఆయస్త్రాగ్నిచేత శూన్యక మనుపేరుగల యతని నగరముతోడ జనసహితముగా భండాసురుఁడు దహింపఁబడినాఁడు. (షోడశాక్షరము.)

౨. ఆత్మపరము.—ఇంతవఱకు చెప్పిన అర్థమువలన, జీవభాగములైన దేహత్రయ వాసనాత్రయ రూపద్వైతవృత్తులు అను భండమంత్రులును,

పుత్రులు గ కుమారీమంత్రిణీదండినులును త్రిపుటి విమర్శరూపాద్వైత వృత్తులచేత హతులైరనియు, రాజైన జీవభావమనే భణ్డుఁడుమాత్రము ఉన్నట్లు చెప్పఁబడినది. పాశుపత మహాపాశుపతములు ప్రయోగింపఁబడినవి. వీనిపైని కామేశ్వరాస్త్రములు భణ్డవధకొం కామేశ్వరీదేవి ప్రయోగింపఁగా శూన్యకమనుపట్టణము జనసహితముగా వాఁడును నశించినాఁడని, స్వాత్మశక్తి స్వస్వరూపజ్ఞానయుక్తమైనపుడు దేహత్రయాభిమానసహితముగా జీవభావము జ్ఞానాగ్నిచే దగ్ధమగుచున్నదని, అందువలన ఆత్మకు చిదానంద లాభమైనదనియు, జన్మకారణమైన మూలాజ్ఞాన నాశమువలన మోక్షలాభమనియుఁ దాత్పర్యము. జీవుఁడు నిత్యుఁడు చిత్కళయే గాన అతనికి నాశములేదు. జీవభావము నశించును. (షోడశాక్షరాత్మికము.)

౮౩. బ్రహ్మోపేంద్రమహేంద్రాదిదేవసంస్తుతవైభవాయై నమః.

తా. ౧. బ్రహ్మవిష్ణురుద్రాదిదేవతలు భండాసురపీడితులై పరాశక్తిని స్తుతింపఁగా దేవకార్యార్థము చిదగ్నికుండమందు శ్రీదేవి ప్రత్యక్షమైనది. ఆశక్తి దేవతలు స్తుతించి తమబాధలను విన్నపముచేయఁగా దేవతాసేనాసహితయై శ్రీదేవి భండాసురునితో యుద్ధముచేసి సకలసేవలతోను ప్రజాసహితమైన వానిపట్టణముతోను భండాసురుని వధించి దేవకార్యము జరిపినదై కృతకృత్యతను పొందియున్న శ్రీదేవిపరాక్రమమును బ్రహ్మాది విష్ణురుద్రాదిదేవతలు మరల స్తుతించి శ్రీదేవివలన వరములను పొంది సన్నిధానమందు బద్ధాంజలులై యున్నారని భావము.

౨. రహస్యార్థము—పైని చెప్పినరీతిని సకలమైన ద్వైతవృత్తులతోఁగూడ జీవభావము అద్వైతజ్ఞానమును అఖండాకారచిదానందోదయమువలన భేదవృత్తి నశించినదైనపుడు జీవుఁడు నిత్యుఁడు. సాక్షిరూపి గాన జీవభావ నాశమైనపుడు ప్రత్యగాత్మయగు సాక్షికి చిన్మయత్వసిద్ధి కలుగుచున్నది. ఇదియే తురీయావస్థగా నున్నది. సకలవృత్తి

రాహిత్యమై చిదానందానుభవముతో నుండుట తురీయారీతి మనఁబడును. వీరు పరశివతుల్యులు, సర్వదేవపరిచితులు విశ్వస్తుతులు, దేహేంద్రియాదులున్నను దుగ్ధపటమువలెను, వీరికి పునర్జన్మకారణములు కానేరవు. వీరి ప్రవృత్తి నివృత్తిరూపమని రహస్యార్థము. (షోడశాక్షరము.)

౮౪ హరనేత్రాగ్నిసందగ్ధ కామసంజీవనౌషధయే నమః.

తా. ౧, ఈశ్వరుని మూఁడవనేత్రరూపమై అగ్నిచేత దగ్ధమైన భస్మావశేషమై మన్మథుని మరల బ్రతికింపుమని బ్రహ్మాదిదేవతలును మన్మథుని భార్యయగు రతీదేవియు శ్రీపరాశక్తిని ప్రార్థింపఁగా, విరక్తుడైన కామేశ్వరుని స్వాభిముఖునిగా చేయుటవలన భండాసురవధానంతరమందు, లలితాంబచేత మరల మన్మథుఁడు జీవించినాఁడనియు పూర్వము శరీరము కలవాఁడనియు, ఇప్పుడు శరీరరహితుఁడనియు, అట్టి మన్మథజీవనమునకుఁ బరదేవతాకటాక్షము సంజీవనమూలికవంటిదనియు భావము.

౨. రహస్యార్థము:—స్వస్వరూపములు హరించునది కనుక 'హరః' అని. హరనేత్రాగ్ని అనఁగా మూలజ్ఞానము. దానిచేత పూర్తిగా దహింపఁబడిన కామేశ్వరరూపమైన ఆత్మయే అవిద్యావరణముచే స్వస్వరూపవిస్మృతి కలిగి జీవభావమును పొందినది. శ్రీవిద్యోపాసనవలన అవిద్యామలరూప ఆవరణరహితమై తన పూర్వరూపమును, బ్రహ్మస్వరూపమును, మోక్షమును పొందినదనియు, జీవునకు బ్రహ్మత్వము క్రొత్తగా రాలేదనియు, ఇట్టి భ్రమనివృత్తికి శ్రీదేవికటాక్షము పునర్జీవనమునకు వనౌషధివంటిది. (షోడశాక్షరము.)

అవ. ఇంతవఱకు శ్రీదేవి స్థూలరూపముచేతఁ చేయఁదగిన భండాసురయుద్ధాదికము ద్వంద్వార్థశ్లేషగా వర్ణించి, ఇచట స్థూలాభిన్నమైన సూక్ష్మరూపమును స్థూలరూపాభిన్నముగా వర్ణింప నారంభించినారు.—

౮౫ శ్రీమద్వాగ్భవకూటైక స్వరూపముఖపంకజాయై నమః.

తా. స్థూలము కరచరణాదులుకలది. సూక్ష్మము మంత్రమయము. ఆ సూక్ష్మరూపముకూడ మూఁడువిధములుగా నున్నది. సూక్ష్మము సూక్ష్మతరము

సూక్ష్మతమము. స్థూలము త్రిపదాగాయత్రి. సూక్ష్మము పంచదశీవిద్య. సూక్ష్మతరము కామకలాబీజము. సూక్ష్మతమము సహస్రారాంతర చంద్ర మండలాకారము. అదిరయే చిత్కళ. పరమాత్మజ్ఞానప్రదమైనదియు, వాక్కులను పుట్టించునదియు గనుక శ్రీవిద్యారూపపంచదశీవిద్యలో మొదటికూటము. అయిదుబీజములు గలది వాగ్భవకూటము. అవియే శ్రీదేవి స్థూలరూపమందు ముఖముగా నున్నది. (షోడశాక్షరము.)

౮౬. కంఠాధఃకటిపర్యంత మధ్యకూటస్వరూపిణ్యై నమః.

తా. కంఠమునుండి కటిపర్యంతముగల ప్రదేశమునకు "శరీరమధ్యమని" సంజ్ఞ కలదు. పంచదశీమంత్రమందున్న కామరాజమను మధ్యమ కూటము శ్రీదేవిశరీరమందు మధ్యప్రదేశముగా ఉన్నది. (షోడశాక్షరము.)

౮౭. శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణ్యై నమః.

తా. పంచదశీమంత్రమందుగల నాలుగుబీజములుగల శక్తికూటమే కటి ప్రదేశమునకుఁ గ్రిందిభాగమగు శ్రీలలితాదేవిశరీరము. శ్రీవిద్యా పంచదశీ మంత్రస్వరూపమని, మంత్రమే శరీరమని చెప్పినందున ఇది సూక్ష్మరూపము. (షోడశాక్షరము.)

౮౮. మూలమంత్రాత్మికాయై నమః.

తా. చతుర్విధపురుషార్థములకు మూలకారణ మగుటచేత మూలమనఁబడియెడి పంచదశీమూలమంత్రమే స్వరూపముగా నున్నది. (షడక్షరము.)

౮౯. మూలకూటత్రయకళేబరాయై నమః.

తా. ౧. మూలమంత్రమందున్న కూటత్రయమే శరీరముగా కలదని తాత్పర్యము. ఈబీజమే ఆత్మగా కలదని చిద్రూపమని భావము. మూల మన్త్రమనఁగా "శ్రీం" అనే కామకలాబీజము. శవర్ణ రేఫ తురీయస్వర బిందువులు నాలుగు అవయవములు. ఈ అంశమును ముందు విస్తరింతుము.

ర. రహస్యార్థము.—పైరెండునామములకు ఏకార్థము చూపింపఁబడుచున్నది. ద్విజత్వసాధనభూతమైన వేదమాతయగు గాయత్రీమంత్రము త్రిపదా అని తురీయపాదమని అధికారి తారతమ్యముగా ఉపాసనలోనున్నది. సమష్టిని గాయత్రీమంత్రము బ్రహ్మస్వరూపమైన శ్రీదేవికి స్థూలశరీరముగాను శ్రీవిద్య సూక్ష్మాకారము పంచదశీబీజములు గాయత్రీవలన త్రిపురోపనిషత్తునందు ఉద్ధారమైనవి. శ్రీబీజప్రధానమైనది కావున శ్రీవిద్యా అనువాదుకయందు వ్యవహారము కలిగినది. చిత్కలాస్వరూపమని భావము. (దశాక్షరము.)

☞ పంచదశీవిద్య కూటత్రయము. షోడశీవిద్య కూటచతుష్టయము పూర్తివిద్య ఒకబీజమందే పాదచతుష్టయము ఇమిడియున్నందున ఆబీజము కామకలాస్వరూపమని సంకేతము. దానికి మూలములేనందున అదియే మూలమంత్రము. ఏకాక్షరీవిద్య పంచదశీవిద్య వృద్ధిక్షయములుగల పది అయిదుచంద్రకలలస్వరూపము అని షోడశీకలవలన ఉత్పన్నమగుచున్నవి. దానియందు లీనమగుచున్నవి గాన ఆకల నిత్యకలగా నున్నది. దానియందున్న బీజములు శ్రీదేవికి అవయవములు. ఆ మూలమంత్రము ఆత్మస్వరూపము అని ముందు కామకలానామవ్యాఖ్యానమందు విస్తరింపగలము.

౯౦. కులామృతైకరసికాయై నమః.

తా. ఈనామమునుండి ఆఱునామములును, మఱియు అచ్చటచ్చట రూఢిచేత కౌళాచారపరములుగా నున్నవి. అంతరంగబహిరంగములచేతను కౌళమని, దక్షిణమని అద్వైతస్వరూపమైన బ్రహ్మశక్తికి ఈభేదకల్పన. ఎందువల్లననఁగా, సకలజనులు అధికార తారతమ్యముచేత బ్రాహ్మణాది నాలుగువర్ణములుగా అజ్ఞానముచే ఆవరింపఁబడి యున్నారు. దయాళుఁడైన పరమేశ్వరుఁడు త్రైవర్ణికుల నుద్దేశించి వారు తరించుటకు అఱువదినాలుగు తంత్రములను నిర్మించెను. బ్రాహ్మణుల నుద్దేశించి స్వతంత్రతంత్రములను నిర్మించెను. త్రైవర్ణికులకు సన్న్యాసాధికారము ఎట్లు లేదో ఆరీతినే త్రైవర్ణికులకు సమయాచారమం దధికారముకూడ లేదు. అటువలెనే ఉత్తమాధికారులైన బ్రాహ్మణు

లకు తంత్రమార్గమం దధికారము లేదు. బ్రాహ్మణులకు అవైదిక తంత్ర మార్గ ప్రవృత్తి అధోగతిప్రాప్తికి హేతువగుచున్నది. అని పూర్వాచార్యులగు శ్రీశంకరగౌడపాదాచార్యవిద్యారణ్యాచార్యాదులు తమతమ మతమును ఆయా గ్రంథములందు వెల్లడించిరి. సర్వసముఁడైన పరమేశ్వరుఁడు బ్రాహ్మణులకొఱకు సమయదక్షిణాచారములను త్రైవర్ణికులకు కౌళవామమార్గములను నిర్మించెను. వసిష్ఠాదిసంహితలందు సమయ దక్షిణములును, చతుష్షష్టితంత్రములందు వామమును కౌళమును విస్తరింపఁబడినవి. ఈయుభయులకును అంతర్యాగ బహిర్యాగములందు అత్యంతభేదముగలదు. సమయాచారస్వరూపము ముందు వివరింపఁబడును. కౌళవామములు అంతర్యాగబహిర్యాగపరములు. బహిర్యాగమైన వామాచారమందు మాంసాదులతో పూజాకలాపము కలుగును. ఇది వీరి బహిర్యాగక్రమము. అంతర్యాగమందు బ్రహ్మనాడి యగు సుషుమ్నానాడి విశుద్ధాది మూలాధారాంత కమలములందు ప్రదక్షిణక్రమముగా గమనము కలిగి మూలాధారమందునికిఁగలది సర్పాకారమైన వక్రగతి కలిగినందున దానికి కుండలీనామము కలిగినది. వాయుధారణ కుంభకముచేత దానిని విజృంభింపఁజేసినపుడు కమలషట్కమును భేదించుకొని సహస్రారకర్ణికకు దానివేధ కలుగునని యు, అందువలన చంద్రమండలమునుండి అమృతస్రావమై పదునాలుగువేల నాడీసముదాయమునకు తృప్తికలుగఁ జేయుననియు, అది కులామృతమనియు కౌళుల అంతర్యాగము. వీరికి మూలాధారస్వాధిష్ఠానములే లయస్థానములు. పూజాస్థానములు. ప్రకృతము వాయుసాధనము మున్నగు సంప్రదాయానుభవముగల గురుపరంపరయే లోపించినది. వామ మనఁగా వెనుక చెప్పిన బాహ్యపూజాకలాపము గనుక అట్టి కులామృతమందు ముఖ్యమైన ఆసక్తికలది. (అష్టాక్షరము.)

౯౧. కులసంకేతపాలిన్యై నమః.

తా. కౌలమతప్రతిపాదకగ్రంథములను ఆయా ద్రవ్యములందుఁగల సంకేతములను రహస్యముగా నుంచవలెనని భావము. ఉపాస్యోపాసకులు

పూజాపరికరము అంతయు చిద్రూపభావనతో చేయవలెను. బహిర్యాగ మందు యవనికి తెరలోపల జరిగింపుమని అట్టి తీర్థప్రసాదానుభవములేని భాగ్యహీనులు లోకవ్యగ్రులైనందున అన్యథా భావింతురని తంత్రము లందు తెరచాటు పుట్టినది. (అష్టాక్షరము.)

౯౨. కులాంగనాయై నమః

తా. కులశబ్దము వస్తుసమూహమందును జాతియందును వంశ మందును స్వభావమందును వర్తించుచున్నది గాన పాతివ్రత్యాదిసుగుణ ములు గల వంశమంగు పుట్టినదనియు, పతివ్రత అనియు తాత్పర్యము. మతాంతరమందు తంత్రములలో చెప్పిన ఆయా జాతి స్త్రీలయందును పర దేవత ప్రకృతిరూపముగా నున్నది అనియు, సూర్యకిరణప్రసారమువలె భేదములేక సర్వాంతర్యామిని యనియు భావము. (చతురక్షరము.)

౯౩. కులాంతస్థాయై నమః

తా. ౧. కులమనఁగా ఇంద్రియసమూహము. అందు నివసించునది మాతృమేయములు. కులము అమధ్యను మానరూపముగా నున్నది.

౨. మతాంతరమందు, మూలాధారమంను కుండలినీ ఆకారముగా నున్నదని కులశాస్త్రములు, అరువదినాలుగుతంత్రములు వానియం దున్నదిగాన 'కులాంతస్థా' అని భావము. మూలాధారస్వాధిష్ఠానములు సమయాచారులకు తామిస్రలోకమని వీరిని విడిచి మణిపూరమందు శ్రీదేవి యొక్క యుత్పత్తిని భావించిరి. కౌళులు స్వాధిష్ఠానపూజాపరులు గాన గాఢప్రాకృతులని గౌడపాదాచార్యుల వారు సుభగోదయస్తోత్రమం దుదహరించిరి. (చతురక్షరము.)

౯౪. కౌళిన్యై నమః

తా. ప్రతిగృహమందును ప్రతిదేశమందును ప్రతిశరీరమందును ప్రతిగ్రామమందును ప్రతివంశమందును ప్రతివనమందును శ్రీదేవి పూజింపఁ బడుచున్నది.

భవిష్యోత్తరే:— 'పూజనీయా జనైర్దేవీ స్థానేస్థానే పురేపురే,

గృహేగృహే శక్తిపరైః గ్రామేగ్రామే! వనేవనేతి.' (త్ర్యక్షరము.)

౯౪. కులయోగిన్యై నమః.

తా. బాహ్యమందు శ్రీచక్రార్చనకులమనియు, అది బాహ్యజాతు లచే చేయఁదగినదనియు, బ్రహ్మవేత్తలు అంతరారాధనపరులనియు, వీరిది సమయాచారమనియు రూఢిగా నున్నది. కులమార్గము వామాచారమందు పూజింపఁబడుచున్నందున 'కులయోగిని' అని నామసిద్ధి. (పంచాక్షరము.)

౯౫. అకులాయై నమః.

తా. మూలాధారము క్రిందను సహస్రారము కలదని అది రక్తకమల మనియు, బ్రహ్మరంధ్రాధోభాగమందున్న సహస్రారము శుక్లకమలమనియు, దాని కర్ణిక చంద్రమండలమనియు గలదు. అందు నివసించునది గాన, 'అకులా' అని నామముకలిగినది. (త్ర్యక్షరము.)

౯౬. సమయాన్తస్థాయై నమః.

తా. ౧. పూర్వాచార్యులు సమయశబ్దమునకు వేదపరముగా వ్యాఖ్యానమును చేసినందున వేదములందు అర్థరూపముగా నున్నదని, శివ భక్తులకు పంచవిధసామ్యము లున్నందున సమయనామము కలిగినదనియు, సనకాదిఋషులు అంతర్యాగ బహిర్యాగవిధుల నుద్దేశించి అయిదుసంహి తలను రచించినారు గాన ఆసంహితార్థస్వరూపిణి అనియు చెప్పిరి. అంత ర్యాగ బహిర్యాగములందు వేదమార్గసమ్మితము సమయాచారమని తాత్ప ర్యము. బాహ్యమందు శ్రీచక్రార్చన వేదమార్గసమ్మతముగా చేయుటయే దక్షిణాచారమనియు, సహస్రారమందు లయాదులు అంతర్యాగమని సమయాచారమని భావము.

౨. శివశక్తులకు పంచవిధసామ్యములు కలిగినందున సమయా అని; ౧. అధిష్ఠానసామ్యము, శ్రీచక్రవాసము, లేక బ్రహ్మాండపిండాండములు; ౨. అనుష్ఠానసామ్యము సృష్ట్యాదికృత్యము; ౩. అవస్థానసామ్యము క్రియా దికము; ౪. నామసామ్యము కామేశ్వరీకామేశ్వరులు; ౫. రూపసామ్యము అరుణ్యాదికము. ఉభయులకు ఈ పంచవిధసామ్యము కలిగినందున 'సమయా' అని నామము. (పంచాక్షరము.)

౯౮. సమయాచారతత్పరాయై నమః.

తా. ఇదివరకు కౌలపరమైన నామములను వర్ణించినందున, శ్రీవిద్యో పాసకులకు ఇదియే ఆచరణీయమని బ్రాహ్మణులును మోహముపొందుదురని అట్టి భ్రమనివారణకొఱకు వేదమార్గసమ్మతమైన సమయాచారసంబంధము లయిన నామములను చూపించిరి. సమయాచారమందు అత్యంత ప్రీతికల దని భావము. ఈరీతియున్నను అవిద్యాబలముచేతను, గౌతమశాపవశమునను అనేకులు బ్రాహ్మణులును, కౌలాచారమందు మోహము పొందుచున్నారు. (అష్టాక్షరము.)

౯౯. మూలాధారైకనిలయాయై నమః.

తా. మూలాధారకమలమందు కుండలినీ రూపముగా సర్వదా నిద్రావస్థ కలిగియున్నది. పరాశక్తి బ్రహ్మనాడియగు సుషుమ్నాస్వరూపముగా ఉన్నదని భావము. (అష్టాక్షరము.)

౧౦౦. బ్రహ్మగ్రంథివిభేదిన్యై నమః.

తా. ౧. ఆరోహణక్రమముచేత శ్రీదేవియొక్క స్థూలాకారమందు మూలాధారాది ఆజ్ఞాకమలముపర్యంతము ఆఱుచక్రము లున్నవి. రెండేసి చక్రములపైని, ఒక్కొక్క గ్రంథిచొప్పున మూఁడుగ్రంథులు కలవు. మూలాధారస్వాధిష్ఠానములపైని బ్రహ్మగ్రంథిస్థానము బ్రహ్మయే గ్రంథిగా నున్నాఁడనిగాని బ్రహ్మనిర్మితమైన గ్రంథి అనిగాని కావచ్చును. దానిని విశేషముగా భేదించునది గనుక ఈనామము కలిగినది. 'శ్రు. తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్'' అను శ్రుతిప్రకారము గర్భస్థజంతువందు 3 మాసమందు చిత్కళా ప్రవేశ మగును.

౨. రహస్యార్థము — సహస్రారకమలాంతర్గతకర్ణికా రూప బిందు స్థానము, చిన్మయ కామేశ్వరీస్థానము. పిండాండ సృష్ట్యాదిని చిద్రూపీ భగవతీ పరానాడీరూపేణ తస్మాన్నిర్గత్య సుషుమ్నారూపముగా అధోముఖముగా సర్పగతికలదై మూలాధారమునుపొంది నిద్రనుపొందిన సర్పమువలెను అచట ఉన్నది. సాధకునకు అనేక జన్మార్జిత సత్క్రియా చరణరూప పుణ్యఫలముచేత నీజన్మమంగు తాపత్రయ బాధలనుండి తరింపవలెనని మోక్షమందు కోరిక గలుగుచున్నది. అట్టి సంకల్పమువలన సద్గురువుల నాశ్రయించి వారి వలన స్వస్వరూప

విచారణ కలిగినపుడు తన నిజరూపమును తెలియును గాని ఇచ్ఛారూపమైన కామేశ్వరి పరానాడీరూపముగా స్వస్థానమైన సహస్రార మందున్న తనభర్తయగు కామేశ్వరుని పొందుటకు ఊర్ధ్వగతికలదై ఆఱుకమలములను మూఁడుగ్రంథులను భేదించుకొని అతిక్రమించి తన భర్తను పొంది సుఖముగా నుండును. సహస్రారమునుండి పుట్టిన మాయారూపము నన్ను మరల స్వస్థానమందు లయమగుటయే మోక్షము. ఇదంతయు భావన.

3. "గ్రన్థిర్నామ సత్యాసత్య వస్తుద్వయస్యాభేద్యం అన్యోన్య తాదాత్మ్యాపన్నత్వం గ్రన్థిః. ధియం స్వప్రకాశవిమర్శశక్తిం గ్రసతి మాయారూపేణా చ్ఛాద్యగృహ్ణాతీతి గ్రన్థిః" ఇచట గ్రంథి అనఁగా సత్యమగు చిత్కళ. అసత్యమగు మాయాస్వరూప ప్రకృతి ఈ రెండును మేళనముపొంది పోల్చుటకు శక్యముకాక, అన్యోన్యము కలిసియుండుటయే, స్వాధిష్ఠాన మణిపూరములమధ్యను వాగ్భవమాయాబీజస్థానము బ్రహ్మసరస్వతులస్థానమని సకలమునకు అధిష్ఠానమైన చిత్కళ అనే ఆత్మను అవిద్యారూపముగా ఆవరించి జీవుఁడను భ్రమను చిత్కళయందు కలుగచేసినందున అన్నమయకోశమయమైన స్థూలదేహమందు నేనను అభిమానము కలిగి జాగ్రదవస్థను పొందిన విశ్వుఁడనుజీవుఁడు 'బ్రహ్మగ్రంథి' అనిపించుకొనును.

సంవిద్రూపిణియగు జ్ఞానస్వరూప పరాశక్తికృపవలన తన నిజరూపము చిత్కళయేగాని స్థూలశరీరము మాత్రము కాదను జ్ఞానము కలుగును. అదియే బ్రహ్మగ్రంథిభేదము అని తాత్పర్యము.

ఇతి శ్రీమత్పదవాక్యప్రమాణ పారావారపారీణధురీణ సర్వతన్త్రస్వతన్త్రత్రైలింగ్యదేశస్థసమయాచారజీర్ణోద్ధారక ప్రకాశానన్దనాథగురుచరణారవిన్ద సేవాపరాయణ సత్యానన్దనాథకరకమల సంజాతాన్తేవాసులును, కాశికసగోత్రోద్భవభాగీరథీరాయశాస్త్రులవారి ద్వితీయపుత్రులును జ్ఞానానన్దనాథదీక్షానామవిరాజితులును, బ్రహ్మశ్రీ సింహంభట్ల రామమూర్తి శాస్త్రులవారిచేత బ్రహ్మాండపురాణాన్తర్గత హయగ్రీవాగస్త్యసంవాదరూప శ్రీలలితాదివ్యనామసహస్రస్తోత్రమందు ప్రథమశతకమునకు పరిమళమను సంజ్ఞగల ప్రతినామతాత్పర్యము సమాప్తము.

---

శ్రీ ర స్తు.

# శ్రీ లలితాసహస్రనామావళి

## ద్వితీయ శతకము.

---

### ౧౦౧. మణిపూరాంతరుదితాయై నమః.

తా. ౧. నాభిస్థానమందు దశదళములుగల మణిపూరకమలమందు సమయాచారమందు, శ్రీదేవి సగుణరూపమును, కరచరణాద్యాకారములను ధ్యానించి మణిపూరమందుత్పత్తియు, మణులను నవరత్నములచేతను అలంకరించి అనాహతమందు, పుష్పధూపదీపోపచారములిచ్చి, విశుద్ధమందు నైవేద్య తాంబూలము లర్పించి ఆజ్ఞాకమలమందు నీరాజనమిచ్చి సహస్రారమధ్యను పొందించి యవనికాభ్యంతరము భావించి తాను పైనుండి మరల భగవతీనిర్గమావసర సమయమును నిరీక్షించుటయే సమయాచారమని పూర్వాచార్యులు నిర్దేశించిరి. శ్రు "యోపాం పుష్పం వేద, పుష్పవాన్ప్రజావాన్పశుమాన్భవతి; తంవోగృహ్ణా మ్యుత్తమమితి; యోప్సునావం ప్రతిష్ఠితాం వేదప్రత్యేవతిష్ఠతీ"తి.

౨. రహస్యార్థము:—లోకమందు నాభికి క్రిందుగా నున్న మణిపూరమందు పిండోత్పత్తియు, వృద్ధియు గలుగుచున్నవి. స్థూలాకారమందు, మణిపూరమందు, చంద్రాగ్నిసూర్యాదుల ఉత్పత్తిని అరుణోపనిషచ్ఛ్రుతి చెప్పుచున్నది. సహస్రారకమలములకు మణిపూరసరస్సు ఉత్పత్తిస్థానము. సుషుమ్నాకారమైన బ్రహ్మనాడి కనకనాళము; సహస్రారగత చంద్రుడు జలపుష్పము, అట్టిచంద్రుని తెలుసుకొన్న పుణ్య

---

పురుషుఁడు, ఆచంద్రాకారమును, అట్టి కిరణసముదాయమును కలవాఁడై, ఈశ్వరుఁ డనిపించుకొనునని శ్రుతితాత్పర్యము. కనుక శ్రీదేవి మణిపూర మధ్యనుండి ఉద్భవించి సాధకులకు ప్రత్యక్షమగును.

3. వెనుక బ్రహ్మగ్రంథి బింబప్రతిబింబోభయాభావమైన తమః కలుషసత్వముగల స్థూలదేహాభిమానమని చెప్పి ఆగ్రంథిని భేదించి మణి పూరమును పొందినమీఁద సాధకులకు చిత్కళాదర్శనమగును. (అష్టా క్షరము.)

## ౧౦౨. విష్ణుగ్రంథివిభేదిన్యై నమః.

తా. ౧. అనాహతవిశుద్ధి కమలములమధ్యను కామరాజమాయా బీజస్థానమందు లక్ష్మీనారాయణస్థానమందు ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయమైన మూఁడుకోశములను సూక్ష్మశరీరమం దభిమానముగలవాఁడై స్వప్నావస్థనుపొంది తైజసుఁ డనే పేరుగల జీవుఁడు, భావభావములు బింబప్రతిబింబములతో సమానమైన జీవబ్రహ్మల 'అన్యోన్యాధ్యాస విష్ణు గ్రంథి' అని చెప్పఁబడుచున్నది.

౨. పరదేవత మణిపూరమం దుత్పన్నమై అనాహతకమలమును పొంది అచట సాధకులచేత పంచోపచారములచేత పూజింపఁబడి పతి దర్శనకాంక్షతో పైనున్న విష్ణుగ్రంథిని భేదించినదని ఇదివఱకు సాధకు లకు బ్రహ్మగ్రంథి విభేదమనఁగా స్థూలశరీరబ్రహ్మాండాదులు అసత్యమని జీవత్వము, నిజమనేజ్ఞానము కలిగినది. అట్టిభ్రమయే విష్ణుగ్రంథి గాన విష్ణు మాయను తెలుసుకొనుట శక్యముకాదని వాడుక. శ్రీదేవి పరానాడీ రూపముగా అనాహతమును బొందినది. అనాహతమనఁగా లోకమందు ఘంటలు మొదలగునవి మఱియొకవస్తువుచేత కొట్టఁబడినందున ధ్వనిని ఇచ్చుచున్నవి. ఈకమలమందు నాదము స్వయముగానే కలుగుచున్నది. ఇచట పరాశక్తి పతిదర్శనోత్సాహముచే నాదబ్రహ్మాకారమైన మంగళ ధ్వనులతో బయలుదేరి స్వస్థానమైన సహస్రారకమలమందు కామేశ్వరుని దర్శనమును పొందును గాన, ఈనాదము నాశ్రయించి పుణ్యపురుషులను అనాయాసముగా స్వరూపమును పొందించును. అటుల కామేశ్వరునకు బోధించును. తరువాతనున్న విష్ణుగ్రంథిని భేదించినది అనఁగా సాధకుల

చిత్కళాదర్శనమై స్థూలదేహ ప్రపంచములు అసత్యములని తెలిసినపైని జీవత్వము నిజమని నిశ్చయము కలుగును. భావనాదార్ఢ్యము గురుకటాక్షమువలన, విచారణాబలమువలన, జీవత్వము స్వప్నసదృశమని స్థూలము వలెనే సూక్ష్మశరీరముకూడ కల్పితముగాని తన నిజరూపముకాదని నిశ్చయజ్ఞాన ముదయించునని భావము. శ్రు. "పద్మకోశప్రతీకాశం హృదయం చాప్యధోముఖం" ఇత్యారభ్య పరమస్వరాడిత్యన్తమ్. (అష్టాక్షరము.)

౧౦౩. ఆజ్ఞాచక్రాంతరాళస్థాయై నమః.

తా. భ్రూమధ్యమందు రెండుదళములుగల ఆజ్ఞాచక్రమును పరాభట్టారికపొంది రెండుదళముల మధ్యకర్ణికయం దున్నదని అచటికి జ్యోత్స్నామయమైన స్వస్థానము దగ్గఱయగుటచేత నిజమైన తత్త్వస్వరూపము తెలిసీ తెలియనట్లుండునని భావము. (అష్టాక్షరము.)

౧౦౪. రుద్రగ్రంథివిభేదిన్యై నమః.

తా. రుద్రగ్రంథి అనఁగా రెండుదళములుగల ఆజ్ఞాకమలము పైభాగమందు త్రిపుటిరూపమైన మూలప్రకృతిస్థానమందు ప్రతిబింబానన్దమయకోశరూప సుషుప్త్యవస్థనుపొందిన ప్రాజ్ఞుఁడనేజీవుఁడు ప్రతిబింబానందము ననుభవించుచు, కలుషసత్వప్రధానమైన ప్రకృతిగలవాఁడై స్పష్టమైన ప్రతిబింబసమానుఁడై జీవబ్రహ్మాయొక్క అన్యోన్యాధ్యాసయే రుద్రగ్రంథి అని చెప్పఁబడుచున్నది. శ్రు. "ప్రజ్ఞానం బ్రహ్మ" అనే శ్రుతివలన సాధకుని స్థూలశరీరమందు సూక్ష్మకారణశరీరములు దృగ్గోచరములేనివై మేళనముగా నున్నవి, వీనిలో నున్నవి స్థూలపరికరము విమర్శింపగా ఇరువదినాలుగు తత్త్వములని శరీరత్రయమని పంచకోశములని గ్రన్థిత్రయమని సంజ్ఞలు కలిగియున్నవి. ఇట్టి సమూహము స్థూలము. ఈ సమూహమునకు సామర్థ్యము లేదు. నేను నాది అనే అస్మచ్ఛబ్దము 'అ+హాం' అను రెండువర్ణముల మేళనశబ్దము. ఇదియే ఆత్మమంత్రముగా నున్నది. పంచాశద్వర్ణములలో ఆదివర్ణము అకా

రము, అంత్యవర్ణము, హాకారము ఈ రెండిటియొక్క మేళనమందు శబ్ద బ్రహ్మమంతయు ఇమిడియున్నది. శరీరమందు శిరోమధ్యము సహస్రారమని శాస్త్రనియమము. అచట సకల వ్యవహార హేతువైన చిత్కళ సాక్షిగా నున్నది. అది ప్రజ్ఞానమని శ్రుతులవలన చెప్పబడుచున్నది. అహామనునది దాని పేరు, ఆ పేరు స్థూలశరీరమందు వాడుక బ్రహ్మగ్రంథి అని, సూక్ష్మాభిమాని అయిన జీవత్వమందు వాడుక విష్ణుగ్రంథి అని కేవల మిథ్యారూపము ఈ భయకారణములయందు వాడుక రుద్రగ్రంథి అని చెప్పబడుచున్నది. అట్టి చిత్కళయొక్క తేజఃపుంజము వికసించి శరీరత్రయమందు లీనమై చైతన్యరూపముగా ఉన్నంతకాలము సకలవ్యవహారములు జరుగుచున్నవి గాన అట్టి ప్రజ్ఞానము పైని చెప్పిన సముదాయములో ముఖ్యవస్తువులు గాన నేననునది అట్టిసాక్షిగాని దిగువనున్న శరీరత్రయమందు వర్తింపదని విమర్శవలన తెలిసికొనుటయే గ్రంథిత్రయభేదము. ఆశక్తి మనలోనున్న చిత్కళది గాన చిత్కళ పరానాడీరూపముగా నుండి స్వస్థానమును పొందుటకు దగ్గఱనైన కొలది ఆయా గ్రంథిభేదమని భావము. ముందు స్వస్థానస్వరూపము తెలియుచున్నది. శ్రు. "భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః, క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. జ్ఞాత్వాదేవం పాశహానిః" ఇత్యాదయో బహూని ప్రమాణాని సన్తి.

## ౧౦౫. సహస్రారాంబుజారూఢాయై నమః

తా. వేయిదళములు గల కమలము పరదేవత శిరస్సునందు ద్వాదశారమునకు సంకేతమై బ్రహ్మరంధ్రమని అచట చంద్రమండలాకారముగా చిత్కళ సాక్షిరూపముగా నున్నది. ఆ స్థానమును పొందినది అని ఈ నామార్థము. ప్రకాశరూపబిందు మండలమునుండి విభాగమై విమర్శశక్తి పరానాడీరూపమును పొంది అధోముఖముగాను సృష్ట్యభిముఖమును మూలాధారమును పొంది అదియే వాసస్థానముగా ఉన్నది. ఆ కమలము మాయారూప మూలరూప ప్రకృతిస్థానమైనందున దానిచే

నావరింపఁబడి మేఘముచే ఆవరింపఁబడిన సూర్యునివలెను తన నిజరూపమును స్వస్థానమును మరచి అజ్ఞానమును పొంది ప్రపంచము దేహేంద్రియాదులు సత్యమను జ్ఞానము కలిగి ఇంతకన్న వేరువస్తువు లేదని స్థూలశరీరాభిమానము గల పామరజనుఁడు ఉండును. ఇది బ్రహ్మగ్రంథిస్వరూపము జన్మాంతరపుణ్యమువలన జనులకు మోక్ష మందు కోరికపుట్టును. అపుడు దానికి ముఖ్యసాధనమైన తన నిజరూప విచారణయందు ఇచ్ఛ కలుగుచున్నది. అదియే పరాశక్తికి ఊర్ధ్వగమనాభి లాషగా నున్నది. అపుడు స్వరూపానుభవము గురువులను ఉపనిషద్దేవిని ఆశ్రయించి వారు చెప్పినరీతిని విచారింపఁగా స్థూలశరీరము నేనుకానని తెలియును. అదియే బ్రహ్మగ్రంథిభేదన. పిమ్మట సూక్ష్మశరీరము నేననియు తనకు పూర్వోత్తరజన్మలు కలవనియు త్రిగుణాత్మకమైన ద్వైతమును ప్రతిపాదించు వేదశాస్త్రములందు ప్రమాణబుద్ధి కలుగుటయు జీవత్వ సత్యజ్ఞానము విష్ణుగ్రంథి విమర్శవలన నశించును. అపుడు మూలప్రకృతి మాత్రము నిజము నేనగుణవృత్తియే ద్వైతవృత్తి అదికలదికారణశరీరము. స్వాత్మదేవత శరీరత్రయమును నిరసించినపుడు జీవితకాలమువఱకు సాక్షిగా సహస్రారమందుండునని భావము. (అష్టాక్షరము.)

## ౧౦౬. సుధాసారాభివర్షిణ్యై నమః

తా. అమృతధారలను వర్షించునదిగాన పరాశక్తికి ఈనామము కలిగినది. బ్రహ్మగ్రంథి విభేదనమునుండి ఇంతవఱకు చెప్పిననామములవలన ఫలితార్థము సంకేతముగా తెలియుచున్నది. అవిద్యామిశ్రశబలబ్రహ్మము నాలుగుపాదములు కలదనియు; శుద్ధబ్రహ్మమునకు ఎట్టిభేదము లేదనియు శ్రుతులు చెప్పుచున్నవి. శ్రీదేవి స్థూలశరీరమందు మూలాధారాదిఆజ్ఞాంతము పాదత్రయముభ్రూమధ్యము ఇడా,పింగళా, సుషుమ్నల త్రికూటస్థానము అదియేఅవ్యక్తస్థానము. అపై విద్యాదశాంతమువఱకు తురీయపాదము జ్యో త్స్నలోకము. అచట అహోరాత్రముల భేదములేదు. ఏవిధమైన ద్వైత

వృత్తియు అచట లేదు. సహస్రారాంతర్గత చంద్రమండలము సుధామయము. అదియే చిత్కళ అనే సాక్షిస్థానము. అదియే ప్రత్యగాత్మ. సృష్ట్యాదిని ఆ చంద్రమండలమందు లీనమైయున్న అగ్నిస్వరూపమైన పరాశక్తి సుషుమ్నారూపముగా ఉత్పన్నమై అధోముఖముగా విశుద్ధాదికమలములను ప్రదక్షిణక్రమముగా నతిక్రమించి మూలాధారమునుపొంది నిద్రనుపొందిన సర్పమువలెను మూలప్రకృతి అను నామము కలిగియున్నది. సాధకజనులకు పుణ్యవిశేషముచేత మోక్షమందు స్వరూపజ్ఞానమందు ఇచ్ఛ కలుగుచున్నది. పిమ్మట ఆత్మానాత్మ విచారణ ప్రారంభమగును. అపుడు ఇచ్ఛాశక్తియగు పరాభట్టారికాదేవి సుషుమ్నామార్గముగా ఊర్ధ్వాభిముఖిఅయి స్వాధిష్ఠానాదికములగు నాలుకమలములను గ్రంథిత్రయమును అతిక్రమించి స్వస్థానమైన సహస్రారాంతర్గత చంద్రమండలమును పొందుచున్నది. ఆ చంద్రమండలము శైత్యాధిక్యముచేత ఘనీభవించిన అమృతమయము. అందు అగ్నిరూపపరాప్రవేశమువలన సుషుమ్నావేధవలన చన్ద్రమండలము ద్రవించి అమృతధారలు వర్షించును. అట్టి సుధావృష్టిచేత క్రిందనున్న పదునాలుగువేల నాడీసముదాయము తృప్తినిపొందుచుండును. ఆ చన్ద్రాగ్నుల సామరస్యము సమానముగా ఉన్నంతకాలము ప్రాణులకు స్వస్థావస్థ కలుగును. ఏమాత్రము వ్యత్యాసమైనను ఆయామూలములయిన వ్యాధులుకలిగి శరీరమునకు పీడకలుగును. యీసుధావృష్టియే జీవనకారణముగా నున్నందున సర్వదా మనయందు సుధావృష్టి కలిగియున్నందున సకలప్రపంచమును సకలశరీరములును చంద్రాగ్నిమయముగా నున్నవి. వెనుకచెప్పిన గ్రంథిత్రయభేదమనగా శరీరత్రయమందహంభావనారూప భ్రమనివారణము. ఆపైని స్వస్థానమగు సహస్రారప్రాప్తి తదుపరి స్వరూపమైన చిత్కళను జ్ఞానదృష్టిచేత తానని తెలిసికొని శరీరమందుగల చేతనత్వము చిత్కళదిగాన సకలమును చిన్మయముగా భావించిన పుణ్యపురుషులు జీవన్ముక్తులనియు భావము. (అష్టాక్షరము.)

౧౦౭. తటిల్లతాసమరుచ్యై నమః.

తా. శ్రీదేవి స్థూలశరీరమందున్న నాడీసముదాయమందు 'ఇడా,

పింగళ, సుషుమ్న' అను మూఁడును ప్రధానములు. అందు మధ్యవర్తియును, జీవస్వరూపియును సహస్రారమునుండి మూలాధారపర్యంతము వ్యాపించి యున్న సుషుమ్నానాడి అగ్నిమండలాకారమయిన పరాశక్తిస్వరూప ముగా నుండి నీలమేఘములమధ్యనున్న మెరుపుతీగవలె ప్రకాశించు చున్నది. శ్రు. "నీలతోయదమధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా" ఇతి. (అష్టాక్షరము.)

౧౦౮. షట్చక్రోపరిసంస్థితాయై నమః

తా. సుషుమ్నారూపముగల పరాశక్తి ఆరోహణక్రమముగా మూలాధార స్వాధిష్ఠాన మణిపూర ఆనాహత విశుద్ధ ఆజ్ఞాచక్రములపైని జ్యోత్స్నాలోకమైన తురీయకూటమునందు సహస్రారాంతర్గత చంద్ర మండలమధ్యనున్న కామేశ్వరునితో సామరస్యమును పొంది ఉన్నది. (అష్టాక్షరము.)

౧౦౯. మహాసక్త్యై నమః.

తా. ౧. శ్రీదేవి కామేశ్వరుని సామరస్యమును పొందుటయే ఉత్సవరూపము. అట్టి ఉత్సవమందు మిక్కిలి ఆసక్తిగల దని గాని కేవల అభేదభావమందు ఆసక్తి గలదనిగాని భావము.

౨. ఆత్మపరము:— స్థూల సూక్ష్మ శరీరకారణములందుగల సత్యత్వ జ్ఞానము పూర్తిగా వాసనాక్షయమై సహస్రారాంతర్గత చంద్రమండల మధ్యస్థమైన సాక్షిస్వరూప చిత్కళాస్వరూపము తన దని సంశయ, విప ర్యయ రహితమైనజ్ఞానమందు ఆసక్తియే మోక్షము గాన దానియందు ఆసక్తి గలవా రని భావము. (చతురక్షరము.)

౧౧౦. కుండలిన్యై నమః.

తా. పరాస్వరూపమైన సుషుమ్నానాడి సహస్రార మూలాధార మధ్యకమలములకు ప్రదక్షిణక్రమముగా ఆరోహణావరోహణగమనము కలది గాన వక్రగతిగలభుజంగి, సర్ప సామ్యముగలది. (చతురక్షరము.)

౧౧౧. బిసతంతుతనీయస్యై నమః.

తా. పరాస్వరూపమైన సుషుమ్నా నాడి తామరతూడు మధ్యనున్న సూక్ష్మతంతుసామ్యము గలది. శ్రు. 'నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా - ఇత్యారభ్యసోఽక్షరః పరమస్స్వరాడితి పర్యంతం' శ్రుతి ప్రమాణముగా నున్నది. (అష్టాక్షరము.)

### ౧౧౨. భవాన్యై నమః

తా. ౧. భవుఁడనఁగా మహాదేవుని, లేక సంసారమును, లేక మన్మథుని జీవింపఁజేయునది భవాని. 'భవం మహాదేవం సంసారం కామం వా ఆనయతి = జీవయతీతి భవానీ.' అని నిర్వచనము. శ్లో. ''రుద్రో భవో భవః కామో భవ స్సంసారసాగరః, తత్ప్రాణనాదియం దేవీ భవానీ పరికీర్తితా'' ఇతి దేవీపురాణే.

౨. భవుని పత్ని భవానియనియు చెప్పవచ్చును.

౩. లేక, జలమూర్తియగు పరమేశ్వరునకు భవుఁడని పేరు. అట్టి జలరూపుఁడగు భవుని జీవింపఁజేయునది కనుక భవాని యని చెప్పఁబడును. 'యస్మాద్భవంతిభూతాని తాభ్యస్తా భావయంతి చ, భవనా ద్భావనా చ్చైవ భూతానాం స భవః స్మృతః'' వాయుపురాణే.

౪. లేక, శ్రీదేవియొక్క పంచాశత్పీఠములలో స్థానేశ్వర మను పీఠము నధిష్ఠించియుండుదేవతకు 'భవాని' యను నామము గలదు. (పద్మపురాణమునందుగల అష్టోత్తరశతదేవీతీర్థమాలాధ్యాయమునందు ''స్థానేశ్వరే భవాన్యాఖ్యా బిల్వకే నామపత్రికా'' అని చెప్పఁబడియున్నది.)

అవ. ఇంతవఱకు దేవతాస్వరూపమును చెప్పి అట్టిస్వరూపమును పొందుటకు ఉపాయమును నిరూపంచుచున్నారు:—

### ౧౧౩. భావనాగమ్యాయై నమః

తా. ౧. దేవతాకారమును ధ్యానించుట అను చిత్తవృత్తి భావన అనఁబడును. అట్టిభావనచేత పొందఁదగినది అని భావము. సాత్వికాది గుణభేదములు మూఁడువిధములుగా నున్నవి. అవి ఎట్లనఁగా;—

1. బాహ్యమందు విగ్రహములు మొదలగు ఉపాధులయందు బుద్ధి యుంచి కరచరణాదులతో దేవతాభావనచేయుట తామసము. 2. తన హృదయకమలమందు దేవతాధ్యానపూజాదికములు జరుపుట రాజసము. 3. సాధకుని శిరోమధ్యమున్న సాక్షియగు చిత్కళయందు తానను అహంకారమును లయింపఁజేయుటయే సాత్త్వికము. ఇది ఉత్తమము.

౨. ప్రకారాంతరము.— అజ్ఞాంతము, సగుణధ్యానము, ఉన్మనీ పర్యంతము మిశ్రమము నిష్కళము ఉన్మనినుండి బిందువందు ప్రధాన మయము. ప్రజ్ఞానస్వరూపబ్రహ్మజ్ఞానము మూఁడవది అని భావము. 'భావనాధార్ఢ్యాన్నిగ్రహానుగ్రహౌ భవత ఇతి శ్రుతేః' ఇట్టిసంశయ విపర్యాసరహితమైన భావనాదార్ఢ్యమువలన నిగ్రహానుగ్రహసామర్థ్యము కలుగుచున్నది. (షడక్షరము.)

౧౧౪. భవారణ్యకుఠారికాయై నమః

తా. సంసారమను అరణ్యమునకు కుఠారము గండ్రగొడ్డలివంటిది. ఏ పుణ్యపురుషులకు శ్రీవిద్యారూపకమైన పంచదశాక్షరీమంత్రోపాసన కలుగుచున్నదో వారికి జీవన్ముక్తి కలుగుచున్నదనియు, లేక జన్మ కలిగినపుడు ఈశ్వర స్వరూపులుగా నుందురు. (షడక్షరము.)

౧౧౫. భద్రప్రియాయై నమః

తా. మంగళములందు శుభములందు ప్రీతికలదనియు, శ్రీదేవి మంగళ స్వరూపురాలనియు భావము. (చతురక్షరము.)

౧౧౬. భద్రమూర్త్యై నమః

తా. శ్రీదేవి శ్రేష్ఠమైనస్వరూపము కలదని భావము. (చతురక్షరము)

౧౧౭. భక్తసౌభాగ్యదాయిన్యై నమః

తా. శ్రీదేవి తనభక్తులకు సకలసంపదలను ఇచ్చునదియనియు, లేక సుభగానామము లలితాంబకే చెల్లును గనుక భక్తులకు సాయుజ్యముక్తిని ఇచ్చునదనియు భావము. (అష్టాక్షరము.)

## ౧౧౮. భక్తప్రియాయై నమః

తా. భక్తికలవానియందు ప్రేమకలది. భక్తి రెండువిధములుగా ఉన్నది. ముఖ్యమని, గౌణమని. అంతరంగమందు ఈశ్వరసంబంధమైన చిత్తవృత్తివిశేషమందు గల ప్రీతి ముఖ్యభక్తి. గౌణమనఁగా బాహ్యమందు తనయిష్టదేవతా సేవాభజనా నామస్మరణాదులు. ఇవి అష్టవిధములు అని నవవిధములని దశవిధములని అనేక భేదములున్నవి. అట్టిభక్తిగలవారి యందు ప్రేమకలది. (చతురక్షరము.)

## ౧౧౯. భక్తిగమ్యాయై నమః

తా. ౧. భక్తిచేతను పొందఁదగినదని, మోక్షమందు ప్రేమగలవాఁడై అంతరంగ బహిరంగములందు భక్తిగలిగిన ఆత్మానాత్మవిచారపరునకు శ్రీదేవియొక్క నిజరూపము ప్రత్యక్షమగును. అదియే మోక్షమని శ్రుతులవలనఁ జెప్పఁబడుచున్నది.

౨. నిజముగా తనవిగాని శరీరజీవాదులందు 'నాది; నేను' అనే భ్రమయే బంధము. మరల జన్మకారణము దానినాశమే మోక్షమని శ్రుతుల అభిప్రాయము. (చతురక్షరము.)

## ౧౨౦ భక్తివశ్యాయై నమః.

తా. స్వాత్మదేవత భక్తిచేత స్వాధీనమగునని స్వరూపజ్ఞానమందాసక్తియే భక్తి అని పూర్వము వివరింపఁబడినది. శ్రీదేవియందు భక్తికలిగినపుడు ఆత్మానాత్మ విచారణకలవానిగాఁ జేయును. ఆ విచారణవలన మధ్యనుకలిగిన దేహేంద్రియాదులే నేననెడిభ్రమ నివారణయై స్వాత్మయే సాక్షి (ప్రత్యగాత్మ)గా చిత్కళయే యున్నదని నిశ్చయజ్ఞానము కలుగును. అదియే జీవన్ముక్తి అనియు, మోక్షమనియు, ప్రసిద్ధి గనుక భక్తిచేత దేవత స్వాధీనము. (చతురక్షరము.)

## ౧౨౧. భయాపహాయై నమః

తా. అరణ్యాదిస్థలములందును జలములందును వ్యాధి మొదలగు ఆపదలందును దేవీనామములను స్మరించినయెడల సకలభయములు నివారణ మగునని శ్రుతులు స్మృతులు పురాణములు చెప్పుచున్నవి. (చతురక్షరము.)

౧౨౨. శాంభవ్యై నమః.

తా. శంభునిభార్య శాంభవి, శాంభవీముద్ర అనియు కావచ్చును. తురీయావస్థయందు ఈముద్ర వినియోగము. ముద్రాలక్షణము. దృష్టి రెప్పపాటులేక, బాహ్యమును చూచినట్లు అంతరంగమందు శిరోమధ్యనున్న చిత్కళయందు లక్ష్యముకలది 'శాంభవీముద్ర' అని భావము. (త్ర్యక్షరము.)

౧౨౩. శారదారాధ్యాయై నమః.

తా. శ్రీదేవి సరస్వతీదేవిచేత పూజింపఁబడుచున్నది. వశిన్యాది వాగ్దేవతలచేతను పండితులచేతను పూజింపఁబడుచున్నందున ఈనామము కలది. (పంచాక్షరము.)

౧౨౪. శర్వాణ్యై నమః.

తా. పరమేశ్వరుని ఎనిమిదిస్వరూపములలోను శర్వనామము గల ఈశ్వరుఁడు జలరూపముగా ప్రత్యక్షముగా నున్నాఁడు. తద్భార్య శర్వాణీరూపముగా శ్రీదేవి ఉన్నందున ఈనామము సిద్ధించినది. (త్ర్యక్షరము.)

౧౨౫. శర్మదాయిన్యై నమః.

తా. శర్మశబ్దము సుఖమందును, బ్రాహ్మణులయందును వర్తించుచున్నందున భక్తులకు సుఖమును ఇచ్చునదియనియు, బ్రాహ్మణుఁడనఁగా బ్రహ్మను పొందకోరుచున్నవాఁడు లేక బ్రహ్మస్వరూపుఁడు, గాన బ్రహ్మపదవిని సాధకుల కిచ్చునదియని భావము. (పంచాక్షరము.)

౧౨౬. శాంకర్యై నమః.

తా. భక్తులకు, సుఖము గలుగఁజేయువాఁడు గనుక, శంకరుఁడు అని తద్భార్య శాంకరి అని భావము. (త్ర్యక్షరము.

౧౨౭. శ్రీకర్యై నమః

తా. భక్తులకు అష్టైశ్వర్యములను ఇచ్చునది యని భావము. (త్ర్యక్షరము.)

౧౨౮. సాధ్వ్యై నమః

తా. లలితాంబ పాతివ్రత్యము ఇతరస్త్రీలకు పొంద శక్యముకాదని కాలత్రయములయందును ప్రతిసృష్టియందును ప్రతికల్పమందును శంకరార్ధశరీరముగా నున్నది. (ద్వ్యక్షరము.)

౧౨౯. శరచ్చంద్రనిభాననాయై నమః

తా. శ్రీదేవిముఖము శరత్కాలచంద్రునివలె నున్నది. (అష్టాక్షరము.

౧౩౦. శాతోదర్యై నమః

తా. శ్రీదేవి సన్నని నడుముకలదనిగాని, అనేకగుహలుగల హిమవంతుని కుమార్తెయనిగాని సకలజనహృదయములందును చిదగ్నిరూపముగా ఉన్నదనిగాని శాతోదరి అనునామము కలిగినది. (చతురక్షరము.)

౧౩౧ శాన్తిమత్యై నమః

తా. శ్రీదేవి శాంతమైన మనస్సుకలదని భక్తులయందు ఔద్ధత్యము తీక్ష్ణత్వము లేనిదని భావము. శాంతినిపొందిన మనస్సుకలదనగా తురీయావస్థయందు మనోవృత్తులు లయమై బుద్ధిమాత్రము నిల్చియుండునుగాన ప్రజ్ఞానఘనమాత్రము శరీరముగా కలదని రహస్యార్థము. (చతురక్షరము.)

౧౩౨. నిరాధారాయై నమః

తా. పరాశక్తి ఏవిధమైన ఆధారముగాని లేనిదయి సకలప్రపంచమునకును తానే ఆధారముగా ఉన్నది. దీపమునకు వత్తి తైలము ఆధారములు. అగ్నికి ఇంధనములు ఆధారములు. జీవునకు శరీరము ఆధారము. ఇటుల ఆధారములేనివస్తువులేదు. అట్లే సకలప్రపంచమునకు పరాశక్తియే ఆధారము. పరాశక్తి మఱొకవస్తు ఆధారముగా లేనందున ఆధారాపేక్షలేనిది సంవిద్రూపిణి.

అని జ్ఞానమునకే సంవిత్తని నామాంతరము. అగియే సాక్షి. దానియందు మనోలయము మోక్షమనఁబడుచున్నది. (చతురక్షరము.)

౧౩౩. నిరంజనాయై నమః.

తా. అంజనమనఁగా కాళిమ ఆవరణము. అదిలేనిది గనుక నిరంజన అని కాళిమ అనఁగా మలత్రయము స్థూలశరీరాభిమానము, ఆణవమలము సూక్ష్మమాయికమలము, కార్మికమలము, తదుపరి తురీయకూటము, జ్యోత్స్నాలోకము, మలత్రయరహితము. అచట చంద్రమండలమందు చిత్కళారూపముగా శ్రీదేవి యుండుటవలన నిరంజన అని ప్రసిద్ధికలిగినది. అత్యంతము సంతోషముకలదనియు చెప్పవచ్చును. ఆనందస్వరూపిణి కావున నిట్టియర్థము గలిగి యున్నది. (చతురక్షరము.)

౧౩౪. నిర్లేపాయై నమః.

తా. లేపమనఁగా కర్మసంబంధము. అది లేనిదిగాన నిర్లేప అని వాడుక. (త్ర్యక్షరము.)

౧౩౫. నిర్మలాయై నమః.

తా. ఆణవాదిమలత్రయము, అవిద్యారూపము, సూర్యసన్నిధి యందు అంధకారము లేనటుల, అవిద్యాసంబంధము లేనిదిగాన నిర్మల అని నామము కలిగినది. (త్ర్యక్షరము.)

౧౩౬. నిత్యాయై నమః.

తా. సృష్ట్యాదిని అంతమందును, మధ్యను ఉన్నది. నాశరహిత గనుక నిత్య అని నామము కలిగినది. (ద్వ్యక్షరము.)

౧౩౭. నిరాకారాయై నమః.

తా. ఆకారములేనిదని కరచరణాదిరూపము గుణత్రయమువలన కలుగుచున్నది. పరాశక్తి గుణములకు పూర్వవర్తినిగాన ఆకారములేని దనియు భావనకు లేదోయనియు యనియు భావము. (చతురక్షరము.)

౧౩౮. నిరాకులాయై నమః

తా. చిత్తచాంచల్యము లేనిది. (చతురక్షరము.)

౧౩౯. నిర్గుణాయై నమః

తా. ఎట్టిగుణములు లేనిదని శ్రుతులుకూడ చెప్పుచున్నవి. (త్ర్యక్షరము.)

౧౪౦. నిష్కలాయై నమః

తా. నిష్కలయనఁగా కలారహిత. కల అనఁగా అంశము. బిందురూపమైన పూర్ణమునుండి అంశలు కలుగుచున్నవిగాన నిష్కల అనినందున పూర్ణత్వము ద్యోతకమగుచున్నది. (త్ర్యక్షరము.)

౧౪౧ శాన్తాయై నమః

తా. శాంతమైన స్వభావముకలదని, లేక శవర్ణమునకు ముందుగానున్న అమృతబీజస్వరూపమని, నిస్తరంగమైన అమృతసరస్సని ఫలితార్థము. (ద్వ్యక్షరము.)

౧౪౨. నిష్కామాయై నమః

తా. నశించిపోయిన ఇచ్ఛకలది. "సంపూర్ణకామస్యైకమిచ్ఛేతి. శ్రు. పూర్ణమదః పూర్ణమిద మితి శ్రుతేః. నిష్కామయతీతివా" నామము. (త్ర్యక్షరము.)

౧౪౩. నిరుపప్లవాయై నమః

తా. ఏవిధమైననాశముగాని ఉపద్రవముగాని లేనిదని యిరువదినాలుగుతత్త్వములకును, వృద్ధిక్షయములు, న్యూనాధికములు కలవు. ఇరువదిఅయిదవకల ఆత్మస్వరూపము, దానికి నాశములేదు. (పంచాక్షరము.)

౧౪౪. నిత్యముక్తాయై నమః

తా. శ్రీదేవిభక్తులు నిత్యముక్తులని, అట్టి భక్తులుగలదని భావము. (చతురక్షరము.)

## ౧౭౫. నిర్వికారాయై నమః

తా. శ్రీదేవి పరమాత్మస్వరూపము గాన ఏవిధమైనమార్పులు లేనిది. అవ్యక్తమహదాదులు మార్పుగలవి. వానికి సత్తారూపముగా నున్నదని భావము. (చతురక్షరము)

## ౧౭౬. నిష్ప్రపంచాయై నమః

తా. పృథివ్యాదిపంచభూతసంబంధములేనిది, వానికి ఆశ్రయముగా నున్నది. అజ్ఞాకమలమునుండి దిగువనున్న కూటత్రయము, పంచభూతమయము ఆపైది తురీయకూటము, అచటనున్నచిత్కళ ప్రపంచసంబంధము లేనిది, శాంతమైనది, మంగళస్వరూపము, రెండవవస్తువులేనిది తురీయమని, మాండూక్యకారిక. (చతురక్షరము.)

## ౧౭౭. నిరాశ్రయాయై నమః

తా. సకలమునకు బ్రహ్మము ఆశ్రయముగా నున్నందున, బ్రహ్మమునకు మఱియొకవస్తువు ఆశ్రయాపేక్షలేదని భావము. బ్రహ్మకు శరీరమాశ్రయముగా ఉన్నదను చార్వాకమతము నిషేధింపఁబడినది. (చతురక్షరము.)

## ౧౭౮. నిత్యశుద్ధాయై నమః

తా. ప్రపంచోత్పత్తికి పూర్వమందును, పరమందును స్థితిలోను మాలిన్యరహితమైనది, ఆణవాదిమలత్రయసంబంధములేనిదని, సాక్షియగు పురుషుఁడు పాదరసమువలెను, దేనిని అంటని వాఁడని శ్రుతి 'శ్రు. అస్పర్శశ్చమహాఞ్ శుచిః.' (చతురక్షరము.)

## ౧౭౯. నిత్యబుద్ధాయై నమః

తా. ౧. సుషుప్తి స్వప్న జాగ్రత్తురీయములందు సమముగా ప్రకాశించుచున్న "చిద్రూపిణి" యని భావము 'శ్రు. న హి విజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యత' ఇతి.

౨. షడ్దర్శనపూజయందు జైనదర్శనోపాస్యముగా దేవికి పూజావిధా

నము నిరూపితమయి యుండుటచేత తదుపాస్యయగు "నానాదేవీస్వరూపిణి" యనియు చెప్పవచ్చును. (చతురక్షరము.)

౧౫౦. నిరవద్యాయై నమః

తా. తనభక్తులయొక్క అవిద్యారూపమైన పాపమును పోఁగొట్టి రక్షించునదియు, నరకబాధలను తొలగించునదియు, అట్టి జ్ఞానమును కలుగఁజేయునదియు నని భావము. శ్రు. "నిరవద్యం నిరంజన" మితి శ్రుతేః; "అవద్యా న్నరకా న్నిర్గతాః యత్ప్రసాదాదితివా." (చతురక్షరము.)

౧౫౧. నిరన్తరాయై నమః.

తా. పృథివ్యాద్యాకాశాంతపంచభూతములును, త్రిపుటియు, స్పష్టమైన భేదధర్మములు కలవి. అటులనే బ్రహ్మయు, ఒకపదార్థముగా భేదబుద్ధితో భావింపఁగూడదనియు, సర్వపరిపూర్ణమనియు భావము. (చతురక్షరము.)

౧౫౨. నిష్కారణాయై నమః.

తా. సకలప్రపంచమునకును కారణముగా నున్న బ్రహ్మమునకు కారణాన్తరము లేదు. కారణకార్యభావరహితము నిత్యమనియు భావము. బ్రహ్మమును పుట్టించువాఁడును, అతనికి ప్రభువును లేఁడని శ్రుతి. శ్రు- "న చాస్య కశ్చి జ్జనితా న చాధిప ఇతి శ్రుతేః". (చతురక్షరము.)

౧౫౩. నిష్కళంకాయై నమః.

తా. కలంకరహితమైన దనియు, ప్రకాశమానమైన దనియు భావము. (చతురక్షరము.)

౧౫౪. నిరుపాధయే నమః.

తా. స్ఫటికమందున్న లోహితత్వమునకు మంకెనపువ్వు ఉపాధిగా నున్నది. అటుల బ్రహ్మస్వరూపిణియగు శ్రీదేవికి వస్త్వంతరాపేక్ష లేదనియు స్వప్రకాశస్వరూపిణియనియు భావము. (చతురక్షరము.)

౧౪౫. నిరీశ్వరాయై నమః.

తా. సకలమునకుఁ దానే ప్రభ్వి గాన, తనకు ప్రభువులేనిది. (చతురక్షరము.)

౧౪౬. నీరాగాయై నమః.

తా. అభిలాష లేనిది. పూర్ణత్వమును పొందిన సకలకోరికలు కలది. (త్ర్యక్షరము.)

౧౪౭. రాగమథనాయై నమః.

తా. పరదేవత తనభక్తులకు వైరాగ్యస్వరూపజ్ఞానమును కలుగఁజేసి గ్రామ్యభోగాభిలాషను పోఁగొట్టునది. (పంచాక్షరము.)

౧౪౮. నిర్మదాయై నమః.

తా. మదరహితమైనదనియు, సర్వదా జాగరూకతగలదనియు భావము. (త్ర్యక్షరము.)

౧౪౯. మదనాశిన్యై నమః.

తా. భక్తులయొక్క దుర్మదమును, మత్తతను పోఁగొట్టునది. (పంచాక్షరము.)

౧౫౦. నిశ్చిన్తాయై నమః.

తా. చిన్త అనఁగా మనస్సునకు విచారమును, దుఃఖమును కలుగఁ జేయు స్మరణము, అట్టి విచారము లేనిది. (త్ర్యక్షరము.)

౧౫౧. నిరహంకారాయై నమః.

తా. అహంకారము సాత్త్వికాదివిభేదముతో త్రివిధముగా నున్నది. బాలశరీరమందు నేనను అహంకారము తామసము. సూక్ష్మశరీరాభిమానము రాజసము. కారణ శరీరాభిమానము సాత్త్వికము. ఈత్రివిధాహంకారములును బన్ధకారణములే. అట్టి యహంకారత్రయములేనిది తన నిజరూపము చిత్కళ అని తెలియుటయే మోక్షము. (పంచాక్షరము.)

## ౧౬౨. నిర్మోహాయై నమః

తా. స్వస్వరూపవిస్మృతి, అసత్యములైన ప్రపంచేంద్రియ స్థూలాది దేహాదికములందు సత్యత్వజ్ఞానము ఇది మోహ మనఁబడును. ఇట్టి మోహములేనిది. (త్ర్యక్షరము.)

## ౧౬౩. మోహనాశిన్యై నమః

తా. మోహమనఁగా ద్వైతవృత్తి. ఏకత్వజ్ఞానమును భక్తులకు కలుగఁజేయునది గాన మోహనాశిని. శ్రు. 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ' ఏకత్వజ్ఞానము కలవారికి శోకమోహాదులు లేవని శ్రుతి. (పంచాక్షరము.)

## ౧౬౪. నిర్మమాయై నమః

తా. దేహజీవప్రపంచాదులందు సత్యత్వబుద్ధియే మమకారము. అఖండాకారబ్రహ్మజ్ఞానముచేత ద్వైతజ్ఞాననాశము నిర్మమత్వము. అట్టి నిర్మమత్వము కలదని భావము. (త్ర్యక్షరము.)

## ౧౬౫. మమతాహన్త్ర్యై నమః

తా. భక్తులయొక్క మమకారమును పోఁగొట్టునది. జీవశరీరాదులందహంభావమే మమత. ఆ మమత్వము అద్వైతవృత్తియు, నిజమయిన స్వస్వరూపపరిజ్ఞానము లేనిది పోదుగనుక అట్టిజ్ఞానమును కలుగచేయునది. (పంచాక్షరము.)

## ౧౬౬. నిష్పాపాయై నమః

తా. పాప మనఁగా అజ్ఞానము, అవిద్య, అట్టిదిలేనిది 'నిష్పాప' యని చెప్పఁబడును. వస్తువిమర్శవలన సత్యము తెలియును. అందువలన 'విమర్శరూపిణి' అని భావము. (త్ర్యక్షరము.)

## ౧౬౭. పాపనాశిన్యై నమః

తా. శ్రీదేవి స్వమంత్రోపాసనపూజాస్మరణాదులొనర్చు భక్తులపాపములను నశింపచేయును. పాద్మే, పుష్కరఖండే:–"మేరుపర్వతమాత్రోఽపి

రాశిః పాపస్యకర్మణః, కాత్యాయనీం సమాసాద్య నశ్యతి క్షణమాత్రతః."
దేవీభాగవతే:— "భిత్వాభిత్వాచ భూతాని హత్వా సర్వమిదం జగత్.
ప్రణమ్య శిరసా దేవీం న స పాపైర్విలిప్యతే''తి. బ్రహ్మాండపురాణేఽపి:—
"వర్ణాశ్రమవిహీనానాం పాపిష్ఠానాం నృణామపి, యద్రూపధ్యాన
మాత్రేణ దుష్కృతం సుకృతాయతే'' ఇత్యాది బహువచనాని సన్తి.
(పంచాక్షరము.)

౧౬౮. నిర్లోభాయై నమః

తా. ఒకరియందు ద్వేషముగాని, ఒకరియందు ప్రియముగాని లేనిది, 'న మే ద్వేష్యోఽస్తి నప్రియః' అని భగవద్గీత. (త్ర్యక్షరము.)

౧౬౯. క్రోధశమన్యై నమః

తా. భక్తులకు బంధకారణమును అరిషడ్వర్గాంతర్గతమును అగు క్రోధమును నశింపఁజేయునది గాన యీనామము కలిగినది. (పంచాక్షరము.)

౧౭౦. నిర్లోభాయై నమః

తా. గొప్ప ఔదార్యముకలదైనందున లోభగుణము లేనిది. స్వభక్తులకు తనసర్వస్వమును, తనభర్తను, తనస్వరూపమునుకూడ ఇచ్చుచున్నది గాన లోభత్వమే లేనిది. (త్ర్యక్షరము.)

౧౭౧. లోభనాశిన్యై నమః

తా. స్వభక్తులయందున్న సకలసుగుణములను సంహరించునట్టిలోభగుణముు నశింపఁజేయునది. (పంచాక్షరము.)

౧౭౨ నిస్సంశయాయై నమః

తా. పోయినసంశయము గలదని చిక్కులను విచారింపఁగా దేహేంద్రియాదులు మిథ్యలగుచున్నవి. స్వాత్మసాక్షాత్కారమైనపుడు నిస్సంశయముగా నున్నది. (చతురక్షరము.)

౧౭౩. సంశయఘ్న్యై నమః

తా. భక్తులయొక్క సర్వసంశయములను పోఁగొట్టునది. శ్రు. "ఛిద్యం తే సర్వసంశయాః." (చతురక్షరము.)

౧౭౪. నిర్భవాయై నమః.

తా. జననము లేనిది, బ్రహ్మస్వరూపిణి గావున అనాది. శ్రు. "అనాదిమత్పరం బ్రహ్మేతి." శ్రుతేః. (త్ర్యక్షరము.)

౧౭౫. భవనాశిన్యై నమః.

తా. శ్రీదేవి స్వభక్తులయొక్క బంధకారణమైన సంసారరూపమయిన జ్ఞానమును పునర్జన్మబీజమును నశింపఁజేయునది. (పంచాక్షరము.)

౧౭౬. నిర్వికల్పాయై నమః.

తా. శూన్యమనే శబ్దజన్యజ్ఞానము, అస్తిఅను శబ్దమువలన పోయినది, గాన వికల్పరహితయనియు, తురీయావస్థయందు వృత్తి శూన్యమగుచున్నందున వికల్పరహితయనియు, తనకంటె వేఱగు వస్తువు లేనందునను సకలము తానే అయినందునను వికల్పరహితయని భావము.(చతురక్షరము.)

౧౭౭ నిరాబాధాయై నమః

తా. సత్యమైన చిత్కళయం దజ్ఞానముచేత జగజ్జీవాదులు కల్పితములుగా నున్నవి. నిజమైన జ్ఞానము కలిగినపుడు ఆ జగదాదులకు బాధ కలుగుచున్నది గాని అదియందున్న చిత్కళకు బాధలేదు గాన 'నిరాబాధా' అని చెప్పఁబడుచున్నది. (చతురక్షరము.)

౧౭౮. నిర్భేదాయై నమః.

తా. పరాశక్తి పరమశివునితోఁ గూంచెమైనను భేదములేనిది. ప్రపంచమందుగల భేదజ్ఞానము ప్రకృతిసంబంధము గాన పరాశక్తి అభేదస్వరూపము సర్వాంతర్యామి సర్వపూర్ణత్వము గలది. తనభక్తులను భేదజ్ఞానరహితులనుగా చేసి మహావాక్యార్థబోధను కలుగఁజేసి బ్రహ్మాపరోక్షజ్ఞానము కలవారినిగా చేయునదియని భావము. (త్ర్యక్షరము.)

౧౭౯. భేదనాశిన్యై నమః.

తా. తనభక్తులకు శరీరజీవాదులు వేరను భేదజ్ఞానమును నశింపఁజేసి బ్రహ్మాత్మలకు అభేదమనే జ్ఞానమును కలుగఁజేయునది. (పంచాక్షరము.)

౧౮౦. నిర్నాశాయై నమః.

తా. శ్రీదేవి నాశరహితయైనదని, జననమరణరహితయని భావము. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యని శ్రుతి. (త్ర్యక్షరము.)

౧౮౧. మృత్యుమథన్యై నమః.

తా. తనభక్తులకు మృత్యువను మరణధర్మమును నశింపఁజేసి, అమృతత్వమను మోక్షమును ఇచ్చునది యనియు, శ్రీవిద్యోపాసకులను రుద్రస్వరూపులనుగాఁ జేయునదియని భావము. (పంచాక్షరము.)

౧౮౨. నిష్క్రియాయై నమః.

తా. విహితనిషిద్ధక్రియలు లేనిది, త్రిపుటిభేదమును నశింపఁజేసి తానే త్రిపుటిగానుండి భక్తులకు తురీయజ్ఞానమును కలుగఁజేయునది యని భావము. (త్ర్యక్షరము.)

౧౮౩. నిష్పరిగ్రహాయై నమః.

తా. సర్వకామపరిపూర్తిగలది గనుక ప్రతిగ్రహము త్యాగము అనే ధర్మములు లేనిదనియు, భక్తులనుకూడ అట్టివారినిగానే జేయునది యనియు భావము. (పంచాక్షరము.)

౧౮౪. నిస్తులాయై నమః.

తా. తనతో సమానమయినట్టిగాని, అధికమయినట్టిగాని, వేఱయిన వస్తువు లేనిది. (త్ర్యక్షరము.)

౧౮౫. నీలచికురాయై నమః.

తా. నల్లని కుంతలములు గలది (సౌందర్యలక్షణము.)(పంచాక్షరము.)

౧౮౬. నిరపాయాయై నమః

తా. నాశరహితమైన నిత్యవస్తువు. శ్రు. "సత్యంజ్ఞానమనన్తం బ్రహ్మేతి". (చతురక్షరము.)

౧౮౭. నిరత్యయాయై నమః

తా. న్యూనాధికధర్మరహిత యనియు, భావాభావధర్మరహిత యనియు భావము. (చతురక్షరము.)

౧౮౮. దుర్లభాయై నమః

తా. యోగులకుకూడ పొందశక్యముకానిది. భాగ్యహీనులకు లభ్యముకానిది. (త్ర్యక్షరము.)

౧౮౯. దుర్గమాయై నమః

తా. భాగ్యహీనులకు పొందశక్యముకానిది. (త్ర్యక్షరము.)

౧౯౦. దుర్గాయై నమః

తా. ౧. దుర్గుఁ (డను రాక్షసుఁ)డు ఇన్ద్రాదిదేవతలను బాధింపఁగా వారు పరాశక్తిని ప్రార్థింపఁగా ప్రత్యక్షమై ఆరాక్షసుని వధించి దేవతలను శత్రుబాధనుండి రక్షించినది గాన దుర్గానామము శ్రీలలితాంబికకు సిద్ధమైనది. (ద్వ్యక్షరము.)

౨. కాశీక్షేత్రమునందు సుబాహువను రాజునకు వరములొసంగి అతనిచేత సంప్రార్థితయై అచ్చట "దుర్గా" దేవియను పేరుతో నివసించునటుల అనుగ్రహమొసంగిన శ్రీలలితాంబికయొక్క అవతారనామము.

3. నవవర్ష యగు (దొమ్మిదిసంవత్సరముల వయస్సుకలిగి,) పెండ్లి కానిబాలికకు (కన్యకు) దుర్గ యని పారిభాషికనామము. తత్స్వరూపిణి యని భావము.

౧౯౧. దుఃఖహంత్ర్యై నమః

తా. సంసారదుఃఖములను భక్తులకుఁ బోఁగొట్టినది. ఆధ్యాత్మికములు వ్యాధిమొదలగునవి. ఆధిభౌతికములు మృగాద్యుపద్రవములు. ఆధిదైవికములు అశనిపాతాదులనెడి తాపత్రయములను భక్తులకు హరింపఁ జేయునది. (చతురక్షరము.)

౧౯౨. సుఖప్రదాయై నమః

తా. తన భక్తులకు ఐహికసుఖములను, అంతమందు కైవల్యమును ఇచ్చునది. (చతురక్షరము.)

౧౯౩ దుష్టదూరాయై నమః

తా. కువాదములచేయు దుర్జనులకు దూరముగా నున్నది. వారికి పొంద శక్యముకానిది. (చతురక్షరము.)

౧౯౪. దురాచారశమన్యై నమః

తా. తనభక్తులయొక్క అజ్ఞానకృతశాస్త్రవిరుద్ధమైన దురాచారదోషములను, పూజా జప స్మరణాదులచేత పోఁగొట్టుచున్నది. (సప్తాక్షరము.)

౧౯౫. దోషవర్జితాయై నమః

తా. రాగద్వేషాదిదోషములు లేనిది. (పంచాక్షరము.)

౧౯౬. సర్వజ్ఞాయై నమః

తా. భూతభవిష్యద్వర్తమానజ్ఞానములు కలది. (త్ర్యక్షరము.)

౧౯౭. సాంద్రకరుణాయై నమః

తా. భక్తులయందు విస్తారమైన కరుణకలది. (పంచాక్షరము.)

౧౯౮. సమానాధికవర్జితాయై నమః

తా. పరదేవతతో సమానులుగాని అధికులుగాని దేవతాన్తరము మఱి ఎవరును లేదని భావము. (అష్టాక్షరము.)

౧౯౯. సర్వశక్తిమయ్యై నమః.

తా. శ్రీచక్రమందుఁగల అణిమాదిభగమాలిని పర్యంతమయిన శక్తిసముదాయము, బాలాశ్యామలాదిశక్తులు, సకలమంత్రములందున్న శక్తిబీజములు ఇవియన్నియు శ్రీదేవిస్వరూపములే యని భావము. (షడక్షరము.)

౨౦౦. సర్వమఙ్గళాయై నమః.

తా. శ్రీదేవియందు సకలమంగళములు ఉన్నందున సర్వమంగళ అనియు, సకలశుభములు శ్రీదేవి స్వరూపము లనియు భావము. (పంచాక్షరము.)

ఇతి శ్రీమత్పదవాక్యప్రమాణపారావారపారీణధురీణ సర్వతన్త్రస్వతన్త్రతైలింగదేశస్థసమయాచారజీర్ణోద్ధారక ప్రకాశానన్దనాథగురుచరణారవిన్దసేవాపరాయణ సత్యానన్దనాథకరకమల సంజాతాన్తేవాసులును, కౌశికసగోత్రోద్భవ భాగీరథీరాయశాస్త్రులవారిద్వితీయపుత్రులును జ్ఞానానన్దనాథదీక్షానామవిరాజితులును, అగు బ్రహ్మశ్రీ సింహాంభట్ల రామమూర్తిశాస్త్రులవారిచేత వ్రాయఁబడిన బ్రహ్మాండపురాణాన్తర్గత హయగ్రీవాగస్త్యసంవాదరూప శ్రీలలితాదివ్య నామసహస్రస్తోత్రమందు ద్వితీయశతకమునకు పరిమళమను సంజ్ఞగల ప్రతినామతాత్పర్యము సమాప్తము.

శ్రీ

# శ్రీ లలితాసహస్రనామావళి

## తృతీయ శతకము

---

### ౨౦౧. సద్గతిప్రదాయై నమః.

తా. శ్రీదేవి తనయొక్క పూజా, జపస్మరణాదికృత్యముల నొనర్చు భక్తజనులకు ఇహమందు సర్వసుఖములను పరమందు స్వర్గాది మోక్షాంతములగు సద్గతులను, లేక బ్రహ్మము నెఱుంగునట్టి జ్ఞానమును ఇచ్చునది యని భావము. (పంచాక్షరము.)

### ౨౦౨. సర్వేశ్వర్యై నమః.

తా. నామరూపాత్మకమైన సకలప్రపంచమునకును ప్రభ్వి యని భావము. (చతురక్షరము.)

### ౨౦౩. సర్వమయ్యై నమః.

తా. శివాది క్షిత్యంతమైన ప్రపంచము షడధ్వలతో నిండి యున్నది. అది పరమేశ్వరుని విరాడ్రూపముగాన శివభక్తులకు భేదము లేనందునను, షడధ్వల ఉత్పత్తి సర్వకారణమైన పరాబిందువువలన క్రమముగా వికసించినది గాన సకలము పరాస్వరూపమని సువర్ణముచే నిర్మితమైన వస్తుసమూహమంతయు స్వర్ణమయమయినటుల, మృత్తికచే నిర్మితమయిన దంతయు మృణ్మయ మయినటుల పరాశక్తిచేత నిర్మితమయినదంతయు పరాశక్తి మయమే యని భావము. (చతురక్షరము.)

### ౨౦౪. సర్వమంత్రస్వరూపిణ్యై నమః.

తా. సప్తకోటిమహామంత్రములును శ్రీదేవియొక్క స్వరూపములు

మంత్రములు పంచాశద్వర్ణమయములు. వర్ణములు వైఖరీరూపములు. వైఖరిపరాబిందువువలన క్రమముగా కలిగినది గాన సకలమంత్రములు పరాశక్తిస్వరూపములని భావము. (అష్టాక్షరము.)

## ౨౦౫. సర్వమంత్రాత్మికాయై నమః

తా. లోకమందు దేవత లెందఱో అన్నిమంత్రములును, అన్ని యన్త్రములును గలవు. సకల మంత్రములు దేవతలు శ్రీదేవీ స్వరూపము లెటులనో, అట్లే సకలయన్త్రములును శక్తిమయములుగా నున్నవి. సకల యంత్రములందును ప్రాణశక్తి ఆత్మగా ఉన్నందున ఈనామము సార్థకముగా ఉన్నదని భావము. (షడక్షరము.)

## ౨౦౬. సర్వతంత్రరూపాయై నమః

తా. వామకేశ్వరాది సకలతన్త్రములును దేవీప్రతిపాదకములే గాని 'సర్వతన్త్రరూపా' అని నామము. కేవల వామాచారయుక్తములైన చతుష్షష్టితంత్రములును, బ్రాహ్మణోచితమైన స్వతంత్రతన్త్రములును అని సర్వశబ్దసార్థక్యము. శ్రు. "బహుధాఽప్యాగమైర్భిన్నాః పన్థాన స్సిద్ధిహేతవః, త్వయ్యేవ నిపతంత్యే తే స్రోతస్విన్యర్ణవా ఇవే"తి. (షడక్షరము.)

## ౨౦౭. మనోన్మన్యై నమః

తా. భ్రూమధ్యమునుండి ఎనిమిదవచక్రము బ్రహ్మరంధ్రమునకు క్రిందుగా మనోన్మనీస్థానము, మనోలయస్థానమని, అచట అహోరాత్ర భేదములేదని నిర్వికల్పము. శివశక్తిమేళనరూపము అని, రుద్రవక్త్రమని చెప్పఁబడుచున్నది. (శ్రు. "మనోన్మనాయనమ ఇతి-నిరస్తవిషయాసఙ్గం సన్నిరుద్ధం మనోహృది, యదాయాత్యున్మనీభావం తదా తత్పరమం పదమితి. ధ్యానధ్యాతృధ్యేయభావో యథా నశ్యతినిర్భరం, తథోన్మనత్వ భవతి జ్ఞానామృత నిషేవణాత్" ఇతి.)

## ౨౦౮. మాహేశ్వర్యై నమః

తా. త్రిమూర్తులు సగుణులు, మహేశ్వరుఁడుమాత్రము నిర్గుణుఁడు, ఈ త్రిమూర్తులకు కారణస్వరూపుఁడు, నిర్గుణుఁడగు మహేశ్వరునిభార్య మహేశ్వరియు నిర్గుణస్వరూపిణియే గాన తురీయమిథునమని భావము. (చతురక్షరము.)

## ౨౦౯. మహాదేవ్యై నమః

తా. ౧. సకలదేవతలకంటె అధికుఁడగు పరమేశ్వరునకు మహాదేవ నామముకలవాఁడు. అతనిభార్య స్వశక్తిరూపిణియే గాన మహాదేవి అని నామసిద్ధి కలిగినది. (చతురక్షరము.)

౨. గండకీనదియందుగల చక్రతీర్థము నధిష్ఠించియున్న పీఠదేవికి 'మహాదేవి' యని ప్రసిద్ధి. తత్స్వరూపిణి యని భావము.

## ౨౧౦. మహాలక్ష్మ్యై నమః

తా. ౧. సాంబమూర్తి వామోరువునందున్న పరదేవతయొక్క తేజస్సమూహము శక్తిరూపముగా నావిర్భవించినది. ఆపరమేశ్వరియే మహాలక్ష్మి అని భావము.

౨. కరవీరక్షేత్రాధిష్ఠానదేవత 'మహాలక్ష్మి' తత్స్వరూపిణి యని భావము. (చతురక్షరము.)

## ౨౧౧. మృడప్రియాయై నమః

తా. సకలజనులకు సుఖమును కలుగఁజేయు సత్వగుణాశ్రయుఁడైన ఈశ్వరుఁడు మృడనామముకలవాఁడు. అతనిభార్య కనుక 'మృడప్రియ' అని భావము. (చతురక్షరము.)

## ౨౧౨. మహారూపాయై నమః

తా. ౧. మూర్తిత్రయము సర్వకారణముగల శివరూపముగల పరాశక్తి, మహారూపా అని బ్రహ్మస్వరూపిణి అని భావము.

తా. ప్రధాన, పురుష, వ్యక్త కాలములను రూపచతుష్టయము కంటె ఉత్కృష్టమయిన రూపముగలది కావున 'మహారూప' యని చెప్పఁబడుచున్నది. (చతురక్షరము.)

౨౧3. మహాపూజ్యాయై నమః.

తా. సర్వజనపూజ్యులైన త్రిమూర్తులచేత పూజింపఁబడుచున్నది గాన మహాపూజ్యా అని ప్రసిద్ధి. (చతురక్షరము.)

౨౧౪. మహాపాతకనాశిన్యై నమః.

తా. గొప్పవైన బ్రహ్మహత్యాదిమహాపాపములుకూడ పరాశక్తి నామస్మరణమువలన నశించుచున్నవి గాన మహాపాతకనాశిని అని నామము కలిగినది. "బహునాత్ర కిముక్తేన శ్లోకార్థేన వదామ్యహం, బ్రహ్మహత్యాశతంవాఽపి శివపూజా వినాశయే" దితి. (అష్టాక్షరము.)

౨౧౫. మహామాయాయై నమః.

తా. బ్రహ్మాదులకుఁగూడ మోహమును కలుగఁజేయునది గాన మహామాయ అని పేరు కలిగినది. (చతురక్షరము.)

౨౧౬ మహాసత్త్వాయై నమః

తా. విశేషమైన బలము కలదని భావము. (చతురక్షరము.)

౨౧౭. మహాశక్త్యై నమః.

తా. గొప్పసామర్థ్యము కలదని భావము. (చతురక్షరము.)

౨౧౮. మహారత్యై నమః

తా. జ్ఞానులకు విషయవాంఛలకంటె నెక్కువ కోరిక పరదేవత యందు కలదు గాన మహారతి అని నామము కలిగినది. (చతురక్షరము.)

౨౧౯. మహాభోగాయై నమః.

తా. నిరతిశయ సుఖముగాని, మితములేని ధనముగాని కలదని భావము. (చతురక్షరము.)

౨౨౦. మహైశ్వర్యాయై నమః

తా. అధికమైన ప్రభుత్వమును, అత్యంతమైన ఐశ్వర్యమును కల దని భావము. (చతురక్షరము.)

౨౨౧. మహావీర్యాయై నమః

తా. గొప్పసామర్థ్యముగాని గొప్పప్రభుత్వముగాని గొప్పతేజస్సు గాని కలది. (చతురక్షరము.)

౨౨౨. మహాబలాయై నమః

తా. గొప్ప చతురంగసేనలుగాని పరాక్రమసామర్థ్యములుగాని దేవీభక్తులైన భుసుండాదివాయసములుగాని గలదని భావము. యోగ వాసిష్ఠరామాయణమందు వసిష్ఠునితో భుసుండుఁడను కాకము స్వవృత్తాంత మును చెప్పుచుఁ దనకు శ్రీదేవివరమువలన జీవన్ముక్తియు దీర్ఘదర్శనము కలిగినదని చెప్పెను. (చతురక్షరము.)

౨౨3. మహాబుద్ధ్యై నమః

తా. శ్రీదేవి గొప్పబుద్ధిగలది కనుక 'మహాబుద్ధి' యని చెప్పఁ బడును. ఎట్టిబుద్ధిచేత బ్రహ్మజ్ఞానము కలుగుచున్నదో, అదియే మహాబుద్ధి. అదియే స్వస్వరూపజ్ఞానము. ఎవనిచేత బ్రహ్మవస్తువు చిత్కళ అని తెలియఁబడుచున్నదో, వాఁడే సకలమును తెలిసినవాఁడగును. వాఁడే మహాబుద్ధిగలవాఁడని భావము.

౨౨౪. మహాసిద్ధ్యై నమః

తా. అణిమాద్యష్టసిద్ధులు గలది 'మహాసిద్ధి' యని భావము. (చతురక్షరము.)

౨౨౫. మహాయోగేశ్వరేశ్వర్యై నమః

తా. మహాయోగేశ్వరులకు ప్రభ్వి, బ్రహ్మ విష్ణు రుద్రులు యోగీశ్వరులు. వారికి ప్రభ్వి యని భావము. (అష్టాక్షరము.)

౨౨౬. మహాతంత్రాయై నమః

తా. లోకమందు కులార్ణవాద్యనేకతన్త్రములు, అల్పఫలదములు కలవు. శ్రీవిద్యాతన్త్రము స్వతన్త్రతన్త్రమని మహాతంత్రమని కాదివిద్యాతన్త్రము ప్రసిద్ధము. అట్టి స్వరూపము గలదని భావము. (చతురక్షరము.)

౨౨౭. మహామన్త్రాయై నమః

తా. సప్తకోటిమహామన్త్రములును ఆత్మపరముగానే యున్నందున, మహాతంత్రస్వరూపిణి అనియు, శాబరములకును మన్త్రసంజ్ఞ కలదు. కాని అవి కేవలము ఐహిక ఫలము నిచ్చునవి. కావున మహామంత్రము లనం బడఁజాలవు. శ్రీవిద్యాషోడశాక్షరీమన్త్రము మాత్రము మహామన్త్రమనఁ బడును. (చతురక్షరము.)

౨౨౮. మహాయన్త్రాయై నమః

తా. మహాయన్త్రశబ్దము శ్రీచక్రమునందు రూఢి. శ్రీచక్రమునకు సిద్ధవజ్రమనియు, శ్రీవిద్యయగు కాదివిద్యాతంత్రమునకు స్వతన్త్రతన్త్రమనియు, ఈశ్వరముఖోద్భూతమైన బిరుదులు గలవుగాన శ్రీచక్రరూపమైనది 'మహాయన్త్ర' యని భావము.

౨౨౯. మహాసనాయై నమః

తా. పృథివిమొదలు ముప్పదియాఱు తత్త్వములును, ఆసనముగాఁ గలదని సకల తత్త్వములను ఆశ్రయించియున్నది కనుక 'మహాసన' యని భావము. (చతురక్షరము.)

౨౩౦. మహాయాగక్రమారాధ్యాయై నమః

తా. శ్రీచక్రార్చనము బ్రాహ్మణులు. కల్పసూత్రప్రకారము భూపురాది బిన్ద్వన్తము, చతుష్షష్ట్యుపచారములచేత పూజించుట మహాయాగ

మని, ఇతర యాగములు విలంబకాలమందు ఫలమునిచ్చును కనుక బహిర్యాగము. రెండవది అంతర్యాగము. అదియు సగుణము, నిర్గుణము, సాధారణము, నిరాధారము. ఈ భేదములను తెలిసికొని భావనోపనిషత్ప్రకారము అంతరంగమందు చేయునది అంతర్యాగమని ఉభయమును అధికార భేదముచేత మహాయాగమనఁబడుచున్నది. అట్టి విధిచేత ఆరాధింపఁదగినదని భావము. (అష్టాక్షరము.)

౨౩౧. మహాభైరవపూజితాయై నమః

తా. కల్పాంతమందు పరశివుఁడు మహాభైరవాకారమును పొందినాఁడు. అట్టి భైరవునిచేతఁ బూజింపఁబడినదని భావము. (అష్టాక్షరము.)

౨౩౨. మహేశ్వరమహాకల్పమహాతాండవసాక్షిణ్యై నమః

తా. మహాప్రళయమందు మహేశ్వరుఁడు మాత్రము ఉండి, మహానందోద్రేకముచేత మహాతాండవమును చేయుచుండఁగా కామేశ్వరీదేవి సకల భూతములను తనయందుంచుకొని ఆ తాండవమునకు సాక్షిగా ఉన్నది. (షోడశాక్షరము.)

౨౩౩. మహాకామేశమహిష్యై నమః

తా. కామేశ్వరునితో త్రైలోక్య సామ్రాజ్య పట్టాభిషేకమును పొందిన రాజ్యలక్ష్మీస్వరూపురాలని భావము. (అష్టాక్షరము.)

౨౩౪. మహాత్రిపురసుందర్యై నమః

తా. శ్రీచక్రమందు బిందువు నాక్రమించియున్న ప్రథమ త్రికోణము అవ్యక్తస్వరూపము. కోణబిందువులు మూఁడును త్రిపుటి స్వరూపములు. సత్త్వ రజ స్తమోగుణస్వభావులైన బ్రహ్మ విష్ణు రుద్ర స్వరూపములు. అట్టి శ్రీచక్రమునకు అధిపతిగాన 'మహాత్రిపురసుందరీ' అను నీనామము కలిగినది. (అష్టాక్షరము.)

౨౩౫. చతుష్షష్ట్యుపచారాఢ్యాయై నమః

తా. బ్రాహ్మణవర్ణోచితమైన దక్షిణాచారక్రమముగా నిర్మింపఁబడి

కల్పసూత్రప్రకారము శ్రీచక్రార్చనయందు చతుష్షష్ట్యుపచారములచేతను శ్రీచక్రము పూజింపఁదగినది. శ్రీచక్రార్చనావిధి వామదక్షిణాచారములకు భేదముగానున్నందున బ్రాహ్మణుల నుద్దేశించి సనకాదిఋషులు వేదమార్గసమ్మతముగాఁ గల్పసూత్రమును పూజాఖండమును నిర్మించిరి. తదనుసారముగా చతుష్షష్ట్యుపచారములతో శ్రీదేవి ఆరాధింపఁదగినది. కపిల దత్తాత్రేయ దూర్వాస పరశురామాదులు కౌళవామాచారపరులు గాన బ్రాహ్మణేతర త్రైవర్ణికులకొఱకు శ్రీపరశురాములవారు పూజాఖండమును సూత్రములుగా రచించినారు. ఆమార్గమున త్రైవర్ణికులు ఆచరించుట వారి స్వధర్మమై ఉన్నది. ఇతర దేవతలకు చతుష్షష్ట్యుపచారాధికారము లేదు. వీరిపై అధికారము ఎవరికిని లేదు. (అష్టాక్షరము.)

## ౨౩౬. చతుష్షష్టికలామయ్యై నమః

తా. చతుష్షష్టికల అనఁగా, అఱువదినాలుగు విద్యలు, నాలుగు వేదములు, ఆఱు అంగములు, అష్టాదశపురాణములు, షడ్దర్శనములు మున్నగునవి. భగవతిపై సకలవిద్యాస్వరూపము గలదని భావము. (అష్టాక్షరము.)

## ౨౩౭. మహాచతుష్షష్టికోటియోగినీగణసేవితాయై నమః

తా. శ్రీదేవి ఉపప్రాణభూతలు, సేనానాయికలు, శ్రీచక్రద్వితీయ భూపురాధిష్ఠాతలగు బ్రాహ్మ్యాద్యష్టమాతృకలు. వారిలో ఒక్కొక్కరికి ఎనమండుగురు చొప్పున సైనికులు. చతుష్షష్టి ౬౪ సంఖ్యగల శక్తిసేనలు గలవారు. సర్వసమిష్టి నాలుగువేలతొంబదియాఱుకోట్లు (౪౦౯౬ కోట్లు) శక్తిసేనాసమూహము చేత సేవింపఁబడుచున్నదని భావము. (షోడశాక్షరము.)

## ౨౩౮. మనువిద్యాయై నమః

తా. శ్రీవిద్యాంతర్గతమైన పంచదశీవిద్యకు మను, చంద్ర, కుబేరాది పండ్రెండుగురు ఉపాసకులు. వారు ప్రత్యేకము. కూటత్రయాత్మకముగా

మంత్రోద్ధారణమును చేసి శ్రీదేవిని ఉపాసించిరి గాన 'మనువిద్య' యని చెప్పఁబడినది. (చతురక్షరము.)

౨౩౯. చన్ద్రవిద్యాయై నమః

తా. చంద్రునిచేత నిర్మింపఁబడిన పంచదశీవిద్యాస్వరూపిణి అని భావము. (చతురక్షరము.)

౨౪౦. చన్ద్రమండలమధ్యగాయై నమః

తా. చంద్రమండల మధ్యస్థమైనదని అచట ధ్యానింపఁదగినది. (అష్టాక్షరము.)

౨౪౧. చారురూపాయై నమః

తా. సుందరమైన ఆకారము కలదని భావము. (చతురక్షరము.)

౨౪౨. చారుహాసాయై నమః

తా. సుందరమైన మందహాసము కలదని భావము. (చతురక్షరము)

౨౪౩. చారుచన్ద్రకళాధరాయై నమః

తా. చంద్రకళలు పదునయిదు వృద్ధిక్షయములు గలవి. పదునాఱవది నిత్యాసంజ్ఞకలది. ఆకళను ధరించినదని శ్రీవిద్యాషోడశమంత్రస్వరూపురాలని కామకలా ఏకాక్షరీవిద్య నిత్య కలాస్వరూపముగాన తద్రూపిణి అని భావము. (అష్టాక్షరము)

౨౪౪. చరాచరజగన్నాథాయై నమః

తా. స్థావరజంగమస్వరూపమైన సకల ప్రపంచమునకు ప్రభ్వి యని భావము. (అష్టాక్షరము.)

౨౪౫. చక్రరాజనికేతనాయై నమః

తా. శ్రీచక్రమే నివాసస్థానముగాఁ గలదని భావము. (అష్టాక్షరము.)

౨౪౬. పార్వత్యై నమః

తా. హిమవత్పర్వతుని కుమార్తె అగుటవలన పార్వతి అని నామము కలిగినది. (త్ర్యక్షరము.)

౨౪౭. పద్మనయనాయై నమః

తా. పద్మములవంటి నేత్రములు గలదని ఈనామము కలిగినది. (పంచాక్షరము.)

౨౪౮. పద్మరాగసమప్రభాయై నమః

తా. పద్మరాగమణి కాంతివంటి ఎఱ్ఱనికాంతిగలదనిగాని, లేక ఎఱ్ఱకలువవంటి కాంతిగలదని గాని భావము. (అష్టాక్షరము.)

౨౪౯. పంచప్రేతాసనాసీనాయై నమః

తా. పంచబ్రహ్మలును వామాది వారివారి శక్తిరహితులైనపుడు ప్రేతసంజ్ఞకలవారు కార్యాసమర్థులు గాన వారిచేఁ గల్పింపఁబడిన మంచాకారమైన ఆసనమందు కూర్చున్నదని భావము. (అష్టాక్షరము.)

౨౫౦. పంచబ్రహ్మస్వరూపిణ్యై నమః

తా. బ్రహ్మాదిసదాశివాంతమైన పంచబ్రహ్మ స్వరూపముగాను సద్యోజాతాది పంచరుద్రులును వారివలన కలిగిన భూతపంచకము స్వరూపముగాఁ గలదని భావము. (అష్టాక్షరము.)

౨౫౧. చిన్మయ్యై నమః

తా. చిత్కళయే ఆకారముగా గలదని భావము. (త్ర్యక్షరము.)

౨౫౨. పరమానన్దాయై నమః

తా. నిజానందస్వరూపిణియని, అదియే తురీయావస్థగా నున్నదని, ఆనందమే బ్రహ్మాకారమని భావము. (పంచాక్షరము.)

౨౫౩. విజ్ఞానఘనరూపిణ్యై నమః

తా. సాంద్రమైన చైతన్యస్వరూపురాలని భావము.(అష్టాక్షరము.)

౨౫౪. ధ్యానధ్యాతృధ్యేయరూపాయై నమః

తా. జ్ఞాత జ్ఞానము జ్ఞేయము అను త్రిపుటీ స్వరూపురాలు. (అష్టాక్షరము.)

౨౫౫. ధర్మాధర్మవివర్జితాయై నమః

తా. శ్రుతిస్మృతులచే నియమింపఁబడిన ఆచారము ధర్మమనఁబడును. దానికి విరుద్ధమైనది అధర్మము. ఎంతవఱకు వర్ణాశ్రమధర్మములందు న్నున్నారో అంతవఱకు ధర్మాధర్మములకు లోఁబడి ఉండవలెను. ధర్మాధర్మశబ్దములు బంధమోక్షపరములు. పురుషప్రకృతి స్వరూపములు. వానితో సంబంధములేనిది గాన 'ధర్మాధర్మవివర్జితా' అని నామము కలిగినది. (అష్టాక్షరము.)

అవ. ఈనామమునుండి పందొమ్మిది నామములచేత జీవేశ్వరులకు విభాగమును చూపించుచు వర్ణించుచున్నారు.—

౨౫౬. విశ్వరూపాయై నమః

తా. బ్రహ్మాండము స్థూలరూపమని సూక్ష్మరూపమని రెండువిధములుగా ఉన్నది. స్థూలము విరాడ్రూపము. సమష్టిజీవసమూహము సూక్ష్మము. ఒకమనుష్యుని శరీరజీవాదులు. ఇదివ్యష్టి. ఈస్థూలసూక్ష్మములు సమానధర్మములు గలవి. ఈఉభయమును వీనియందున్న విభాగసంకేతములును పరదేవతాస్వరూపములని వర్ణించుచున్నారు. వెనుక 'సర్వోపాధివినిర్ముక్తా' అని వర్ణించినందున దేహజీవబ్రహ్మాండాదులకు అభేద భేదభావనగా ఉన్నదని భావము. ప్రతిమనుష్యునకు జాగ్రత్త స్వప్నము సుషుప్తి అని మూఁడు అవస్థలుగలవు. జాగ్రదవస్థాభిమాని అయిన జీవుఁడు విశ్వుఁడనియు, స్వప్నావస్థాభిమాని తైజసుఁడనియు, సుషుప్త్యవస్థాభిమాని ప్రాజ్ఞుఁడని, ఇదివ్యష్టి. సమష్టిలో వైశ్వానర, హిరణ్యగర్భేశ్వరులు వీరే స్థూల సూక్ష్మ కారణశరీరత్రయాభిమానులు అని. స్థూలశరీరాభిమానియు, జాగ్రదవస్థాపన్నజీవుఁడు, విశ్వుఁడని నామము గలవాఁడు. పరాశక్తియే విశ్వరూపము గా అభేదముగా ఉన్నదని భావము. (చతురక్షరము.)

## ౨౫౭. జాగరిణ్యై నమః

తా. సర్వేంద్రియస్ఫూర్తి జ్ఞానముగల విశ్వుఁడనేజీవుని అవస్థ జాగర మనఁబడును. జీవేశ్వరులకు భేదములేనందున జాగ్రదవస్థకలది. (చతురక్షరము.)

## ౨౫౮. స్వపన్త్యై నమః

తా. 'నిద్రావస్థాయాం మనః, ప్రజ్ఞామాత్రేణ ప్రపంచానుభవో వాసనారూపేణ సస్వప్నః' నిద్రావస్థలో మానసిక ప్రపంచానుభవము స్వప్న మనఁబడును. సాక్షిరూపముగా పరాశక్తి ఉన్నందున స్వపంతీ నామము కలిగినదని భావము. (త్ర్యక్షరము)

## ౨౫౯. తైజసాత్మికాయై నమః

తా. స్వప్నావస్థయందున్న తైజసుండనే సూక్ష్మదేహాభిమానియగు జీవునియందు ఆత్మరూపముగా ఉన్నందున తైజసాత్మిక అని నామము కలిగినది. (పంచాక్షరము.)

## ౨౬౦. సుప్తాయై నమః

తా. సుషుప్త్యవస్థకు సమ్ప్రసాదావస్థ అని నామాంతరము. అందుకు ప్రాజ్ఞుఁడను సమష్టి ఈశ్వరుఁడే అభిమాని గనుక సుప్తావస్థా స్వరూపిణి అని అభేదభావనగా వర్ణించినారని భావము. (ద్వ్యక్షరము.)

## ౨౬౧. ప్రాజ్ఞాత్మికాయై నమః

సుషుప్త్యవస్థయందున్న కారణశరీరాభిమానియైన ప్రాజ్ఞునియందు ఆత్మరూపముగా ఉన్నందున ఈ నామము కలిగినది. 'ప్రాజ్ఞాత్మిక' యని భావము. (చతురక్షరము.)

## ౨౬౨. తుర్యాయై నమః

తా. మనోబుద్ధుల మార్పువలన జాగ్రదాద్యవస్థలు కలుగుచున్నవి. మనోబుద్ధులు నేత్రగోళము నాశ్రయించి ఉన్నపుడు జాగ్రదవస్థ, కంఠగత

మైనపుడు, స్వప్నము, హృదయగతమైనపుడు గాఢసుషుప్తి, శిరస్సును సహస్రారమధ్యమును పొందినపుడు తురీయమనఁబడును. తురీయము జాగ్రత్తలోనుండి పొందఁదగినది. జాగ్రత్తలో పద్మాసనాసీనుఁడై పూర్ణమైనదృష్టికలిగి మనోబుద్ధులను సహస్రారమును పొందించి మనస్సును వృత్తిశూన్యముగా లయింపఁజేసి బుద్ధిని లయింపకుండ నిలిపి సకలప్రపంచము చిన్మయముగా భావించుటయే తురీయమనఁబడును. అభ్యాసపాటవముకొలఁది దీర్ఘకాలము సూక్ష్మముగా దోఁచును. శ్రు. 'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి సభూమా. భూమాత్వేవవిజిజ్ఞాసితవ్యఇతి.'

భూమైవసుఖం = భూమావస్థయే తురీయ మనఁబడుచున్నది. తురీయప్రాప్తియే జీవన్ముక్తి. వారు శివతుల్యులు. పరాశక్తి తురీయావస్థాస్వరూపముగా ఉన్నది గనుక 'తుర్యా'నామము. తురీయనార్థ్యమే తురీయాతీతమని భావము. (ద్వ్యక్షరము.)

## ౨౬౩. సర్వావస్థావివర్జితాయై నమః

తా. జాగ్రదాదిసర్వావస్థల నతిక్రమించి, సకలప్రపంచమును అఖండాకారచిన్మయముగాఁ గాంచెమైనను ద్వైతబుద్ధి లేకుండ ఉన్నపుడు సచ్చిదానందోదయ మగును. వారు అవధూత లనఁబడుదురు. వారికి అవస్థాత్రయమునందు తురీయజ్ఞానమేగాని, యించుకైనను ద్వైతజ్ఞానము లేదు. వారు జీవన్ముక్తులు. శివతుల్యులు. వారి ప్రవృత్తి నివృత్తిగా నున్నది. దేహేంద్రియాదులున్నను వారిక్రియలు దగ్ధపటమువలె దేహారంభకారణములు కానేరవు. వారికి జన్మకారణమైన మాయాబీజము నశించినదని భావము. (అష్టాక్షరము.)

## ౨౬౪. సృష్టికర్త్ర్యై నమః

తా. సృష్టి అనఁగా జగన్నిర్మాణము. అది రజోగుణప్రధానమైన ఈశ్వరాధీనముగా ఉన్నందున అట్టిసృష్టిని మూలప్రకృతిరూపమును పొంది చేయునదిగాన సృష్టికర్త్రీ అని నామము కలిగినది. (చతురక్షరము.)

౨౬౫. బ్రహ్మరూపాయై నమః

తా. బ్రహ్మ, చతుర్ముఖబ్రహ్మస్వరూపుఁడైన ఈశ్వరుఁడు, అట్టి రూపము గలదిగాన ఈనామసిద్ధి కలిగినది. (చతురక్షరము.)

౨౬౬. గోప్త్ర్యై నమః

తా. గోపనమనఁగా జగత్సంరక్షణము. అది సత్వగుణప్రధానమయిన ఈశ్వరకృత్యము గాన అట్టి రూపముగలిగినదని భావము. పరిపాలనధర్మము గలదని భావము. (ద్వ్యక్షరము.)

౨౬౭. గోవిన్దరూపిణ్యై నమః

తా. గోవిందనామముగల ఈశ్వరుఁడు విష్ణుస్వరూపుఁడు. ప్రకృతి యొక్క ప్రథమభాగము, మహత్తత్త్వము ఉమాస్వరూపము. వ్యాపకత్వముగల విష్ణుశక్తి స్వరూపుఁడని భావము. (షడక్షరము.)

౨౬౮. సంహారిణ్యై నమః

తా. సంహారమనఁగా జగత్తును బూర్ణముగా నశింపఁజేయుట. అది తమోగుణప్రధానుఁడైన ఈశ్వరునికృత్యము. దానినిఁ జేయునది గాన ఈ నామము కలిగినదని భావము. (చతురక్షరము.)

౨౬౯. రుద్రరూపాయై నమః

తా. రుద్రుఁడనఁగా రుజం=సంసారమును, ద్రావయతి=నశింపఁజేయువాఁడు. రోగములను పోఁగొట్టు పరమేశ్వరుఁడే గాన బ్రహ్మశక్తికి ఈనామము కలిగినదని భావము. (చతురక్షరము.)

౨౭౦. తిరోధానకర్యై నమః

తా. దీపనాశమువలెను సకలపరికరసహితముగా పరమాణువుతో జగత్తును నశింపఁజేసి బీజమును తనయం దుంచుకొనునది గాన 'తిరోధానకరీ' నామము కలిగినది. (షడక్షరము.)

## ౨౭౧. ఈశ్వర్యై నమః

తా. ముఖ్యమైన శుద్ధసత్త్వప్రధానుఁడు ఈశ్వరుఁడు. పంచబ్రహ్మలలో నాలుగవవాఁడు. అతనితో అభేదము గలదిగాన ఈనామము కలిగినది. (త్ర్యక్షరము.)

## ౨౭౨. సదాశివాయై నమః

తా. పంచబ్రహ్మలలో అయిదవవాఁడు సదాశివుఁడు. అతనితో అభేదముగలది గాన ఈనామము కలిగినది. (చతురక్షరము.)

## ౨౭౩. అనుగ్రహదాయై నమః

తా. నిశ్శేషముగా ధ్వంసమైన జగత్తును మరల సృష్టిబీజము ననుగ్రహించుకృత్యము శ్రీదేవి స్వాధీనముగాన, అనుగ్రహము నిచ్చునది యని భావము. (చతురక్షరము.)

## ౨౭౪. పంచకృత్యపరాయణాయై నమః

తా. సృష్టి, స్థితి, సంహార, తిరోధానానుగ్రహాః, పంచవిధకృత్యాః ఈ అయిదును పంచవిధకృత్యములు. వీనియందు ఆసక్తిగలదనియు, బంధమోక్షములు పరదేవతాధీనము లనియు భావము. (అష్టాక్షరము.)

## ౨౭౫. భానుమణ్డలమధ్యస్థాయై నమః

తా. సూర్యమండలమధ్యమునం దున్నదని సూర్యమండలము చంద్రాగ్నిమేళనరూపము గాన బ్రహ్మస్వరూపము. శ్రు. 'ఉద్యంతి మస్తం యంత మాదిత్య మభిధ్యాయన్నితి' శ్రుతిచేత సూర్యమండలము బ్రహ్మస్వరూపము గాన అచట ఉన్నదని భావము. (అష్టాక్షరము.)

## ౨౭౬. భైరవ్యై నమః

తా. ప్రపంచ సంహారకాలమం దీశ్వరుఁడు భైరవరూపమును ధరించినాఁడు. తద్భార్య భైరవీనామముకలది గాన భైరవీనామసిద్ధి కలిగినదని భావము. (త్ర్యక్షరము.)

## ౨౭౭. భగమాలిన్యై నమః

తా. భగశబ్దము షడ్గుణైశ్వర్యపరము గాన గుణసంఖ్యారూప మాల కలది. (పంచాక్షరము.)

## ౨౭౮. పద్మాసనాయై నమః

తా. బ్రహ్మస్వరూపిణి గాన పద్మాసన అని లక్ష్మిని భక్తులకు నిచ్చునది. కాన పద్మాసన అని నామముకలిగినది. మూలాధారాది సహస్రారాంతకమలములం దునికిగలది గాన 'పద్మాసనా' అనియు భావము. (చతురక్షరము.)

## ౨౭౯. భగవత్యై నమః

తా. సంపూర్ణైశ్వర్యము ధర్మము యశస్సు కీర్తి లక్ష్మి జ్ఞానము యుక్తాయుక్తము విజ్ఞానము బ్రహ్మజ్ఞానము ఈ మొదలైన సుగుణములు కలదియు భక్తులకుఁ గలుగఁజేయునది యనియు భావము. (చతురక్షరము.)

## ౨౮౦. పద్మనాభసహోదర్యై నమః

తా. పద్మనాభస్య విష్ణో స్సహోదరీ భగినీతి. సృష్ట్యాదిని విష్ణువును శక్తియు ఏకాండమం దుత్పన్నమయినందున శక్తి విష్ణుసోదరి అని భావము. నారాయణీ అన్నచోటనుకూడ నారాయణస్యభగినీ నారాయణీ అని భావము గాన పద్మనాభసహోదరీనామసిద్ధి కలిగినది. (అష్టాక్షరము.)

## ౨౮౧. ఉన్మేషనిమిషోత్పన్న విపన్నభువనావళ్యై నమః

తా. పరాశక్తియొక్క నిమేషోన్మేషములు కనుఱెప్పపాటువలన అనేకకోటి బ్రహ్మాండములు సృష్టిఅగుచున్నవి. దేవతలకు రెప్పపాటు లేదుగదా ఎట్లుచెప్పిరనఁగా వారి యిచ్ఛామాత్రముచేత సృష్టి స్థితి లయములు అగుచున్నవని భావము. (షోడశాక్షరము.)

## ౨౮౨. సహస్రశీర్ష వదనాయై నమః

తా. వేలకొలఁది శిరస్సులు ముఖములు కలది. (అష్టాక్షరము.)

౨౮౩. సహస్రాక్ష్యై నమః

తా. వేలకొలఁది నేత్రములు కలది 'సహస్రాక్షీ' అని భావము. 'సహస్రాక్షస్సహస్రపాత్' అని శ్రుతి. (చతురక్షరము.)

౨౮౪. సహస్రపదే నమః.

తా. వేలకొలఁది పాదములు కలదని భావము. పరాశక్తి జగదభేదముగా నున్నందున సకలజీవుల శిరస్సులు నేత్రములు పాదములు పరాశక్తివే గాన వేలకొలఁది పాదములు గలదని భావము. (పంచాక్షరము.)

౨౮౫. ఆబ్రహ్మకీటజనన్యై నమః

తా. బ్రహ్మాండము శరీరముగాఁ గలవాఁడు. బ్రహ్మ=హిరణ్యగర్భుఁడు, కీటమనఁగా, అతిసూక్ష్మజంతువగు క్రిమివిశేషము. ఈస్థూలసూక్ష్మగ్రహణముచేత మధ్యవర్తులైన పరిమాణముగల శరీరధారులగు ప్రాణికోటి అంతయు గ్రహింపఁబడినది. బ్రహ్మాదిస్తంభపర్యంతమైన సకలప్రాణులను బుట్టించునదియని భావము. (అష్టాక్షరము.)

౨౮౬. వర్ణాశ్రమవిధాయిన్యై నమః

తా. ఈరీతిని సకలజీవులను నిర్మించి ఉత్తమాధికారముగల మనుష్యులను తరింపఁజేయఁ దలఁచి వేదస్వరూపమును పొందినది. అట్టి వేదప్రచారముకొఱకు ఉత్తమాధికారభేదము ననుసరించి మనుష్యులను నాలుగువర్ణములుగాను నాలుగాశ్రమములుగాను ఆయావర్ణాశ్రమముల కుచితమైన ధర్మములను జగన్మాతయే ఏర్పాటును జేసినది. (అష్టాక్షరము.)

౨౮౭. నిజాజ్ఞారూపనిగమాయై నమః

తా. నాలుగువేదములును పరదేవతయొక్క ఆజ్ఞారూపముగా నున్నవి. కాన వేదమార్గము ననుసరించిన పురుషులు శ్రీదేవి యనుగ్రహమునకుఁ బాత్రులుగా నున్నారని భావము. (అష్టాక్షరము.)

౨౮౮. పుణ్యాపుణ్యఫలప్రదాయై నమః

తా. పూర్వరీతిని నియమించిన వేదమార్గప్రవర్తకులకును తద్విరుద్ధాచరణము గలవారికిని పుణ్యపాపములకు ఫలములైన స్వర్గనరకములను పరదేవతయే పొందించుచున్నది. (అష్టాక్షరము.)

౨౮౯. శ్రుతిసీమన్తసిందూరీకృతపాదాబ్జధూళికాయై నమః

తా. నాలుగు వేదములును శ్రీదేవిచేత సృజింపఁబడినవై లోకమాతయగు శ్రీదేవికి సాష్టాంగప్రణామము చేయఁగా వారి శిరస్సులు దేవీపాదారవిందములం దునికివలన ఎఱ్ఱని పాదరజస్సు వారిశిరస్సులకు అంటి సీమంతమందు అలంకారార్థముంచిన సింధూరమువలె ప్రకాశించుచున్నదనియు, లేక శ్రుతి సీమంతములు ఉపనిషత్తులు శుద్ధస్ఫటికము సాత్త్వికాంతఃకరణాలు గలవి. అట్టి ఉపనిషత్తులను ఎఱ్ఱని పాదారవిందపరాగము సింధూరమువంటి ఎఱుపురంగు గలవానిని గాఁ జేయుచున్నదని ఉపనిషత్తులు శుద్ధసాత్త్వికములు. శ్రీదేవిచరణకమలములు భక్తులకు ఇహామందు సకలసంపత్సుఖానుభవములను ఇచ్చుచు మోక్షదములుగా నగును అని భావము. (షోడశాక్షరము.)

౨౯౦. సకలాగమసన్దోహశుక్తిసంపుటమౌక్తికాయై నమః

తా. సమస్తాగమములనే ముత్యపుచిప్పలసంపుటమందున్న ఆణిముత్యమువంటిదని సకలాగమగర్భమందున్న పరమార్థము పరదేవతాపరముగనే ఉన్నందున సకలాగమములం దున్నదని భావము. (షోడశాక్షరము.)

౨౯౧. పురుషార్థప్రదాయై నమః

తా. పురుషార్థచతుష్టయము నిచ్చునదియని భావము. (షడక్షరము.)

౨౯౨. పూర్ణాయై నమః

తా. దేశము కాలము వస్తువు ఇది ప్రమాణమును తెలుపును. ఈ మూఁడువిధములందును పరిమాణము లేనిది గాన సర్వపరిపూర్ణవస్తువని

భావము. ఈ త్రివిధము ప్రకృతిలోనిది. ప్రకృతియొక్క ఆద్యంతములం దున్న పరిపూర్ణవస్తువు గాన బ్రహ్మస్వరూపిణి అని భావము.(ద్వ్యక్షరము.)

ఓం 3. భోగిన్యై నమః

తా. భోగమనఁగా సుఖానుభవము. బ్రహ్మానందస్వరూపమును దాని ననుభవించు మనోబుద్ధులస్వరూపమును గలది గాన ఈ నామము కలిగినది. (త్ర్యక్షరము.)

ఓం ౪. భువనేశ్వర్యై నమః

తా. చతుర్దశభువనములకును ప్రభ్వి గాన భువనేశ్వరి అని భావము. (పంచాక్షరము.)

ఓం ౫. అంబికాయై నమః

తా. అంబయే అంబికగా నున్నది. జగన్మాతయగు భారతిగాన పృథివీస్వరూపమును, రుద్రాణిస్వరూపమును, ఇచ్ఛాజ్ఞానక్రియల సమష్టి యగు త్రిపుటిమూలప్రకృతియందుఁ గ్రహింపఁబడుచున్నది. (త్ర్యక్షరము.)

ఓం ౬. అనాదినిధనాయై నమః

తా. జననమరణరహితమైన దైనందున, నిత్యస్వరూపము గలదని భావము. (పంచాక్షరము.)

ఓం ౭. హరిబ్రహ్మేంద్రసేవితాయై నమః

తా. విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మొదలగు దేవతలచేత సేవింపఁ బడుచున్నదని ఇందువలన బ్రహ్మాదులసేవించుట భిక్షుఁడు భిక్షవని యాచించునటుల యగును గాన సకలజనులకు లోకమాతయే ఆశ్రయింపఁ దగిన దనియు, సకలఫలముల నొసంగగల దనియు దెలియుచున్నది. (అష్టాక్షరము.)

ఓం ౮. నారాయణ్యై నమః

తా. నరశబ్దము జీవపరము. సకలజీవులకును స్థానము కనుక పరమ శివుఁడు నారాయణుఁడు అతని భార్య నారాయణి అని భావము. (చతురక్షరము.)

౨౯౯. నాదరూపాయై నమః

తా. పరాది నాలుగవస్థలు శబ్దబ్రహ్మమునకు కలవు. అందు ముఖ్యము నాదము గాన "నాదరూప" అని ప్రపంచము నామరూపాత్మకము. రూపము తత్త్వమయము. ప్రకాశాంశము శివస్వరూపము. నామము విమర్శాంశము. శక్తిస్వరూపము గాన నాదరూప అని నామసిద్ధి కలిగినది. (చతురక్షరము.)

300 నామరూపవివర్జితాయై నమః

తా. అస్తిభాతి మొదలగు అయిదు అంశలు కలది. ప్రపంచమును సాధకజనులును అందు నామరూపములు ప్రకృతిస్వరూపములు అస్తిభాతి ప్రియములు సచ్చిదానందలక్షణములుగాన నామరూపములు లేని బ్రహ్మస్వరూపిణి అని భావము. జగత్తునందు సకలజీవులందును సకలపదార్థములందును సత్తారూపముగా శ్రీదేవి యున్నదని భావము. (అష్టాక్షరము.)

ఇతి శ్రీమత్పదవాక్యప్రమాణ పారావారపారీణ ధురీణ సర్వతన్త్రస్వతన్త్ర త్రైలింగదేశస్థసమయాచారజీర్ణోద్ధారక ప్రకాశానన్దనాథగురు చరణారవిన్ద సేవాపరాయణ సత్యానన్దనాథకరకమలసంజాతాన్తేవాసులును, శ్రీమత్కౌశికసగోత్రోద్భవ భాగీరథీరాయశాస్త్రులవారిద్వితీయపుత్రులును జ్ఞానానన్దనాథదీక్షానామవిరాజితులును, అగు బ్రహ్మశ్రీ సింహాంభట్ల రామమూర్తిశాస్త్రులవారిచేత వ్రాయఁబడిన బ్రహ్మాణ్డపురాణాన్తర్గతహయగ్రీవాగస్త్యసంవాదరూప శ్రీలలితాదివ్యనామ సహస్రస్తోత్రమందు తృతీయశతకమునకు పరిమళమను సంజ్ఞగల ప్రతినామతాత్పర్యము సమాప్తము.

---

శ్రీరస్తు

# శ్రీలలితాసహస్రనామావళి

## చతుర్థశతకము.

---

### ౩౦౧. హ్రీంకార్యై నమః

తా. ఈబీజము శక్తిప్రణవపంచకమందు ద్వితీయము. మాయాబీజమనియు, అవ్యక్తమనియు, శబలబ్రహ్మవాచకమనియు, భువనేశ్వరీమన్త్రస్వరూపమనియు, అష్టపాశాత్మకమైన లజ్జాస్వరూపమనియు భావము. (త్ర్యక్షరము.)

### ౩౦౨. హ్రీమత్యై నమః

తా. లజ్జావంతురాలనియు, తత్స్వరూపురాలనియు భావము. (త్ర్యక్షరము.)

### ౩౦౩. హృద్యాయై నమః

తా. హృదయమందు ధ్యానింపఁదగినదనియు, మహాత్ములగు మునుల హృదయమందునికిగలదనియు, మనోహరమైన ఆకారము గలదనియు భావము. (ద్వ్యక్షరము.)

### ౩౦౪. హేయోపాదేయవర్జితాయై నమః

తా. ఇష్టానిష్టములు ప్రవృత్తినివృత్తులు లేనిదని భావము. సాక్షిస్వరూపురాలని రహస్యార్థము. (అష్టాక్షరము.)

### ౩౦౫. రాజరాజార్చితాయై నమః

తా. కుబేరునిచేత ఉపాసింపఁబడినదని భావము. (షడక్షరము.)

౩౦౬. రాజ్ఞ్యై నమః

తా. కామేశ్వరునితో పట్టాభిషిక్తురాలయిన పట్టపుదేవి అని భావము. (ద్వ్యక్షరము.)

౩౦౭. రమ్యాయై నమః

తా. మనోహరమైన ఆకారము గలదని భావము. (ద్వ్యక్షరము.)

౩౦౮. రాజీవలోచనాయై నమః

తా. కమలదళములవంటి నేత్రములు గలదని, నేత్రములందు విశేషధావళ్యము, రక్తధాతు మిశ్రమము, సాముద్రికశాస్త్ర శుభలక్షణములు అన్నియు పద్మదళమందున్నందున దేవియొక్క నేత్రములు అట్టి ఆకారము గలదని భావము. (షడక్షరము.)

౩౦౯. రంజన్యై నమః

తా. భక్తుల విచారమును పోఁగొట్టి ఉత్సాహముకలవారినిగాఁ జేయునదియని భావము. (త్ర్యక్షరము.)

౩౧౦. రమణ్యై నమః

తా. భక్తులతో బాలురతోవలె క్రీడించునది యని భావము. (త్ర్యక్షరము.)

౩౧౧. రస్యాయై నమః

తా. ప్రతిపదార్థమందును, ఇంద్రియగ్రాహ్యమైన సారము రస మనఁబడును. అట్టి రసస్వరూపమైనదని ప్రతిపదార్థమందుఁ గల సారము భగవతీస్వరూపమని, రసోఽస్యా అస్తీతి రస్యా, రసగ్రహణరూపముగా నున్నదని. శ్రు. "ప్రజ్ఞానం బ్రహ్మేతి" అను శ్రుతివలన సకలభూతము లందును, ప్రజ్ఞానరూపముగా శ్రీదేవి ఉన్నదని రసగ్రహణశక్తిస్వరూప మని భావము. (ద్వ్యక్షరము.)

### ౩౧౨. రణత్కింకిణిమేఖలాయై నమః

తా. ధ్వనితోకూడిన చిరుగంటలుగల మొలనూలు గలది. (అష్టాక్షరము.)

### ౩౧౩. రమాయై నమః

తా. లక్ష్మీశబ్దము సరస్వతీపార్వతులయందును వర్తించుచున్నది గాన 'రమా' యని భావము. కామకలాస్వరూప యనియు రమాస్యార్థము. (ద్వ్యక్షరము.)

### ౩౧౪. రాకేందువదనాయై నమః

తా. షోడశకలాయుక్తమగు పూర్ణచంద్రునివంటి ముఖము కలదని భావము. (షడక్షరము.)

### ౩౧౫. రతిరూపాయై నమః

తా. రతి యనుపదము మన్మథునిభార్యయందు రూఢి. రతీదేవి స్వరూపము గలదనియు, కామశబ్దము కామేశ్వరుని పరమైనదిగాన రతి శబ్దము కామేశ్వరీపర మగుచున్నది. రమా అను నామమునుండి మూఁడు నామములు అన్వయక్రమముగాఁ గూర్చినపుడు కామకలామంత్రస్వరూప మగుచున్నది. ఈ మంత్రమే శ్రీవిద్యకు మూలమంత్రముగా నున్నది అని భావము. రమా శ్రీకారము, రాకేందువదనా, పూర్ణబిందువు ముఖమందు గలదైన రతిరూపా కామకలాబీజ మగుచున్నదని మంత్రోద్ధారము. (చతురక్షరము.)

### ౩౧౬. రతిప్రియాయై నమః

తా. కామపత్ని అయిన రతీదేవియందు ప్రేమగలది శ్రద్ధా రూపమైనదనియు భావము. (చతురక్షరము.)

### ౩౧౭. రక్షాకర్యై నమః

తా. భక్తులను సంరక్షించునదియని భావము. (చతురక్షరము.)

## ౩౧౮. రాక్షసఘ్న్యై నమః

తా. దేవతాద్వేషులయిన రాక్షసులను సంహరించు స్వభావము గలదని భావము. (చతురక్షరము.)

## ౩౧౯. రామాయై నమః

తా. సకల పురుషులును శంకరస్వరూపులు. స్త్రీలందఱు పర దేవతాస్వరూపులు అని భావము. (ద్వ్యక్షరము.)

## ౩౨౦. రమణలంపటాయై నమః

తా. కామేశ్వరునితో సర్వదా సామరస్యమును పొంది యున్నదని భావము. (షడక్షరము.)

## ౩౨౧. కామ్యాయై నమః

తా. జ్ఞానముచేత పొందఁదగినదైనందున ముముక్షువులచేత కోరఁదగినదిగాన కామ్యా అని నామసిద్ధి కలిగినది. జ్ఞానస్వరూపిణి అని భావము. (ద్వ్యక్షరము.)

## ౩౨౨. కామకలారూపాయై నమః

తా. ౧. కామకలాస్వరూపము ఆగమమందు మూఁడువిధములుగాఁ జెప్పఁబడినది. వీనికి వినియోగభేదము ప్రథమము కామకళావిలాసమందు చెప్పినరీతి:— 'బిందుత్రయం హార్ధకళా' అనుచోట అగ్రబిందువు కామేశ్వర స్వరూపమనియు, బిందుద్వయము కలాస్వరూపమనియు, స్ఫుటశివ శక్తి సమాగమ బీజాంకురరూపిణీ పరాశక్తిః. "ప్రారభ్య" కామః కమనీయతయా కలాచ దహనేందువిగ్రహౌ భాతీతి. తా. ప్రకారాంతరమున సర్వవర్ణాగ్రస్థమైన అకారమును విసర్గాంశ యను సర్వవర్ణాన్త్యమగు హకారము కలసి అహమను అక్షమంత్రము ప్రథమ కామకలాస్వరూపము శక్తిబోధయందు వీని వినియోగము.

౨. ఇఁక రెండవది. శ్రు. "యదీగ్ం శ్రుణోత్యలకగ్ం శ్రుణోతి నహి ప్రవేసుకృతస్య పంథాం." తా. కామరాజ బీజమందుఁగల కకార లకారరహితమైన కేవల బిందుయుక్తతురీయస్వరమును ఈం-అ వేదానిని ఎవరు వినుచున్నారో ఉచ్చరించుచున్నారో వారు సుకృతవంతులు పొందెడి స్వర్గాదులను పొందరని మఱి ఏదనఁగా వారికి కేవల సాయుజ్య ప్రాప్తియే అని శ్రుతి భావము. ఈబీజము చక్రమందు బీజన్యాసములో బిందువందు వినియోగము భావింపఁదగినదని భావము.

౩. మూఁడవది. ఉపాసింపఁదగిన షోడశీకలాస్వరూపము. ఏబీజము ప్రధానమైనందున శ్రీవిద్య అను ప్రసిద్ధి కలిగినదో అది ప్రకాశవిమర్శ లగు శివశక్తి సామరస్య స్వరూపము. ఆదిలక్ష్మీ నిత్యకలా అని వ్యవహారము కలది. ఐహికాముష్మిక పూర్ణసుఖదాయిని. ఉపాసనలో దీని వినియోగము. ఏకాక్షరీమంత్రము. ఆగమరహస్యే:—"అగ్రబిందు పరికల్పితాననా మన్యబిన్దు రచితస్తనద్వయాం, నాదబిందురశనాగుణాస్పదాం నౌమితే పరశివాం పరాంకళామ్. ఈ ఁ రార్ధ్వగతోబిందు ర్ముఖం భాను రధోముఖా, స్తనా దధాన శీతాంశూ యోనిర్హార్ధ్వకలాభవేత్." ఈ కామకలాంగనా స్వరూపము సృష్టికిపూర్వమందున్న అఖండాకార నిర్వికల్పబ్రహ్మ స్వరూపముగా భావించి ఉపాసింపఁదగినదని భావము. (షడక్షరము.)

౩౨౩. కదమ్బకుసుమప్రియాయై నమః

తా. కదంబపుష్పములందు ప్రీతిగలదని భావము. (అష్టాక్షరము.)

౩౨౪. కల్యాణ్యై నమః

తా. మంగళప్రదమైనది గనుక కళ్యాణి అని నామము కలిగినది. (త్ర్యక్షరము.) '

౩౨౫. జగతీకందాయై నమః

తా. శ్రీదేవి సకలజగదుత్పత్తికి కారణమైనది గాన మూల ప్రకృతి అవ్యక్తరూపమైనదని భావము. (పంచాక్షరము.)

౩౨౬. కరుణారససాగరాయై నమః

తా. లలితాదేవి భక్తులయందుఁ గల కరుణారసముచేత నిండియున్న సముద్రమువంటిదనియు, అపరిమిత దయావంతురాలనియు భావము. తమ సర్వస్వమును భక్తులకు నిచ్చునదియు, జీవన్ముక్తిని కలుగఁజేయునది యనియు భావము. (అష్టాక్షరము.)

౩౨౭. కళావత్యై నమః

తా. పరాశక్తి అఱువదినాలుగు విద్యలు స్వరూపముగా కల దనియు, మాతృకయందున్న యేఁబదివర్ణములును దేవతాస్వరూపము లనియు, పూర్ణగాయత్రీ శ్రీవిద్యా పఞ్చదశీవిద్యా షోడశాక్షరీవిద్యా స్వరూపమనియు, వృద్ధిక్షయరహితమైన జీవకలయగు ఏకాక్షరీవిద్యయగు కామకలాస్వరూపిణియనియు షోడశీకలను శిరోభూషణముగా ధరించిన దనియు భావము. (చతురక్షరము.)

౩౨౮. కళాలాపాయై నమః

తా. అఱువదినాలుగువిద్యలు శ్రీదేవిమాటలుగా నున్నదనియు, అతిమృదువైన సంభాషణ కలదనియు, సులభముగా భక్తులను బ్రహ్మస్థానమును గాని, బ్రహ్మజ్ఞానమును గాని పొందించునదనియు, ప్రపంచమందున్న జలము శ్రీదేవి లాలాజలమనియు భావము. (చతురక్షరము.)

౩౨౯. కాన్తాయై నమః

తా. మనోహరమైన స్వరూపము గలదనిగాని, బ్రహ్మైవస్థయే సిద్ధాంతముగాఁ గలదనిగాని భావము. (ద్వ్యక్షరము.)

౩౩౦. కాదమ్బరీప్రియాయై నమః

తా. కాదంబరీశబ్దమువలన పుష్పాసవము మధుసంజ్ఞ కలదనియు దేవయోగ్యము. సంవిదాసవములలో, సంవిద్రూపాసవమే పరదేవతాప్రీతికరమని భావము. పూజాఖండే:- ''సంవిన్మయే పరదేవి పరామృత చరుప్రియే''

వశిష్ఠసంహితా:—"సంవిదాసవయోర్మధ్యే సంవిదేవ గరీయసీ" అని. (షడక్షరము.)

## ౩౩౧. వరదాయై నమః

తా. శ్రీదేవ్యుపాసకులైన బ్రహ్మవిష్ణ్వాదిదేవతలకు వరములనిచ్చునదిదము, శ్రేష్ఠమైన, ఉత్తమమైన బ్రహ్మపదమును స్వరూపజ్ఞానమును నిచ్చునదని భావము. (త్ర్యక్షరము.)

## ౩౩౨. వామనయనాయై నమః

తా. సుందరమైన కరుణారసముతో నున్న నేత్రములు కలదని భావము. (పంచాక్షరము.)

## ౩౩౩. వారుణీమదవిహ్వలాయై నమః

తా. ఖర్జూరమువలన పుట్టినరసము వారుణి అనిపించుకొనును. వారుణి అను వాయుదేవతగల నాడీవివేకము దానివలనఁగాని, దానిని జయించుట వలనఁగాని సహస్రారకమలమునుండి అమృతస్రావమగునదియు, సుషుమ్నా పరాశక్తి సహస్రారగతమైనపుడు సంవిదమృతానుభవరూపమదోద్రేకమువలన, బాహ్యపదార్థజ్ఞానరహితమైనదని భావము. (అష్టాక్షరము.)

## ౩౩౪. విశ్వాధికాయై నమః

తా. శివాది క్షిత్యంతమైన సకలప్రపంచముకంటె శ్రేష్ఠమనియు, అధికమైయుండునదనియు భావము. శ్రు. "విశ్వాధికో రుద్రో మహర్షిరితి." బ్రహ్మస్వరూపిణి అని. (చతురక్షరము.)

## ౩౩౫. వేదవేద్యాయై నమః

తా. ఋగాది నాలుగువేదములచేతను తెలుసుకొనఁదగినదని. 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనునది ప్రారంభించి నాలుగువేదములనుండి, నాలుగు మహావాక్యము లుత్పన్నమైనవి గాన నాలుగు మహావాక్యములచేతను తెలియఁబడుచున్నదనియు, చింతామణి గృహమునకు నాలుగువేదములును

నాలుగుద్వారములుగానున్నందున, ద్వారప్రవేశము, లేక దేవతాదర్శనము కాదుగాన మహావాక్యవిచారణ ఆవశ్యకమనియు, శుద్ధవిద్యాదిమంత్రములు చక్రమందుఁ జతుర్ద్వారభూతములుగా నున్నవిగాన "వేదవేద్యా" అను నామము సిద్ధించినదని భావము. (చతురక్షరము.)

౩౩౬. వింధ్యాచలనివాసిన్యై నమః

తా. వింధ్యమను పర్వతశిఖరమందు నివాసము కలదని బాహ్యార్థము. వృత్తిశూన్యమైన మనస్సుగలదనఁగా మనోలయాంతమందు నిలచిన ప్రజ్ఞానమందు నివాసము కలదని రహస్యము. వృత్తిశూన్యమైన ప్రజ్ఞానమే ఆనందస్వరూపము. శ్రు. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాదితి." ఇదియే తురీయావస్థ-దీని దార్ఢ్యము తురీయాతీతము. (అష్టాక్షరము.)

౩౩౭. విధాత్ర్యై నమః

తా. సకలలోకములను పుట్టించునది యనిగాని, లేక పోషించునది యనిగాని, లేక బ్రహ్మభార్యయగు సరస్వతీస్వరూపమని భావము. (త్ర్యక్షరము.)

౩౩౮. వేదజనన్యై నమః

తా. ఋగాదివేదములకు జనని మాతృస్వరూపురాలని, పరబ్రహ్మస్వరూపమైన మహాభూతముఅనఁగా విరాడ్రూపముయొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములు వేదస్వరూపములని శ్రుతులు చెప్పుచున్నవి అని బాహ్యార్థము. రహస్యార్థము:—శబ్దబ్రహ్మము పరాపశ్యంతీ మధ్యమా వైఖరులను నాలుగవస్థలను పొందినది. అందు వైఖరియనఁగా పంచాశద్వర్ణమయ మాతృకాస్వరూపము. ఆదియందున్నపరాశక్తియే క్రమముగా పశ్యన్త్యాద్యవస్థలనుపొంది సకలవేదములు సకలశాస్త్రములు సకలదేశభాషలును ఉత్పన్నమైనవి గనుక అట్టి వైఖరీరూపపరాశక్తియే 'వేదజననీ' అని చెప్పఁబడును. (పంచాక్షరము.)

౩౩౯. విష్ణుమాయాయై నమః

తా. విష్ణుసంబంధమైనదనిగాని అపరిచ్ఛిన్నుఁడైన విష్ణువునుగూడ

పరిచ్ఛేదయుక్తునిగాఁ జేయునట్టి త్రిగుణాత్మకమైన మూలప్రకృతి. ఇదియే విష్ణుమాయ యని భావము. ఇదియే అవ్యక్తస్వరూపము. కాన ఇదియే ప్రథమ సృష్టిగా ఉన్నదని భావము. (చతురక్షరము.)

## ౩౪౦. విలాసిన్యై నమః

తా. విక్షేపశక్తిస్వరూపిణి గాన విలాసిని అనియు, బ్రహ్మశక్తి మోక్షమార్గమైన బ్రహ్మరంధ్రము నాచ్ఛాదించి ఉన్నదిగాన మోక్ష మార్గము నిచ్చునదియు ప్రతిబంధకముగను నున్నదిగాన 'విలాసిని' అని పించుకొనెను. (చతురక్షరము.)

## ౩౪౧. క్షేత్రస్వరూపాయై నమః

తా. క్షేత్ర మనఁగా కామేశ్వరీకామేశ్వరుల స్థూలాకారములు శివాది క్షిత్యంతమైన స్థూలవిరాడ్రూపముగాని, చతుర్వింశతత్త్వమయ సకలజీవ స్థూలశరీరములుగాని, శ్రీదేవియొక్క ఆకారములుగా నున్నవి. స్థూలరూపము నామరూపాత్మకమంతయు ప్రకృతిమయము. ప్రకృతి భగవత్యంశభూతము గాన 'క్షేత్రస్వరూప' యని భావము. (పంచాక్షరము.)

## ౩౪౨. క్షేత్రేశ్యై నమః

తా. క్షేత్రము, క్షేత్రాధిపతియు తానేయని భావము. (త్ర్యక్షరము.)

## ౩౪౩. క్షేత్రక్షేత్రజ్ఞపాలిన్యై నమః

తా. క్షేత్రస్వరూపమైన శరీరమును, సుఖదుఃఖములను తెలిసికొను వాఁడు జీవుఁడు గాన క్షేత్రజ్ఞుని యీరెంటిని సంరక్షించునది గనుక క్షేత్రక్షేత్రజ్ఞపాలిని' యను నామము సిద్ధించినది. (అష్టాక్షరము.)

## ౩౪౪. క్షయవృద్ధివినిర్ముక్తాయై నమః

తా. వృద్ధిక్షయములు శరీరబ్రహ్మాండధర్మములుగానవాని సంబంధము లేనిది పరమాత్మస్వరూపిణి అని భావము. శ్రు. "అసఙ్గోఽయం పురుషః."

శరీరత్రయమందును మేళనమై ఉండువాఁడు గనుక పురుషుఁడు కలిసి ఉన్నను వీనితో ఆత్మకు సంబంధము లేదని శ్రుతిభావము. (అష్టాక్షరము.)

## ౩౪౫. క్షేత్రపాలసమర్చితాయై నమః

తా. క్షేత్రపాలకుఁడనఁగా రూఢిగా జీవుఁడు. అతనిచే పూజింపఁబడునది యని భావము. (అష్టాక్షరము.)

## ౩౪౬. విజయాయై నమః

తా. సర్వత్ర జయముకలదనియు, విజయాముహూర్తకాలస్వరూపిణి అనియు భావము. (త్ర్యక్షరము.)

## ౩౪౭. విమలాయై నమః

తా. అవిద్యాసంబంధము లేనిదని భావము. (త్ర్యక్షరము.)

## ౩౪౮. వంద్యాయై నమః

తా. నమస్కరింపఁదగినదనియు నింతకంటె నధికులు లేనిదనియు భావము. (ద్వ్యక్షరము.)

## ౩౪౯. వన్దారుజనవత్సలాయై నమః

తా. భక్తజనులను తనపిల్లలవలెను లాలనచేయునది యనియు అధికప్రేమకలది యని భావము. (అష్టాక్షరము.)

## ౩౫౦. వాగ్వాదిన్యై నమః

తా. వాగ్రూపము కలదనియు, వాగ్వాదస్వరూపము కలదనియు భావము. (చతురక్షరము.)

## ౩౫౧. వామకేశ్యై నమః

తా. వామకేశ్వరుఁడు సదాశివుఁడు, తద్భార్య 'వామకేశీ' నామము కలదని, సుందరమైన కేశకలాపము గలదని భావము. (చతురక్షరము.)

## ౩౫౨. వహ్నిమండలవాసిన్యై నమః

తా. ప్రకాశాంశ బిందువనియు, విమర్శాంశ త్రికోణమనియు, నియ

మమువలన, అగ్నిమండలమనఁగా త్రికోణచక్రము, అందు నివాసము గల దనియు, శ్రీచక్రమందు నవయోనుల సమ్మేళనమువలన, అనేకయోను లుత్పన్నమై ... మూహము మండలము. అందు ఆయాదేవతామయ ముగా ... లోకమందుఁగల అగ్నిమండలమందున్న దాహకశక్తిస్వరూ... నియు భావము. (అష్టాక్షరము.)

... క్తిమత్కల్పలతికాయై నమః

తా. భక్తజనులకుఁ గల్పలతవలెను సకలవాంఛలను ఇచ్చునదియుని భావము. (అష్టాక్షరము.)

3౫౪. పశుపాశవిమోచన్యై నమః

తా. అవిద్యాగ్రస్తులు ద్వైతరూపజ్ఞానము కలవారు పశువులతో సమానమని భావము. వారు అష్టవిధపాశములచేతను, పంచవిధక్లేశముల చేతను కట్టఁబడియుందురనియు, అట్టివారు శివభక్తి దేవీభక్తికలవారై నపుడు సకలపాశములవలనను శ్రీదేవి విడిపించి సకలసుఖముల నిచ్చి జీవన్ముక్తులనుగాఁ జేయునని శ్రుతులు, స్మృతులు చెప్పుచున్నవి:—

శ్రు. "భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరేతి." జ్ఞాత్వా దేవం క్లేశహానిః.

బృహదారణ్యకే:—ఆత్మానం చేద్విజానీయా దయ మస్మీతి పూరుషః, కిమిచ్ఛన్కస్య కామాయ శరీర మనుసంజ్వరేదితి. శివభక్త్యైవ సర్వపాశహానిరితి.

దేవీభాగవతే:—తమోమోహో మహామోహస్తామిస్ర మథ పణ్డితాః, అన్ధతామిస్రమిత్యాహుః క్లేశాద్వై పంచధా స్థితాన్.

లైంగే. బ్రహ్మాద్యాస్థావరాన్తాశ్చ దేవదేవస్య శూలినః, పశవః పరికీర్త్యంతే సుమనాః పశువృత్తయః. ఇతి. చతుర్వింశతితత్త్వాని మాయాకర్మ గణానిచ, విషయా అపి కీర్త్యంతే పాశా జీవసబంధనాత్. తైర్బద్ధా శివశక్త్యైవ ముచ్యన్తే సర్వదేవ...న ఇతి తత్రైవ. అవిద్యామస్మితాం రాగం ద్వేషఞ్చ

ద్విపదాంబర, పదస్త్వభినివేశశ్చ క్లేశాః పంచత్వమాగతాః, అవిద్యా తమ ఇత్యాహు రస్మితాం మోహ ఇత్యపి, రాగం చైవమహామోహం ద్వేషం తామిస్ర మిత్యపి, అంధతామిస్రకం విద్వ్యాఽభినివేశం ప్రచక్షత ఇతి. అర్థః. ఆత్మానాత్మవివేకాభావో అవిద్యా, అనాత్మని దేహాదావాత్మత్వ విపర్యయః అస్మితా, తేనచ దేహోపభోగకరణే ప్రచ్ఛన్నాదావభిలాషో రాగః, తత్ప్రాప్తిప్రతిబంధిని ద్వేషః క్రోధః, తదిదమహితమితి జ్ఞాత్వా ఉప్యజ్ఞానాత్తదపరిత్యాగోఽభినివేశః. ఇత్యాదయో[illegible]శ భేదాః బహవో నిర్ణీతాః. సర్వే శివభక్త్యా విలీయంతే ఇతి. ఉపాయాంతరం నాస్తీత్యలం. శ్రు. "జ్ఞాత్వా దేవం పాశహానిః; భిద్యతే హృదయగ్రంథిః." (అష్టాక్షరము.)

౩౫౫. సంహృతాశేషపాషండాయై నమః

తా. వేదబాహ్యార్థక్రియానిష్ఠముగలవారును, శ్రౌతస్మార్తక్రియా రహితులును పాషండులని, వారిని నిశ్శేషముగా నశింపఁజేయునది. (అష్టాక్షరము.)

౩౫౬. సదాచారప్రవర్తికాయై నమః

తా. వేదవిహితాచారము సదాచారమనియు, బ్రహ్మపరమైనది గాని, శిష్టపరంపరగా నున్నదిగాని, దానిని విస్తరింపఁజేయునదియని భావము. (అష్టాక్షరము.)

౩౫౭. తాపత్రయాగ్నిసంతప్త సమాహ్లాదనచంద్రికాయై నమః

తా. మానసికవిచారాదులు, శరీరమందుఁ గలిగినవ్యాధి మొదలగునవి, అశనిపాతాదులు. ఇవి, తాపత్రయము, ఈ తాపత్రయరూప సంసారాగ్నిచేత తపింపఁబడిన జనులకు, పూర్తిగా సుఖమును కలుగఁ జేయుటకు శ్రీదేవి చంద్రకాంతివంటిదని భావము. (షోడశాక్షరము.)

౩౫౮. తరుణ్యై నమః

తా. ఎల్లప్పు డేకరీతి అయిన యౌవనము గలది. సర్వదా పదు నాఱువర్షములు వయస్సుగలదని భావము. (త్ర్యక్షరము.)

3౫౯. తాపసారాధ్యాయై నమః

తా. తపశ్శాలురచేత పూజింపఁబడుచున్నదని తపశ్శాలురకే ప్రాప్తించునదియనియు, తపస్సునకు శ్రీదేవీస్మరణము కలుగుటయే ఫలముగానున్నదనియు, అట్టి స్వస్వరూపజ్ఞానము కలిగినపుడు జీవన్ముక్తి సిద్ధించుచున్నదనియు భాగ్యహీనులకు పొంద శక్యముకానిదనియు భావము. (పంచాక్షరము.)

3౬౦. తనుమధ్యాయై నమః

తా. సూక్ష్మమైన మధ్యప్రదేశము కలదనియు, సౌందర్యశాలిని అనియు భావము. పరాపశ్యంతుల మధ్యావస్థ. సూక్ష్మమధ్యము అని. అది సంగీతశాస్త్రమందు సప్తస్వరములుగాను, వేదములందు ఉదాత్తానుదాత్త స్వరితరూపముగాను ఉన్నదిగాన అట్టి సూక్ష్మమధ్యమస్వరూపము గలదని భావము. (చతురక్షరము.)

3౬౧. తమోఽపహాయై నమః

తా. భక్తజనుల యజ్ఞానమునుపోఁగొట్టి బ్రహ్మజ్ఞానమును కలుగఁజేయునదియని భావము. భేదజ్ఞానముగల దేవతాంతరోపాసనలు ఐహిక మాత్రఫలముల నిచ్చుననియు, అద్వైతభావనయుక్తకర్మాచరణము కేవలజ్ఞానమునే వృద్ధిచేయునని భావము. (చతురక్షరము.)

3౬౨. చిత్యై నమః

తా. చిత్కలయే ఆకారముగానున్నదని ప్రాణులందు జీవస్వరూపము, సాక్షిస్వరూపము, సచ్చిదానందమందు జ్ఞానస్వరూపము, సూర్యచంద్రాగ్నులందు ప్రకాశస్వరూపము, త్రిపుటియందు మధ్యపదస్వరూపము, జాగ్రత్సుషుప్తులమధ్యనున్న తురీయస్వరూపము చిత్ అను పేరు గలదిగాన శ్రీదేవి చిద్రూపిణి అని భావము. (ద్వ్యక్షరము.)

3౬౩. తత్పదలక్ష్యార్థాయై నమః

తా. 'తత్త్వమసి' అను మహావాక్యమందు, తత్-త్వం-అసి-అని

మూఁడుపదములు. త్వం అనఁగా వినువాని దేహేంద్రియజీవాదులుగాక ప్రత్యగాత్మ స్వరూపుఁడగు సాక్షియైన నీవని; తత్ అనఁగా జగత్సృష్ట్యాదికమునకు కారణమహాకారణములగు అవ్యక్తబిందువులు శబలబ్రహ్మస్వరూపములు. వాచ్యార్థము తత్పద త్వంపదముల కైక్యమును, అసిపదము చెప్పుచున్నందున అట్టి సామరస్యస్వరూపముగల శుద్ధబ్రహ్మము లక్ష్యార్థము గనుక తత్పదలక్ష్యార్థ స్వరూపము నిర్గుణ శుద్ధబ్రహ్మస్వరూపము. (షడక్షరము.)

## ౩౬౮. చిదేకరసరూపిణ్యై నమః

తా. చిదానందస్వరూపురాలనియు నిరాకారబ్రహ్మస్వరూపిణి అయినను ఆనందస్వరూపము గలదిగా నున్నదని భావము. (అష్టాక్షరము.)

## ౩౬౯. స్వాత్మానన్దలవీభూత బ్రహ్మాద్యానన్దసన్తత్యై నమః

తా. తైత్తిరీయోపనిషత్తు ఆనందవల్లిలో మానుషానందమునుండి బ్రహ్మానందమువఱకు వర్ణింపఁబడినవి. కోరవలసినవస్తువులు లేక సర్వసంపన్నుఁడైన మహారాజు మానుషానందము గలవాఁడు. దేవతలు ఇంద్రుఁడు బ్రహ్మ విష్ణువు రుద్రుఁడు ఈశ్వరుఁడు సదాశివుఁడు పరబ్రహ్మము ఒకరికంటె ఒకరు ఉత్తములు. మనుష్యానందముకంటె మానుషగంధర్వానందములు నూఱురెట్లధికము. ఆరీతిని నూఱేసిభాగములు అధికముగా వారివారి ఆనందములున్నవి. వీరికి సత్వగుణాధిక్యమును, అవిద్యాసంబంధన్యూనాధిక్యములచేత హెచ్చుతగ్గులుకలిగినవి. శ్రీదేవి యానందము బ్రహ్మానందసముద్రము. దానిలో సృష్టికర్తయగు బ్రహ్మేంద్రాదుల ఆనందములు బిందువులుగా నున్నవని భావము. (షోడశాక్షరము.)

## ౩౭౦. పరాయై నమః

తా. పిండాండబ్రహ్మాండములకును మాతృకా శ్రీచక్రములకును ప్రధానకారణము శుద్ధబ్రహ్మస్వరూపము. జనిష్యమాణప్రాణ్యదృష్టకాలము తటస్థించినపుడు సృష్ట్యాది నిర్వికల్ప సచ్చిదానందమయు తేజోమండలము మాత్రము ద్వైతవస్తురహితము గా నున్నది.

# ఆంధ్రతాత్పర్యసహితము

వెనుకటి సృష్ట్యంతమందు నామరూపాత్మకప్రపంచము వాసనామయముగా అవ్యక్తమందు క్రమముగా లీనమైనది. అవ్యక్తము బ్రహ్మమందు లీనమైనది. మరల సృష్ట్యావిర్భావకాలమందు నిర్గుణబ్రహ్మము బిందుభావమును పొందినది. నిస్తరఙ్గసముద్రమునం దలలవలె బిందువునందున్న మాయాశక్తి విజృంభణచేత ఆబిందువు వికసించినది. వెనుకటి బిందువు సర్వకారణముగాను బిందువికసనము అవ్యక్తమను త్రిభుజాచక్రముగాను ఏర్పడినవి. ఆదిబిందువు పురుషుఁడు, అవ్యక్తము మూలప్రకృతి, ఇదియు కారణముగానే యుండి ఈఉభయమేళనమువలన నామరూపాత్మకమైన కారణ బిందువువలన జగదుత్పత్తి అయినది. ఈద్వంద్వమువలననే మహదాదిచతుర్వింశతితత్త్వములు రూపాత్మకశాఖగాను శబ్దస్వరూపమైన నామాత్మకశాఖ పరాపశ్యన్తీమధ్యమవైఖరులనే నాలుగవస్థలుగల వాగ్దేవతయు ఉత్పన్నమైనవి.

జగత్తు సత్యాసత్యమేళనము నామరూపములు జడములు ప్రకృతిభాగములు అసత్యములు సచ్చిదానందములు బ్రహ్మభాగములు సత్యపదార్థము నామరూపములను జడస్వరూపోపాధియందు మేళనమైయున్నది. ఈ అయిదంశములును కలసి జగత్తు అని వాడుక గనుక సత్యాసత్యమేళనస్వరూపిణిపరావాక్కు అని భావము.

అట్టిజగత్తునందు నామాత్మకమైన శబ్దబ్రహ్మమునకు శబలబ్రహ్మము అని నామాంతరము. దీనిని మహాకారబిందువుగా గ్రహింపవలెను. ఈ బిందువికసనము భావిజగత్తునకు అంకురప్రాయము. ఇందువలన నాదముత్పన్నమై అవ్యక్తనామము గలదైనదిగాన మహాకారణ బిందువు పరాబిందువని భావము. గనుక శ్రీదేవికి పరాశక్తి అని నామము కలిగినది. ఈపరా - పశ్యన్తీ - మధ్యమా - వైఖరులే క్రమముగా బిందునాదికలాస్వరూపమయి షడధ్వలలో వర్ణ - పద - మన్త్రము ఈషడధ్వల సృష్టిక్రమమున కనేక ప్రమాణములు నిగమాగమములందుఁ గలవు. గ్రంథవిస్తరభీతిచే చూపింపలేదు. (ద్వ్యక్షరము.)

3౬౭. ప్రత్యక్చితీరూపాయై నమః

తా. శ్రీదేవి సాక్షిస్వరూపురాలనియు, మోక్షసాధనమైన అంతర దృష్టి జ్ఞానదృష్టిస్వరూపురాలనియు, శుద్ధబ్రహ్మముయొక్క అంశమైన శబలబ్రహ్మాకారచిద్బిందుస్వరూపురాలనియు భావము. ఈ రెండునామములును అగ్రబిందుపరముగానే యున్నవి. (షడక్షరము.)

3౬౮. పశ్యన్త్యై నమః

పశ్యంతీవాక్కు శ్రీచక్రమందు బిందువు నాక్రమించిన ప్రథమ త్రికోణచక్రము శరీరపక్షమం దవ్యక్తము. భ్రూమధ్యము నాదము వాయువశముగాన సహస్రారబిందువందు ఇచ్ఛాశక్తి ఉత్పత్తిగనుక బిందువే పరావాక్కు. మూలాధారమందు వాయూత్పత్తి గాన మూలాధార స్వాధిష్ఠానములు పశ్యన్తీవాక్కుగా నున్నవని భావము. పశ్యంతీ స్వరూపముగా నున్నదని భావము. (త్ర్యక్షరము.)

3౬౯. పరదేవతాయై నమః

తా. ఉత్కృష్టమైన దేవతాస్వరూపమనియు, అవ్యక్తమూలప్రకృతి గాన, పరదేవతాస్వరూపమనియు భావము. (పంచాక్షరము )

3౭౦. మధ్యమాయై నమః

తా. మధ్యమ రెండువిధములు కలది. పరాపశ్యంతుల మధ్యావస్థ. సూక్ష్మమధ్యమ సప్తస్వరమయము. పశ్యన్తీ వైఖరులమధ్యావస్థ. అ-క-చ-టాద్యష్టవర్గమయమని భావము. ఈ రెండువిధములగు మధ్యమాస్వరూపమని భావము. (త్ర్యక్షరము.)

3౭౧. వైఖరీరూపాయై నమః

తా. శ్రీదేవి విశేషకఠినత్వముకలది గాన వైఖరి అని. పంచాశద్వర్ణవిభాగము వైఖరీరూపముగాన అట్టియక్షరస్వరూపము కలదని భావము. (పంచాక్షరము.)

322. భక్తమానసహంసికాయై నమః

తా. భక్తులగు యోగులయొక్క మనస్సనే మానససరస్సునందు హంసాంగనవలె నివాసము కలదని భావము. హంసికా=ఆడుహంస. (అష్టాక్షరము.)

323. కామేశ్వరప్రాణనాడ్యై నమః

తా. జగద్రూపకామేశ్వరునకు ప్రాణనాడీస్వరూపముగా నున్నదని భావము. (అష్టాక్షరము.)

324. కృతజ్ఞాయై నమః

తా. ప్రాణుల సుకృతదుష్కృతములను సూర్యచంద్రాదిరూపములతో తెలిసికొనునది. (త్ర్యక్షరము.)

325. కామపూజితాయై నమః

తా. మన్మథునిచేత ఉపాసింపఁబడుచున్నదనియు, కామగిరిపీఠస్వరూపమైన మూలాధారస్వాధిష్ఠానములందు పూజింపఁబడుచున్నదని భావము. (పంచాక్షరము.)

326. శృంగారరససంపూర్ణాయై నమః

తా. శృంగారరసముచేత పూర్ణమైనదనియు, శృంగారరసస్వరూపురాలని భావము. మణిపూరకమలమును పూర్ణగిరిపీఠమందు దున్నది. (అష్టాక్షరము.)

327 జయాయై నమః

తా. జయస్వరూపురాలు గాన జయా అని నామము కలిగినదని భావము. (ద్వ్యక్షరము.)

328. జాలంధరస్థితాయై నమః

తా. శారీరపక్షమందు అనాహతకమలమే జాలంధరపీఠము. అందు నివసించునది యని భావము. (పంచాక్షరము.)

## ౩౨౯. ఓడ్యాణపీఠనిలయాయై నమః

తా. భ్రూమధ్యమందున్న అజ్ఞాకమలమే ఓడ్యాణపీఠము. అచట నివాసముకలదని భావము. (అష్టాక్షరము.)

## ౩౩౦. బిందుమండలవాసిన్యై నమః

తా. శ్రీచక్రమందు సర్వానందమయము బిందుస్థానముగా నున్నది గాన పిండాండమందు బ్రహ్మరంధ్రాధోభాగము చంద్రమండలము. అచట నివసించునది యని శ్రుతిస్మృతులచే ప్రసిద్ధమైనది. (అష్టాక్షరము.)

## ౩౩౧. రహోయాగక్రమారాధ్యాయై నమః

తా. రహస్యయాగమందుఁ గలక్రమమును గురుముఖమున తెలుసుకొని, ఆక్రమమున ఆరాధింపఁదగినదని అట్టియాగమందు ప్రీతిగలది. ఎట్టిదనిన సాధకుని శరీరత్రయమునకును, శ్రీచక్రమునకును, లయభావన సహస్రారాంతర్గత చంద్రమండలమందు శ్రీచక్రమందున్న సర్వానందమయబిందువును లయభావన, అచట ప్రత్యగాత్మసాక్షులకు పరమాత్మతో నైక్యభావనయును జీవబ్రహ్మలకైక్యము ప్రకాశవిమర్శలగు శివశక్తులకు నైక్యము సకలప్రపంచమును అఖండాకారచిన్మయముగా భావించుటయును, ఇది అంతర్యాగమని శ్రుతిస్మృతులును, మహర్షులందఱును సమ్మతించిరి. అట్టి యీరహోయాగమందు శ్రీదేవి ప్రీతిగలది. (అష్టాక్షరము.)

## ౩౩౨. రహస్తర్పణతర్పితాయై నమః

తా. ఇచట తర్పణశబ్దము పూజాపరముగా నున్నదని గ్రహింపవలెను. సగుణారాధన బాహ్యమనియు, మానసికమనియు రెండు విధములు. బాహ్యము శ్రీచక్రమందు వర్ణాశ్రమోచితముగా పూజించుట. హృదయకమలమందు, శ్రీచక్రమును భావించి మానసికోపచారపూజ చేయుట అంతరంగము. ఈరెండును సగుణములుగాను. త్రివర్గఫలప్రదములుగాను ఉన్నవి. మోక్షకాములు పిండాండబ్రహ్మాండ శ్రీచక్రముల నైక్యమును సంపాదించి సహస్రారమందు లయభావనచేయుట అంతర్యాగ

మనియూ, ఇదియే రహస్యపూజ అనియు, ఇట్టి పూజయందు ప్రీతిగలదని భావము. (అష్టాక్షరము.)

౩౮౩. సద్యః ప్రసాదిన్యై నమః

తా. చెప్పఁబడిన రహోయాగము, రహస్యపూజనము జరిగినపుడు, ఆకాలమందే స్వాత్మదేవతాసంతుష్టి యగునని భావము. సాక్షి తన నిజరూపమని తెలియుటయే జీవన్ముక్తి అని భావము. (షడక్షరము.)

౩౮౪. విశ్వసాక్షిణ్యై నమః

తా. పూర్వోక్తప్రకారము స్వాత్మదేవతాతృప్తి కలిగినపుడు సాధకుని శరీరత్రయమునకుగాని, బాహ్యప్రపంచమునకుగాని, తాను సాక్షిగా నున్నాఁడననియు, వానితో తనకు సంబంధము లేదనియు, అట్టి జ్ఞానము కలుగును. అజ్ఞానమే శ్రీదేవీస్వరూపమునియు, అదియే ప్రపంచమునకు సాక్షిగా నున్నదనియు భావము. తానే అట్టిసాధకుఁడు. ప్రపంచసాక్షి అనియు భావము. (పంచాక్షరము.)

౩౮౫. సాక్షివర్జితాయై నమః

తా. పరదేవత సర్వసాక్షిగా నున్నందున, సాక్షికిసాక్షి అప్రసిద్ధముగాన సాక్షివర్జితా అని నామసిద్ధి కలిగినదని భావము. సాక్షిమాత్రభావనవలకు తురీయావస్థగా నున్నదనియు, సాక్షిజ్ఞానముకూడ లయమై కేవలచిదానందస్వరూపము తురీయాతీతము సాక్షివర్జిత అని భావము. (పంచాక్షరము.)

౩౮౬. షడంగదేవతాయుక్తాయై నమః

తా. హృదయము, శిరస్సు, శిఖా, నేత్ర, కవచ అస్త్రములు, షడంగములు వీనికి అధిదేవతలు, అంగదేవతలని వారితోకూడి ఉన్నదని వీరును ఆవరణదేవతలతోకూడ పూజింపఁదగినవారు. కనుక సర్వదా వారితోకూడి ఉండునని భావము. (అష్టాక్షరము.)

3౮౭. షాడ్గుణ్యపరిపూరితాయై నమః

తా. ఐశ్వర్యధర్మాదిపురాణోక్తగుణములును, సంధివిగ్రహాదిధర్మాదులను వానితో నిండియున్నదని భావము. (అష్టాక్షరము.)

3౮౮. నిత్యక్లిన్నాయై నమః

తా. అత్యంత దయార్ద్రహృదయముగలదని భావము. (చతురక్షరము.)

3౮౯. నిరుపమాయై నమః

తా. శ్రీదేవితో సమానులుగాని, అధికులుగాని లేరని భావము. (చతురక్షరము.)

3౯౦. నిర్వాణసుఖదాయిన్యై నమః

తా. పరిమితిలేని మోక్షసుఖము నిచ్చునదియని తాత్పర్యము. (అష్టాక్షరము.)

3౯౧. నిత్యాషోడశికారూపాయై నమః

తా. కామేశ్వర్యాదినిత్యాంతమైన, పంచదశనిత్యలును మహానిత్యాకలారూప లలితాంబకు అంగములు, పదునారవకలయే అంగిగాన అంగాంగీ భావము కలదని భావము. షోడశనిత్యలస్వరూపముగా ఉన్నదని భావము. (అష్టాక్షరము.)

3౯౨. శ్రీకంఠార్ధశరీరిణ్యై నమః

తా. ఈశ్వరుని అర్ధశరీరస్వరూపము గలదనితాత్పర్యము. బ్రహ్మాండపిండాండ శ్రీవిద్యాశ్రీచక్రములు ప్రకాశవిమర్శలగు శివశక్తిమేళనము కలవి గాన ఈశ్వరునితో అర్ధశరీరము కలదని భావము. (అష్టాక్షరము.)

3౯3. ప్రభావత్యై నమః

తా. శ్రీదేవికిరణసముదాయమే అణిమాద్యావరణదేవతలతో కూడియున్నదని భావము. (చతురక్షరము.)

3౯౪. ప్రభారూపాయై నమః

తా. అణిమాద్యావరణ దేవతాస్వరూపురాలని భావము. (చతురక్షరము.)

౩౯౭. ప్రసిద్ధాయై నమః

తా. సకలజనులును అహమహమని దేనిని వాడుచున్నారో, ఆపదము పరదేవతాస్వరూపము గాన అందఱకును తెలిసినది గనుక ప్రసిద్ధా అని నామము కలిగినదని భావము. (త్ర్యక్షరము.)

౩౯౬. పరమేశ్వర్యై నమః

తా. శ్రేష్ఠమైన ప్రధానేశ్వరీ స్వరూపురాలు. (పంచాక్షరము.)

౩౯౭. మూలప్రకృత్యై నమః

తా. ప్రథమసృష్టిరూపమైన ఇచ్ఛాశక్తియే మూలప్రకృతిగా నున్నది. ముందు కలుగఁబోవు సకలమునకును మూలకారణము గనుక మూలప్రకృతి అనియు, దీనికి ప్రకృతి బ్రహ్మయే అనియు అట్టిబ్రహ్మకు ప్రకృతి లేదుగాన అట్టిమూలప్రకృతి స్వరూపురాలు. (పంచాక్షరము.)

౩౯౮. అవ్యక్తాయై నమః

తా. ఇరువదినాలుగవతత్త్వము, ప్రథమసృష్టి స్వరూపము. శబలబ్రహ్మాకారము అవ్యక్తమని, అట్టిస్వరూపము గలది. (త్ర్యక్షరము.)

౩౯౯. వ్యక్తావ్యక్తస్వరూపిణ్యై నమః

తా. అవ్యక్తము వ్యక్తమైన మహత్తత్త్వమును స్వరూపముగాఁగలదనియు, నామరూపములు జడస్వరూపమనియు దానియందు చైతన్య స్వరూపముగా నున్నదని భావము. (అష్టాక్షరము.)

౪౦౦. వ్యాపిన్యై నమః

తా. అహంకారాది పృథివీపర్యంత రూపాత్మకశాఖయు పరాది వైఖర్యంత నామాత్మకశబ్దబ్రహ్మమును పరాశక్తిరూపములుగాన (షడధ్వ అందును వ్యాపించినది) వ్యాపినీ అని నామసిద్ధి కలిగినది. (త్ర్యక్షరము.)

చతుర్థశతకము సమాప్తము

---

శ్రీ రస్తు

# శ్రీ లలితాసహస్ర నామావళి

## పంచమశతకము.

---

### ౪౦౧. వివిధాకారాయై నమః

తా. నామరూపాత్మకమైన, సకల ప్రపంచమునందునుగల, నానా రూపములు అనేకభేదములుఁగల స్వాభేదరూపముగలది. (పంచాక్షరము.)

### ౪౦౨. విద్యా విద్యా స్వరూపిణ్యై నమః

తా. ౧. విద్యయనఁగా బ్రహ్మస్వరూపజ్ఞానము. అవిద్యయనఁగా చరమవృత్తిరూపజ్ఞానము. ఈ ద్వివిధజ్ఞానమే స్వరూపముగా గలది విద్యా విద్యాస్వరూపిణి.

తా. ౨. విద్య యనఁగా జంతువులను సంసారబంధమునుండి వదలించుజ్ఞానము. అవిద్య యనఁగా సంసారబంధమునకు లోనగునటుల చేసెడి జ్ఞానము. ఈ ద్వివిధజ్ఞానము పరాశక్తిస్వరూపమే కావున "విద్యా విద్యాస్వరూపిణి" యనంబడును.

"విద్యా విద్యేతి దేవ్యా ద్వే రూపే జానీహి పార్థివ,
ఏకయా ముచ్యతే జంతు రన్యయా బధ్యతే పునః."

(దేవీభాగవతే.)

౩. 'విద్య' యనఁగా చరమవృత్తిరూపజ్ఞానము. 'అవిద్య' యనఁగా భేదభ్రాంతిరూపజ్ఞానము. 'స్వ' మనఁగా పరబ్రహ్మాత్మకజ్ఞానము, ఈ త్రివిధ జ్ఞానమే రూపముగాఁ గలది. విద్యావిద్యాస్వరూపిణి.

"భ్రాంతి ర్విద్యా పరంచేతి శివరూపమిదం త్రయం,
అర్థేషు భిన్నరూపేషు విజ్ఞానం భ్రాంతిరుచ్యతే,
ఆత్మాకారేణ సంవిత్తిః బుధై ర్విద్యేతి కథ్యతే,
వికల్పరహితం తత్త్వం పరమిత్యభిధీయతే."

(లింగపురాణే.) (అష్టాక్షరము.)

౪౦౩. మహాకామేశనయనకుముదాహ్లాదకౌముద్యై నమః

తా. పరశివుని నేత్రములనే కలువలు వికసించుటకు కార్తిక పూర్ణిమనాఁటి వెన్నెలవంటిదని, కామేశ్వరుని పొందించుటచేత భక్తులకు స్వరూప జ్ఞానానందసుఖములు, మోక్షమును కలుగఁజేయునది యని భావము. పరశివునకును స్వరూపానందము నిచ్చునది యని భావము. (షోడశాక్షరము.)

౪౦౪. భక్తహార్దతమోభేదభానుమద్భానుసన్తత్యై నమః

తా. శ్రీదేవి తన భక్తుల మనస్సునందున్న ఆవరణశక్తి, రూపమైన మాలిన్యమనెడి చీకటిని, అజ్ఞానమును పోఁగొట్టుటకు సూర్యునికిరణ సమూహమువంటిదని భావము. మధ్యాహ్నకాలసూర్యకిరణములు, అంధకారమును నశింపఁజేయునట్లు, శ్రీదేవిని స్మరించిన వారి మనస్సునం దావరించియున్న అజ్ఞానమును పోఁగొట్టునది; స్వస్వరూపవిస్మృతియే భ్రమ అనియు, బంధమనియు, అజ్ఞానమనియు, మనోమాలిన్యము అని చెప్పఁబడును. అది నశించుటయే జ్ఞానము (మోక్షలాభము కలుగుట) అని భావము. (షోడశాక్షరము.)

౪౦౫. శివదూత్యై నమః

తా. భక్తులకు శ్రీదేవి సాన్నిధ్యము కలుగఁజేయుటకు, శివభక్తి దూతికగా నున్నదనియు. ఈశ్వరానుగ్రహము వినాగా, స్వాత్మదేవతా సాక్షాత్కారము కలుగదని భావము. (చతురక్షరము.)

౪౦౬. శివారాధ్యాయై నమః

తా. శివునిచేత ఉపాసింపఁబడినదని, శ్రీవిద్యలలో కాదివిద్యా అను

పంచదశీవిద్య ఈశ్వరసృష్టమై ఉపాసింపఁ బడినదిగాన, షోడశాక్షరీ మన్త్రము నాలుగు కూటములు గలది, రాజరాజేశ్వరీ దేవీ స్వరూపము, అది సదాశివునిచే ఉపాసింపఁబడుచున్నదిగాన, శివారాధ్య అని నామసిద్ధి కల్గినది. (చతురక్షరము.)

## ౨౦౭. శివమూర్త్యై నమః

తా. పరశివుఁడే స్వరూపముగాఁ గలదనియు, శివశక్తులకు అభేదమనియు శ్రుతులు చెప్పుచున్నవిగాన, మంగళప్రదమైన స్వరూపము గలదనియు, మోక్షస్వరూపురాలనియు భావము. (చతురక్షరము.)

## ౨౦౮. శివంకర్యై నమః

తా. శ్రీదేవి తనభక్తులను పరశివుని సాయుజ్యముక్తి గలవారినిగాఁ జేయునది అనియు, మంగళము చేయునదనియు, మోక్షము కలుగఁ జేయునదనియు భావము. (చతురక్షరము.)

## ౨౦౯. శివప్రియాయై నమః

తా. శివునకుఁ బ్రియురాలుగాని, శివుఁడు ప్రియుఁడుగాఁగలదనిగాని, శివశక్తుల కభేదమనిగాని భావము. (చతురక్షరము.)

## ౨౧౦. శివపరాయై నమః

తా. శివునికంటెఁ బరమైనదని, ఈశ్వరునకును స్వాత్మలాభము శక్త్యధీనముగలదని, 'శివః పరోఽస్యా ఇతివా.' శ్రు. ''అవ్యక్తాత్పురుషః పరః, పురుషాన్న పరం కించిదితి.'' అవ్యక్తస్వరూపమునకు పరమపురుషుఁడే కారణము గనుక 'శివపరా' అని నామము కలిగినది. (చతురక్షరము.)

## ౨౧౧. శిష్టేష్టాయై నమః

తా. ౧. శ్రుతిస్మృతులందు విహితమైన తమతమ వర్ణాశ్రమాచారములను ఆచరించువారు శిష్టులని భావము. వారిచేత పూజింపఁబడునది గనుక

శిష్టేష్టా అనియు, ఏశ్రీదేవికి అట్టిశిష్టులు ఇష్టులుగాను, భక్తులుగాను యున్నారు, కనుక శ్రీదేవి శిష్టేష్టా అనిపించుకొనును.

౨. లేక నేతి - నేతి శ్రుతులచేత సకల జగత్తు నిషేధింపఁబడగా ఏది మిగిలినదో అదియే బ్రహ్మస్వరూపము, అట్టి నిశ్చయమును నమ్మినవారు శిష్టేష్టులు. శ్రీదేవి వారి స్వరూపముగా నున్నదనిగాని, అట్టివారికిని దేవతకును భేదము లేదని భావము. (త్ర్యక్షరము.)

## ౭౧౨. శిష్టపూజితాయై నమః

తా. వెనుకఁ జెప్పిన లక్షణములు గల శిష్టులగువారిచేత పూజింపఁ బడునది; లేక ఉపాసింపఁబడునది యని భావము. (పంచాక్షరము.)

## ౭౧౩. అప్రమేయాయై నమః

తా. దేశకాలవస్తుభేదముచేత, ప్రమాణములేనిదనియు, ఆకారము బ్రహ్మవిష్ణువాచకముగాన, వారికిఁ దెలియఁబడుచున్నదని, లేక శ్రుతి ప్రసిద్ధములయిన ఉదకములయందు తెలియఁబడుచున్నదని భావము. శ్రు. "మమయోనిరప్స్వన్త స్సముద్రే, ఇతి." (చతురక్షరము.)

## ౭౧౪. స్వప్రకాశాయై నమః

తా. ఏశ్రీదేవి ఆకారము ప్రకాశస్వరూపమో, అది స్వప్రకాశా అని నామము. చూచునది చూడఁబడునదియుకూడ ప్రకాశమే అనియు, ప్రకాశమే ఆకారముగాఁ గలదనియు, తాను ప్రకాశించుటకు సూర్య చంద్రాదులవలెఅన్యాపేక్ష లేనిదనియు, బ్రహ్మవస్తువుస్వయంజ్యోతిఅనియు, స్వప్రకాశమనియు శ్రుతులు చెప్పుచున్నవని భావము. (చతురక్షరము.)

## ౭౧౫. మనోవాచామగోచరాయై నమః

తా. మనస్సుచేత ఇట్టి ఆకారముగలదని గాని, వాక్కుచేత ఇట్టిదని చెప్పుటకుగాని శక్యముకానిదని శ్రుతులును స్మృతులును చెప్పుచున్నవి. కారణ మేమనఁగా:—

ఈ అంశము విచారణశూన్యులకు ఆశ్చర్యము. కాని విమర్శకులకు సాధారణముగనే యున్నది. ఎట్లనిన-పౌత్త్రుఁడుగాని, దౌహిత్త్రుఁడుగాని, తనతాతయొక్క బాల్యమును ఎఱుఁగుదుననియు, తనతాతయొక్కయు, వివాహమహోత్సవము తనకు బాగుగా తెలియుననియు, తన ఎదురుగా వివాహము అయినదనియు చెప్పుట ఎట్టి అసంభవమో, అటులనే కలా తత్త్వభువనములు, ప్రకాశాంశము, రూపాత్మకమైన శాఖ, దీనిసృష్టి క్రమము, ఆదివస్తువు పరాబిందువు బిందువికసనము, అవ్యక్తము, దాని వలన మహత్తత్త్వము, దానివలన అహంకారము, దానివలన మనస్సు ఇటుల క్రమముగా కలిగినవి. ఆదినున్న పరాబిందుస్వరూపములను, దాని అయిదవతరగతి, తరువాత పుట్టినమనస్సు, ఏలాగు కనుగొనఁగలదు ? మనస్సు తన తరువాతపుట్టిన ఆకాశాదులనుమాత్రమే గ్రహింపఁగలదని భావము.

ఇఁక వాఙ్మయమైన నామాత్మకశాఖలో పరాబిందువు ఆదినున్నది, ఆబిందువికసనము నాదము, దానివలనమధ్య, దానివలన వాక్కులు వైఖరీరూపములు గలవి. ఇవి వర్ణపదమంత్రములుగా నున్నవి. ఆదినున్న పరాశక్తిని నాలుగవతరగతిలో నున్న వాక్కులు ఎట్లు చెప్పఁగలవు? అందువలన, మనోవాక్కులు తమకంటె తరువాత పుట్టిన వస్తువును నిరూపింపఁగలవుగాని, తమపైనున్న వస్తువుయొక్క స్థితిని నిరూపింప లేవని శ్రుతులు చెప్పుచున్నవి. మనోవాక్కులయందున్న సత్తయే బ్రహ్మ భాగము గనుక, ఆట్టి సత్తను కనుగొను మఱియొక మనోవాక్కులులేవని భావము. (అష్టాక్షరము.)

౨౧౬. చిచ్ఛక్త్యై నమః

తా. సర్వప్రాణులయందును గల జీవకళయే ప్రకాశరూపమైన శక్తి, చిచ్ఛక్తి అనియు, అజ్ఞానమును పోఁగొట్టుజ్ఞానమే చిచ్ఛక్తి అనియు భావము. (త్ర్యక్షరము.)

౨౧౭. చేతనారూపాయై నమః

తా. పరమేశ్వరునిశక్తియే చేతనారూపముగలది. అదియే చైతన్యమని భావము. ఇంతకుముందు చెప్పిన చిచ్ఛక్తిధర్మము, చైతన్యము, ఇదియే ధుర్వికల, నిత్యకల, షోడశికల అని వాకుక. చిత్కాలాస్థానము సహస్రారాంతర్గత బిందుస్థానము. చైతన్యము సర్వశరీరవ్యాపి అని భావము. (పంచాక్షరము.)

## ౪౧౭. జడశక్త్యై నమః

తా. పరబ్రహ్మయందు సకలశక్తులును ఇమిడియున్నవి. అగ్నియందుష్ణశక్తియు, బ్రహ్మయందు సృష్టిశక్తియు, విష్ణువునందు పాలనశక్తియు ఇవన్నియు పరమాత్మయందున ప్రపంచసర్గసంహారాదిరూపమైన మాయాశక్తి, పరిణామవిశేషము, జడశక్తస్వరూపము, సత్తారహితము, విచారింపఁగా శూన్యముగా నున్నదని భావము. అట్టి జడశక్తియు శ్రీదేవి అంశయేగాన 'జడశక్తి' యను నామము కలిగినది. (చతురక్షరము.)

## ౪౧౮. జడాత్మికాయై నమః

తా. పరిదృశ్యమానమైన నామరూపాత్మక జగత్తే స్వరూపముగా నున్న జడస్వరూపమాయారూపమని భావము. పంచశక్తలనిదా, అని ప్రశ్నగలుగును. దృశ్యమానజగత్తు, ప్రకాశవిమర్శాంశలనామిరస్యము, అందు సత్ చిత్ ఆనందము ఈమూఁడును ప్రకాశాంశలు. ప్రతివస్తువునందును గల సత్తాభాగముగా నున్నవి. నామరూపములు రెండును జడములు. విమర్శాంశముగా నున్నందున శ్రు. "సత్యంచానృతంచసత్యమభవత" అని సత్యముగా నున్నసత్తయును, అసత్యమైన నామరూపాత్మక జడమును సత్యమె రెండురూపములైనదని శ్రుత్యర్థము. ఆస్పదములేనిది భ్రమకలుగదు. కాన అఖండాకారబ్రహ్మమందు ద్వైతప్రపంచభ్రమ కలిగినందున, అట్టిభ్రమయు భ్రమాస్పదమునుకూడ బ్రహ్మస్వరూపమే అని భావము. (చతురక్షరము.)

## ౪౧౯. గాయత్ర్యై నమః

తా. గాయత్రీశబ్దము వేదమాతయగు త్రిపదా గాయత్రీమంత్ర

మందు వర్తించుచున్నది. గాయత్రీఛందస్సనే సంకేతము. చతుర్వింశ ద్వర్ణాత్మక మంత్రపరము. ద్వాత్రింశద్వర్ణాత్మకము. తురీయపాదసహితము; పూర్ణగాయత్రీసంజ్ఞ కలది. ప్రథమము త్రిపదా; కూటత్రయాత్మకము; ద్వితీయము చతుష్కూటాత్మకము, షోడశీకలాయుక్తము. దీనిని గానము చేయువారిని రక్షించునదనియు, పరబ్రహ్మను పొందించునది యనియు ఇహమందు సకల సంపదల నిచ్చునదియనియు, బ్రహ్మోపరోక్షజ్ఞానము నిచ్చి రక్షించునదియనియు భావము. (త్ర్యక్షరము.)

## ౭౨౧ వ్యాహృత్యై నమః

తా. అత్యంతము వ్యాప్తమైనదని శబ్దార్థము. గాయత్రీమంత్రము నకు పూర్వమందు ప్రణవపూర్వకముగ భూః-భువః-సువః అని ఉచ్చరించుట వ్యాహృతి త్రయమని సుప్రసిద్ధము. భూలోక-భువర్లోక-స్వర్గలోకములు బ్రహ్మస్వరూపములని శ్రుతిస్మృతిప్రసిద్ధమై ఉన్నందున వ్యాపకత్వము శ్రీదేవికి వ్యాహృతులందు సార్థకముగా నున్నదని భావము. (త్ర్యక్షరము.)

## ౭౨౨. సన్ధ్యాయై నమః

తా. ఏకాలమందు బ్రాహ్మణులు బ్రహ్మాత్మల కభేదభావనతో, సంశయ విపర్యయరహితముగా 'సోఽహమస్మి' అని లేక, 'బ్రహ్మాహమస్మి' అని దేనిని, ధ్యానించుచున్నారో అది సన్ధ్య యనంబడును. అహోరాత్రసంధి కాలమందుపాసింపఁదగిన దేవతయొక్క నామము సంధ్య అని. అట్టి దేవతయు శ్రీదేవియేగాన సంధ్యా నామము కలిగినది. (ద్వ్యక్షరము.)

## ౭౨౩. ద్విజబృందనిషేవితాయై నమః

తా. బ్రాహ్మణసమూహముచేతగాని, బ్రహ్మ క్షత్రియ వైశ్యుల సమూహముచేతగాని ఉపాసింపఁబడుచున్నదని భావము. (అష్టాక్షరము.)

## ౭౨౪. తత్త్వాసనాయై నమః

తా. శివాదిక్షిత్యంతమైన, సకలతత్త్వములే ఆసనముగాఁ గలది. తత్వ

సంఖ్య అనేక భేదములుగానున్నను, చతుర్వింశతితత్త్వములు శ్రుతిస్మృతిసమ్మతములు. వీనియందన్నియు అంతర్భావములుగా నున్నవి. ఇవి ఆత్మవలననే కలిగినందున తత్త్వములని నామము కలిగినది. స్వయముగా జడములు, కలాతత్త్వభువనాత్మకములు, వీనియందు చిత్కలాసంబంధము చేత, వృక్షమందు క్రమముగా పుష్పము, పుష్పమందు పరిమళము కలిగినట్లు వీనికి చేతనత్వము సంభవించినది. ఈతత్త్వములద్వారా, జ్ఞానులకు బ్రహ్మాపరోక్షజ్ఞానము కలుగుచున్నదిగాన, శ్రీదేవికి తత్త్వాసనము సిద్ధించినదని భావము. (చతురక్షరము.)

## ౨౫౯. తస్మై నమః

తా. తత్ అనుపదము, సకల నిగమాగమములచేత తెలియఁబడుచున్న సచ్చిదానందస్వరూప బ్రహ్మవస్తువాచకము. అతత్పదస్వరూపిణియని భావము. (ఏకాక్షరము.)

## ౨౬౦. తుభ్యన్నమః

తా. త్వ మనఁగా తనకంటె వేఱుగానున్న నీవని అర్థము. ఇచట 'త్వం' అనుపదము ద్వైతజ్ఞానమందున్న సగుణోపాసకులగు భక్తులకు ఎదురుగా లక్ష్యముగానున్న శ్రీదేవీ పరమని భావము. (ఏకాక్షరము.)

## ౨౬౧. అయ్యై నమః

తా. అయీ అనఁగా సమానధర్మముగల ఎదురుగానున్న మనుష్యుని ఓయీ! అని పిలుచుటకు అర్థము మాతాపితరులవలెను భక్తులకు అభేదభావనగలదిగాన 'అయీ' అనేపేరున పిలువఁబడుచున్నదని భావము. (ద్వ్యక్షరము.)

## ౨౬౨. పంచకోశాన్తరస్థితాయై నమః

తా. సకలశరీరములందును, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను ౫ కోశములు నొకదానిలో నొకటి ఇమిడియున్నది. ఈ అయిదుకోశములేస్థూల-సూక్ష్మ-కారణముల నే శరీరత్రయము.

వీనిలోపల చిత్కలారూపముగా శ్రీదేవియుండి వీనికన్నిటికిని శక్తిని కలుగచేయుచున్నది. ఈఅర్థమును తైత్తిరీయశ్రుతి చెప్పుచున్నది. శ్రుతియందున్న గుహ అనగా పంచకోశమధ్యస్థానము, పరాకాశము, ద్వాదశాంతము ఇటులనే బ్రహ్మాండమందును ఊహింపదగినదని భావము. (అష్టాక్షరము.)

## ౪౨౯. నిస్సీమమహిమ్నే నమః

తా. పరిమితిలేని ప్రభావము కలదని భావము. (షడక్షరము.)

## ౪౩౦. నిత్యయౌవనాయై నమః

తా. కాలత్రయములయందును, వార్ధక్యములేనిదనియు, సదా పదునారువర్షముల వయస్సుగలదనియు భావము. (పంచాక్షరము.)

## ౪౩౧. మదశాలిన్యై నమః

తా. ఇతరవృత్తి వాసనారహితమైన పూర్ణానందానుభవముచేత ప్రకాశించుచున్నదని భావము. (పంచాక్షరము.)

## ౪౩౨. మదఘూర్ణితరక్తాక్ష్యై నమః

తా. యౌవనోద్రేకముచేత చలించుచున్న రక్తిమగల నేత్రములు గలదని భావము. చంచలాక్షిత్వము, సౌందర్యసూచకమని భావము. (అష్టాక్షరము.)

## ౪౩౩. మదపాటలగండభువే నమః

తా. యౌవనముచేత తెలుపు ఎఱుపు రంగులమిశ్రమును గల చెక్కిళ్లు గలదని భావము. (అష్టాక్షరము.)

## ౪౩౪. చందనద్రవదిగ్ధాంగ్యై నమః

తా. పరిమళయుక్తచందనద్రవముచేత పూయబడిన శరీరముగలదని భావము. (అష్టాక్షరము.)

## ౪౩౫. చాంపేయకుసుమప్రియాయై నమః

తా. సంపెంగపుష్పములు ప్రియముగాను ఇష్టముగానుఁగలదని భావము. (అష్టాక్షరము.)

౪౩౬. కుశలాయై నమః

తా. సృష్టినిర్మాణము మొదలగు సామర్థ్యములు గలదని భావము. (త్ర్యక్షరము.)

౪౩౭. కోమలాకారాయై నమః

తా. శ్రీదేవి అతిసుకుమారమైన ఆకారముఁగలదని భావము. (పంచాక్షరము.)

౪౩౮. కురుకుల్లాయై నమః

తా. కురుకుల్ల యనగా మణిద్వీపమందుఁగల శ్రీపురమందు అహంకార చిత్తమయ ప్రాకారమధ్యమునందుఁగల విమర్శమయవాపికి అధికారిణి యను దేవత, తద్దేవతారూపముగా శ్రీదేవి ఉన్నదని భావము. (పంచాక్షరము.)

౪౩౯. కులేశ్వర్యై నమః

తా. సజాతీయమైన త్రిపుటికి ప్రభ్వి యని భావము. (చతురక్షరము.)

౪౪౦. కులకుండాలయాయై నమః

తా. మూలాధారము వాసస్థానముగాఁగలదని భావము. (షడక్షరము.)

౪౪౧. కౌళమార్గతత్పరసేవితాయై నమః

తా. కౌళమార్గమందాసక్తిగల జనులచే పూజింపఁబడుచున్నదని భావము.

కౌళాచార, సమయాచారభేదము చూపింపఁబడినది. కౌళ వామ మార్గములు తంత్రచోదితములు వేదబాహ్యములు; ఇవి త్రైవర్ణికులకును క్షపణక కాపాలికశూద్రాదులను బైరాగులనుద్దేశించి చెప్పఁబడినది. సమయ దక్షిణములు వేదసమ్మతములు, బ్రాహ్మణులనుద్దేశించి నిర్దేశింపఁబడినవి.

శ్రేయస్కాముఁడైన బ్రాహ్మణునకు వామకౌళాచారములందు అధికారములేదు. 'ఆచారహీనం నపునన్తి వేదాః' అని ప్రమాణము. బ్రాహ్మణుఁడు సత్వగుణవృద్ధికొఱకు ప్రయత్నింపవలెను. 'ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః' తమః ప్రధానమైన సురామాంసాదులతో బ్రాహ్మణాద్యగ్రవర్ణములవారు శ్రీచక్రార్చనచేయుట మహాఘోరకృత్యము, అతిసాహసముగా నున్నది. ఇట్టి యాచరణము గురుసంప్రదాయమనియు, వంశపరంపరగా తమ ఆచారమనియు, అంధపరంపరగా కొందఱు విశ్వసించుచున్నారు. అందఱును వంశపరంపరగా అజ్ఞానులుగాను పుణ్యపురుషుఁడు వివేకిఅయి మోక్షమును పొందుచున్నటుల నింద్యమయిన యీపనిని పరిత్యజించుట యావశ్యకము. ఉత్తమాధికారులగు బ్రాహ్మణులకు ఇట్టి నీచకృత్యమం దభిలాష అధః పతనహేతువుగా నున్నది. అట్టివారు తాము చెడి, లోకమునుకూడ భ్రష్టులనుగాఁ జేయుచున్నారని శంకరాచార్యాది పూర్వాచార్యులు తమతమ గ్రంథములందు వెల్లడించిరి. పరదేవతకు అందఱును సమానులేగాన, ఈనామము సిద్ధించుచున్నది. (దశాక్షరము.)

౪౪౨ కుమారగణనాథాంబాయై నమః

తా. కుమారస్వామికి గణపతికిని తల్లి అయినదని భావము. (అష్టాక్షరము.)

౪౪౩ తుష్ట్యై నమః

తా. సకలజనులయందును, సంతుష్టిస్వరూపముగా నున్నదని భావము. (ద్వ్యక్షరము.)

౪౪౪. పుష్ట్యై నమః

తా. సకలభూతములందును, పోషణరూపముగా నున్నదని భావము. (ద్వ్యక్షరము.)

౪౪౫ మత్యై నమః

తా. సకలభక్తులయందును, మనస్స్వరూపముగా నున్నదని భావము. (ద్వ్యక్షరము.)

౨౨౬. ధృత్యై నమః

తా. సకలభూతములందును, ధైర్యరూపముగా నున్నదని భావము. (ద్వ్యక్షరము.)

౨౨౭. శాన్త్యై నమః

తా. సకలభూతములందును, శాన్తిరూపముగా నున్నదని భావము. (ద్వ్యక్షరము.)

౨౨౮. స్వస్తిమత్యై నమః

తా. శ్రు. "అస్తిబ్రహ్మేతివ్యజానాత్" అని. మనోవాక్కులకు అగోచరమైనను, సత్తామాత్రముచేత, అనిర్వాచ్యమైన, బ్రహ్మము అను వస్తువు సర్వత్ర కలిగిఉన్నందున అస్తి అను వ్యవహారముకలదని భావము. సకల శరీరములందును ప్రాణముగాని, జీవముగాని ఉన్నది, లేదు అనేకవ్యవహారము కలదు. ఆప్రాణము అగోచరమైనను సత్తుచేతను జనులు గ్రహించి వాడుచున్నారుగాన, దేనిని ఉన్నది, లేదు అని వ్యవహరించుచున్నారో, అట్టివస్తు స్వరూపము శ్రీదేవి అని గ్రహించునది. (చతురక్షరము.)

౨౨౯. కాన్త్యై నమః

తా. సకల ప్రపంచమందును కాంతి స్వరూపముగానున్నది. కాంతి యనఁగా తేజస్సు అనియు, జీవకళ నిర్జీవకళ స్పష్టముగా తెలియుచున్నవి గాన అందులో శ్రీదేవి జీవకలాస్వరూపిణి యని భావము. (ద్వ్యక్షరము.)

౨౩౦. నందిన్యై నమః

తా. నందతీతి నందినీ అని. ఏది ఆనందము ననుభవించుచున్నదో అది నందిని శ్రీదేవి అట్టిస్వరూపమని. శ్రు. "ప్రజ్ఞానం బ్రహ్మ" అను శ్రుతియందుఁగల ప్రజ్ఞానస్వరూపురాలని భావము. (త్ర్యక్షరము.)

౨౩౧. విఘ్ననాశిన్యై నమః

తా. శ్రీవిద్యోపాసకులకు కలిగెడి విఘ్నములను పోఁగొట్టునదియని భావము. (పంచాక్షరము.)

౪౫౧. తేజోవత్యై నమః

తా. ఏ తేజస్సు సూర్యచంద్రాదులకు ఆధారముగా నున్నదో అట్టి తేజస్సు కలదని భావము. శ్రు. "ఏతస్మిన్ ఖల్వక్షరే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠత ఇతి." (చతురక్షరము.)

౪౫౨. త్రిణయనాయై నమః

తా. శ్రీదేవికి మూఁడు నేత్రములు గలదనియు, చంద్రాగ్ని సూర్యులు ముగ్గురు నేత్రములుగా నున్నారని విరాడ్రూపవర్ణనమందుఁ గలదని భావము. (చతురక్షరము.)

౪౫౩. లోలాక్షీకామరూపిణ్యై నమః

తా. స్త్రీలకును మనోహరమైనరూపము కలదనియు, లేక శ్రీదేవి స్త్రీలయందు కామస్వరూపనుగా నున్నదని భావము. (అష్టాక్షరము.)

౪౫౪. మాలిన్యై నమః

తా. అకారాది హకారాన్తమైన మాతృకావర్ణపఙ్క్తి మాలాకారముగా ఉన్నందునను, క్షకారము మేరువుగా నున్నందునను, మాతృకమాలాకారముగా నున్నందున మాలిని అను నామము సిద్ధించినది. (త్ర్యక్షరము.)

౪౫౫. హంసిన్యై నమః

తా. హంసమంత్రస్వరూపము కలదనియు, హంసలని యతులలో ఒక భేదము కలదు. అట్టి హంసలకును శ్రీదేవికిని భేదము లేదు గాన 'హంసిని' అని నామసిద్ధి కలిగినది. (త్ర్యక్షరము.)

౪౫౬. మాత్రే నమః

తా. సకలప్రపంచమును పుట్టించునది గనుక మాతా అని నామము కలిగినది. (ద్వ్యక్షరము.)

౪౫౮. మలయాచలవాసిన్యై నమః

తా. మలయపర్వతమందు నివసించునది యని భావము. దక్షిణదేశమందు మళయాళభగవతి అని శ్రీదేవికి ప్రసిద్ధికలదుగాన ఈనామము సిద్ధించినది. (అష్టాక్షరము.)

౪౫౯. సుముఖ్యై నమః

తా. మంగళప్రదమైన ముఖముకలదనియు, జ్ఞానస్వరూపమైన కాంతిచేత ప్రకాశించుచున్న ముఖముకలదనియు భావము. (త్ర్యక్షరము.)

౪౬౦. నళిన్యై నమః

తా. కరచరణముఖనేత్రములు కమలమువంటివి గలదిగాన సృష్టిన్యాయముచేత నళినిఅనియు, 'నన్దిని, నళిని, గంగా' అను పండ్రెండు నామములు గంగానదికిఁగలవుగాన భాగీరథీ స్వరూపురాలనియు భావము.

౪౬౧. సుభ్రువే నమః

తా. శుభప్రదమైన కనుబొమలుగలదని భావము. (త్ర్యక్షరము.)

౪౬౨. శోభనాయై నమః

తా. సౌందర్యముచేత ప్రకాశించుచున్నదని భావము. (త్ర్యక్షరము.)

౪౬౩. సురనాయికాయై నమః

తా. దేవతలకు శ్రీదేవి ప్రభ్వీ యని భావము. శ్రు. "మహత్తరా మహిమాదేవతానాం, ఇతి." (పంచాక్షరము.)

౪౬౪. కాలకంఠ్యై నమః

తా. నల్లనికంఠముకలవాఁడు ఈశ్వరుఁడు. తద్భార్యగాన కాలకంఠీ అని నామముకలిగినది. (చతురక్షరము.)

౪౬౫. కాన్తిమత్యై నమః

తా. సకలావయవములందును కాంతి, తేజస్సుకలది. (చతురక్షరము.)

## ౭౬౬. క్షోభిణ్యై నమః

తా. ౧. శాంతస్వరూపుఁడైన పరమేశ్వరునియందు ప్రవేశించి, చాంచల్యమును కలుగఁజేసి సృష్టియం దభిముఖునిగా చేయునదిగాన క్షోభిణి అని నామము కలిగినది.

౨. సర్గకాలమందు పరాశక్తి మనస్సుయొక్క క్షోభవలన అనేక వేల శక్తి సముదాయమును పుట్టించినదని భావము. (త్ర్యక్షరము.)

## ౭౬౭. సూక్ష్మరూపిణ్యై నమః

తా. అతినిర్మలమైనందున స్థూలదృష్టిచేతఁ దెలియఁబడని ఆకారము గలదిగాన ఈ నామము కలిగెను. శ్రు. "సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం; అణో రణీయానితి." (పంచాక్షరము.)

## ౭౬౮. వజ్రేశ్వర్యై నమః

తా. శ్రీచక్రమందుఁగల అవ్యక్తస్వరూప త్రిభుజాచక్రమందుఁగల కోణత్రయ బింద్వధిదేవతలు, కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని దేవతలు గనుక శ్రీదేవియే వజ్రేశ్వరి నామముకలదని భావము.(చతురక్షరము.)

## ౭౬౯. వామదేవ్యై నమః

తా. సకలదేవతలకు వందనీయుఁడుగాన పరమేశ్వరునకు వామదేవుఁడని నామసిద్ధి కలిగినది. శ్రు. "తందేవా అబ్రువ న్నయం వైన స్సర్వేషాం వామఇతి తస్మాద్వామదేవః. ఇత్యైతరేయే." ప్రకాశించుచున్న వామభాగముగల అర్ధనారీశ్వరుఁడు వామదేవుఁడనియు, ఈశ్వరుని పంచ ముఖములలో ఉత్తరముఖమునకు వామదేవసంజ్ఞ కలిగినదిగాన వామదేవుఁడనంబడును. అట్టి వామదేవుఁడనే ఈశ్వరునిభార్యగాన వామదేవీ అని నామము కలిగినది. సుందరమైన దేవతగాన వామదేవి అనియు, వామ శబ్దము కర్మపరమైనపుడు కర్మఫలము నిచ్చునదిగాన వామదేవి అని భావము. (చతురక్షరము.)

## ४२०. వయోవస్థావివర్జితాయై నమః

తా. బాల్యపౌగండకైశోరయౌవనాది వయోభేదములు లేనిదని సనాతనముగా నున్నందున నిత్యయౌవనముగలదని భావము. (అష్టాక్షరము.)

## ४२१. సిద్ధేశ్వర్యై నమః

తా. ౧. సిద్ధులు దేవతాగణములలో భేదముగలవారు. వారికి ప్రభ్వి యని భావము.

౨. కాశియందు సకలసిద్ధులను ఇచ్చు సిద్ధేశ్వరి యను దేవత కలదు. ఆస్వరూపముకలదని భావము. (చతురక్షరము.)

## ४२२. సిద్ధవిద్యాయై నమః

తా. శ్రీవిద్యలను సంజ్ఞకల బాలా, పంచదశాక్షరీ షోడశాక్షరీ విద్యలు, సిద్ధవిద్యలను సంజ్ఞకలవి. ఈమంత్రము లుపాసనచేయుటకు సిద్ధాదిచక్రశోధనము ఆవశ్యకములేదనియు, అందఱకును సిద్ధమంత్రము లనియు తత్స్వరూపిణి యని భావము. (చతురక్షరము.)

## ४२३. సిద్ధమాత్రే నమః

తా. సిద్ధులకు శ్రీదేవి తల్లియని భావము. సకలజనులకును జనకమాత ఒకకాలమందు ఉన్నదనియు, ఒకప్పుడు లేదనియు వ్యవహారము కలదు. ఈజగన్మాత అట్టిమాతగాక సర్వకాలములయందును అంతటను అందఱకును తల్లిగా ఉన్నదనియు, స్మరణమాత్రముననే సంసిద్ధయయి కాపాడుచున్నదని భావము. (చతురక్షరము.)

## ४२४. యశస్విన్యై నమః

తా. శ్రీదేవి కీర్తికలదనియు, మేధాస్వరూపముగా నున్నదనియు భావము. (చతురక్షరము.)

## ४२५. విశుద్ధిచక్రనిలయాయై నమః

తా. ఈనామమునుండి ఆఱువదిరెండు నామములచేత అంతర్మాతృకా

న్యాసక్రమముగా విశుద్ధాది సహస్రారాంత సప్తచక్రములందుఁగల అధిష్ఠానదేవతలైన డ-ర-ల-క-స-హ-య ఈ బీజరూపములుగానున్న ఆయా యోగినీల స్వరూపముగానున్న పరాశక్తిని వర్ణించుచున్నారు. పరాశక్తి శారీరవృక్షమను అశ్వత్థవృక్షమందు స్వవిచారణకుగాని, జగద్విచారణకుగాని, ఈ అశ్వత్థవృక్షము సృష్టిక్రమమును తెలుపుచున్నది. ఇది బ్రహ్మాండపిండాండములను తెలుపుచున్నది. మధ్యను మూలాధారాది కమలసప్తకమును చూపరుల కుడివైపున కలాతత్త్వభువనాత్మకమైన మూఁడుఅధ్వలుగల చతుర్వింశతి తత్త్వాత్మకమైన ఈ ప్రకాశాంశయగు రూపశాఖయును.

చూపరుల వామభాగమందు పరాపశ్యంతీమధ్యమావైఖరీలనే నాలుగవస్థలును, వర్ణపదమంత్రములను మూఁడుఅధ్వలుగల నాదాత్మకశబ్దబ్రహ్మశాఖయును గలవు. ఇందు సర్వోర్ధ్వబిందువు ఇరువదియైదవది ఆత్మస్వరూపముగాను, ఆబిందు వికసనరూపమైన ముక్కోణచక్రము అవ్యక్తసంజ్ఞకలదిగాను, ఈ బిందుత్రికోణములు దిగువనున్న రెండుశాఖలకును మాతాపితరులుగానున్నవని గ్రహింపవలెను. రెండుశాఖలును సృష్టిక్రమముగా విశుద్ధాది సప్తచక్రములందు నిమిడియున్నవి.)

అందులో రూపశాఖకు ప్రమాణము. శ్రు.—"ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః, మనసశ్చ పరాబుద్ధిః బుద్ధేరాత్మామహాన్పరః, మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషఃపరః, పురుషాన్నపరం కించిత్" ఇతి; శ్రు. "పంచవిగ్ంశ ఆత్మాభవతీతి." ఆరోహణక్రమమందు పృథివినుండి సర్వకారణబిందువు యిరువదియైదవది అగుచున్నది. అదియే సహస్రారము. సాక్షి ప్రత్యగాత్మగా నున్నది.

వామభాగమందున్న నామశాఖకు ప్రమాణము.

శ్రు. "చత్వారివాక్పరిమితాపదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః, గుహాత్రీణి నిహితా నేంగయంతి తురీయంవాచో మనుష్యావదన్తి."

తా. పరాపశ్యన్తీమధ్యమలు మూఁడవస్థలు అగోచరములనియు, నాలుగవదైన వైఖరీనిమాత్రము మనుష్యులు వాక్కుచేత ఉచ్చరించుచున్నారనియు భావము.

పైని చెప్పిన రెండుశాఖలసృష్టి అవరోహణ క్రమముగా కలిగినది. అందు బిందునాదకలలు క్రమముగా కలిగినవి. పంచాశద్వర్ణవిభాగమైన వైఖరిగాన విశుద్ధకమలము ప్రారంభించి, మూలాధారమును పొంది ఆజ్ఞాకమలమందు వైఖరీసమాప్తమైనది గాన విశుద్ధకమలమునుండి యోగినీరూపములు ధరించి ఆయామాతృకాబీజము లున్నవని వర్ణించుచున్నారు.

పదునాఱుదళములుగల విశుద్ధికమలకర్ణికయందున్న డాకినీ అనే యోగినీ ధ్యానము.—

శ్లో. "గ్రీవాకూపే విశుద్ధౌ నృపదళకమలే శ్వేతరక్తాం త్రినేత్రాం
హస్తైః ఖట్వాంగఖడ్గౌ త్రిశిఖమపి మహాచర్మసన్ధారయన్తీం,
వక్త్రే నైకేనయుక్తాం పశుజనభయదాం పాయసాన్నైకసక్తాం
త్వక్స్థాం వన్దేఽమృతాద్యైః పరివృతవపుషాం డాకినీం వీరవన్ద్యామ్."

పరదేవతయొక్క శారీరవృక్షమందు కంఠస్థానముందున్న పదునాఱుదళములుగల విశుద్ధకమలకర్ణికయందు స్థానముగాకలదని భావము. (అష్టాక్షరము.)

౪౭౬. రక్తవర్ణాయై నమః

తా. శ్రీదేవి యెఱుపక యెఱ్ఱని కాంతి అనఁగా పాటలవర్ణము గలది. (పంచాక్షరము.)

౪౭౭. త్రిలోచనాయై నమః

తా. శ్రీదేవి మూఁడు నేత్రములు గలదని భావము. (చతురక్షరము.)

౪౭౮. ఖట్వాంగాదిప్రహరణాయై నమః

తా. శ్రీదేవి ఖట్వాంగము మొదలగు ఆయుధములు కలదని భావము. (అష్టాక్షరము.)

౪౩౯. వదనైకసమన్వితాయై నమః

తా. శ్రీదేవి ఒకముఖముగలదని భావము. (అష్టాక్షరము.)

౪౪౦. పాయసాన్నప్రియాయై నమః

తా. శ్రీదేవి పాయసాన్నమందు విశేషప్రీతికలదని భావము. (నవ
క్షరము.)

౪౪౧. త్వక్స్థాయై నమః

తా. త్వక్ చర్మము అను ధాతువందు చేతనరూపముగా నున్నదని భావము. (ద్వ్యక్షరము.)

౪౪౨. పశులోకభయంకర్యై నమః

తా. స్వరూపజ్ఞానశూన్యులు పామరులు పశువులని భావము. అట్టి అజ్ఞానులకు భయంకరముగా నున్నదని భావము. శ్రు. "అథో్యఽసావన్యో ఽహ మస్మీతి నసవేద యథాపశురితి" "ద్వితీయాద్వైభయం భవతి" "యఏతస్మిన్నుదరమన్తరంకురుతే. అథతస్య భయం భవతీతి." (అష్టా
క్షరము.)

౪౪౩. అమృతాదిమహాశక్తిసంవృతాయై నమః

తా. పదునారుదళములందును క్రమముగా స్వరములు, అకారాదులగు పదునారును అమృతాది షోడశ యోగినీరూపములు ధరించి, ఆచక్రేశ్వరిని సేవించుచున్నారు. (ఏకాదశాక్షరము.)

౪౪౪. డాకినీశ్వర్యై నమః

తా. వెనుక చెప్పిన తొమ్మిది విశేషణములుగల డాకినీశ్వరీ స్వరూపురాలని భావము. (పంచాక్షరము.)

౪౪౫. అనాహతాబ్జనిలయాయై నమః

తా. అనాహతకమలము కర్ణికయందు స్థానముగాఁగలదని భావము. హృదయమందు ద్వాదశదళములుగల అనాహతకమలమందు రాకిని అను పేరుగల యోగినీరూపముగా నున్నది.

రాకినీధ్యానము :—

శ్లో. "హృత్పద్మే భానుపత్రే ద్వివదనలసితాం దంష్ట్రిణీం శ్యామవర్ణాం
చక్రం శూలం కపాలం డమరుమపి భుజైర్ధారయన్తీం త్రినేత్రాం,
రక్తస్థాం కాళరాత్రిప్రభృతి పరివృతాం స్నిగ్ధభక్తైకసక్తాం
శ్రీమద్వీరేన్ద్రవన్ద్యా మభిమతఫలదాం రాకినీం భావయామః."

(అష్టాక్షరము.)

౪౮౬. శ్యామాభాయై నమః

తా. పదునాఱుసంవత్సరములు వయస్సుగల స్త్రీపేరు శ్యామ గాన అట్టి వయస్సుగలదనియు శ్యామలవర్ణకాంతిగలదనియు భావము. (త్ర్యక్షరము.)

౪౮౭. వదనద్వయాయై నమః

తా. శ్రీదేవి రెండుముఖములుగలదని భావము. (పంచాక్షరము.)

౪౮౮. దంష్ట్రోజ్జ్వలాయై నమః

తా. వరాహదంష్ట్రాసమాన దంతములచేత ప్రకాశించుచున్నదని భావము. (చతురక్షరము.)

౪౮౯. అక్షమాలాదిధరాయై నమః

తా. జపమాలాద్యాయుధములను నాలుగుహస్తములచేత ధరించినదని భావము. (సప్తాక్షరము.)

౪౯౦. రుధిరసంస్థితాయై నమః

తా. రుధిరమనే ధాతువునందు ఉన్నదని భావము. (షడక్షరము.)

౪౯౧. కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతాయై నమః

తా. కాది, పదిరెండుబీజములనే కాళరాత్రి మొదలగు పదిరెండు యోగినీలతో కూడిఉన్నదని భావము. (దశాక్షరము.)

౪౯౨. స్నిగ్ధౌదనప్రియాయై నమః

తా. ఘృతముతో కూడిన అన్నమందు ప్రీతికలదని భావము. (షడక్షరము.)

౪౯౩. మహావీరేంద్ర వరదాయై నమః

తా. ౧. మహావీరేంద్రులు బ్రహ్మ, విష్ణు, రుద్రులు వీరికి వరములిచ్చునదియని భావము.

౨. మహావీరులగు ప్రహ్లాదుఁడు, ఇంద్రుఁడు అను ఇరువురు పూర్వమందు నూఱు దివ్యవర్షములవఱకు అన్యోన్య జయాకాంక్షకలిగి యుద్ధము చేయుచుండఁగా శ్రీదేవి ప్రత్యక్షమై ఇద్దరకును సంధిచేసి ఇద్దరకును వరములిచ్చినది. గాన ఈ నామము కలిగినది.

౩. జాగ్రత్స్వప్నసుషుప్తులయందును, తురీయానుభవముగలవారు వీరేంద్రులు. అట్టివారికి వరములిచ్చునది యని భావము. (అష్టాక్షరము.)

౪౯౪. రాకిణ్యంబాస్వరూపిణ్యై నమః

తా. అనాహతచక్రాధిపతి అయిన రాకిణ్యంబా స్వరూపముగలదని భావము. (అష్టాక్షరము.)

౪౯౫. మణిపూరాబ్జనిలయాయై నమః

తా. మణిపూరకమలము నాభికిమీఁదుగా పదిదళములుగలది. ఆకమలము నివాసముగాగలది అని భావము. తదుక్తం యోగినీహృదయే:—

శ్లో. "దిక్పత్రే నాభిపద్మే త్రివదనవిలసద్దంష్ట్రిణీం రక్తవర్ణాం
శక్తిందంభోళిదణ్డావభయమపి భుజైర్ధారయంతీం మహోగ్రాం,
డామర్యాద్యైః పరీతాంపశుజనభయదాం మాంసధాత్వేకనిష్ఠాం

గౌడాన్నాసక్తచిత్తాం సకలసుఖకరీం లాకినీం భావయామః."
(అష్టాక్షరము.)

౪౯౬ వదనత్రయసంయుతాయై నమః

తా. ఆయోగినీదేవి మూఁడుముఖములు గలదని భావము. (అష్టాక్షరము.)

౪౯౭. వజ్రాదికాయుధోపేతాయై నమః

తా. వజ్రము మొదలగు ఆయుధములు ధరించినది యని భావము. (అష్టాక్షరము.)

౪౯౮. డామర్యాదిభిరావృతాయై నమః

తా. డామరి మొదలగు పది ఆవరణదేవతలతో కూడియున్నదని భావము. (అష్టాక్షరము.)

౪౯౯. రక్తవర్ణాయై నమః

తా. ఎఱ్ఱని కాంతిగలదని భావము. (చతురక్షరము.)

౫౦౦. మాంసనిష్ఠాయై నమః

తా. మాంసధాతువునందు శ్రీదేవి ఉన్నదని భావము.

పంచమశతకము సమాప్తము.

---

శ్రీ ర స్తు.

# శ్రీలలితాసహస్రనామావళి

## ష ష్ఠ శ త క ము.

---

౫౦౧. గుడాన్నప్రీతమానసాయై నమః

తా. శ్రీదేవి గుడాన్నమందు ప్రియమైన మనస్సుకలదియని భావము.
(అష్టాక్షరము.)

౫౦౨. సమస్తభక్తసుఖదాయై నమః

తా. శ్రీదేవి తనభక్తజనులందఱకును సుఖము నిచ్చునదియని భావము.
(అష్టాక్షరము.)

౫౦౩. లాకిన్యంబాస్వరూపిణ్యై నమః

తా. లాకిని అను చక్రేశ్వరి యోగినీస్వరూపము గలదియని భావము.
(అష్టాక్షరము.)

౫౦౪. స్వాధిష్ఠానాంబుజగతాయై నమః

తా. లింగస్థానమందు ఆఱుదళములుగల స్వాధిష్ఠానమను కమలము గలదు. అది అగ్నిభూతస్వరూపము, శక్తివిమర్శాంశము అగ్నిస్వరూపము గాన తాను ఉండునది అని భావము. చంద్రుఁడు ప్రకాశాంశము ఈశ్వర స్వరూపము.

ధ్యానము.—

"స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళసహితే వేదవక్త్రాం త్రినేత్రాం
హస్తాభ్యాం ధారయంతీం త్రిశిఖగుణకపాలాభయాన్యాత్తగర్వామ్,

మేదోధాతుప్రతిష్ఠా మభిమదముదితాం బన్దినీముఖ్యయుక్తాం
పీతాం దధ్యోదనేష్టా మభిమతఫలదాం కాకినీం భావయామః.''

(అష్టాక్షరము.)

౫౦౫. చతుర్వక్త్రమనోహరాయై నమః

తా. శ్రీదేవి నాలుగుముఖములుకలిగి మనోహరముగా నున్నదని భావము. (అష్టాక్షరము.)

౫౦౬. శూలాద్యాయుధసంపన్నాయై నమః

తా. శూలము మొదలగు ఆయుధములు ధరించినదని భావము. (అష్టాక్షరము.)

౫౦౭. పీతవర్ణాయై నమః

తా. శ్రీదేవి పచ్చనికాంతిగలదని భావము. (చతురక్షరము.)

౫౦౮. అతిగర్వితాయై నమః

తా. సౌందర్యసంపన్నత్వాది సకలైశ్వర్యములచేత అధికమైన గర్వము కలదని భావము. (పంచాక్షరము.)

౫౦౯. మేదోనిష్ఠాయై నమః

తా. మెదడనునది శిరస్సునందుఁగల ద్రవించుచున్న తెల్లని మృదు మాంసవిశేషము. ఆధాతువునందు బుద్ధి కళారూపముగా యున్నదని భావము. (చతురక్షరము.)

౫౧౦. మధుప్రీతాయై నమః

తా. మధువునందు ప్రీతిగలదని భావము. (చతురక్షరము.)

౫౧౧ బన్దిన్యాదిసమన్వితాయై నమః

తా. బందినీ మొదలగు ఆఱుగురు యోగినీలతో కూడియున్నదని భావము. (అష్టాక్షరము.)

౫౧౨. దధ్యన్నాసక్తహృదయాయై నమః

తా. పెరుగన్నమందు విశేషాసక్తిగల మనస్సుకలదని భావము. (అష్టాక్షరము.)

౫౧౩. డాకినీరూపధారిణ్యై నమః

తా. డాకినీ అను చక్రేశ్వరీరూపమును ధరించియున్నదని భావము. (అష్టాక్షరము.)

౫౧౪. మూలాధారాంబుజారూఢాయై నమః

నాలుగుదళములుగల మూలాధారకమలకర్ణికయం దున్నదని భావము.

శ్లో. "మూలాధారస్థపద్మే శ్రుతిదళలసితే పంచవక్త్రాం త్రినేత్రాం
ధూమ్రాభా మస్థిసంస్థాంసృణిమపికమలం పుస్తకంజ్ఞానముద్రామ్,
బిభ్రాణాంబాహుదణ్డైస్సులలిత వరదాపూర్వశక్త్యన్వితాం తాం
ముద్గాన్నాసక్తచిత్తాం మధుమదముదితాం సాకినీం భావయామః."
(అష్టాక్షరము.)

౫౧౫. పంచవక్త్రాయై నమః

తా. అయిదుముఖములు గలదని భావము. (చతురక్షరము.)

౫౧౬. అస్థిసంస్థితాయై నమః

తా. అస్థులనే ధాతువునందు సత్తారూపముగా యున్నది గనుకనే అస్థులకు వృద్ధిగుణము కలిగినది. (పంచాక్షరము.)

౫౧౭. అంకుశాదిప్రహరణాయై నమః

తా. అంకుశము మొదలగు ఆయుధములను ధరించినది. (అష్టాక్షరము.)

౫౧౮. వరదాదినిషేవితాయై నమః

తా. వరద మొదలగు నలుగురు యోగినులచేత సేవింపఁబడుచున్నది. (అష్టాక్షరము.)

౫౧౯. ముద్గౌదనాసక్తచిత్తాయై నమః

తా. ముద్గౌదనము అనగా పెసలపప్పు, జీలకఱ్ఱ మున్నగువస్తువులతో చేర్చివండిన పులగము అను సిద్ధాన్నమునందు ఆసక్తిగల మనస్సుకలది. (అష్టాక్షరము.)

౫౨౦. సాకిన్యంబాస్వరూపిణ్యై నమః

తా. సాకిని అను చక్రేశ్వరీరూపమును ధరించియున్నదని భావము. (అష్టాక్షరము.)

౫౨౧. ఆజ్ఞాచక్రాబ్జనిలయాయై నమః

తా. రెండుదళములుగల భ్రూమధ్యమందున్న ఆజ్ఞాకమలము స్థానము గాగలదని భావము. అచటగల హాకినీ అను యోగినీధ్యానము.

శ్లో. భ్రూమధ్యేబిందుపద్మే దళయుగకలితే శుక్లవర్ణాం కరాబ్జై
ర్బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుకమమలా మక్షమాలాం కపాలం,
షట్చక్రాధారమద్యాం త్రినయనలసితాం హంసవత్యాదియుక్తాం
హారిద్రాన్నైకసక్తాం సకలశుభకరీం హాకినీం భావయామః.”
(అష్టాక్షరము.)

౫౨౨. శుక్లవర్ణాయై నమః

తా. శ్రీదేవి తెల్లనికాంతికలదని భావము. (చతురక్షరము.)

౫౨౩. షడాననాయై నమః

తా. శ్రీదేవి ఆఱుముఖములు కలదని భావము. (చతురక్షరము.)

౫౨౪. మజ్జాసంస్థాయై నమః

తా. మజ్జ అను ధాతువునందున్నదని యీధాతువు మెదడువలన కలిగి, శుక్లరూపముకాని మధ్యావస్థగా నున్నది. సప్తధాతువులందును చిత్కళల సత్తారూపముగా నున్నదని భావము. (చతురక్షరము.)

౫౨౫. హంసవతీముఖ్యశక్తిసమన్వితాయై నమః

తా. హంసవతి మొదలగు యోగినులతో కూడియున్నదని భావము. (ద్వాదశాక్షరము.)

౫౨౬. హరిద్రాన్నైకరసికాయై నమః

తా. హరిద్రామిశ్రితాన్నమందు ప్రీతిగలదని భావము. (అష్టాక్షరము)

౫౨౭. హాకినీరూపధారిణ్యై నమః

తా. హాకిని యను చక్రేశ్వరీరూపము ధరించియున్నదని భావము. (అష్టాక్షరము.)

౫౨౮. సహస్రదళపద్మస్థాయై నమః

తా. శిరోమధ్యభాగమునందున్న సహస్రారకమలము వేయిదళములు గల పద్మము. దాని కర్ణికయందు యాకినీరూపముగా యున్నదని భావము.

యాకినీ ధ్యానము.—

శ్లో. "ముండవ్యోమస్థపద్మే దశశతదళకే కర్ణికాచన్ద్రసంస్థాం
రేతోనిష్ఠాం సమస్తాయుధకలితకరాం సర్వతో వక్త్రపద్మాం,
ఆదిక్షాన్తార్ణశక్తి ప్రకటపరివృతాం సర్వవర్ణాం భవానీం
సర్వాన్నాసక్తచిత్తాం పరశివరసికాం యాకినీం భావయామి."

(అష్టాక్షరము.)

౫౨౯. సర్వవర్ణోపశోభితాయై నమః

తా. సకలవర్ణములచేతను ప్రకాశించుచున్నదని భావము. (అష్టాక్షరము.)

౫౩౦. సర్వాయుధధరాయై నమః

తా. సకలాయుధములను ధరించినదని భావము. (షడక్షరము.)

౫౩౧. శుక్లసంస్థితాయై నమః

తా. శుక్లధాతు వందు జీవరూపముగానున్నది గాన వృద్ధిగుణము కలది. (పంచాక్షరము.)

౫౩౨. సర్వతోముఖ్యై నమః

తా. అంతటను ముఖములుకలదని భావము. (పంచాక్షరము.)

౫౩౩. సర్వౌదనప్రీతచిత్తాయై నమః

తా. శ్రీదేవి సకలాన్నములందును ప్రీతికలదని భావము. (అష్టాక్షరము.)

౫౩౪. యాకిన్యంబాస్వరూపిణ్యై నమః

తా. యాకిని అను చక్రేశ్వరీస్వరూపముగా ఉన్నది.(అష్టాక్షరము.)

౫౩౫. స్వాహాయై నమః

తా. ౧. స్వాహాశబ్దము, దేవతాహవిర్దానవాచకము. తత్స్వరూపిణి యని భావము.

శ్లో. "సోమసంస్థాః హవిస్సంస్థాః పాకసంస్థాశ్చ సప్తధాః,
తాస్త్వదుచ్చారణాద్దేవి క్రియంతే బ్రహ్మవాదిభిః."
(మార్కండేయపురాణే.)

౨. అగ్నిమూర్తియగు శివునియొక్క పత్ని 'స్వాహాదేవి' ఈమె పుత్త్రుఁడు షణ్ముఖుఁడు.

శ్లో. "స్వాహా వహ్న్యాత్మనస్తస్య ప్రోక్తా పశుపతేః ప్రియా,
షణ్ముఖో భగవాన్ దేవః బుధైః పుత్ర ఉదాహృతః" (లింగపురాణే.)

౩. మాహేశ్వరీపీఠాధిష్ఠాత్రియగు దేవత "స్వాహా" నామము కలది కలదు. తత్స్వరూపిణి యని భావము. 'స్వాహామాహేశ్వరేపురే' అని పద్మపురాణము. (ద్వ్యక్షరము.)

౫౩౬. స్వధాయై నమః

తా. ౧. స్వధాశబ్దము పితృగణములకు హవిర్దానమిచ్చుమంత్రము ఈ శబ్దమునకు అర్థస్వరూపముగా శ్రీదేవి యున్నదని భావము.

౨. స్వాహాదేవి స్వధాదేవి అగ్ని భార్యలుగా యున్నారు. కనుక తద్రూపముగలదని భావము. (ద్వ్యక్షరము.)

౪౩౭. అమత్యై నమః

తా. అవిద్యాస్వరూపిణి అనియు, ఆదిసృష్టి అబుద్ధిపూర్వకము గనుక ప్రథమసృష్టిరూపమైన అవ్యక్తము మూలప్రకృతి స్వరూపము. (త్ర్యక్షరము.)

(ప్రకారాన్తరం నామ) మత్యై నమః

తా. మతిస్వరూపిణి యని భావము. (ద్వ్యక్షరము.)

౪౩౮. మేధాయై నమః

తా. ౧. శ్రీదేవి బుద్ధిస్వరూపురాలని భావము.

౨. "మేధాకాశ్మీరమండలే." యను పద్మపురాణానుసారము కాశ్మీరమండలాధిష్ఠాత్రియగు దేవత, "మేధా" సంజ్ఞగలది గలదు. తద్రూపిణి యని భావము. (ద్వ్యక్షరము.)

౪౩౯. శ్రుత్యై నమః

తా. ఋగ్యజుస్సామాథర్వణవేదములు శ్రవణగోచరములు గావున శ్రుతులనంబడును. ఇవియే బ్రహ్మస్వరూపము. అట్టి వేదస్వరూపముగా ఉన్నదని భావము. (ద్వ్యక్షరము.)

౪౪౦. స్మృత్యై నమః

తా. మన్వాది స్మృతి స్వరూపిణియని భావము. (ద్వ్యక్షరము.)

౪౪౧ అనుత్తమాయై నమః

తా. దేవతలలో శ్రీదేవికంటె ఉత్తమదేవతలు లేనందున అనుత్తమ అని నామము కలిగినది. సర్వోత్తమురాలని భావము. (చతురక్షరము.)

## ౯౪౨. పుణ్యకీర్త్యై నమః

తా. శ్రీదేవియొక్క చరిత్రలును, మహిమలును, పవిత్రమైనవియు భక్తులయొక్క పాపములను పోఁగొట్టునవియు, జ్ఞానమును కలుగఁజేయు నవియునని భావము. (చతురక్షరము.)

## ౯౪౩. పుణ్యలభ్యాయై నమః

తా. అనేకజన్మలయందు కోరికలులేక బ్రహ్మార్పణబుద్ధితో అనేక పుణ్యములు చేసినవారికే శ్రీవిద్యాప్రాప్తి కలుగునని భావము. చరమ జన్మమందే శ్రీవిద్య లభించును. వీరు జీవితకాలమందే ముక్తులు. వీరికి పునర్జన్మము లేదు. (చతురక్షరము.)

## ౯౪౪. పుణ్యశ్రవణకీర్తనాయై నమః

తా. శ్రీదేవియొక్క నామశ్రవణకీర్తనాదులు పవిత్రములయిన వియు, భక్తులకు జ్ఞానప్రదములైనవనియు అని భావము. (అష్టాక్షరము.)

## ౯౪౫. పులోమజార్చితాయై నమః

తా. పులోమఋషికుమార్తెయగు శచీదేవి నహుషుఁడు స్వర్గాధిపత్యము వహించిన కాలమందు తన భర్తయగు ఇంద్రుఁడు దేశాంతరుఁడు కాఁగా తత్ప్రాప్తికొఱకు బృహస్పతివలన త్రిపురసుందరీమంత్రమును ఉపదేశమును పొంది, శ్రీదేవి నారాధించి భర్తను పొందెను. కావున 'పులోమజార్చిత' యని చెప్పఁబడునని భావము. (షడక్షరము.)

## ౯౪౬. బన్ధమోచిన్యై నమః

తా. భక్తులకు కారాగృహబంధనాద్యాపదలను తొలగించునది యని భావము. (పంచాక్షరము.)

## ౯౪౭. బన్ధురాలకాయై నమః

తా. దట్టమైన కేశకలాపము గలదని భావము. (పంచాక్షరము.

౫౪౮. విమర్శరూపిణ్యై నమః

తా. పరబ్రహ్మమందుఁ గలస్ఫురణ శక్తి స్వరూపురాలుగా నున్నదని భావము. (షడక్షరము.)

౫౪౯. విద్యాయై నమః

తా. శ్రీదేవి మోక్షమును కలుగఁజేయు జ్ఞానస్వరూపమని భావము. (ద్వ్యక్షరము.)

౫౫౦. వియదాదిజగత్ప్రసవే నమః

తా. ఆకాశాది పంచభూతములను చతుర్వింశతి తత్త్వములతో కూడిన జగత్తును పుట్టించునది యని భావము. (అష్టాక్షరము.)

౫౫౧. సర్వవ్యాధిప్రశమన్యై నమః

తా. శ్రీదేవి జ్వరము మొదలగు సమస్తరోగములను పోఁగొట్టునది యని భావము. (అష్టాక్షరము.)

౫౫౨. సర్వమృత్యునివారిణ్యై నమః

తా. కాలమృత్యువు, అకాలమృత్యువు మొదలగు సకలవిధ మృత్యువులను పోఁగొట్టునది యని భావము. (అష్టాక్షరము.)

౫౫3. అగ్రగణ్యాయై నమః

తా. సృష్టికి పూర్వమందు ఉన్నదిగాన మొదట లెక్కింపఁదగినదని భావము. (చతురక్షరము.)

౫౫౪. అచిన్త్యరూపాయై నమః

తా. సత్వాదిగుణత్రయసంపర్కము లేనిదిగాన ఇట్టిది అని ఊహింపశక్యము కానిదని భావము. (పంచాక్షరము.)

౫౫౫ కలికల్మషనాశిన్యై నమః

తా. కలివలన కలిగినదోషములను పాపములను హరింపఁజేయునది

యని భావము. "కృత్యస్యాఖిలపాపస్య జ్ఞానతోఽజ్ఞానతోఽపివా, ప్రాయశ్చిత్తం పరం ప్రోక్తం పరాశక్తేఃపదస్మృతిః". (అష్టాక్షరము.)

౫౫౬. కాత్యాయిన్యై నమః

తా. ౧. సకలదేవతల తేజస్సు కలసి పుట్టిన పరాశక్తికి 'కాత్యాయని' యను నామము కలదు.

౨. కతుండను ఋషియొక్క కుమార్తె కాత్యాయని, తత్స్వరూపము గలది.

౩. ఓడ్యాణపీఠాధిష్ఠాత్రి యగుదేవి కాత్యాయని, తత్స్వరూపిణి. (చతురక్షరము.)

౫౫౭. కాలహన్త్ర్యై నమః

తా. మృత్యువును సంహరించునదని భావము. (చతురక్షరము.)

౫౫౮. కమలాక్షనిషేవితాయై నమః

తా. విష్ణుమూర్తిచేత పూజింపఁబడినదని భావము. (అష్టాక్షరము.)

౫౫౯. తాంబూలపూరితముఖ్యై నమః

తా. తాంబూలముచేత పూరితమైన ముఖముకలదని భావము.(అష్టాక్షరము.)

౫౬౦. దాడిమీకుసుమప్రభాయై నమః

తా. దాడిమపుష్పమువంటి ఎఱ్ఱనికాంతి గలదని భావము. (అష్టాక్షరము.)

౫౬౧. మృగాక్ష్యై నమః

తా. లేడి నేత్రములు, వైశాల్యము, జాగరూకత, చాంచల్యము కలవి గాన అట్టినేత్రములు కలదని భావము. (త్ర్యక్షరము.)

౫౬౨. మోహిన్యై నమః

తా. సకలజగత్తును మోహింపఁజేయునదిగాన మోహిని అని నామము కలిగినది. (త్ర్యక్షరము.)

# శ్రీ లలితాసహస్రనామావళి

## ౫౬౩. ముఖ్యాయై నమః

తా. సృష్టికి ఆది యందున్నది గాన ముఖ్య అని నామము కలిగినది (ద్వ్యక్షరము.)

## ౫౬౪. మృడాన్యై నమః

తా. సకల భక్తజనులకు సుఖమునిచ్చు పరశివుఁడు మృడుఁడు. అట్టి మృడుని భార్య కనుక మృడానీ అని నామము కలిగినది. (త్ర్యక్షరము.)

## ౫౬౫. మిత్రరూపిణ్యై నమః

తా. సూర్యునితో సమానమైన రూపముగలదని భావము. (పంచాక్షరము.)

## ౫౬౬. నిత్యతృప్తాయై నమః

తా. సర్వదా ఆనందముచేత తృప్తిగలదని భావము.(చతురక్షరము)

## ౫౬౭. భక్తనిధయే నమః

తా. భక్తులకు కోరికలను ఇచ్చుటకు నిధివంటిదనియు, సకలభక్తులందును సాక్షికము లేక సమాన ప్రేమకలదనియు భావము. (చతురక్షగము)

## ౫౬౮. నియన్త్ర్యై నమః

తా. జగత్తునకు నియామకురాలనియు, బ్రహ్మస్వరూపిణి అనియు, సర్వాధికారిణి యనియు భావము. (త్ర్యక్షరము.)

## ౫౬౯. నిఖిలేశ్వర్యై నమః

తా. సకలప్రపంచమునకు ప్రభ్వీ యని భావము. (పంచాక్షరము.)

## ౫౭౦. మైత్ర్యాదివాసనాలభ్యాయై నమః

తా. మైత్రి, కరుణ, ముదిత ఉపేక్ష అని వాసనలు నాలుగువిధములు. సౌఖ్యము ననుభవించువారియందు స్నేహభావముతోనుండుట మైత్రి దుఃఖితులందు దయారసముగానుండుట కరుణ. పుణ్యాత్ములగు వారినిచూచి సంతోషముగానుండుట ముదిత. పాపాత్ములందు ఉపేక్షగా

నుండుట ఉపేక్ష. ఇది వాసనాచతుష్టయము. శ్రీదేవి ఈగుణములుగల భక్తులకు సులభముగా ప్రసన్నురాలగునని భావము. 'మైత్రీముదితా కరుణోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్య విషయాణాం భావనాతశ్చిత్త ప్రసాదనమ్.' అని యోగసూత్రము. (అష్టాక్షరము.)

౫౭౧. మహాప్రళయసాక్షిణ్యై నమః

తా. కల్పాంతమందు అనఁగా ప్రళయకాలమందు పరశివుఁడు కాలాగ్ని రుద్రుఁడై, తననేత్రాగ్నిచేత బ్రహ్మవిష్ణ్వాదులతోఁగూడిన సకల జగత్తును భస్మముచేసి, ఆభస్మమును పూసుకొని మహాతాండవముచేయు చుండగా శ్రీదేవిమాత్రముండి ఆ తాండవమునకు సాక్షిగా ఉండును. సకలజనులు గాఢసుషుప్తియందు సకలమును మఱచియున్నప్పుడు చిత్కళ మాత్రము సాక్షిగా ఉండును. అటులనే జగత్ప్రళయమందు బ్రహ్మ స్వరూపిణియైన పరాశక్తిమాత్రము సాక్షిగా నుండును. గనుక ఎన్నఁడు నాశములేనిది. బ్రహ్మవేత్త. అట్టి బ్రహ్మస్వరూపుఁడగుచున్నాఁడు గనుక అదియే ముక్తి అని మోక్షమని వాడుకగలదు అని భావము. (అష్టాక్షరము.)

౫౭౨. పరాశక్త్యై నమః

తా. ప్రతిశరీరమందును తొమ్మిదిధాతువులును ఈ తొమ్మిదిధాతువులకు సత్తారూపమైనది పదియవధాతువు కలదు. ఆ పదియవధాతువే పరాశక్తి అని వసిష్ఠసంహిత. శ్లో. "త్వగసృఙ్మాంసమేదోఽస్థి ధాతవశ్శక్తి మూలకాః, మజ్జాశుక్లప్రాణజీవ ధాతవశ్శివ మూలకాలకాః. నవధాతు రయందేహో నవయోనిసముద్భవః, దశమీధాతురేకైవ పరాశక్తిరితీర్య తేతి." శ్రు. "పరాఽస్యశక్తి ర్వివిధైవ శ్రూయతఇతి." తా. బ్రహ్మ శక్తి సకలధాతువులందును ప్రవేశించి అనేకనామములు కలిగియున్నదని శ్రుత్యర్థము. లైంగే.—శ్లో. "యస్యయస్య పదార్థస్య యాయాశ్శక్తి రుదాహృతా, సాసా విశ్వేశ్వరీ దేవీ శక్తస్సర్వో మహేశ్వరః. శక్తి మన్తః పదార్థా యే తేవై సర్వవిభూతయః, పదార్థే శక్తయో యాయా స్తాంస్తాం గౌరీం విదుర్బుధా" ఇతి. (చతురక్షరము.)

### ౫౭౩. పరానిష్ఠాయై నమః

తా. ఉత్కృష్టమైననిష్ఠ. అనఁగా బ్రహ్మజ్ఞానము సకలమును ఆత్మయందు లయభావనచేసి ఆత్మమాత్రావశేషముగానున్న తురీయావస్థాస్థితి పరానిష్ఠ అనియు, అట్టి స్థితియే శ్రీదేవిస్వరూపమని భావము. తురీయవివరణము.—సూతసంహితాయాం—శ్లో. గీతాసుచ. "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానేపరిసమాప్యతే, ఇతి. శాస్త్రాచార్యోపదేశేన తర్కైః శాస్త్రానుసారిభిః. సర్వసాక్షితయాఽఽత్మానం సమ్యఙ్నిశ్చిత్యసుస్థిరః, స్వాత్మనోఽన్యతయాభాన్తం సమస్తమవిశేషతః. స్వాత్మమాత్రతయా బుద్ధ్వా పునః స్వాత్మానమద్వయం, శుద్ధబ్రహ్మేతి నిశ్చిత్య స్వయం స్వానుభవేనచ, నిశ్చయం చ స్వచిన్మాత్రే విలాప్యావిక్రియేఽద్వయే, విలాపనం చ చిద్రూపం బుద్ధ్వా కేవలరూపతః, స్వయం తిష్ఠేదయం సాక్షాద్బ్రహ్మవిత్ప్రవరో మునిః. ఈదృశీయం పరానిష్ఠాశ్రౌతీ స్వానుభవాత్మికేతి." (చతురక్షరము.)

### ౫౭౪. ప్రజ్ఞానఘనరూపిణ్యై నమః

తా. తేజోమయమైన స్వాత్మస్వరూపజ్ఞానముకంటె వేఱువృత్తిలేనిబుద్ధికి ప్రజ్ఞానఘనమని నామము. అదియే తురీయావస్థగాన తురీయపాదమని బ్రహ్మాకారస్థితి అని భావము. శ్రు. "సయథా సైంధవఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవైవం వా అరేఽయమాత్మాఽనన్తరోఽబాహ్యః కృత్స్నోఽన్తః ప్రజ్ఞానఘన ఇతి. (అష్టాక్షరము.)

### ౫౭౫. మాధ్వీపానాలసాయై నమః

తా. దేవయోగ్యమైన ద్రాక్షాసవ పుష్పాసవాది పానముచేత శరీరపారవశ్యము కలదని భావము. రహస్యార్థమందు బ్రహ్మానందరసానుభవముచేత ప్రపంచజ్ఞానరాహిత్యము కలదని ద్వైతజ్ఞానశూన్యముగా ఉన్నదని భావము. అజాలు ప్రాకృతిమద్యము శ్రీలలితాంబికకు ప్రీతిఅని భావింతురు. జ్ఞానమునకు కేవలవిరోధియు, తామసవృద్ధికరమును, జడభావమును వృద్ధిని

పాదించుచు మనుష్యులకు సహా అపవిత్ర పదార్థమగు మద్యమును దేవపూజలో చేర్చుటకంటె పాపకృత్యము వేఱులేదు. శ్రుతిస్మృతులు శ్రీదేవి ఆజ్ఞారూపములుగాన అట్టివారు దేవతా ఆజ్ఞోల్లంఘనదోషులుగా నున్నారని భావము. (అష్టాక్షరము.)

౫౭౬. మత్తాయై నమః

తా. పూర్ణానందానుభవముచేత మత్తతగలదనియు శ్రు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే పూర్ణాహంభావము గలదనియు భావము. (ద్వ్యక్షరము.)

౫౭౭. మాతృకావర్ణరూపిణ్యై నమః

తా. అకారాదిక్షకారాంతమైన ఏకపంచాశద్వర్ణములు మాతృకాశక్తిస్వరూపములుగాన శ్రీదేవి ఆయావర్ణరూపముగానున్నదని ఈమాతృకావర్ణములవలననే సకలమంత్రములు వేదశాస్త్రములు, సకలదేశభాషలు పుట్టుచున్నందున మాతృకాశక్తి అని నామాంతరము కలిగినది. (అష్టాక్షరము.)

౫౭౮. మహాకైలాసనిలయాయై నమః

తా. ఉత్కృష్టమైన కైలాసపర్వతము స్థానముగాఁ గలదనియు, శ్రీచక్రమందు బిందుస్థానము మహాకైలాసమనియు, అచట నివసించునదనియు, మాతృకోత్పత్తికి ఆద్యంతములందు బిందువుగలదనియు, ఆ బిందువు మహాకైలాసమనియు, అచట నివసించునదియని భావము. శారీరపరమందు సహస్రారకర్ణిక బ్రహ్మరంధ్రాధోభాగము మహాకైలాసము అచట నివసించునదని భావము. (అష్టాక్షరము.)

౫౭౯. మృణాళమృదుదోర్లతాయై నమః

తా. శ్రీదేవి తామరనాళములతో సమానమైన లతలవంటి భుజములు కలది. (అష్టాక్షరము.)

౫౮౦. మహనీయాయై నమః

తా. సకలదేవతలచేను పూజింపఁదగినది. (చతురక్షరము.)

౫౮౧. దయామూర్త్యై నమః

తా. శ్రీదేవి భక్తులయందుఁ గల దయయే స్వరూపముగాఁగల దని భావము. (చతురక్షరము)

నం॥ ౨. మహాసామ్రాజ్యశాలిన్యై నమః

తా. మహాకైలాసాధిపత్యము మహాసామ్రాజ్య మనంబడును. శ్రీదేవి అట్టి మహాసామ్రాజ్యపదవిచేతఁ బ్రకాశించుచున్నది. (అష్టాక్షరము.)

నం॥ 3. ఆత్మవిద్యాయై నమః

తా. శ్రీదేవి బ్రహ్మవిద్యారూపిణి అనియు, అహ మనునది ఆత్మ మంత్రము కనుక అట్టి ఆత్మమంత్రస్వరూపిణి అనియు భావము. (చతురక్షరము.)

నం॥ ౪. మహావిద్యాయై నమః

తా. సప్తకోటిమహామంత్రములలోను ఉత్తమమైనది శ్రీవిద్యా షోడశాక్షరీమంత్రముగాన మహావిద్యా అనియు, వనదుర్గామంత్రము మహావిద్యాస్తోత్రము స్వరూపము గాఁగలదనియు భావము. (చతురక్షరము)

నం॥ ౫. శ్రీవిద్యాయై నమః

తా. బాలా - పంచదశాక్షరి - షోడశాక్షరములకు శ్రీవిద్యాసంజ్ఞ కలిగినందున ఆయామంత్రస్వరూపముగా నున్నదనియు, శ్రీబీజప్రధానమైన విద్యగనుక శ్రీవిద్య అని ప్రసిద్ధి కలిగినది. కామకలాఏకాక్షరీవిద్య అనియు, సిద్ధలక్ష్మీ మంత్రస్వరూపిణి అనియు భావము. (త్ర్యక్షరము.)

నం॥ ౬. కామసేవితాయై నమః

తా. శ్రీదేవి మన్మథునిచేత సేవింపఁబడినదని భావము. అరుణోపనిషత్తు:— "పుత్రోనిబుబుత్స్యావై దేహః, అచేతాయశ్చచేతనః సతం మణిమవిన్దత్, సోఽనంగులిరావయత్, సోఽగ్రీవః ప్రత్యముంచత్, సోఽజిహ్వో అపశ్చతి; నైనమృషిమవిదిత్వా నగరం ప్రవిశేత్, యది ప్రవిశేత్, మిథో చరిత్వాప్రవిశేత్, తత్వంభవస్పవ్రతమితి." అని శ్రుతి.

లక్ష్మీపుత్రుఁడైన శరీరములేని మన్మథుఁడు మనస్సు లేనివాఁడైనను ప్రసిద్ధమైన శ్రీవిద్యను గ్రహించినాఁడు. అతఁడు ఈ విద్యారత్నమును గ్రహించినాఁడు, ఆ మణిని కంఠమందు ధరించినాఁడు. ఉపాసించినాఁడని, నోరులేని అతఁడు విద్యారత్నమును జపించినాఁడు. కనుక పంచదశీ మంత్రములు పదిరెండువిధములు గలిగియున్నవి. అందులో మన్మథవిద్య ఒకటిగా నున్నందున మన్మథుఁడు ఋషిగా ఉన్నాఁడు. సకలమంత్రోపాసనలును ఋష్యాదిషడంగజ్ఞానములేక చేయఁగూడదు. నగరప్రవేశమనఁగా శ్రీచక్రార్చన అంతర్యాగక్రమముగా చేయవలెననియు,ఒకప్పుడు బహిర్యాగము చేయఁదలఁచినయెడల శ్రీచక్రమందు శివశక్తిసామరస్యమును సంపాదించి చేయవలెననియు, ఈ ద్వంద్వసామరస్యమును సంపాదించుటయే మన్మథవ్రతమని ఈ శ్రుత్యర్థము. మన్మథుఁడు శరీరములేనివాఁడైనను, అశక్యములైనపనులు నొనర్చుచుండుటచేత పరదేవతాకటాక్షమహిమగలవాఁడని తెలియుచున్నది. శ్రీదేవి అనుగ్రహించి తన పాశాంకుశములను చెఱకువిల్లును పుష్పబాణములను మన్మథునకు ఇచ్చెను. వీనిచేత మూఁడులోకములను అనాయాసముగా మన్మథుఁడు జయించెను. జయించుచున్నాఁడు కనుక పరదేవతాకటాక్షమహిమకు భక్తులలో మన్మథుఁడు లోకమందు దృష్టాంతముగా నున్నాఁడని భావము. (పంచాక్షరము.)

౫౮౭. శ్రీషోడశాక్షరవిద్యాయై నమః

తా. రాజరాజేశ్వరీవిద్య పదునారుబీజములు గలది. అందులో శ్రీబీజము షోడశీకలయగు నిత్యాకలాస్వరూపము, తక్కిన పదునయిదుకలలు పదునయిదుబీజములు, వృద్ధిక్షయములు గలకలలు, పంచదశీకూటత్రయము మూఁడుబీజములుగాను ఇతరములు పదమూఁడుబీజములుగాను కలిసి షోడశాక్షరీమంత్ర మగుచున్నది. పంచదశీ వర్ణవిభాగమైనపుడు గౌడపాదసూత్రము:-అథ విద్యా హ్యష్టావింశతివర్ణవిశిష్టా. ఇతి. లలితా పచదశీమంత్రమందు లక్ష్మీబీజయుక్తమైన షోడశాక్షరీ యని హయగ్రీవం

విద్యయూ ఉన్నందున సంశయనివృత్తికొఱకు గౌడపాదాచార్యులవారు సూత్రమును నిరూపించినారు. కనుక షోడశాక్షరీమంత్రమునకును శ్రీదేవికిని భేదములేదని భావము. (అష్టాక్షరము.)

౫౮౮ త్రికూటాయై నమః

తా. శ్రీవిద్యా, పంచదశీవిద్యా, కూటత్రయముగా ఉన్నందున కూటత్రయస్వరూపిణి అని భావము (త్ర్యక్షరము )

౫౮౯. కామకోటికాయై నమః

తా. పరమశివుఁడైన కామేశ్వరుఁడు కోటి=అవధిగాగలది, అర్ధనారీశ్వరుఁడు గాన శివశక్తిసామరస్యము పూర్ణ వస్తువని భావము. (పంచాక్షరము.)

౫౯౦. కటాక్షకింకరీభూత కమలాకోటిసేవితాయై నమః

తా. శ్రీదేవికటాక్షమాత్రము చేత కింకరులుగానున్న కోటి సంఖ్యలుగల లక్ష్ములచేత సేవింపఁబడుచున్నదనియూ, ఏభక్తునియందు కటాక్షము కలుగునో అట్టి భక్తులసంతతియం దనేకపరంపరలవఱకు అఖండలక్ష్మీప్రాప్తి కలుగునని భావము.

౫౯౧. శిరస్స్థితాయై నమః

తా. శిరస్సునందు గురుపాదుకారూపముగా నున్నదని భావము. (చతురక్షరము.)

౫౯౨. చన్ద్రనిభాయై నమః

తా. బ్రహ్మరంధ్రాధోభాగమందు సహస్రారకర్ణిక చంద్రమండలాకారముగా నున్నందునచంద్రునివంటికాంతికలదని భావము.(చతురక్షరము)

౫౯౩. ఫాలస్థాయై నమః

తా. ఫాలప్రదేశమందు బిందుయుక్తమైన భువనేశ్వరీ బీజరూపముగా ఉన్నది. (త్ర్యక్షరము.)

౫౯౪. ఇంద్రధనుఃప్రభాయై నమః

తా. ఇంద్రధనుస్సువలె నాలుగురంగులుకలసిన కాంతికలది. (షడక్షరము.)

౯౫. హృదయస్థాయై నమః

తా. శ్రీదేవి హృదయమందు కామరాజబీజస్వరూపముగా నున్నది. (చతురక్షరము.)

౯౬. రవిప్రఖ్యాయై నమః

తా. మణిపూరానాహతములు రవిమండలముగాన సూర్యరూపముగా నున్నది. (చతురక్షరము.)

౯౭. త్రికోణాంతరదీపికాయై నమః

తా. స్వాధిష్ఠానమందు త్రికోణాకారముగాను అగ్నిరూపముగా నున్నదని భావము. మూలధారస్వాధిష్ఠానము అగ్నిమండలము, మణిపూరానాహతములు సూర్యమండలము, విశుద్ధ ఆజ్ఞలు చంద్రమండలము, సహస్రారము ఉత్తమ చంద్రమండలము అని ప్రసిద్ధి. (అష్టాక్షరము.)

౯౮. దాక్షాయణ్యై నమః

తా. దక్షప్రజాపతికుమార్తెయగు సతీదేవి స్వరూపముకలది. (చతురక్షరము.)

౯౯. దైత్యహంత్ర్యై నమః

తా. భండాసురాది దుష్టరాక్షసులను సంహరించినది. (చతురక్షరము.)

౧౦౦. దక్షయజ్ఞవినాశిన్యై నమః

తా. దక్షయజ్ఞవినాశమునకు సతీదేవియే కారణమని భావము. (అష్టాక్షరము.)

సప్తశతకము సమాప్తము.

శ్రీ ర స్తు

# శ్రీ లలితాసహస్ర నామావళి

## స ప్త మ శ త క ము.

---

౬౦౧. దరాందోళిత దీర్ఘాక్ష్యై నమః

తా. ౧. కొంచెముగ సంచలించుచున్న ఆకర్ణాంతవిశాలములయిన నేత్రములు గలది.

౨. భయమును పోగొట్టెడి విశాల నేత్రములుగలది. కటాక్షపాత మాత్రముచేతనే భక్తులయొక్క సకలభయములను పోగొట్టునట్టిది. (అష్టాక్షరము.)

౬౦౨. దరహాసోజ్జ్వలన్ముఖ్యై నమః

తా. చిఱునవ్వుప్రకాశించుచున్న ముఖారవిందముకలదని భావము (అష్టాక్షరము.)

౬౦౩. గురుమూర్త్యై నమః

తా. శ్రీవిద్యాగురుస్వరూపముగా దేవత ఉన్నదనియు, గురుదేవతలకు భేదము లేదనియు భావము. (చతురక్షరము.)

౬౦౪. గుణనిధయే నమః

తా. సత్త్వాదిగుణములకు శ్రీదేవి నిధివంటిది. సృష్ట్యాదియందు బ్రహ్మవస్తువుమాత్రము సర్వసంపూర్ణముగా నున్నది. సృష్ట్యావిర్భావకాలమందు భిత్తియందు చిత్తరువువలె గుణత్రయసంవలితమైన అవ్యక్తము ఉత్పన్నమైనది. తరువాత త్రిగుణములు విభాగమైనవి గాన గుణత్రయమునకును శ్రీదేవియే స్థానభూతమని భావము. (చతురక్షరము.)

౬౦౫. గోమాత్రే నమః

తా. కామధేనువునకు గాని గోసముదాయమునకు గాని జనని అనియు, గోశబ్దము వాక్కునందును వర్తించుచున్నందున శబ్దబ్రహ్మస్వరూపిణి యనిభావము. (త్ర్యక్షరము.)

౬౦౬. గుహాజన్మభువే నమః

తా. కుమారస్వామికి తల్లి యని భావము. (పంచాక్షరము.)

౬౦౭. దేవేశ్యై నమః

తా. దేవతలందఱకును ప్రభ్వి యని భావము. (త్ర్యక్షరము.)

౬౦౮. దండనీతిస్థాయై నమః

తా. నీతిశాస్త్రమందును అర్థశాస్త్రమందును ఉన్నదనియు, విధినిషేధములను దెలిపెడి శాస్త్రస్వరూపిణి యని భావము. (పంచాక్షరము)

౬౦౯. దహరాకాశరూపిణ్యై నమః

తా. దహరాకాశరూపముగా ప్రతిశరీరమందును ఉన్నదనియు, హృదయకమలమందున్న స్వల్పమైన ఆకాశము దహరాకాశమనియు, అదియే సకలదేవతలకు స్థానమనియు భావము. శ్రు. "అథ య ఇద మస్మిన్ బ్రహ్మపురేదహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నన్తరాఽఽకాశ స్తస్మిన్యదన్త స్తదన్వేష్టవ్యమితి." (అష్టాక్షరము.)

౬౧౦. ప్రతిపన్ముఖ్యరాకాన్తతిథిమండలపూజితాయై నమః

తా. ప్రతిమాసమందును శుక్లప్రతిపత్తునుండి పౌర్ణమిపర్యంతము ఆయాతిథులందాయానిత్యారూపముగా కామేశ్వర్యాది చిత్రాంతదేవతా రూపముగా పూజింపఁబడుచున్నదని భావము. (షోడశాక్షరము.)

౬౧౧. కళాత్మికాయై నమః

తా. చంద్రకలలు ౧౬- గ్నికలలు ౧౦-సూర్యకలలు-౨౪-౧౪ సమిష్టి ౩౮-౫౦ ఇట్టి కలాస్వరూపము అనియు, కలాశబ్దము అకారాది

క్షకారాంత వర్ణములందును వర్తించుచున్నది. జాగ్రదాద్యవస్థలయందును కలాభేదములున్నవి.

శ్రు. "ఉత్పత్తిర్జాగరో బోధో వ్యావృత్తిర్మనసస్సదా,
కలాచతుష్టయం జాగ్రదవస్థాయాం వ్యవస్థితమ్.
జాగ్రత్సర్వగుణైః ప్రోక్తా కేవలం శక్తిరూపిణీ,
మరణంవిస్మృతిర్మూర్ఛానిద్రాచతమసాఽఽవృతా.
సుషుప్తేస్తు కలాజ్ఞేయా స్సా కలా శ్రీశివాత్మికా,
అభిలాషో భ్రమశ్చింతా విషయేషు పునస్స్మృతిః,
కలాచతుష్టయం దేవీ స్వప్నావస్థా విధీయతే.
శివరూపా శ్శాంతిరూపాస్తాః కలా స్త్రిపురాత్మికాః,
వైరాగ్యం చ ముముక్షుత్వం సమాధివిమలం మనః.
పదసద్వస్తునిర్ధార స్తుర్యావస్థా కలా ఇమాః.

జాగ్రత సుషుప్తి స్వప్నము తురీయము అని నాలుగవస్థలు. ప్రతి అవస్థకును నాలుగునాలుగుచొప్పున పదునాఱుకలలు గలవు. ఉత్పత్తి (జననము) జాగ్రత్త బోధ సర్వదా మనోవ్యాపారము ఈనాలుగును జాగ్రదవస్థ కేవలము శక్తిస్వరూపముగా నున్నది. మరణము పరాకు మూర్ఛ నిద్ర ఈ నాలుగును సుషుప్తికళలు. ఇవి శివ స్వరూపము. అభిలాష భ్రమ చింతా విషయములందు కోరిక ఈనాలుగు స్వప్నావస్థ కళలు. వైరాగ్యము మోక్షేచ్ఛసమాధిచేత మనశ్శుద్ధి సదసద్వస్తునిశ్చయము ఈనాలుగు తురీయావస్థాకళలు. ఇట్టి కలాస్వరూపిణి యనియు.

శ్రు. అరుణోపనిషత్తు:—"మరీచయస్స్వాయంభువా యే శరీరాణ్యకల్పయత్ మాచ తేఖ్యాస్తతీరిషత్; లోకస్యద్వారమర్చిమత్పవిత్రం జ్యోతిష్మద్భ్రాజమానంమహస్వత్, అమృతస్య ధారా బహుధా దోహమానం చరణం నో లోకే సుధితాం దధాతు."

శ్రుతియందుగల 'అర్చివత్, జ్యోతిష్మత్, భ్రాజమానం' అను శబ్దముల సంకేతములవలన అర్చిష్మతీ అగ్నికలలు ౧౦౮ అష్టోత్తరశతము జ్యోతిష్మతీ చంద్రకలలు షట్త్రింశదుత్తరశతం ౧౩౬. మహస్వత్ అను సూర్యకలలు షోడశోత్తరశతము ౧౧౬. సమష్టి ౩౬౦ కలలు. శ్రీదేవి పాదారవిందములనుండి అసంఖ్యములయిన కల లుత్పన్నమగుచున్నవి. అందు ముఖ్యమైనవి పైరీతిని మండలత్రయముగాను సంవత్సరాత్మకము గాను కాలాత్మకముగా నున్నవనియు, ఈ ౩౬౦ కలలు కలిసి శ్రీదేవి స్వరూపమని శ్రుత్యర్థమువలన కలలే ఆత్మ అనఁగా శరీరముగా కలవనియు, పూర్వోక్తకలలకు ఆత్మగా నున్నది. పరాశక్తియే సకలకలాస్వరూపముగా నున్నదని భావము. (చతురక్షరము.)

౬౧౨. కళానాథాయై నమః

తా. సమస్తమైన కలలకును ప్రభ్వియని భావము. (చతురక్షరము.)

౬౧౩. కావ్యాలాపవినోదిన్యై నమః

తా. వాల్మీక్యాది మహాకవికృత కావ్యభావలచేత వినోదసంతోషముగలదియని భావము. (అష్టాక్షరము.)

౬౧౪. సచామరరమావాణీసవ్యదక్షిణసేవితాయై నమః

తా. శ్రీదేవి కుడిభాగమందు లక్ష్మీదేవియు, ఎడమభాగమందు సరస్వతీదేవియు, వింజామరలుకలవారై సేవించుచున్నారని భావము. (షోడశాక్షరము.)

౬౧౫. ఆదిశక్త్యై నమః

తా. సకలజగత్తుకంటె ముందున్న శక్తిస్వరూపమనియు, సర్వమునకు కారణస్వరూపమనియు భావము. (చతురక్షరము.)

౬౧౬. అమేయాయై నమః

తా. ప్రపంచమందుఁగల సకలపదార్థములును ప్రమాణముగలవి. శ్రీదేవి సర్వత్ర సంపూర్ణముగా నున్నందున ప్రమాణములేనిదనియు,

పరాశక్తి మాతృమానమేయాములచే త్రిపుటిలో మేయస్వరూపమనియు ఈశ్వరుఁడు మాత అనియు భావము. (త్ర్యక్షరము.)

### ౬౧౭. ఆత్మనే నమః

తా. ఇచట ఆత్మశబ్దము జీవపరము గాన జీవస్వరూపిణి అని భావము. (ద్వ్యక్షరము.)

### ౬౧౮. పరమాయై నమః

తా. బ్రహ్మకు నాలుగురూపములు గలవు. అందులో ఉత్కృష్టమైన రూపము పరదేవతాస్వరూపమని భావము. శ్రు. "ప్రధానపురుషావ్యక్త కాలాస్తు ప్రవిభాగశః, రూపాణి స్థితిసర్గాన్తవ్యక్తిసద్భావహేతవ ఇతి." (త్ర్యక్షరము.)

### ౬౧౯. పావనాకృత్యై నమః

తా. పవిత్రమైన స్వరూపము నామము జ్ఞానముకలదని భావము. (పంచాక్షరము.)

### ౬౨౦. అనేకకోటి బ్రహ్మాండజనన్యై నమః

తా. ఇట్టి బ్రహ్మాండములు అనేకకోట్లు గలవు. శ్రీ దేవి ఇట్టి బ్రహ్మాండముల నన్నిఁటిని పుట్టించునదియనియు, ఒక్కొకశరీరముకూడ ఒక్కొక బ్రహ్మాండమే గాన అన్నిశరీరములకును తల్లి అనియు భావము. (ఏకాదశాక్షరము.)

### ౬౨౧ దివ్యవిగ్రహాయై నమః

తా. మనోహరమైన ఆకారముగలదనియు, లేక నిరాధారమైన అంతరాళమందుకూడ యుద్ధము చేయునది యని భావము. (పంచాక్షరము.)

### ౬౨౨. క్లీంకార్యై నమః

తా. కామరాజబీజస్వరూపమనియు, లక్ష్మీనారాయణద్వంద్వరూపమనియు భావము. (త్ర్యక్షరము.)

౬౨౩. కేవలాయై నమః

తా. కకార లకార తురీయస్వరబిందువులు కామరాజబీజము. బిందుయుక్త తురీయస్వరమమాత్రము కామకలాబీజము గనుక కకార లకారరహితమైన కామకలాబీజస్వరూపమని భావము. శ్రు. "యదీగ్ం శృణోత్యలకగ్ం శృణోతి, నహిప్రవేదసుకృతస్య పన్థాం."

కకార లకార రహితమైన ఈం అను కేవల కామకలాబీజమును ఎవరు వినుచున్నారో, ఎవరు ఉచ్చరించుచున్నారో, వారు స్వర్గాది పుణ్యలోకములను పొందరనియు, మఱి ఏమనఁగా కేవల మోక్షమునే పొందుచున్నారనియు శ్రుతి భావము. (త్ర్యక్షరము.)

౬౨౪. గుహ్యాయై నమః

తా. పంచకోశాంతర్వర్తియగు గుహాయందున్నది "గుహ్య" అని యనంబడును. అతిరహస్యార్థస్వరూపిణి అని భావము. (ద్వ్యక్షరము.)

౬౨౫. కైవల్యపదదాయిన్యై నమః

తా. పుణ్యపురుషులకు ఉత్తమలోకప్రాప్తికి కర్మాచరణము, ఉపాసనము, జ్ఞానము అని మూఁడుమార్గములు గలవు. సత్కర్మలను నిష్కామనయా చేయువారికి చంద్రలోకావాప్తి అనియు; ఇతర దేవతోపాసకులకు అర్చిరాదిమార్గముగా సూర్యలోకావాప్తి అనియు; సాలోక్యాది చతుర్విధముక్తి అనియు; దేవతాస్వాత్మల కభేదజ్ఞానము కామకలోపాసన లగువారికి బ్రహ్మత్వసిద్ధి అనియు, అదియే కైవల్యపదమనియు, అట్టి వారికి కైవల్యమను పదవిని ఇచ్చునదనియు భావము.

తైత్తిరీయే:—శ్రు. "యఏవం విద్వానుదగయనే, ప్రమీయంతే దేవానామేవ మహిమానంగత్వాఽఽదిత్యస్యసాయుజ్యంగచ్ఛత్యథయో దక్షిణే ప్రమీయతే పితృణామేవ మహిమానం గత్వా చంద్రమసస్సాయుజ్యం

గచ్ఛత్యేతా వై సూర్యాచంద్రమసోర్మహిమానా బ్రాహ్మణో విద్వా నభి జయతి తస్మా ద్బ్రహ్మణో మహిమాన మాప్నోతి.'' (అష్టాక్షరము.)

## ౬౨౬. త్రిపురాయై నమః

తా. బ్రహ్మాది త్రిమూర్తులకంటె శ్రీదేవి పూర్వమున్నదిగాన, త్రిపురా అని భావము. గౌడపాదసూత్రము:— ''తత్వత్రయేణభిదేతి'' ఒక బ్రహ్మతత్వమే స్థూలశరీరాభిమాని యగు ఆత్మతత్వముగాను, సూక్ష్మ శరీరాభిమాని యగు విద్యాతత్వముగాను, కారణశరీరాభిమాని శివతత్వము గాను, ఈరీతిని మూఁడువిధములైన దని సూత్రాభిప్రాయము. 'సర్వ త్రయంత్రయం యస్మాత్తస్మాత్తు త్రిపురా మతేతి.' (త్ర్యక్షరము.)

## ౬౨౭. త్రిజగద్వంద్యాయై నమః

తా. స్వర్గ మర్త్యపాతాళలోకవాసులచేత పూజనీయమైనది. (పంచాక్షరము.)

## ౬౨౮. త్రిమూర్త్యై నమః

తా. ౧. పరాశక్తి తనయందున్న సత్వాదిగుణత్రయముచేత బ్రహ్మాది త్రిమూర్తులను పుట్టించినది గనుక త్రిమూర్తుల స్వరూపముగా నున్నదని భావము.

౨. త్రివర్షయగు కన్యక 'త్రిమూర్తి' శబ్దవాచ్యకావున తత్స్వరూపిణి. (త్ర్యక్షరము.)

## ౬౨౯. త్రిదశేశ్వర్యై నమః

తా. సకలదేవతలకును ప్రభ్వి యని భావము. (పంచాక్షరము.)

## ౬౩౦. త్ర్యక్షర్యై నమః

తా. వాగ్భవ కామరాజ శక్తి బీజస్వరూప మని భావము. వామ కేశ్వరే:— ''వాగీశ్వరి జ్ఞానశక్తి ర్వాగ్భవే మోక్షరూపిణీ, కామరాజే

క్రియాశక్తిః కామేశీ కామరూపిణీ. శక్తిబీజే పరాశక్తిరిచ్చైవ శివరూపిణీ, ఏవం దేవీ త్ర్యక్షరీ తు మహాత్రిపురసుందరీ.'' త్ర్యక్షరీశుద్ధవిద్యా కుమారీచ ఇతి గౌడపాదసూత్రే. (త్ర్యక్షరము.)

౬౩౧. దివ్యగంధాఢ్యాయై నమః

తా. శ్రీదేవి హరిచందనాదిమనోహరమైన పరిమళయుక్త చందనము గలది. (పంచాక్షరము.)

౬౩౨. సిందూరతిలకాఞ్చితాయై నమః

తా. సీమంతమందు సిందూరమును, లలాటమందు కస్తూరీతిలకమును కలది. (అష్టాక్షరము.)

౬౩౩. ఉమాయై నమః

తా. పార్వతీ అవతారమందు బాల్యమందు ఈశ్వరుని భర్తగా పొందుటకొఱకు పార్వతి తపస్సు చేయుచుండఁగా తల్లి పార్వతిని ''తపస్సుకష్టసాధ్యము. నీవు బాల్యము, కావున తపస్సువద్దు'' అని వారించినది. ''ఉ=ఓచిన్నదానా ! మా=వలదు'' అని పలికినందున ఉమా అని పార్వతికి నామము కలిగినది. (ద్వ్యక్షరము.)

౬౩౪. శైలేంద్రతనయాయై నమః

తా. శ్రీదేవి పర్వతరాజైన హిమవంతునివమా ర్తె యని భావము. (షడక్షరము.)

౬౩౫. గౌర్యై నమః

తా. గౌరవర్ణముగల దేహముగలదిగాన గౌరి అని నామప్రసిద్ధి కలిగినది. దేవీపురాణే:— శ్లో. ''యోగాగ్నినాతుయాదగ్ధా పునర్జాతాహిమాలయాత్, శంఖకున్దేన్దు వర్ణాచేత్యతోగౌరీతి సాస్మృతేతి.'' (ద్వ్యక్షరము)

౬౩౬. గంధర్వసేవితాయై నమః

తా. గంధర్వులచేత పూజింపఁబడినది, లేక దివ్యగానముచేత సేవింపబడునది యని భావము. (షడక్షరము.)

౬౩౭. విశ్వగర్భాయై నమః

తా. సకలప్రపంచము తనగర్భమందుఁ గలదని భావము. (చతురక్షరము.)

౬౩౮. స్వర్ణగర్భాయై నమః

తా. సువర్ణము గర్భమందుఁ గలదనియు, సువర్ణగర్భమందు బుట్టినదనియు, మాతృకాబీజములు గర్భమం దున్నదనియు భావము. (చతురక్షరము.)

౬౩౯. అవరదాయై నమః

తా. అనార్యులయిన రాక్షసులను సంహరించునది, లేక కాంతియుక్తములయిన దంతములు కలదని భావము. (చతురక్షరము.)

౬౪౦. వాగధీశ్వర్యై నమః

తా. శ్రీదేవి వాక్కులకు అధిపత్యముగలది, ప్రభ్వి యని భావము. (పంచాక్షరము.)

౬౪౧. ధ్యానగమ్యాయై నమః

తా. శ్రీదేవి ధ్యానయోగముచేత పొందఁదగినదని భావము. శ్రు. "తే ధ్యానయోగానుగతా అపశ్య న్దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామితి." (చతురక్షరము.)

౬౪౨. అపరిచ్ఛేద్యాయై నమః

తా. దేశకాలవస్తువులచేత పరిమాణములేనిది. (పంచాక్షరము.)

౬౪౩. జ్ఞానదాయై నమః

తా. బ్రహ్మోపదేశోక్తజ్ఞానమును తమభక్తులకు ఇచ్చునదని భావము. (త్ర్యక్షరము.)

౬౪౪. జ్ఞానవిగ్రహాయై నమః

తా. శ్రీదేవి జ్ఞానమే శరీరముగాఁగలదని భావము. సకలజగత్తు జ్ఞానమే మూలముగాగలదిగనుక జ్ఞానస్వరూపిణియని నామము. (పంచాక్షరము.)

౬౪౫. సర్వవేదాన్తసంవేద్యాయై నమః

తా. సకలోపనిషత్తులచేతను తెలియఁబడుచున్నదని భావము. (అష్టాక్షరము.)

౬౪౬. సత్యానందస్వరూపిణ్యై నమః

తా. శ్రీదేవి త్రికాలాబాధ్యత్వము, సత్యము, వృత్తిరాహిత్య స్వరూపస్థితి, ఆనందము మొదలైన గుణములుగలది గనుక సత్యము ఆనందము స్వరూపముగాఁగలదని భావము. (అష్టాక్షరము.)

౬౪౭. లోపాముద్రార్చితాయై నమః

తా. అగస్త్యమహర్షి భార్యఅయిన లోపాముద్రాదేవిస్వయముగా లలితాపంచదశాక్షరీమన్త్రమును ఉద్ధారము చేసి ఉపాసించి శ్రీదేవియొక్క సాక్షాత్కారమును పొంది శ్రీదేవిని అర్చించెను. అందువలన ఆ మన్త్రము హాదివిద్య అని ప్రసిద్ధిగానున్నది. శ్రీదేవికిని లోపాముద్రకును అభేదముగా నున్నందున శ్రీదేవికి లోపాముద్రార్చిత అనునామము కలిగెనని భావము. కాదివిద్య శివవిరచితము, దక్షిణామూర్తి ఋషి, కాదివిద్యామన్త్రమందు పంచదశీవిద్య తృతీయకూటము. దానిని శక్తి ప్రణవత్రయ యుక్తముగా చేర్చి దానిచేత సర్వోపచారములను చేయవలయుననిరహస్యార్థము. (షడక్షరము.)

౬౪౮. లీలాక్లృప్తబ్రహ్మాణ్డమణ్డలాయై నమః

తా. శ్రీదేవి విలాసార్థము రచింపఁబడిన బ్రహ్మాండసమూహముఁగలదని పరమాత్మయొక్క ఇచ్ఛాశక్తియే శ్రీదేవి అని సంకల్పమాత్రముచేతను అనాయాసముగా క్షణమాత్రములో అనేకకోటి బ్రహ్మాండములను సృజింపఁగలదని దేవికి విలాసము క్రీడయే ప్రయోజనముగాని ఎవరినియామకముగాని

వేఱు ప్రయోజనముగాని లేదు. శక్తిమాత్రము:—"స్వేచ్ఛయా స్వభిత్తౌ విశ్వమున్మీలయతీతి." (దశాక్షరము.)

### ౬౪౯. అదృశ్యాయై నమః

తా. సకలజనులకు కంటికగుపడుచున్న ప్రపంచముకంటె శ్రీదేవి వేఱుగా నున్నదనియు, దృశ్యమంతయు నాశము కలదనియు ఈ దృశ్య మందు సత్తారూపముగా మేళనమై ఉన్నశక్తి నాశరహితమైనదనియు, అదృశ్యమైన దానినే జీవుఁడని పామరజనులు వాడుచున్నారనియు తాత్పర్యము. శ్రు. "అస్తిభాతి ప్రియంరూపం నామ ఇత్యంశపంచకం, ఆద్యత్రయం బ్రహ్మభాగం నామరూపాత్మకంజగత్." తా. అస్తి భాతి ప్రియం ఈ మూఁడును సత్ చిత్ ఆనందములు. (బ్రహ్మభాగము, నామము రూపము) ప్రకృతిమాయాభాగములు దృగ్గోచరములు జడములు సత్తాలేనివి మార్పుగలవి. ఈ రెండుభాగములు కలసి జగత్తు కావున అందులో నామరూపములను ఉపేక్షించి అగుపడని సత్తామాత్రము బ్రహ్మకళగా గ్రహించుట జ్ఞానము. నామరూపములు అనాత్మలు సచ్చిదానందములను ఆత్మస్వరూపముగా గ్రహించుట ఆత్మానాత్మవివేకము అని శ్రుత్యర్థము. సకలప్రపంచమును తాను చూచుచున్నాఁడు. తనను తానే చూడవలెనుగాని మరియొకటి తనను చూచునది లేదు గనుక అదృశ్యా అని శ్రీదేవికి నామము కలిగినది. ఇదియే బ్రహ్మశక్తి అని అభిప్రాయము. (త్ర్యక్షరము.)

### ౬౫౦. దృశ్యరహితాయై నమః

తా. ద్రష్ట చూచువాఁడు ఉన్నపుడు దృశ్యము ఉన్నది. బ్రహ్మ వస్తువు అఖండాకారముగా ఉన్నందున రెండవవస్తువే లేనందున దృశ్యములేనిదని భావము. అగుపడుచున్న ప్రపంచము మాయామయము ఇంద్రజాలమువంటిది. (పంచాక్షరము.)

### ౬౫౧. విజ్ఞాత్ర్యై నమః

తా. శ్రీదేవి ప్రజ్ఞారూపముగానుండి సకలమును తెలుసుకొనుచున్నది. ఆశ్రీదేవిని తెలుసుకొనునది మఱియొకటి లేదు. కనుక సకల ప్రపంచమందునుగల సత్తా తానే అయియున్నదనియు, నామరూపములు మిథ్యలనియు, సత్తారూపమైన బ్రహ్మవస్తువు అనిర్వాచ్యమనియు, అందువలననే అగుపడు జగత్తు సత్యాసత్యమేళనమని తెలియుచున్నది. శ్రు. "విజ్ఞాతారమరేకేన విజానీయాదితి." (త్ర్యక్షరము.)

౬౫౨. వేద్యవర్జితాయై నమః

తా. సకలప్రపంచమును తాను ప్రజ్ఞారూపముగానుండి తెలుసుకొనుచున్నదనియు, తనను తెలుసుకనే మఱియొకవస్తువులేదనియు, సకలము తెలిసినదనియు, తెలుసుకొనవలసిన అవశిష్టము లేదనియు, సర్వజ్ఞురాలనియు భావము. (పంచాక్షరము.)

౬౫౩. యోగిన్యై నమః

తా. మూలాధారాది సహస్రారాంతముగల సప్తకమలములకును ప్రత్యేకాధిదేవతలు డాకిన్యాదియోగినీశక్తులు గలరు. వారి స్వరూపముగా శ్రీదేవి ఉన్నదనియు, యోగమనఁగా చిత్తవృత్తినిరోధమని కొందఱును, మన్త్ర హఠలయ రాజయోగములని కొందఱును, జీవేశ్వరుల సంయోగమని కొందఱును, భోక్తా భోజ్యము భోగములకు బ్రహ్మభావనయేకత్వభావన అని కొందఱును, జ్ఞాతా జ్ఞానము జ్ఞేయములకు యేకత్వభావన అని కొందఱును, ఇటుల అనేక భేదములుగా నున్నది. సకలయోగస్వరూపిణి పరాశక్తియే అని భావము. శ్రు. "జ్ఞానేంద్రియాణి సర్వాణి నిగృహ్య మనసా సహ, ఏకత్ర భావనాయోగః క్షేత్రజ్ఞపరమాత్మనోః" (త్ర్యక్షరము.)

౬౫౪. యోగదాయై నమః

తా. పూర్వోక్తమైన జీవబ్రహ్మల కైక్యరూపమైన అపరోక్షజ్ఞానస్వరూపయోగమును భక్తులకు కలుగఁజేయునది యని భావము. (త్ర్యక్షరము.)

### ౬౫౫. యోగ్యాయై నమః

తా. సమస్తవిధములను పరదేవతకంటె యోగ్యమైనపదార్థమునకు మఱియొకటిలేదు గాన యోగ్యఅనియు, యోగ్యమైనపదార్థమునకు అర్థస్వరూపురాలనియు, శక్తికల యెచటనుండునో అది యోగ్యపదార్థ మనిపించుకొనుననియు భావము. (ద్వ్యక్షరము.)

### ౬౫౬. యోగానన్దాయై నమః

తా. శివశక్తిసామరస్యము యోగమనియు అదియే జీవబ్రహ్మలకైక్యమనియు, అందువలన ఆకాలమందు కలిగిన ఆనందమే బ్రహ్మానందమనియు, నిజానందమనియు భావము. కనుక అట్టి ఆనందమే స్వరూపముగా గలదని భావము. ఇంద్రియములవలన కలిగిన లోకానందములు బ్రహ్మానందవాసనలుగాను తత్ ప్రతిబింబములుగాను ఉన్నవనియు, నిజానందములు మాత్రముకావు. తైత్తిరీయే:— శ్రు. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని అట్టి నిజానందమే బ్రహ్మమునకు ఆకారమని శ్రుత్యర్థము. మనస్సు వృత్తిశూన్యమై బుద్ధి నిలిచి ఉన్నపుడు ఆనందము కలుగును. దీనినే తురీయావస్థఅందురు. జాగ్రన్నిద్రల మధ్యావస్థ తురీయ మనంబడును. నిద్రావస్థలో మనోబుద్ధులు రెండును లయమయినందున ద్వైతము లేనందున ఆనందరూపముగా నుండునుగాని ఆసుఖమును తెలుసుకొనే బుద్ధి తత్కాలమునందు లయమైనందున నిజానందము మాత్రముకాదు. నిద్రానందము బ్రహ్మానందసూచకముగా నున్నదని భావము. (చతురక్షరము.)

### ౬౫౭. యుగన్ధరాయై నమః

తా. యుగశబ్దము రథముయొక్క చీలయందును ద్వంద్వమందును కృతాదియుగమందును వర్తించుచున్నది గాన ప్రపంచరూపరథ రక్షారూపమైన చీలగా నున్నదనియు, శివశక్తిరూపద్వంద్వముగా నున్నదనియు, కృతాది యుగరూపముగా నున్నదని భావము. (చతురక్షరము.)

౬౫౮. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణ్యై నమః

తా. శ్రీదేవియే ప్రపంచోత్పత్తికి మూలమైన ఇచ్ఛాజ్ఞానక్రియలనే శక్తిత్రయ రూపమును ధరించినదని భావము. (షోడశాక్షరము.)

౬౫౯. సర్వాధారాయై నమః

తా. సకలజగత్తులకును జన్యజనకరూపముగాను ధారాపరంపరగాను ఉన్నదనియు, బ్రహ్మశక్తి అగోచరమైనందున సకలపదార్థములకు ఆధారముగా నున్నదనియు, సత్తాను అనుసరించి కలదనియు, సకల ప్రపంచమందును సూత్రాత్మగా నున్నదనియు, సకలమునకును బ్రహ్మవస్తువే ఆధారముగా నున్నదనియు భావము. మార్కండేయ పురాణే:—శ్లో. "యేఽర్థానిత్యాయేవినశ్యన్తి చాన్యేయేఽర్థాస్థూలా యేచ సూక్ష్మాతిసూక్ష్మాః యేచామూర్తంయుచ్చమూర్తం సమస్తం యద్వ ద్భూతేష్వేక మేకంచకించిత్, యేఽర్థా భూమౌ యేఽన్తరిక్షేఽన్యతో వా తేషాందేవి త్వత్త ఏవోపలబ్ధిః." ఇతి. (చతురక్షరము.)

౬౬౦. సుప్రతిష్ఠాయై నమః

తా. శోభనమైన ప్రతిష్ఠ అనఁగా కీర్తికలదనియు, సకలజగత్తునకును అధిష్ఠానరూపమైనదనియు భావము (చతురక్షరము.)

౬౬౧. సదసద్రూపధారిణ్యై నమః

తా. సత్ అనఁగా దృశ్యమానమైనజగత్తు. అసత్ అనఁగా మాయ శూన్యము గగనారవిందము వంధ్యాపుత్రుఁడు మొదలగునవి శబ్దమాత్రము విచారింపఁగా శూన్యము. ఈ రెండు రూపములను ధరించినదనియు, భావాభావములకు అధిష్ఠానమని తాత్పర్యము. తదుక్తం స్కాందే:—"యద్యదస్తితయా భాతి యద్యన్నాస్తితయాఽపిచ, తత్తత్సర్వం మహాదేవ మాయయాపరికల్పిత మితి." శ్రు. "సత్యంచానృతంచ సత్యమభవత్." సత్యాసత్యములు రెండును సత్యస్వరూపమైన బ్రహ్మవలననే కలిగినవని శ్రుత్యర్థము. (అష్టాక్షరము.)

౬౬౨. అష్టమూర్తయే నమః

తా. లక్ష్మ్యాది అష్టమూర్తులుగాని; పృథివ్యాదిపంచభూతములు, చంద్రసూర్యులు, యజ్ఞదీక్షగల సోమయాజి, ఇవి పరమేశ్వరుని అష్టమూర్తులని భావము. శక్తిరహస్యే—"లక్ష్మీర్మేధా ధరాపుష్టిర్గౌరీ తుష్టిః ప్రభాధృతిః, ఏతాభిః పాహి తనుభి రష్టాభిర్మాం సరస్వతీ"తి. యోగశాస్త్రే:—"గుణభేదాదాత్మమూర్తి రష్టధా పరికీర్తితా, జీవాత్మాచాన్తరాత్మాచ పరమాత్మాచ నిర్మలః. శుద్ధాత్మాజ్ఞానరూపాత్మా మహాత్మా సప్తమస్స్మృతః, అష్టమ స్తేషుభూతాత్మే త్యష్టాత్మానః ప్రకీర్తితాః." విష్ణుపురాణే:—"సూర్యో జలం మహీవహ్ని ర్వాయు రాకాశ ఏవచ, దీక్షితో బ్రాహ్మణ స్సోమ ఇత్యష్టౌ మూర్తయో మతా" ఇతి. (చతురక్షరము.)

### ౬౬౩. అజాజైత్ర్యై నమః

తా. శ్రు. "అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయన్తీగ్‌ం సరూపామితి." ఈశ్రుతిచేత ప్రతిపాదింపఁబడు మూలప్రకృతి అనే ఏ అజ్ఞానముకలదో దానిని జయించునది. అనఁగా జ్ఞానస్వరూపిణి అని భావము. (చతురక్షరము.)

### ౬౬౪. లోకయాత్రావిధాయిన్యై నమః

తా. ఈ పదునాలుగులోకముల సృష్టిస్థితిలయరూపమైన యాత్ర శ్రీదేవికి స్వభావధర్మమని భావము. (అష్టాక్షరము.)

### ౬౬౫. ఏకాకిన్యై నమః

తా. ఏకాకిని యనఁగా ద్వితీయవస్తురహితమని భావము. శ్రు. బృహదారణ్యకము:—"సోఽబిభే త్తదేకాకీ బిభేతి సహాయమీక్షాంచక్రే యన్మదన్యన్నాస్తి కస్మాన్ను బిభేమీతి తత ఏవాస్యభయం వీయాయేతి." (చతురక్షరము.)

### ౬౬౬. భూమరూపాయై నమః

తా. సర్వాధారమైన బ్రహ్మవస్తువునకు "భూమ" యని నామము.

ఇది తురీయావస్థగాను బ్రహ్మ నాలుగుపాదములలోను తురీయపాదముగా నున్నదని. శ్రు. "ఛాన్దోగ్యః:—యావై భూమాతత్సుఖం భూమా త్త్వేవ విజిజ్ఞాసితవ్యః భగవః భూమానైవ బ్రూహీతియత్ర నాన్యత్పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్యద్విజానాతిఁభూమాః యత్రాన్యచ్ఛృణోత్యన్య ద్విజా నాత్యన్యద్ద్రశ్యతేతదల్పం." శ్రుతితాత్పర్యము. ఏ తురీయావస్థలో రెండవది చూడఁబడదో వినఁబడదో తలఁపఁబడదో అట్టిది భూమావస్థ అని పేరు. ఏది వినఁబడినను కనఁబడినను తలఁపఁబడినను అట్టి అవస్థ అల్పమని శ్రుతి. కాన శ్రీదేవి అట్టి భూమస్వరూపమని భావము. (చతురక్షరము.)

౬౬౭. నిర్ద్వైతాయై నమః

తా. త్యజింపఁబడిన ద్వైతరూపప్రపంచముఁ గలదని భావము. (త్ర్యక్షరము.)

౬౬౮. ద్వైతవర్జితాయై నమః

తా. పూర్వనామము నశించిన ద్వైతము కలదని పునఃపునః ద్వైతభావన కలుగునని ద్వైతములేనిదని ద్వైతభావనఅంతయు భ్రాంతి మాత్రమని బ్రహ్మవస్తువు నిత్యము పరమార్థము పూర్ణము అని భావము. (పంచాక్షరము.)

౬౬౯. అన్నదాయై నమః

తా. సకలజీవులకు అన్నమును ఇచ్చునది. (త్ర్యక్షరము.)

౬౭౦. వసుదాయై నమః

తా. సకలజనులకు ధనమును, రత్నముల నిచ్చునది. (త్ర్యక్షరము.)

౬౭౧. వృద్ధాయై నమః

తా. సకలజగత్తుకంటె ముందు ఉన్నది గనుక వృద్ధా అని నామము కలిగినది. (ద్వ్యక్షరము.)

౬౭౨ బ్రహ్మాత్మైక్యస్వరూపిణ్యై నమః

తా. బ్రహ్మశబ్దముచేత సహస్రారాంతర్గత చిత్కలాస్వరూపమైన సాక్షి ఇతఁడే. ప్రత్యగాత్మ అహమనునది. జీవాత్మవాచ్యము సోఽహమను ఏకత్వానుభవము అహంబ్రహ్మాఽస్మి అనునది అనుభవము తురీయస్థితి. అట్టిస్థితియే పరాశక్తియొక్క నిజస్వరూపమని భావము. (అష్టాక్షరము.)

### ౬౭౩. బృహత్యై నమః

తా. పరిదృశ్యమానమైన సకలజగత్తుకంటె శ్రీదేవి గొప్పదని భావము. బృహత్సామస్వరూపమనియు, జ్యేష్ఠసామస్వరూపమనియు బృహచ్ఛబ్దముచే సూచితమగుచున్నది. (త్ర్యక్షరము.)

### ౬౭౪. బ్రాహ్మణ్యై నమః

తా. బ్రాహ్మణస్త్రీస్వరూపిణి యని భావము. కూర్మాదిపురాణములందిట్లు గలదు:—"బ్రాహ్మణో భగవాన్సాంబో బ్రాహ్మణానాంహిదైవతం, విశేషాద్బ్రాహ్మణోరుద్రమీశానంశరణంవ్రజే" దితి. సాంబమూర్తి బ్రాహ్మణస్వరూపుఁడనియు తత్సతి బ్రాహ్మణి అని నామసిద్ధి కలిగినదని భావము. (త్ర్యక్షరము.)

### ౬౭౫. బ్రాహ్మ్యై నమః

తా. బ్రహ్మసంబంధమైన అవ్యక్తాదిస్వరూపురాలని భావము. శ్రు. "సత్యంచానృతంచ సత్యమభవ"దితి. తైత్తిరీయే. (ద్వ్యక్షరము.)

### ౬౭౬. బ్రహ్మానన్దాయై నమః

తా. ఆనందమే బ్రహ్మముయొక్క స్వరూపము గనుకను మానుషానందాది బ్రహ్మానంద పర్యంతముగల ఆనంద భేదములున్నందున సర్వోత్తమమైన బ్రహ్మానందమే శ్రీదేవియొక్క స్వరూపమని భావము. శ్రు. "ఆనన్దోబ్రహ్మేతివ్యజానాత్, ఆనన్దంబ్రహ్మణో విద్వాన్నబిభేతికదాచనేతి." (చతురక్షరము.)

### ౬౭౭. బలిప్రియాయై నమః

తా. పూజోపహారములందు శ్రీదేవి ప్రియమైనదని భావము. (చతురక్షరము.)

౭౭౮. భాషారూపాయై నమః

తా. సంస్కృతాంధ్రాద్యనేక భాషాభేదము లున్నను సకల భావములచేతను శ్రీదేవి తెలియఁబడుచున్నందున భాషాస్వరూపురాలని భావము. (చతురక్షరము.)

౭౭౯. బృహత్సేనాయై నమః

తా. అపారమైన చతురంగసేనలు గలదని భావము. (చతురక్షరము.)

౭౮౦. భావాభావవివర్జితాయై నమః

తా. భావమనఁగా సర్వజనచక్షుర్గోచరమైనజగత్తు; అభావమనఁగా గగనారవిందము శశవిషాణము వంధ్యాపుత్త్రుఁడు మొదలగునవిగాని, శూన్యవాదులు చెప్పుశూన్యముగాని, ఈ ఉభయముసు కానిదనిభావము. మఱి ఎట్టిదనిన: జడస్వభావమైన నామరూపాత్మక జగత్తునకు చైతన్యమును కలుగఁజేయునదని భావము. 'సత్తామాత్రమగోచరః' అని శ్రుతి ప్రమాణము కలుగుటచేత తెలియుచున్నది: (అష్టాక్షరము.)

౭౮౧. సుఖారాధ్యాయై నమః

తా. ఉపాసనారాధనాదికాయక్లేశములు లేక అంతర్యాగము భావనామాత్రమే గనుక తద్రీతిననుసరించి సుఖముగా అరాధింపఁదగినదని భావము. (చతురక్షరము.)

౭౮౨. శుభకర్యై నమః

తా. శుభమును తనభక్తులకు కలుగఁజేయునదనియు, మోక్షము అత్యంతశుభము గాన మోక్షమునిచ్చునది యని భావము. (చతురక్షరము.)

౭౮౩. శోభనాసులభాగత్యై నమః

తా. మోక్షస్వరూపమైనట్టి సులభమైన గమ్యస్థానముగలదనియు, సులభసాధ్యమనియు భావము. (అష్టాక్షరము.)

౬౮౪. రాజరాజేశ్వర్యై నమః

తా. రాజులు ఇంద్రాద్యష్టదిక్పాలకులు వారికిరాజులు బ్రహ్మవిష్ణు రుద్రులు వారికి శ్రీదేవి ప్రభ్వి గాన రాజరాజేశ్వరీనామము సిద్ధించినదని భావము. (షడక్షరము.)

౬౮౫. రాజ్యదాయిన్యై నమః

తా. కైలాస, వైకుంఠాద్యాధిపత్యములను తనభక్తులకు ఇచ్చు స్వభావముగలదనియు, భూమండలాధిపత్యము నిచ్చునదని భావము (పంచాక్షరము.)

౬౮౬. రాజ్యవల్లభాయై నమః

తా. ఐంద్ర, కైలాస, వైకుంఠాదిరాజ్యములు ప్రియముగాఁ గల ప్రభ్వి యని భావము. (పంచాక్షరము.)

౬౮౭. రాజత్కృపాయై నమః

తా. తనభక్తులయందు వెలయుచున్న అనుగ్రహము కలదని భావము. (చతురక్షరము.)

౬౮౮. రాజపీఠనివేశితనిజాశ్రితాయై నమః

తా. ఇంద్రాధిపత్యమందుఁ గాని భూమండలాధిపత్యమందుఁ గాని స్థాపింపఁబడిన భక్తసమూహము కలదని భావము. (ద్వాదశాక్షరము.)

౬౮౯. రాజ్యలక్ష్మ్యై నమః

తా. రాజ్యాభిమానలక్ష్మీస్వరూపురాలనియు, చతుర్లక్ష్మీమంత్రములలో రాజ్యలక్ష్మి మన్త్రాధిదేవతాస్వరూపమనియు భావము.(చతురక్షరము.)

౬౯౦. కోశనాథాయై నమః

తా. కోశమనఁగా భాండాగారము. దివ్యమయినట్టియు, నవనిధి రూపమైనట్టియు, ధనసమూహమునకుగాని లేక, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనియెడి పంచకోశములకుగాని ప్రభ్వి యని భావము. (చతురక్షరము.)

౬౯౧. చతురంగబలేశ్వర్యై నమః

తా. హస్త్యశ్వరథపదాతిబలములకుఁ ప్రభ్వి అనియు, చతురంగ బలములచేత నిర్మింపఁబడిన వ్యూహములకుఁ ప్రభ్వి యనియు భావము. (అష్టాక్షరము.)

౬౯౨. సామ్రాజ్యదాయిన్యై నమః

తా. రాజసూయమనే యజ్ఞమును చేసినవారుగాని, భూమండలాధిపతులుగాని, రాజాధిరాజులుగాని సామ్రాజ్యపదవిగలవారు. తన భక్తులకు అట్టిసామ్రాజ్యపదవిని ఇచ్చునదనియు, పూర్ణపట్టాభిషేకమనే శ్రీవిద్యామంత్రదీక్షను పొందిన దేవీఉపాసకులు సామ్రాజ్యపదవిగల వారు, వీరు బ్రహ్మవేత్తలు గనుక బ్రహ్మస్వరూపులు; ఇట్టి దేవీభక్తుల పదవికి సామ్రాజ్యపదవి తక్కువదిగాన అట్టి పూర్ణదీక్షను భక్తులకు కలుగఁజేయునదని భావము. (షడక్షరము.)

౬౯౩ సత్యసంధాయై నమః

తా. అతిక్రమింపని ప్రతిజ్ఞకలది అనియు సత్యస్వరూపమనియు భావము. (చతురక్షరము.)

౬౯౪. సాగరమేఖలాయై నమః

తా. సముద్రమే మొలనూలు (కట్యాభరణము) గాఁగల భూస్వరూపురాలనియు, చతుర్దశభువనములుకలసి విరాడ్రూపమైనపుడు (స్థూలరూపము) భూలోకము కటిప్రదేశము సముద్రములు కట్యాభరణముగాఁ గలదని భావము. (షడక్షరము.)

౬౯౫. దీక్షితాయై నమః

తా. జ్ఞానమును పొందించునది గనుక దీక్షఅనియు శిష్యులకు మంత్రప్రదానముచేత పాపములను అజ్ఞానమును పోఁగొట్టునది గనుక దీక్ష అనియు అట్టి శ్రీవిద్యాపూర్ణదీక్షనుపొందిన బ్రాహ్మణస్వరూపము గలదనియు, అట్టి దీక్షాస్వరూపమనియు భావము. పూర్ణదీక్షను పొందిన వారికిని పరదేవతకును భేదము లేదని భావము. (త్ర్యక్షరము.)

౧౯౬. దైత్యశమన్యై నమః

తా. భండాసురుఁడు మొదలగురాక్షసులను నశింపఁజేసినదని భావము. (పంచాక్షరము.)

౧౯౭. సర్వలోకవశంకర్యై నమః

తా. చతుర్దశభువనములు శ్రీదేవికి స్వాధీనములో నున్నవనియు, శ్రీదేవి తనభక్తులకు సకల జగత్తును స్వాధీనముఁ జేయునది యనియు భావము. (అష్టాక్షరము.)

౧౯౮. సర్వార్థదాత్ర్యై నమః

తా. తనుభక్తులకు ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములనుగాని, లేక కోరిన సకల కామ్యములనుగాని ఇచ్చునదని భావము. (పంచాక్షరము.

౧౯౯. సావిత్ర్యై నమః

తా. సకలజగత్తులను పుట్టించువాఁడు గనుక సూర్యునకు "సవితా" యను నామము కలిగినది. ఈనామము పరమశివునికిని వర్తించుచున్నది. గనుక సూర్యమండలమందున్న శక్తికి సావిత్రీనామముగలది. పరమశివుని భార్యయు సావిత్రినామముగలది గనుక సావిత్రి అని ప్రసిద్ధి గలిగినది. (త్ర్యక్షరము.)

౨౦౦. సచ్చిదానందరూపిణ్యై నమః

తా. సత్ అనఁగా త్రికాలాబాధ్యము; చిత్ అనఁగా జ్ఞానస్వరూపము; ఆనందమనఁగా తృప్తి సంతోషము. ఇవి బ్రహ్మలక్షణములు గనుక ఈగుణములే శ్రీదేవికి స్వరూపముగానున్నవని, పరబ్రహ్మస్వరూపమని శ్రీదేవి సర్వకాలములయందు సచ్చిదానంద స్వరూపముగలదని భావము. సకలప్రపంచమునందు ఫలస్వరూపమని భావము. శ్రు 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యని తైత్తిరీయశ్రుతి. (అష్టాక్షరము.)

సప్తమశతకము సమాప్తము.

---

శ్రీరస్తు.

# శ్రీలలితాసహస్రనామావళి

## అష్టమశతకము.

---

### ౨౦౧. దేశకాలాపరిచ్ఛిన్నాయై నమః

తా. దేశతః కాలతః పరిచ్ఛేదరహితమని బ్రహ్మాద్రిదులకంటె బూర్వమునుంచి శ్రీదేవియున్నదని సర్వదాకలదని సకలప్రపంచముకంటె పూర్వమున్నదని సకలమందును ఉన్నదని వస్తుభేదపరిమాణములేనిదని దేశకాలభేదములు శ్రీదేవివలన కలిగినవని వీరికి పూర్వము కాలభేదము దేశభేదములేదని అంతకు పూర్వమున్న బ్రహ్మవస్తువని భావము. దేశకాల భేదము సృష్ట్యనంతరమందు కలిగినదని శ్రీదేవిసృష్టికి పూర్వవస్తువని భావము. (అష్టాక్షరము.)

### ౨౦౨. సర్వగాయై నమః

తా. సమస్తవస్తువులందును సత్తారూపముగా నున్నది. (త్ర్యక్షరము.)

### ౨౦౩. సర్వమోహిన్యై నమః

తా. బ్రహ్మసంబంధమైన మాయాస్వరూపముగానుండి సకలజనులకు భేదబుద్ధిని గలుగఁజేసి మోహింపఁజేయునదని భావము. (పంచాక్షరము.)

### ౨౦౪. సరస్వత్యై నమః

తా. పూర్వపునామములో భేదభావన ద్వైతవృత్తులు గలుగఁ జేయుటకు శ్రీదేవికారణమని యందున సర్వమోహిని మూలప్రకృతిరూప ముగా నున్నందున ఇచట అద్వైతజ్ఞానస్వరూపము వాస్తవమని ద్వైత భావన మోహమాత్రమని పూర్వపువానిని పరిహరించుటకు సరస్వతీ స్వరూపమని వర్ణించుచున్నారు. సరస్వతి ఆత్మానాత్మవిచారణవలనఁ గలిగిన బ్రహ్మాపరోక్షజ్ఞానస్వరూపిణి పూర్వపుభేదజ్ఞాన రూపమోహము

పోఁగొట్టి అఖండాకార బ్రహ్మజ్ఞానమును ఇచ్చునదని అద్వైతవృత్తి స్వరూపమని భావము.

శ్రు. 'అజ్ఞానావృతం జ్ఞానం' అని ప్రమాణము వాస్తవము. జ్ఞానము అట్టినిజమైనజ్ఞానము చేత ఆవరింపఁబడినపుడు సర్వమోహినీనామము సిద్ధించుటయు దేవతాభక్తిగల పుణ్యపురుషులకు వివేకమువలన అజ్ఞానరూప మోహరూపము నశించి శుద్ధజ్ఞానోదయమగును. అట్టిజ్ఞానమునకు సరస్వతి ముఖ్యమైనదనియు, శ్రీదేవియే సరస్వతీనామము కలదనియు భావము. (చతురక్షరము.)

## ౨౦౫. శాస్త్రమయ్యై నమః

తా. వేదాదిసకలశాస్త్రములును బ్రహ్మజ్ఞానసాధనములుగా నున్నవి. శ్రు. "సర్వం ఖల్విదం బ్రహ్మ; అయమాత్మాబ్రహ్మ; నేహానానాఽస్తికించన" ఇత్యాదిశ్రుతులు; శాస్త్రయోనిత్వాత్, అని బ్రహ్మసూత్రము; శ్లో. "శాస్త్రదృష్టంగురోర్వాక్యం తృతీయం త్వాత్మనిశ్చయః" అని స్మృతి. ఒకప్పుడు శాస్త్రము బహుముఖమైనను సకలోపనిషద్వాక్యములును బ్రహ్మైకత్వమునే ప్రతిపాదించుచున్నవి. గనుక శాస్త్రములకు శ్రీదేవి జన్మస్థానమని భావము, శ్రీవిద్యాపంచదశీకూటత్రయమని భావము. (చతురక్షరము.)

## ౨౦౬. గుహామ్బాయై నమః

తా. భేదజ్ఞానము కేవలలౌకికమేగాక శాస్త్రముచేత తెలుపుటకు ఈనామము 'గుహాయాం స్థితాఽమ్బా' అని గుహాయందున్న జనని అని ఛాయారూపము అనియు శ్రు. "సత్యంజ్ఞానమనన్తం బ్రహ్మ, యోవేద నిహితంగుహాయాం పరమేవ్యోమన్" ఇతి. కుమారస్వామికి తల్లి అనియు భావము. (త్ర్యక్షరము.)

## ౨౦౭. గుహ్యరూపిణ్యై నమః

తా. రహస్యమైన స్వరూపముగలదనియు, సకలప్రపంచమందుఁగల వస్తువులవలెను కంటికి అగుపడునదికాదనియు, జ్ఞానదృష్టికి ప్రత్యక్షముగా

నుండినదనియు, జడస్వభావమైన నామరూపములు జగత్తునందు ప్రతి పదార్థమందును విచారించి చూచినపుడు ఆయావస్తువులయందుగల సత్తా స్వరూపమంతయు పరాశక్తిస్వరూపమనియు, అసత్తావేత్తైనపుడు శరీరాదులు జడములనియు, ప్రాణమనునది బ్రహ్మవస్తువనియు, అది విచారణ వలనగాని తెలియదనియు, రహస్యముగానున్నదనియు చెప్పిరి. సూత సంహిత:—"గురుమూర్తిధరాం గుహ్యాం గుహ్యవిజ్ఞానరూపిణీం, గుహ్య భక్తజనప్రీతాం గుహాయాం నిహితాం నుమః" గుహ్యోపనిషత్స్వరూప మని భావము. (పంచాక్షరము.)

## ౭౦౮. సర్వోపాధివినిర్ముక్తాయై నమః

తా. శాస్త్రము భేదరూపమును అభేదరూపమును కూడ చెప్పుచున్నందున దానివలన అద్వైతసిద్ధి కలుగనేరదని ఈ నామమువలన తెలియుచున్నది. ఈ ద్వైతాద్వైతములు ఉపాధినిబట్టి కలుగుచున్నవి. ఉపాధిరహితమైనపుడు భేదాభేదములు రెండును లేవు గనుక సకలోపాధులకును శ్రీదేవి ముందున్నదని భావము. ధర్మాధర్మసంబంధము లేనిదనియు, ఇట్టి భేదము వ్యవహారముచేతనే కలిగినదనియు, శుక్తియందు రజతభ్రమకలిగినట్లు శుక్తియందు రజత తాదాత్మ్యము ఎట్లులేదో అటులనే ఉపాధులందు బ్రహ్మతాదాత్మ్యము లేదు. 'స్ఫటికలౌహిత్యవత్' వస్తుసాన్నిధ్యమునుబట్టి స్ఫటికము రక్త నీలాదికాంతులుగలదగుచున్నది. అటులనే సర్వాధారబ్రహ్మమందు అవిద్యాసంస్కారముచేత సకలభేద కల్పన కలిగెనని భావము. (అష్టాక్షరము.)

## ౭౦౯. సదాశివపతివ్రతాయై నమః

తా. పైనిచెప్పిన నామమువలన పరిచ్ఛేదముగల శక్తిరూపత్వము శ్రీదేవికి సిద్ధించుచున్నదనే భ్రమను నిరసించుటకొఱకు ఈనామము కలిగినది. పరాశక్తికి ప్రతియుగమందును ప్రతిజన్మమందును శివుఁడే భర్త అను నియమము గలదిగాన 'సదాశివపతివ్రతా' అని నామము కలిగినది. ఇందువలన సదాశివునికి సచ్చిదానందలక్షణములుగలవు. శ్రీదేవియు

తనభర్తతో సమానధర్మములుగలదనియు, ఎట్లు సకలపురుషులు శివ స్వరూపులో అటులనే సకలస్త్రీలు శక్తిస్వరూపిణులు. సగుణమందును నిర్గుణమందునుగూడ తనభర్తతో సమానధర్మములు గలదియని భావము. (అష్టాక్షరము.)

## ౭౧౦. సంప్రదాయేశ్వర్యై నమః

తా. శ్రీవిద్యాక్రమము సగుణము పరంపరాగతమై తెలిసికొన తగినదిగాన అట్టి సంప్రదాయము గురురూపేణ తెలిసికొనవలెననియు, నిర్గుణబ్రహ్మమందు వియదాదులు ఎట్లు కల్పింపఁబడినవో అటులనే ధర్మియగు పురుషునియందు వియదాదులు కల్పించినట్లు ధర్మమైన శక్తియందును అంతకల్పనయుకలదు గాన శివశక్తులకు ధర్మధర్మిభావము కలిగినను బ్రహ్మత్వము సమానమని సంప్రదాయక్రమముగా తెలుసుకొన తగినదిగాని గ్రంథపఠనావలోకనశ్రవణాదులవలన బ్రహ్మజ్ఞానముకలుగనేరదనియు, అట్టి గురుసంప్రదాయము లభింపఁజేయునట్టి ప్రభ్వియని భావము. (షడక్షరము.)

## ౭౧౧. సాధునే నమః

తా. అగ్నికి దాహకశక్తి ఎట్టిధర్మమో ఈశ్వరునకు పరాహంతాశక్తి అట్టి ధర్మముగా నున్నది. బ్రహ్మముకంటె తాను భిన్నుఁడననే జ్ఞానానుభవముగలదానికే నేనువేరుకాను. బ్రహ్మమే నేను అని నిశ్చయజ్ఞానము తిరిగికలుగుట శక్తిధర్మము. సాధుశబ్దము పూర్ణవాచకము. అట్టిస్వరూపము కలదని భావము. (ద్వ్యక్షరము.)

## ౭౧౨. ఈయై నమః

తా. ఈ అనునది స్వరములు ౧౬. వీనిలో నాలుగవస్వరము చతుర్థీ విభక్తి. ఈబీజము బిందుయుక్తమైనపుడు కామకలాస్వరూపము కేవలతురీయ శక్తిస్వరూపము. సంహితలందు ఈకామకల చాలవర్ణింపఁ

బడినది. శక్తిప్రణవములగు మాయాబీజ లక్ష్మీబీజకామరాజాదిబీజములందు ఈతురీయస్వరసంయోగమువలననే ఆ బీజములకు ప్రణవసంజ్ఞ కలిగినదని కామకలాస్వరూపమని భావము. (ఏకాక్షరము.)

౨౧౩. గురుమండలరూపిణ్యై నమః

తా. పూర్వము చెప్పిన కామకలాస్వరూపనిరూపణము చేయుట ఇతరులకు అశక్యమైనందున అట్టిపరాశక్తియొక్క ముఖతః గ్రహించియే అనుసంధానము చేయవలెను. గాన గురుస్వరూపముగా పరాశక్తి పూర్వపురుషులకు అనుగ్రహించుచున్నందున శ్రీదేవి గురుమండలస్వరూపముగా నున్నదని చెప్పిరి. పరశివాది స్వస్వగురుపర్యంతము గురుమండల మనంబడును. అందు దివ్యౌఘసిద్ధౌఘమానవౌఘములు గలవు. బ్రహ్మవిష్ణురుద్రులు దివ్యౌఘమనియు, సనకవసిష్ఠాదులు సిద్ధౌఘమనియు, వ్యాసాది స్వస్వగురుపర్యంతము మానవౌఘమనియు గ్రహించునది. ఈఓఘత్రయము శ్రీదేవియొక్క స్వరూపమనియు, శ్రీవిద్యారహస్యము కర్ణోపదేశపరంపరగా అవిచ్ఛిన్నముగా వచ్చుచున్నదనియు, పుస్తకములు చూచి గ్రహింపఁగూడదనియు శాస్త్రాభిప్రాయము. 'కర్ణాత్కర్ణోపదేశేన సంప్రాప్తమవనీతలే.' ఇతి (అష్టాక్షరము.)

౨౧౪ కులోత్తీర్ణాయై నమః

తా. అట్టిరహస్యమైన బ్రహ్మస్వరూపమును నాలుగునామములచేత వర్ణించుచున్నారు.—కులమనఁగా ఇంద్రియసమూహము. దానిని అతిక్రమించినదనియు, ఇంద్రియములచేత గ్రహింప శక్యముకానిదనియు. మూలాధారాద్యాజ్ఞాంతము కూటత్రయము తదుపరి ద్వాదశాంతము తురీయకూటముగాన, అట్టితురీయస్వరూపమని భావము. (చతురక్షరము.)

౨౧౫. భగారాధ్యాయై నమః

తా. భగుడనఁగా సూర్యుఁడు. ఆ సూర్యునిచేత ఆరాధింపఁబడుచున్నదని, లేక సూర్యమండలమందు ఉపాసింపఁదగినదని భావము. (చతురక్షరము.)

౨౧౬. మాయాయై నమః

తా. ప్రసిద్ధముగా ఎల్లర యనుభవములోనున్నను ఇట్టిదని నిర్ణయింప శక్యముగాని శక్తి మాయ అనిపించుకొనును గాన శ్రీదేవి సకల జగన్నిర్మాణ సామర్థ్యముగల శక్తిస్వరూపమని భావము. (ద్వ్యక్షరము.)

## ౨౧౭. మధుమత్యై నమః

తా. శ్రీదేవి పుష్పాసవమందు ప్రీతిగలదనియు; మధుమతీ అనే మంత్రదేవతా స్వరూపమనియు; భావనాతీతులగు పరమహంసలుకూడ సప్తభూమికల నతిక్రమించుట ఆవశ్యకము గాన ఆసప్తభూమికలలో తుర్యాతీతావస్థ మధుమతి యనంబడును. అట్టితుర్యాతీత మగు 'మధుమతి' స్వరూపమని భావము. (చతురక్షరము.)

## ౨౧౮. మహ్యై నమః

తా. శ్రీదేవి అట్టి రహస్యస్వరూపమైనను ప్రసిద్ధముగానున్న భూరూపముగా నున్నదని భావము. (ద్వ్యక్షరము.)

## ౨౧౯. గణామ్బాయై నమః

తా. ప్రమథాదిగణములకుగాని గణపతికిగాని తల్లి అని భావము. (త్ర్యక్షరము.)

## ౨౨౦. గుహ్యకారాధ్యాయై నమః

తా. గుహ్యకులు దేవతావిశేషులలో నొకభేదము. వారిచేత పూజింపఁబడుచున్నదనియు, గుహ్యయనఁగా పంచకోశాంతర్వర్తిస్థానము శిరోమధ్యమందు ద్వాదశాన్తశిఖాస్థానమందు సహస్రారాంతర్గత చంద్రమండలమందు ఆరాధింపఁదగినదనియు భావము. (పంచాక్షరము.)

## ౨౨౧. కోమలాంగ్యై నమః

తా. శ్రీదేవి అతిమృదువైన శరీరముగలదని భావము. (చతురక్షరము.)

## ౨౨౨. గురుప్రియాయై నమః

తా. స్వస్వగురుపత్నీస్వరూపురాలనియు; ఏపుణ్యపురుషులు అర్హ

లైన శిష్యులకు మన్త్రదీక్షాదానముచేయుచు గురువులనిపించుకొను చున్నారో వారియందు ప్రేమగలదనియు, సర్వగురువు ఈశ్వరుడు గాన సదాశివుని భార్య అనియు భావము. (చతురక్షరము.)

౭౨౩. స్వతన్త్రాయై నమః

తా. సృష్ట్యాదికృత్యములకు అన్యాపేక్షలేకయే స్వతంత్రురా లనియు, బ్రాహ్మణార్హమైన శ్రీవిద్యాతన్త్రమునకు స్వతన్త్రతన్త్రమనియు, శ్రీచక్రమునకు సిద్ధమన్త్రమని ప్రసిద్ధిఅనియు, అట్టి సిద్ధమన్త్రస్వతన్త్రతన్త్ర స్వరూపమని భావము. (త్ర్యక్షరము.)

౭౨౪. సర్వతన్త్రేశ్యై నమః

తా. శ్రీవిద్యాతన్త్రములు అరువదినాలుగు. తక్కిన శాబరాదితన్త్ర ములు అనేకములు గలవు. సకలతన్త్రములకును శక్తిస్వరూపముగా ప్రభ్వియై ఉన్నదనియు వభావము. (పంచాక్షరము.)

౭౨౫. దక్షిణామూర్తిరూపిణ్యై నమః

తా. సనకసనందనాది మహర్షులు బ్రహ్మజ్ఞాననిశ్చయమును తెలిసి కొనలేక సంశయాత్ములై బ్రహ్మస్వరూపమైన పరమేశ్వరుని ప్రార్థింపగా ఈశ్వరుడు భాండీరమను వటవృక్షమూలమందు దక్షిణాభిముఖముగా పది యారు వత్సరములవయస్సుతో తురీయానుభవయుక్తముగా గురుస్వరూప ముగా శిష్యులైన ఋషులకు ప్రత్యక్షమైరి. వారు మౌనము చిన్ముద్రతో దర్శనమియ్యగానే శిష్యులసంశయములు నశించి బ్రహ్మజ్ఞానోదయమైనది. వారు సర్వలోకగురువులు. వారి యవతారము బ్రహ్మస్వరూపము గనుక పరాశక్తియే ఆస్వరూపముగా అవతరించినదని భావము. (అష్టాక్షరము.)

౭౨౬. సనకాదిసమారాధ్యాయై నమః

తా. అట్లు గురుస్వరూపముగా దర్శనమియ్యగానే సనకాదిఋషులు

జ్ఞానయుక్తులై దక్షిణామూర్తిస్వరూపముగా తమ ఇష్టదేవత ప్రత్యక్షమైనదని భావించి పూజించిరి. (అష్టాక్షరము.)

౨౨౭. శివజ్ఞానప్రదాయిన్యై నమః

తా. స్పందశక్తియగు విమర్శనశక్తివలన శివజ్ఞానము బ్రహ్మజ్ఞానము స్వస్వరూపజ్ఞానమును కలుగుచున్నందున అట్టిజ్ఞానము నిచ్చునదియని భావము. యోగవాసిష్ఠే:—'స్పందేన లక్ష్యతే వాయుర్వహ్నిరౌష్ణ్యేన లక్ష్యతే, చిన్మాత్రమమలం శాంతం శివ ఇత్యుదితం తు యత్, తత్స్పందమయశక్త్యైవ లక్ష్యతే నాన్యథా కిల' అని. జ్ఞానప్రదాయిని అనియు; వారాహే:—త్రిమూర్తిం ప్రక్రమ్య, "ఏతాస్తిస్రోఽపిసిద్ధ్యంతి యో రుద్రం వేత్తి తత్త్వతః" ఇతి. (అష్టాక్షరము.)

౨౨౮. చిత్కళాయై నమః

తా. సదాశివుఁడను కలారూపముగా అఖండాకారబ్రహ్మము యొక్క ఏకదేశమయిన అంశము ఏశక్తికలదో అది చిత్కల అని భావము. 'చిత్తేషు చిత్కలానామ శక్తిస్సర్వశరీరిణా' మితి. (త్ర్యక్షరము.)

౨౨౯. ఆనందకలికాయై నమః

తా. పూర్వనామమువలెనే పరబ్రహ్మయొక్క స్వల్పాంశము ఆనందకలగా ఉన్నదని భావము. (షడక్షరము.)

౨౩౦. ప్రేమరూపాయై నమః

తా. ప్రేమ అనఁగా స్నేహము, భక్తి. ఈరెండును పరాశక్తి స్వరూపములని భావము. ఈనామత్రయముచేత శ్రీదేవి సచ్చిదానంద స్వరూపమని భావము. (చతురక్షరము.)

౨౩౧. ప్రియంకర్యై నమః

తా. తనభక్తులకు ఇష్టమైన కోరికలను పూర్తిచేయునదియని భావము. (చతురక్షరము.)

## 232. నామపారాయణప్రీతాయై నమః

తా. ఈ లలితాసహస్రనామపారాయణచేత శ్రీదేవి సంతోషించు ననియు, నామపారాయణ అనగా అఆ-ఇఈ మొదలగు స్వరములు 16-ను, కాదిక్షాంతమైన వ్యంజనములు 34-గును. ఈపంచాశద్వర్ణము లును పరాశక్తి నామములుగా నున్నవి. అందు అచ్చులు16-ను విమర్శ శక్తిస్వరూపములు. వ్యంజనములు 34-గును ప్రకాశాంశములు. ఈ ప్రకాశాంశ విమర్శల సంయోగముచేతను 20232 యిరువదివేల యేడువందల ముప్పదియారు నామములగును. మాతృకావివేకే :—

"అ ఈపల్లదితైః పరస్పరయుతై ర్ద్విత్రి క్రమాద్యక్షరైః
కాదిక్షాంతగతైః స్స్వరాదిభి రథక్షాన్తైశ్చతైస్సస్వరైః,
నామాని త్రిపురే భవంతి ఖలు యాన్యత్యంతగోప్యాని తే
తేభ్యో భైరవపత్ని వింశతిసహస్రేభ్యః పరేభ్యో నమః.

దేవీభాగవతే, తృతీయస్కంధే:—

"అకారాది క్షకారాన్తై స్స్వరై ర్వర్ణైస్తు యోజితైః,
అసంఖ్యేయాని నామాని భవంతి రఘునందనేతి."

ఏతన్నామపారాయణక్రమంతు—

'దినతో వారతో పక్షా న్మాసాత్షట్త్రింశతా దినైః' రిత్యాదినా. తదిదం నామపారాయణాఖ్యం కర్మ ఉక్తం:—

"మా మర్చయతు వా మా వా విద్యాం జపతు వా నవా,
కీర్తయే న్నామసాహస్ర మిదం మత్ప్రీతయే సదా."

అని చెప్పఁబడియుండుటచేత నామపారాయణము, శ్రీదేవికి పరమ ప్రీతికరమని భావము, (అష్టాక్షరము.)

## 233. నందివిద్యాయై నమః

తా. నందికేశ్వరునిచేత ఉపాసింపఁబడిన మంత్రస్వరూపురాలు. (చతురక్షరము.)

## ౭౩౪ నటేశ్వర్యై నమః

తా. ప్రతి ప్రదోషకాలమందును సాంబమూర్తి చిదానందమయుఁడై తాండవముచేయును. అట్టి శివతాండవమునకు శ్రీదేవి ప్రత్యగ్గానుండి చిద్విలాసముగా వినోదించుచుండఁగా దేవీసన్నిధానమందు శివతాండవము ప్రదోషకాలమందు అనుదినము జరుగుచుండునని భావము. (చతురక్షరము.)

## ౭౩౫. మిథ్యాజగదధిష్ఠానాయై నమః

తా. మిథ్యాభూతమైన జగత్తునకు అధిష్ఠానకారణముగా నున్నదని, రజతభ్రమకు శుక్తి అధిష్ఠానకారణము, నీలలోహితాది వర్ణములకు స్ఫటికము, సర్పభ్రమకు రజ్జువు, చోరభ్రమకు స్థాణువు, జగద్భ్రమకు బ్రహ్మమే కారణము గాన అట్టిస్వరూపమే శ్రీదేవియని భావము. (అష్టాక్షరము.)

## ౭౩౬. ముక్తిదాయై నమః

తా. తనభక్తులకు మోక్షలక్ష్మిని ఇచ్చునదని భావము.(అష్టాక్షరము.)

## ౭౩౭. ముక్తిరూపిణ్యై నమః

తా. బ్రహ్మసాక్షాత్కారము, స్వాత్మజ్ఞానస్వరూపము, ముక్తిభేదవాచ్యము, అవిద్యానివృత్తి జ్ఞానముచేత నె కలుగుచున్నవి. శ్రు. "అజ్ఞానేనావృతం జ్ఞాన" మిత్యాదినా. స్వస్వరూపజ్ఞానమే ముక్తిగనుక అట్టి జ్ఞానమే శ్రీదేవిస్వరూపమని భావము. (పంచాక్షరము.)

## ౭౩౮. లాస్యప్రియాయై నమః

తా. శ్రీదేవికి నృత్యమందు విశేషప్రీతిగలదని భావము. (చతురక్షరము.)

## ౭౩౯. లయకర్యై నమః

తా. శ్రీదేవి జగత్ప్రళయకాలమందు జగత్తును లయముచేయునదనియు, 'ఏకధ్యానసమాలయః' అను న్యాయమున జీవబ్రహ్మైక్య

కాలము చిత్తవృత్తివిశేషము తురీయాతీత పంచమదశానుభవము లయమని శ్రీదేవి అట్టి లయమును చేయునదని భావము. (చతురక్షరము.)

౭౮౦. లజ్జారూపాయై నమః

తా. శ్రీదేవి లజ్జాస్వరూపురాలని 'యాదేవీ సర్వభూతేషు, లజ్జా రూపేణ సంస్థితా' ఇతివచనాత్. (చతురక్షరము.)

౭౮౧. రమ్భాదివన్దితాయై నమః

తా. శ్రీదేవి రంభా ఊర్వశి మొదలగు అప్సరస్త్రీలచేత పూజింపఁబడుచున్నదని భావము. (షడక్షరము.)

౭౮౨ భవదావసుధావృష్ట్యై నమః

తా. సంసారమను నగ్నిహోత్రము నుపశమింపఁజేయుటకు శ్రీదేవి అమృతవర్షమువంటిదని భావము. (అష్టాక్షరము.)

౭౮౩. పాపారణ్యదవానలాయై నమః

తా. శ్రీదేవి పాపములను అరణ్యమునకు వనవహ్నివలె నుండునదని భావము. (అష్టాక్షరము.)

౭౮౪. దౌర్భాగ్యతూలవాతూలాయై నమః

తా. దరిద్రమును తూలరాశికి (దూదిసమూహమునకు) పెనుగాలివంటిది. అనఁగా దరిద్రమును దూరముగాఁ దొలఁగించునదని భావము. (అష్టాక్షరము.)

౭౮౫. జరాధ్వాన్తరవిప్రభాయై నమః

తా. ముదిమియను గాఢాన్ధకారమునకు సూర్యునివంటిదని భావము. (అష్టాక్షరము.)

౭౮౬. భాగ్యాబ్ధిచంద్రికాయై నమః

తా. భాగ్యమను సముద్రమునకు శ్రీదేవి చంద్రకాన్తివంటిది. (షడక్షరము.)

౨౮౭. భక్తచిత్తకేకిఘనాఘనాయై నమః

తా. భక్తులచిత్తములను నెమిళ్లకు మేఘసమూహమువంటిదని భావము. (దశాక్షరము.)

౨౮౮. రోగపర్వతదమ్భోళయే నమః

తా. శ్రీదేవి రోగములను పర్వతములకు వజ్రాయుధమువంటిదని భావము. (అష్టాక్షరము.)

౨౮౯. మృత్యుదారుకుఠారికాయై నమః

తా. మృత్యువను వృక్షమునకు గండ్రగొడ్డలివంటిది. (అష్టాక్షరము.)

౨౯౦. మహేశ్వర్యై నమః

తా. శ్రీదేవి సకలబ్రహ్మాండమునకును ప్రభ్వి యని భావము. (చతురక్షరము.)

౨౯౧. మహాకాళ్యై నమః

తా. మృత్యువునుకూడ నశింపఁజేయునది గనుక మహాకాళి అనియు అట్టిస్వరూపము గలది; ఉజ్జయినీ పీఠాధీశుండగు మహాకాలుని పట్టమహిషి యగు మహాకాలియొక్క స్వరూపిణి యని భావము. (చతురక్షరము.)

౨౯౨. మహాగ్రాసాయై నమః

తా. 'యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవతిచోదనే' యను శ్రుత్యనుసారము, బ్రహ్మ క్షత్రములు రెండును పరమేశ్వరునకు అన్న స్థానములుగా నున్నవి. కనుక తచ్ఛక్తిస్వరూపిణి యగు లలితాంబికకుగూడ బ్రహ్మక్షత్రములు రెండును అన్నములే యగును. కావున అట్టి గొప్ప కబళము గలదని భావము. (చతురక్షరము.)

౨౯౩. మహాశనాయై నమః

తా. ప్రళయకాలమందు చరాచరరూపప్రపంచమును నశింపఁ జేయునదని భావము. (చతురక్షరము.)

౨౫౪. అపర్ణాయై నమః

తా. శ్రీదేవి పార్వతీస్వరూపురాలని భావము. (త్ర్యక్షరము.)

౨౫౫. చణ్డికాయై నమః

తా. శ్రీదేవియందు భక్తిలేనివారిమీఁద కోపించునది యని భావము. (త్ర్యక్షరము.)

౨౫౬. చణ్డముణ్డాసురనిషూదిన్యై నమః

తా. శ్రీదేవి చండుఁడు ముండుఁడు అను రాక్షసులను దుర్గారూపమునుపొంది సంహరించినదని భావము. (దశాక్షరము.)

౨౫౭. క్షరాక్షరాత్మికాయై నమః

తా. క్షరమనఁగా సకలభూతములు అక్షరమనఁగా కూటస్థుఁడు. నాశముకలదనియు, నాశము లేనిదనియు. ఈయుభయమును పరదేవతాస్వరూపమే అని భావము. (షడక్షరము.)

౨౫౮. సర్వలోకేశ్యై నమః

తా. చతుర్దశభువనములకును ప్రభ్వి యని భావము. (పంచాక్షరము)

౨౫౯. విశ్వధారిణ్యై నమః

తా. శ్రీదేవి సకలప్రపంచమును ధరించినదని. ఆధారముగానున్నదని దానికి భావము. (పంచాక్షరము.)

౨౬౦. త్రివర్గదాత్ర్యై నమః

తా. శ్రీదేవి ధర్మార్థకామములను ఇచ్చునది యని భావము. (పంచాక్షరము.)

౨౬౧. సుభగాయై నమః

తా. లోకత్రయమందునుగల చరములందును అచరములందును ఉండిన సౌభాగ్యము శ్రీదేవీస్వరూపమని పద్మపురాణవచనము. అచరగతంతు:–

“ఇక్షవస్తరురాజీశ్చ నిష్పావాజీరధాన్యకే, వికారవచ్చగోక్షీరం కుసుంభం కుంకుమంతథా. లవణంచేతి సౌభాగ్యాష్టకం స్థావరముచ్యతే” ఇతి. చరాసు :—సువాసిన్యః ప్రసిద్ధాఏవ, కించ తత్రైవః—“త్రివిష్టప సౌభాగ్యనయీం భుక్తిముక్తిప్రదాముమాం, ఆరాధ్యసుభగాం భక్త్యా నారీవా కిన్నవిదంతి” ఇతి. లేక, శ్రీకామమాహాత్మ్యవీర్యయత్నకీర్త్యాదయో భగపదవాచ్యాః, ఈగుణములు భగశబ్దార్థములు గలవి గాన ‘సుభగా’ అనేనామము సిద్ధించినది అని. “భగమైశ్వర్యమాహాత్మ్యజ్ఞాన వైరాగ్యయోనిషు, యశోవీర్యప్రయత్నేచ్ఛాశ్రీధర్మరవిముక్తిషు.” ఇతి విశ్వః; లేక సూర్యునియందుగల సకలధర్మములును శ్రీదేవి స్వభావములని భావము. (త్ర్యక్షరము.)

౭౬౨. త్ర్యమ్బకాయై నమః

తా. శ్రీదేవి చంద్ర సూర్యాగ్ని మండలములనే మూఁడునేత్రములు గలదని భావము. (త్ర్యక్షరము.)

౭౬3. త్రిగుణాత్మికాయై నమః

తా. శ్రీదేవి సత్త్వరజస్తమోగుణమేళనస్వరూపము గలది. (పంచాక్షరము.)

౭౬౪. స్వర్గాపవర్గదాయై నమః

తా. స్వర్గమనఁగా క్షయస్వభావసుఖముగలది, స్థిరమైన అపవర్గమనఁగా మోక్షసుఖము, ఈద్వివిధసుఖము నొసంగునది. (షడక్షరము.)

౭౬౫. శుద్ధాయై నమః

తా. శ్రీదేవి అవిద్యారహితమైనది గనుక నిర్మలమైనదని భావము. (ద్వ్యక్షరము.)

౭౬౬. జపాపుష్పనిభాకృత్యై నమః

తా. శ్రీదేవి మంకెనపుష్పముతో సమానమైన ఎఱ్ఱనికాంతిగలదని భావము. (అష్టాక్షరము.)

౭౬౭. ఓజోవత్యై నమః

తా. ఇంద్రియసామర్థ్యముగలది. "ఓజస్తేజసి ధాతూనా మవష్టంభప్రకాశయోః, ఓజో బలే చ దీప్తౌచేతి విశ్వః." (చతురక్షరము.)

౭౬౮. ధృతిధరాయై నమః

తా. శ్రీదేవి విశేషమైన కాంతిని ధైర్యమును ధరించినదని భావము. (చతురక్షరము.)

౭౬౯. యజ్ఞరూపాయై నమః

తా. శ్రు. 'యజ్ఞోవైవిష్ణుః' అను శ్రుతివలన విష్ణుస్వరూపమనియు, ప్రసిద్ధమైన యాగస్వరూపమనియు భా. రహస్యామ్నాయే:-'ఇంద్రియద్వారసంగ్రాహ్యైః గన్ధాద్యైరాత్మదేవతాం, స్వయంభక్త్యా సమారాధ్య జ్ఞాతస్సోఽయం మహామఖః ఇతి' ఇంద్రియద్వారములచే గ్రహింపఁబడే గంధాదులచేత ఆత్మదేవతను భక్తితో ఆరాధించుటయే మహామఖమను నియమమున అట్టి అంతర్యాగస్వరూపమని భావము. (చతురక్షరము.)

౭౭౦. ప్రియవ్రతాయై నమః

తా. సకలవ్రతములందును శ్రీదేవి ప్రీతిగలదని భావము. (చతురక్షరము.)

౭౭౧. దురారాధ్యాయై నమః

తా. ఇంద్రియచాంచల్యము గలవారిచేత ఆరాధించుటకు శక్యము కానిదని భావము. (చతురక్షరము.)

౭౭౨. దురాధర్షాయై నమః

తా. అస్వాధీనమైన ఇంద్రియములుగలవారికి స్వాధీనము కానేరదని భావము. (చతురక్షరము.)

౭౭3. పాటలీకుసుమప్రియాయై నమః

తా. శ్వేతరక్తవర్ణములు కలసినది పాటలీపుష్పము. అందు శ్రీదేవి మిక్కిలి ప్రీతిగలదని భావము. పాటలి అని వృక్షవిశేషము. 'శ్రీవృక్షే శంకరోదేవః పాటలాయాస్తు పార్వతీ' ఇతినియమాత్. (అష్టాక్షరము.)

౨౨౪. మహాత్యై నమః

తా. శ్రీదేవి పరిమాణరహితాకారముగలదని భావము. (త్ర్యక్షరము.)

౨౨౫. మేరునిలయాయై నమః

తా. భూమధ్యమందున్న ప్రసిద్ధమైన మేరుపర్వతమందు స్థానముగాఁ గలదనియు, శ్రీచక్రమధ్యబిందువు మేరుసంజ్ఞ కలది. అచట స్థానముగాఁ గలదనియు, పంచదశనిత్యాస్థానములు శ్రీదేవి చుట్టునున్నవనియు, అదియే పరాశక్తిస్థానమనియు, శారీరమందు ద్వాదశస్థానమనియు, మధ్యబిందువు మేరువనియు, అచట నివసించునదనియు భావము.

శ్లో. 'జ్ఞానార్ణవే: భూమిశ్చంద్రశ్శివోమాయా శక్తికృష్ణాధ్వమాదనా, అర్ధచంద్రశ్చ బిందుశ్చ నవార్ణో మేరురుచ్యతే' ఇతి. ఈ వచనమందున్న తొమ్మిదివర్ణములు కలసినబీజము మేరుమంత్రమని సంకేతము. శ్రీదేవి ఆమంత్రాధిదేవతనియు, శ్రీచక్రమందు బీజన్యాసమందుఁగల భేదముల ననుసరించి భూప్రస్తారము కైలాసప్రస్తారము మేరుప్రస్తారము అని ప్రస్తారత్రయము సనకాదిసంహితలందు ప్రసిద్ధముగా నున్నది. అందు శ్రీచక్రమందుఁగల షోడశదళకమలమందు షోడశస్వరములను షోడశనిత్యలుగా భావించుటయు, అష్టదళమందు అష్టవర్గులను మన్వస్రాదికమందు సనకాదులు ఆరోహణక్రమముగా లిఖించినపుడు భూప్రస్తారమనియు, అష్టదళమందు రెండేసిస్వరములచొప్పున వేసి మన్వస్రాదికమందు కాదులను ఆరోహణక్రమము లిఖించినపుడు కైలాసప్రస్తారమనియు, అష్టకోణమందు రెండేసిస్వరములు చొప్పున షోడశస్వరములను వ్రాసి అంతర్దశారము నుండి కాదులను అవరోహణక్రమముగా లిఖించినపుడు మేరుప్రస్తారమనియు, సనకాదిసంహితలందు ప్రస్తారత్రయనిర్ణయము గలదు గాన అందు మేరుప్రస్తారమందు శ్రీదేవి సాన్నిధ్యమని అభిప్రాయము. (పంచాక్షరము.)

౨౨౬. మన్దారకుసుమప్రియాయై నమః

తా. మందార మనఁగా దేవతరువుగాని ప్రసిద్ధమైన మందార పుష్పముగాని శ్వేతార్కపుష్పముగాని యగును. వానియందు ప్రీతిగలదని భావము. (అష్టాక్షరము.)

౨౨౭. వీరారాధ్యాయై నమః

తా. వీరులనఁగా ఇంద్రాదులుగాని బ్రహ్మ విష్ణు రుద్రులుగానియగు దురు. వీరిచే ఆరాధింపఁబడునదియని భావము. శ్లో. "అహామి ప్రళయం కుర్వన్నిదమః ప్రతియోగినః, పరాక్రమంపరోభుఙ్క్తే స్వాత్మానమశివాపహ"మితి. మహావాక్యార్థానుభవముగలవారు వీరులు. అట్టివీరులచేత ఆరాధింపఁబడునదని భావము. (చతురక్షరము.)

౨౨౮. విరాడ్రూపాయై నమః

తా. ప్రకాశమానమైన విశ్వరూపము, విరాడ్రూపము గలదని భావము (చతురక్షరము.)

౨౨౯. విరజసే నమః

తా. రజోగుణ సంపర్కరహితమైన శుద్ధసత్వస్వరూపురాలని భావము. (త్ర్యక్షరము.)

౨౩౦. విశ్వతోముఖ్యై నమః

తా. విశ్వమంతటను ముఖములు గలదని భావము శ్రు. "విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖమితి." (పంచాక్షరము.)

౨౩౧. ప్రత్యగ్రూపాయై నమః

తా. ప్రతికూలమును పొందించునదిగాన ప్రత్యక్ ఇంద్రియములను విషయోన్ముఖమును పొందించుట బహిర్ముఖము పరాఙ్ముఖము దానికిప్రతికూలముగా అంతరాత్మోన్ముఖత్వమును బొందించుటప్రత్యక్ అట్టిప్రత్యక్స్వరూప

మని భావము. శ్రు. "పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూ స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాన్తరాత్మ"న్నితి. ప్రత్యగవలోక్యమానస్వరూపమని భావము. (చతురక్షరము.)

౭౮౨. పరాకాశాయై నమః

తా. ఉత్కృష్టమైన ఆకాశస్వరూపమని బ్రహ్మజ్ఞానస్వరూపమని భావము. శ్రు. "ఆకాశఇతిహోవాచాకాశోహ్యేవైభ్యోజ్యాయానాకాశః." ఇతిఛాన్దోగ్యే. ఆకాశపదముచేత శ్రీదేవి పరబ్రహ్మమే అని భావము. 'పరమేవ్యోమన్ప్రతిష్ఠిత' అను శ్రుతివలన సిద్ధమైన బ్రహ్మాండ పిండాండ భేదముచేతను, ద్వాదశాన్తస్థానము పరాకాశస్థానముగా నున్నందున బ్రహ్మస్థాన మనియు బ్రహ్మస్వరూపమనియు స్వచ్ఛన్దతన్త్రే. 'ద్వాదశాన్తంలలాటోర్ధ్వం కపాలోర్ధ్వావసానకం, ద్వ్యఙ్గులోర్ధ్వం శిరోదేశాత్పరం వ్యోమప్రతిష్ఠిత'మితి. (చతురక్షరము.)

౭౮౩. ప్రాణదాయై నమః

తా. శ్రీదేవి ప్రాణాదిపంచవాయువులను ఇచ్చునదనియు, బ్రహ్మస్వరూపమనియు భావము. (త్ర్యక్షరము.)

౭౮౪. ప్రాణరూపిణ్యై నమః

తా. శ్రీలలితాదేవి ప్రతిభూతమందును ప్రాణస్వరూపముగా నున్నదనియు, ప్రాణస్వరూపమైన శ్వాసలవలననే కాలనిర్ణయము మేషాదికాలనిర్ణయము సూర్యచన్ద్రాదిగతినిర్ణయము జరుగుచున్నందున కాలము బ్రహ్మస్వరూపమని భావము. (పంచాక్షరము )

౭౮౫. మార్తాండభైరవారాధ్యాయై నమః

తా. కాలభైరవ ఆనన్దభైరవాద్యష్టభైరవులలో మార్తాండభైరవస్వరూపముగా పరాశక్తిఉన్నదని భావము. భైరవుఁడు ఒకసమయమందు రత్నమయవిగ్రహమందు శ్రీదేవిని ఆరాధింపఁగా సూర్యసమానకాంతి

నిచ్చినందున మార్తాండ నామము కలిగినది. ఆ భైరవునకును శ్రీదేవికిని అభేదమని భావము. (అష్టాక్షరము.)

౭౮౬. మన్త్రిణీన్యస్తరాజ్యధురే నమః

తా. శ్యామలాంబయందుంచఁబడిన రాజ్యభారము గలదని భావము. (అష్టాక్షరము.)

౭౮౭. త్రిపురేశ్యై నమః

తా. సర్వానందమయ చక్రేశ్వరి త్రిపురేశ్వరి గనుక శ్రీదేవి అట్టి స్వరూపముగలదని భావము. (చతురక్షరము.)

౭౮౮. జయత్సేనాయై నమః

తా. భండాసురాదిరాక్షసులను జయించిన సేనలుగలదని భావము. (చతురక్షరము.)

౭౮౯. నిస్త్రైగుణ్యాయై నమః

తా. శ్రీదేవి గుణత్రయవాసనారహితయనియు, గుణత్రయము కంటె పూర్వమున్నదనియు భావము. (చతురక్షరము.)

౭౯౦. పరాపరాయై నమః

తా. పరులు శత్రువులు, అపరులు మిత్రులు గనుక శత్రుమిత్రత్వ భేదములేనిదని భావము. పరమని అపరమని శబలత్వ శుద్ధత్వభేదముచేత బ్రహ్మము రెండువిధములుగా నున్నదని భావము. పరము అపరము పరాపరము అనిపూజ మూఁడువిధములు. పరము శ్రీచక్రాదులందును, అపరము నిర్గుణము, జ్ఞానస్వరూపమును పొంది తుర్యాతీతావస్థానుభవము పరాపరమని ముక్తావస్థాస్వరూపమని భావము. (చతురక్షరము.)

౭౯౧. సత్యజ్ఞానానన్దరూపాయై నమః

తా. సత్యమనఁగా త్రికాలాబాధ్యము. జ్ఞానమనఁగా ప్రకాశ

స్వరూపము. ఆనందమనఁగా ప్రేమస్వరూపము అని భావము. ఇదియే సచ్చిదానంద స్వరూపిణి యని భావము. (అష్టాక్షరము.)

౭౯౨. సామరస్యపరాయణాయై నమః

తా. న్యూనాధికములులేని శివశక్తులసామరస్యముస్థానమనియు, సామరస్యమందాసక్తికలదనియు, సామరస్యమే స్వరూపముగాఁగల దనియు, పరబ్రహ్మస్వరూపమనియు భావము. (అష్టాక్షరము.)

౭౯3. కపర్దిన్యై నమః

తా. కపర్దుఁడను నామముగల ఈశ్వరునిపత్నిగాన కపర్దిని యను నామము కలిగినదని భావము. (చతురక్షరము.)

౭౯౪. కళామాలాయై నమః

తా. కళలనఁగా చతుష్షష్టి (౬౪) విద్యలు; ఈవిద్యలే పుష్ప మాలవలె శ్రీదేవికి అలంకారముగా నున్నవని భావము. (చతురక్షరము.)

౭౯౫. కామదుఘే నమః

తా. తమభక్తులకు కోరికలనిచ్చుటకు శ్రీదేవి కామధేనువువంటి దనియు కామధేనుస్వరూపముగా నున్నదని భావము. (చతురక్షరము.)

౭౯౬. కామరూపిణ్యై నమః

తా. కాముఁడనఁగా పరశివుఁడే స్వరూపముగాఁ గలదనియు; శ్రు. 'సోఽకామయత బహుస్స్యాం ప్రజాయేయేతి' అను శ్రుతిచేత సిద్ధమైన జగత్సృజనేచ్ఛగల ఈశ్వరస్వరూపిణి అనియు, యథేచ్ఛమైన భావములు గలదనియు భావము. (పంచాక్షరము.)

౭౯౭. కళానిధయే నమః

తా. శ్రీదేవి షోడశకళలకు స్థానమని, చంద్రస్వరూపిణి యని భావము. (చతురక్షరము.)

౯౯౮. కావ్యకళాయై నమః

తా. కవులయొక్క కర్మ కావ్యము, అది కావ్య, నాటక, నాటికా, భాణ, డిమ, ప్రహసనాది భేదములు కలిగియున్నది. అట్టి కలాస్వరూపము పరాశక్తి అనియు కావ్యోత్పాదక ప్రతిభయే కలాస్వరూపముగా నున్న దనియు, దాని విశేషముచేత కావ్యనిర్మాణసామర్థ్యము కలుగుచున్న దనియు, "నాఋషిః కావ్యకర్తాస్యాత్" అను న్యాయముచేతను అట్టి ప్రతిభాస్వరూపిణి యని భావము. శుక్రాచార్యునియందు మృతసంజీవినీ విద్య కలారూపముగా నున్నదనియు భావము. (చతురక్షరము.)

౯౯౯. రసజ్ఞాయై నమః

తా. శృంగారాది నవరసములను గ్రహించునదనియు, రసనేంద్రియస్వరూపిణి అనియు, 'రసోవై సః.' అనేశ్రుతివలన బ్రహ్మానంద స్వరూపిణి అనియు దానిని అనుభవించు ప్రజ్ఞానస్వరూపిణి అనియు భావము. (త్ర్యక్షరము.)

౧౦౦౦. రససేవధయే నమః

తా. శ్రీదేవి బ్రహ్మానందరసమునకు నిధివంటిదని భావము. (పంచాక్షరము.)

అష్టమశతకము సమాప్తము.

---

శ్రీరస్తు

# శ్రీలలితాసహస్రనామావళి

## నవమశతకము.

---

### ౮౦౧. పుష్టాయై నమః

తా. షట్త్రింశ త్తత్త్వములతోఁ గూడియున్నందున పుష్టా అను నామము కల్గినది. సర్వగుణములచేతఁగాని బ్రహ్మరసముచేతఁగాని పోషింపఁబడునది గాన పుష్టా అని ప్రసిద్ధి. శ్రు. 'బ్రహ్మాయుష్మ త్తద్బ్రాహ్మణైరాయుష్మత్' ఇతి శ్రుతేశ్చ. (ద్వ్యక్షరము.)

### ౮౦౨. పురాతనాయై నమః

తా. శ్రీదేవి సకలమునకు ఆదియందున్నందున పురాతన యని భావము. (చతురక్షరము.)

### ౮౦౩. పూజ్యాయై నమః

తా. శ్రీదేవి ఆదినుండి ఉన్నందున సమస్తజనులకు పూజింపఁదగినది. (ద్వ్యక్షరము.)

### ౮౦౪. పుష్కరాయై నమః

తా. పుష్కరమను తీర్థస్వరూపమనియు, పుష్కరమను తీర్థరాజకాల విశేషము గాన అట్టి కాలస్వరూపిణి యనిగాని భావము. (త్ర్యక్షరము.)

### ౮౦౫. పుష్కరేక్షణాయై నమః

తా. పద్మదళములవంటి నేత్రములుగలదని భావము.(పంచాక్షరము.)

## ౮౦౬. పరంజ్యోతిషే నమః

తా. శ్రీదేవి ఉత్కృష్టమైన బ్రహ్మస్వరూప తేజస్సనియు, ఇదియే సూర్యాగ్ని చంద్రాదితేజస్సులకు తేజస్సును ఇచ్చునదనియు భావము. శ్రు. 'నతత్రసూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః; మనోజ్యోతిర్జుషతాం; వాచైవాయంజ్యోతిషాఽఽస్తే' ఇత్యాది ప్రయోగములున్నను ఆత్మజ్యోతియే పరంజ్యోతి యని భావము. (చతురక్షరము.)

## ౮౦౭. పరస్మై ధామ్నే నమః

తా. ౧. పరంధామ అనఁగా ఉత్కృష్టమైన తేజస్సని భావము. శ్రుతి:—"న తద్భాసయతే సూర్యో న శశాంకో నపావకః యద్గత్వా న నివర్తంతే తద్ధామపరమంమమే"తి గీతావచనం:—'ధామశబ్దో అవస్థా పరః, తదతిక్రాంతం పరంధామ' శ్రు. "త్రిషు ధామసు యద్భోజ్యం భోక్తా యశ్చ ప్రకీర్తితః, వేదైతదుభయం యస్తు స భుంజానో న లిప్యతే" ఇతి.

౨. జాగ్రత్స్వప్న సుషుప్తులనే అవస్థాత్రయమందుఁ గల సుఖదుఃఖములను ఎవఁడు అనుభవించుచున్నాఁడో, ఏజీవియో (?) ఆ రెండును తెలుసుకున్నవాఁడు సాక్షి గనుక, ఆస్వరూపుఁడు తాననియు, స్థూల సూక్ష్మ కారణశరీరములు తాను కానని ఎవరు తెలుసుకొనుచున్నారో వారు ప్రపంచవ్యవహారమందున్నను, సుఖదుఃఖానుభవము గలవారైనను, సాక్షిస్వరూపులు గాన, జీవన్ముక్తులని భావము. వీరే తురీయావస్థను పొందినవారు. శ్రుత్యంతరే:—"జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్యం వేద ధామత్రయం తు యః, స ఏవాత్మాన మద్దృశ్యం దృశ్యంతస్మిన్ప్రకల్పితం." తా. జాగ్రత్స్వప్నసుషుప్తులను ఏసాక్షి తెలుసుకొనుచున్నాఁడో, అదియే ఆత్మ యని గ్రహించవలెను. అది కంటికగపడదు. అగుపడు ప్రపంచమంతయు, దానియందు కల్పితమని భావము. ఆత్మ, సాక్షి, బ్రహ్మము, తురీయావస్థ ఇవన్నియు ముక్తిస్థానమునకు నామములు.

ఒకేవస్తువుపేర్లు, తక్కిన ప్రపంచమంతయు దానియందు కల్పితముగా నున్నదని తెలుసుకోవలెను. అట్లు తెలిసికొనువాఁడు సాక్షిగాన, సాక్షిని నేననువాఁడు జీవన్ముక్తుఁడు బ్రహ్మస్వరూపుఁడుగా నున్నాఁడని, శ్రుతి భావము. (చతురక్షరము.)

### ౮౦౮. పరమాణవే నమః

తా. శ్రీదేవి పరమాణుస్వరూపురాలని భావము. దృగ్గోచరము లయిన వస్తువులన్నియు, అణువుకంటె పెద్దవి. అన్నిటికిన్న చిన్నది అగుపడనిది అణువు. దానికంటె చిన్నది పరమాణువు గనుక ఆత్మ పరమాణుస్వరూపమనియు భావము.

శ్రు. 'అణోరణీయాన్మహతో మహీయానితి'. బ్రహ్మము పరమాణువు కంటె చిన్నదియు, పెద్దవస్తువులగు ఆకాశము వాయువు భూమి వీనికంటె పెద్దది. అనఁగా పరమాణువులో నిమిడియున్నందున అంతకంటె చిన్నదనియు, ఆకాశాదులు ఆత్మలోపల పరమాణువులవలెను అనేక బ్రహ్మాండములున్నందున అన్నిటికంటె పెద్దదనియు భావము. (చతురక్షరము.)

### ౮౦౯. పరాత్పరాయై నమః

తా. పరమనఁగా ఉత్కృష్టము. బ్రహ్మ, విష్ణు, రుద్రులు వీరికంటె ఉత్కృష్టమనియు, బ్రహ్మవైవర్తే:— "తస్య బ్రహ్మస్వరూపస్య. దివారాత్రిశ్చ యద్భవేత్, తత్పతం నామ తస్యార్ధం పరార్ధమభిధీయతే. సఈశ్వరస్యదివసస్తావతీ రాత్రిరుచ్యతే. స్థూలాత్ స్థూలతమ స్సూక్ష్మా ద్యస్తుసూక్ష్మతమోమతః. న తస్యాస్తిదివారాత్రివ్యవహారో న వత్సరః." సూక్ష్మభేదము లేని బ్రహ్మస్థానమందుఁ గాని బ్రహ్మావస్థయందుఁ గాని తురీయావస్థయందుఁ గాని అహోరాత్రిభేదము సంవత్సరభేదము లేదని సూర్యచంద్రకిరణసంపర్కములేదని శ్రుతి భావము. (చతురక్షరము.)

౮౧౦. పాశహస్తాయై నమః

తా. శ్రీదేవి వామోర్ధ్వకరమందు పాశమును ధరించినదని భావము. (చతురక్షరము.)

౮౧౧ పాశహన్త్రై నమః

తా. శ్రీదేవి సకలపాశములను హరించునదని భావము. (చతురక్షరము.)

౮౧౨. పరమంత్రవిభేదిన్యై నమః

తా. తనభక్తులకు శత్రువులచేత చేయఁబడు క్రూరాలోచనలను గాని, మారణాదిమంత్రములనుగాని అత్యంతము భేదించునదియని భావము. పంచదశీ మంత్రోపాసకులు ద్వాదశసంఖ్యగలవారు. శ్లో. "మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః, అగస్తి రగ్నిస్సూర్యశ్చ నన్దీస్కన్ద శ్శివ స్తథా, క్రోధభట్టారకో దేవ్యాః ద్వాదశామీ ఉపాసకాః." ఈ పన్నిద్దఱు వారివారి పంచదశీమంత్రమును వేరువేరుగా ఉద్ధారములుచేసి తమతమ మంత్రోపాసనచేత పరదేవతానుగ్రహమును పొందినారని భావము. అందులో శివవిద్యయగు కాదివిద్యాసంప్రదాయము ఈ వ్యాఖ్యానకారులది. సమయవిద్య దక్షిణాచారమున్నూ. (అష్టాక్షరము.)

౮౧౩. మూర్తాయై నమః

తా. శ్రీలలితాంబిక "మూర్త" స్వరూపిణియని భావము. (మూర్తము లన నేమియో, అమూర్తము లన నేమియో ఆ వివరణము పైనామమునందు చక్కఁగా వివరింపుచున్నాము.) (ద్వ్యక్షరము.)

౮౧౪. అమూర్తాయై నమః

తా. ప్రపంచమందుఁగల సకలపదార్థములు మూర్తములని అమూర్తములని రెండువిధములుగ నున్నవి. దృగ్గోచరములు మూర్తములు. కంటికగుపడని వాయ్వాకాశాదులు అమూర్తములు. స్థూలభూతములు మూర్తములు. శబ్దస్పర్శాదిసూక్ష్మభూతములు అమూర్తములు. పరాశక్తిమాత్రము పైమూర్తా

మూర్తములను రెండురూపములుగా నున్నదని రెండునామముల భావము. శ్రు. 'ద్వేఏవ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తంచేతి' సగుణరూపములు మూర్తివంతములు పృథివ్యాదులు ఆకాశవాయ్వాదులు తన్మాత్రా పంచకము శబ్దస్పర్శాదులు అమూర్తిమంతములు. ఈరెంటను బ్రహ్మమునకు స్వరూపముగా నున్నవని పైశ్రుతి భావము. (త్ర్యక్షరము.)

౮౧౫. అనిత్యతృప్తాయై నమః

తా. షోడశోపచారచతుష్షష్ట్యుపచారములు అనిత్యములు. అప్రత్యక్షములైనను అపరిమితములు గాన అనిత్యమైన పంచోపచారమాత్రము చేతనే సంతోషించునది యని భావము. శ్లో. "పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనా" అను వచనముచేత భక్తిమాత్రముచేత కించిత్తైనను ఏది దేవతార్పణము చేయఁబడునో దానిచేతనే దేవతకు ప్రీతియగునని భావము. (పంచాక్షరము.)

౮౧౬. మునిమానసహంసికాయై నమః

తా. మునులనఁగా స్వమంత్రోపాసకభక్తజనులు, వారిమనస్సే మానససరస్సునందు శ్రీజాతిహంసవలెను శ్రీదేవి నిత్యసాన్నిధ్యము గలిగి ఉండునని భావము. (అష్టాక్షరము.)

౮౧౭. సత్యవ్రతాయై నమః

తా. సత్యమనఁగా బ్రహ్మము. వ్రత మనఁగా భక్ష్యముగా ప్రియమైనదనియు, శ్రు. "తపోవ్రతం బ్రాహ్మణస్య" అనుశ్రుతి వ్యాఖ్యానమందు వ్రతశబ్దమునకు భక్ష్యమని అర్థము నిర్ణయింపఁబడినందున, సత్యమే వ్రతముగాఁ గలదనియు, సత్యమైన శీఘ్రఫలదాయకమైన వ్రతములు గలదనియు భావము. (చతురక్షరము.)

౮౧౮. సత్యరూపాయై నమః

తా. శ్రీదేవి కాలత్రయాబాధ్యమైన స్వరూపము గలదనియు, సత్యమే రూపముగాఁ గలదనియు భావము. (చతురక్షరము.)

౮౧౯. సర్వాన్తర్యామిన్యై నమః

తా. శ్రీదేవి సకల హృదయములందుండి ఇంద్రియములను ప్రేరణ చేయుచున్నదియని భావము. సర్వాంతర్యామిని అని. (షడక్షరము.)

౮౨౦. సత్యై నమః

తా. శ్రీదేవి పతివ్రత అనియు, సత్యస్వరూపిణీ అనియు, దక్షకన్యాస్వరూపమనియు భావము. (ద్వ్యక్షరము.)

౮౨౧. బ్రహ్మాణ్యై నమః

తా. 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' అను శ్రుతివలన ఆనందకోశపుచ్ఛమందు ప్రతిష్ఠింపఁబడిన బ్రహ్మమే స్వరూపముగాఁ గలదని భావము. శ్రు. 'బ్రహ్మణ ఆణీస్థః'' అనే శ్రుతివలన 'అణి' అనగా పుచ్ఛాగ్రమని ప్రసిద్ధముగా వ్యాఖ్యాతలు గ్రహించినారు. (త్ర్యక్షరము.)

౮౨౨. బ్రహ్మణే నమః

తా. ఏస్థానము ముక్తులు పొందఁదగినదో, అది బ్రహ్మమనియు, స్వాత్మాభిన్నజ్ఞాన స్వరూపమనియు భావము. విష్ణుపురాణే. శ్లో. ''ప్రత్యస్త మితభేదం యత్సత్తామాత్రమగోచరం. వచసా మాత్మ సంవేద్యం తజ్జ్ఞానం బ్రహ్మసంజ్ఞిత'' మితి. (త్ర్యక్షరము.)

౮౨౩. జనన్యై నమః

తా. శ్రీదేవి సకలప్రపంచమును పుట్టించునది గనుక జననియను నామసిద్ధి కలిగినది. (త్ర్యక్షరము.)

౮౨౪ బహురూపాయై నమః

తా. స్థావరజంగమాత్మకమైన అనేకరూపములుగలదని. దేవీపురాణే:- ''స్వరూపా పరభావత్వాద్బహురూపా క్రియాత్మికేతి. పరబ్రహ్మభావనారూపాయా అపి భండాసురహననాది క్రియాకారిత్వాత్. తత్తద్రూపవత్త్వేన బహురూపత్వమపి'' గ్రన్థాంతరే:- ''బహూనియస్యా

రూపాణి స్థిరాణి చ చరాణి చ, దేవమానుషతిర్యక్షు బహురూపాతత శ్చ వేతి'' సూతసంహితాయాం:—''ఏకధా చ ద్విధా చైవ తథా షోడశ ధాస్థితా, ద్వాత్రింశద్భేదభిన్నా వా యా తాం వందే పరాత్పరా'' మితి. (చతురక్షరము.)

౮౨౪. బుధార్చితాయై నమః

తా. శ్రీదేవి జ్ఞానులచేత పూజింపఁబడుచున్నదని భావము. తథాచ భగవద్గీతాయాం:—''చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున, ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభేతి.'' వచనాత్. (చతురక్షరము.)

౮౨౫. ప్రసవిత్ర్యై నమః

తా. అత్యంతము వియదాదిభూతములనుగాని సకలజనులనుగాని పుట్టించునది యని విష్ణుధర్మోత్తరే:-ప్రజానాంచ ప్రసవనాత్ ''సవితేతి'' ''నిగద్యతే'' ఇతి దేవీపురాణే.—''బ్రహ్మాద్యాస్థావరాన్తాశ్చ యస్యా ఏవసముద్గతాః, మహాదాదివిశేషాన్తం జగదస్యాస్సముద్గతం. తామేవ సకలార్థానాం ప్రసవిత్రీం పరాం మమ'' ఇతి. (చతురక్షరము.)

౮౨౬. ప్రచండాయై నమః

తా. శ్రీదేవి అధికమైన కోపస్వభావముగల సేనలు గలదనిగాని తీక్ష్ణమైన ఆజ్ఞ కలదనిగాని భావము. శ్రు. ''భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యఇతి'' అధికమైన ప్రతాపముగలదనిగాని భావము. (త్ర్యక్షరము.)

౮౨౭. ఆజ్ఞాయై నమః

తా. వేదమందుఁగల ప్రవృత్తినివృత్తిరూపమైన ఆజ్ఞాస్వరూపిణి అని. ''లైంగ్యే:— నహ్యేషా ప్రకృతిర్జీవో వికృతిర్వావిచారతః. పురామమాజ్ఞా మద్వక్త్రా త్సముత్పన్నా సనాతనీ, పంచవక్త్రా మహాభాగా జగతామభయప్రదేతి, రుద్రాక్షైస్సంస్థితాదేవీ, త్వనయా ముక్తిరంబయేతి.'' 'జ్ఞా' యని ఏకాక్షరముగ చెప్పెడి పక్షమునందు గుణభోక్తృ పురుష స్వరూప యని భావము.'' (ద్వ్యక్షరము.)

౮౨౯. ప్రతిష్ఠాయై నమః

తా. శ్రీదేవి సకలజగత్తునకు అధిష్ఠానమైనందునను, సకలము పరదేవతయందు ప్రతిష్ఠింపఁబడినందునను ప్రతిష్ఠానామము సిద్ధించినది. (త్ర్యక్షరము.)

౮౩౦. ప్రకటాకృత్యై నమః

తా. సర్వజనుల అనుభవములోను, 'అహామహ' మని తెలియఁబడుచున్న ఆకారముగలదని భావము. సూతసంహితాయాం:— "తమహం ప్రత్యయవ్యాజాత్ సర్వేజానంతి జంతవః, తథాఽపి శివరూపేణ న విజానంతి మాయయేతి." (పంచాక్షరము.)

౮౩౧. ప్రాణేశ్వర్యై నమః

తా. ప్రాణములనఁగా ఇంద్రియములు. వానికిఁ బ్రభ్వియనిగాని, పంచప్రాణములకు అధిపతి అనిగాని భావము. శ్రు. "ప్రాణస్య ప్రాణ ఇతి శ్రుతేః. 'సర్వేవేదాయత్పద మామనంతి' ఇతి శ్రుతేశ్చ." (చతురక్షరము)

౮౩౨. ప్రాణదాత్ర్యై నమః

తా. సకలజగత్తును జీవింపజేయుచున్నదని భావము. శ్రు. "సర్వే ప్రాణా అనూత్క్రామంతీతి శ్రుతేః." (చతురక్షరము.)

౮౩౩. పఞ్చాశత్పీఠరూపిణ్యై నమః

తా. అకారాది క్షకారాంతమైన మాతృకావర్ణములనే పంచాశత్పీఠములు. ఆబీజముల ఆకృతిగా నున్నది. శబ్దబ్రహ్మ స్వరూపిణి అని భావము. ఈపదమునకే ఏకపంచాశదని కొందఱు వ్యాఖ్యాత లభిప్రాయపడిరి. శారదాతిలకే:— "నిత్యానందవపుర్నిరంతరగళత్పంచాశద్వర్ణైః క్రమా" దితి. అక్షమాలలో పంచాశద్వర్ణమాల అనేవ్యవహారము గలది. అందు క్షకారము మేరువుగా గ్రహింపఁబడుచున్నది. కనుక పంచాశత్పక్షమే సిద్ధమైనది (అష్టాక్షరము.)

౮౩౪. విశృంఖలాయై నమః

తా. శృంఖలములనఁగా లోహమయములగు సంకెలలు. ఇచట జనుల కర్మలనే ప్రతిబంధరూపశృంఖలములు. అట్టి ప్రతిబంధరూపము లేనిదని స్వేచ్ఛగలదని భావము. 'కాంచనీ భవతు లోహమయీవా శృంఖలా యది పదోర్నవిశేషః.' (చతురక్షరము.)

౮౩౫. వివిక్తస్థాయై నమః

తా. విజనస్థలమందుఁ గలదనియు, పవిత్రమైనస్థలమందుఁ గలదనియు, ఆత్మానాత్మవిచారపరులయందుఁ గలదనియు భావము. (చతురక్షరము.)

౮౩౬. వీరమాత్రే నమః

తా. వీరులనఁగా ఉపాసకులలో ధురీణులు. రణమందు అభిముఖులు. వారికి తల్లిగా నున్నదనియు, వీరుఁడనేనామముఁగల గణేశ్వరునికి తల్లి అనియు భావము. (చతురక్షరము.)

౮౩౭. వియత్ప్రసవే నమః

తా. సకలము ఆకాశమందున్నది. అట్టి ఆకాశము పరదేవతవలన పుట్టినదని భావము. శ్రు. "ఆత్మన ఆకాశస్సంభూతః." (చతురక్షరము.)

౮౩౮. ముకుందాయై నమః

తా. శ్రీదేవి ముక్తినిచ్చునదనియు, గోపాలకృష్ణస్వరూపిణి అనియు, గోపాలయంత్రశేదేతంత్రరాజే:— "కదాచిదాద్యాలలితా పుంరూపా కృష్ణవిగ్రహా, స్వవంశనాదనారంభాదకరోద్వివశం జగత్. తతస్సగోపీసంజ్ఞాభిరావృతోఽఙ్గనాభిస్స్వశక్తిభిః, తదాతేన వినోదాయ స్వం షోఢాఽకల్పయద్వపుః." (త్ర్యక్షరము.)

ముక్తినిలయాయై నమః

తా. సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య బ్రహ్మాభేదములగల పంచవిధములగు ముక్తులకు స్థానమని భావము. (పంచాక్షరము.)

### ౮౨౦. మూలవిగ్రహరూపిణ్యై నమః

తా. బాలా బగళాదిశక్తులకును అణిమాద్యావరణశక్తులకును చాల కారణరూపమైన రాజరాజేశ్వరీస్వరూపమని భావము. గౌడపాదసూత్రములు:—ఒకశక్తియే శాంభవీ శ్యామాది త్రివిధభేదములను పొందినదనియు, వారిలో ఒక్కొకరివలన అనేకశక్తులు ఉత్పన్నమైనవని ప్రతిపాదింపఁబడినది. అట్టి త్రిశక్తులకును ఆదియందు నున్నదియే రాజరాజేశ్వరీస్వరూపిణి. (అష్టాక్షరము.)

### ౮౨౧. భావజ్ఞాయై నమః

తా. శ్రీదేవి మానసికోద్దేశములను తెలుసుకొనునది యనియు, మానసికజ్ఞానానుభవము చేత తెలియబడునది అనియు, 'అస్తి జాయతే వర్ధతే పరిణమతే పరిక్షీయతే మ్రియతే' అనే షడ్భావవికారముల చేతను తెలియఁబడనిదనియు 'ధాత్వర్థః కేవలశ్శుద్ధో భావ ఇత్యభిధీయతేతి.' స్వభావము చేతనే నిర్మలత్వమని తెలియఁబడునది యనియు భావము. భవమనఁగా సంసారము తద్రూపముగా నున్నదని తెలియఁదగినదనియు భావము. (త్ర్యక్షరము.)

### ౮౨౨. భవరోగఘ్న్యై నమః

తా. సంసారమనే రోగమును నశింపఁజేయునది యని భావము. "నాన్యం పశ్యామి భైషజ్యమన్తరేణవృషధ్వజ" మితి రామాయణవచనాత్. "వ్యాధీనాం భేషజం యద్వత్ ప్రతిపక్షంస్వభావతః, తద్వత్సంసారరోగాణాం ప్రతిపక్షశ్శివాఽభవత్." ఇతి శైవాగమే. (పంచాక్షరము.)

### ౮౨౩. భవచక్రప్రవర్తిన్యై నమః

తా. సంసారమండలమును ప్రవర్తింపఁజేయునదియనియు, సంసారమును చక్రమువలెను ప్రవర్తింపఁజేయునదనియు; మనుస్మృతౌ. "ఏషా సర్వాణి భూతాని పఞ్చభిర్వ్యాప్య మూర్తిభిః, జన్మవృద్ధిక్షయైర్నిత్యం సంసారయతిచక్రవదితి." శ్రీచక్రాన్తర్గతమైనబిందువు అష్టదళము షోడశ

దళము చతురశ్రము ఈ నాలుగును భవచక్ర సంజ్ఞ కలవి. తక్కిన త్రికోణ అష్టకోణదశారయుగ్మ మన్వశ్రములు అయిదును శక్తిచక్రము లని ఉభయమేళనము నవయోన్యాత్మకమని నిబంధనలవలన శివచక్ర చతుష్టయమునకు సత్తాను కలుగఁజేయునదని భావము. 'భవస్య శివస్య చక్రం మనవీవ; తత్ ప్రవర్తయతీతివా. (అష్టాక్షరము.)

౮౮౮. ఛన్దస్సారాయై నమః

తా. ఛందశ్శబ్దముచేత గాయత్ర్యాదిఛందస్సులకు సారభూతమనియు, పూర్ణగాయత్రీమంత్రమువలన శ్రీవిద్యాపంచదశాక్షరీ విద్యోద్ధారము అయినందున గాయత్రీమంత్రసారముగా నున్నదనియు, ఛందశ్శబ్దము వేదపరమైనందున వేదసారను ఉపనిషత్తులు వానిసారము శ్రీవిద్య అని భావము. ఈ విషయము కామకలావిలాసవ్యాఖ్యానమందు మాచే ప్రకటింపఁబడినది. శ్లో. తద్జ్ఞానార్థముపాయావిద్యాలోకే చతుర్దశ ప్రోక్తాః; తేష్వపిచసారభూతా వేదాస్తత్రాపి గాయత్రీ, తస్యా రూపద్వితయం తత్రైకం యత్ప్రపత్యతే స్పష్టం, వేదేషు చతుర్ష్వపి పరమత్యంతం గోపనీయతరం. అథర్వణే హి త్రైపురసూక్తే:—''షోడశీఋక్త్రః. కామోయోనిః, కమలావజ్రపాణి ర్గుహాహసామాతరిశ్వాభ్రమింద్రః, పునర్గుహాసకమలామాయయాచ పురూచ్యేషా విశ్వమాతాఽఽది విద్యేత్యస్యా మృచికాది విద్యాయా ఉద్ధారః.'' పంచదశీమంత్రోద్ధారము.— వేదపురుషుఁడును వెల్లడింపక సంకేతరూపముగా చూపించినాఁడు గాన శ్రీవిద్య గుప్తమని భావము. (చతురక్షరము.)

౮౮౯. శాస్త్రసారాయై నమః

తా. మీమాంసాది వివిధశాస్త్రములు వేదసమ్మితములుగాన 'శాస్త్రయోనిత్వాదితి బ్రహ్మసూత్ర ప్రమాణాత్' విధిశాస్త్రములు. పరదేవతాజ్ఞారూపములు గనుక, అట్టివిధి శాస్త్రసారభూతమని భావము. ఛందస్సారా శాస్త్రసారా మంత్రసారా అని ఈనామత్రయము గాళ

మతనిరసనమును తెలుపుచున్నది గనుక పంచద్రావిడసంకేతముగల బ్రాహ్మణులు ౭౮-తంత్రములందును, ఆతంత్రాంతర్గతవలచనములందును భ్రమను పొందఁగూడదనియు, చతుష్షష్టితంత్రములు వేదమార్గ దూరములనియు, బ్రాహ్మణులకొఱకు సమయాచారముత్పన్నమైనది గనుక, దురాచారములందు బ్రాహ్మణులు ప్రవేశింపకూడదని భావము. శ్రు. "రసోవై సః, రసగ్గ్ హ్యేవాయం, లబ్ధ్వాఽఽనందీ భవతీతి." (చతురక్షరము.)

౮౪౬. మన్త్రసారాయై నమః

తా. 'మననాత్త్రాయతీతి మన్త్రః' విశ్వాసమువలన రక్షించునదిగాన మన్త్రమని. బాలా శ్రీవిద్యా పంచదశీ షోడశాక్షరీ ఈమన్త్రముల యర్థము మన్త్రసార మనిపించుకొనును. అట్టి మన్త్రార్థస్వరూపిణి అని భావము. శ్లో. "స గురుర్మత్సమో జ్ఞేయః మన్త్రవీర్యప్రకాశకః" ఇది ఈశ్వర వాక్యము. మన్త్రార్థస్వరూపమని భావము. (చతురక్షరము.)

౮౪౭. తలోదర్యై నమః

తా. సూక్ష్మమైన ఉదరము మధ్యప్రదేశముగాఁ గలదని, తల మనఁగా పాతాళలోకము. అట్టి పాతాళలోకము ఉదరముగాఁగలదని విరాడ్రూపమందు చతుర్దశభువనములును శ్రీదేవికి పాదాదిశిరాంతముగా నున్నందున పాతాళము ఉదరమని భావము. (పంచాక్షరము.)

౮౪౮. ఉదారకీర్త్యై నమః

తా. శ్రీదేవి విస్తారమైన కీర్తిఁగలదనియు, భక్తులకు విస్తారమైన కీర్తిని గలుగఁజేయునది యని భావము. (పంచాక్షరము.)

౮౪౯. ఉద్దామవైభవాయై నమః

తా. దామ అనఁగా బంధనరజ్జువు. పరిమితిరహితమైన వైభవము. ఐశ్వర్యముగలదనియు. అనవధిక శ్రీరూపము ముక్తియేగాన తద్రూపిణి అని భావము. (షడక్షరము.)

## ౮౫౦ వర్ణరూపిణ్యై నమః

తా. బ్రాహ్మణాది చతుర్వర్ణములు అధికారభేదము ననుసరించి సృష్ట్యాదియందు పరమేశ్వరునిచేత సృష్ట్యభివృద్ధికొఱకు ఏర్పరపఁబడినవి గాన ఈనిబంధనక్రమముగా మోక్షసాధనమగుచున్నందున వర్ణరూపిణీ అని నామసిద్ధి కలిగినది. వర్ణసంకరము అందఱకును నష్టకరముగాన వర్ణ నిబంధనయే శ్రీదేవీస్వరూపమని భావము. (పంచాక్షరము.)

## ౮౫౧. జన్మమృత్యుజరాతప్తజనవిశ్రాన్తిదాయిన్యై నమః

తా. జననము మరణము వార్ధక్యము వీనిచేత తపించుచున్న జనులకు విశ్రాంతిని ఇచ్చునదియనియు, స్వరూపజ్ఞానము ఆత్మవిశ్రాంతి గనుక అట్టి జ్ఞానమును ఇచ్చునదియని భావము. (షోడశాక్షరము.)

## ౮౫౨. సర్వోపనిషదుద్ఘుష్టాయై నమః

తా. సకలోపనిషత్తులందును ప్రతిపాదింపఁబడిన స్వరూపముఁ గలదని సర్వోపనిషత్తులు సగుణ నిర్గుణ భేదమాత్రముగా బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవి. కాలోపనిషత్తు అనునది మధ్యకాలమునందు కల్పితము. వేదవిరుద్ధాగ్ర విషయప్రతిపాదకగ్రంథమంగు ఊపనిషత్పదము వర్తింపదు. అది కాళీమతస్థులచే కల్పితము. (అష్టాక్షరము.)

## ౮౫౩. శాన్త్యతీతకలాత్మికాయై నమః

తా. పరాకాశమందున్నకల శాంత్యతీతకలఁగాన ఆకలాస్వరూపముగా నున్నదని భావము. (అష్టాక్షరము.)

## ౮౫౪. గమ్భీరాయై నమః

తా. శ్రీదేవి అంతములేనిదిగాన గంభీరయనియు, మహాహ్రద స్వరూపమనియు భావము. తథాచ శివసూత్రం:—"మహాహ్రదాను సంధానాన్మంత్రవీర్యానుభావతః, ఇతి మహాహ్రద ఇతిప్రోక్తా శక్తిర్భగ

వతీపరా. అనుసంధాన ఇత్యుక్తం తత్తాదాత్మ్యవిమర్శనం, మంత్రవీర్య మితిప్రోక్తం పూర్ణాహన్తావిమర్శనం. తదీయోఽనుభవ స్తస్య స్ఫురణం స్వాత్మనః స్ఫుటమితి. అన్యత్రాపి:—పరాభట్టారికా సంవిదిచ్ఛాశక్తిపుర స్సరం, స్థూలప్రమేయపర్యంతం వమంతీ విశ్వమాతరం, ప్రమాత్రన్త ర్బహీరూపా హృషీకవిషయాత్మనాం, ప్రవర్తకత్వస్వచ్ఛత్వగమ్భీ రత్వాదిధర్మతః, మహోహ్రదో జగద్వ్యాపీ దేశకాలాద్యగోచర ఇతి." (త్ర్యక్షరము.)

౮౫౫. గగనాన్తస్థాయై నమః

తా. దహరాకాశమందుఁగాని భూతాకాశమందుఁగాని పరాకాశ మందుఁగాని లోపల ఉండునదియని భావము. శ్రు. "వృక్షఇవ స్తబ్ధోదివి తిష్ఠత్యేక ఇతి శ్రుతేః." (పంచాక్షరము.)

౮౫౬. గర్వితాయై నమః

తా. శ్రీదేవి విశ్వనిర్మాణాహంభావశాలినియని భావము. (త్ర్యక్ష రము.)

౮౫౭. గానలోలుపాయై నమః

తా. శ్రీదేవి గానమందు ఆసక్తిగలదని భావము. (పంచాక్షరము.)

౮౫౮ కల్పనారహితాయై నమః

తా. వికల్పరహితమైన స్వరూపముగలదని సర్వకాలములందును ఏకాకారముగా ఉన్నదని భావము. (షడక్షరము.)

౮౫౯. కాష్ఠాయై నమః

తా. ౧. కలా కాష్ఠా అని కాలనియమభేదము అనియు, సూక్ష్మకాల స్వరూపమనియు, వేదాంతవాక్యార్థనిర్ణయము కాష్ఠా అని. శ్రు. సా కాష్ఠా సాపరాగతిరితి; సూతసంహితాయాం:—ప్రతీతమప్రతీతం వా సదసచ్చ పరశ్శివః, ఇతివేదాన్తవాక్యానాం నిష్ఠాకాష్ఠేతికథ్యతే" ఇతి.

౨. గగనాత్మకుఁడగు భీముఁడను నామముగల పరమశివునియొక్క పత్నిదిక్స్వరూపిణి యగుటచేత కాష్ఠ యని చెప్పఁబడును. తత్స్వరూపిణి.

శ్లో. "చరాచరాణాం భూతానాం సర్వేషామవకాశదః,
వ్యోమాత్మా భగవాన్దేవో భీమఇత్యుచ్యతే బుధైః,
మహామహిమ్నో దేవస్య భీమస్య పరమాత్మనః,
దశస్వరూపాదిక్పత్నీ సుతస్స్వర్గశ్చసూరిభిః." మాఘపురాణే.

(ద్వ్యక్షరము.)

౮౬౦. అకాన్తాయై నమః

తా. అకమనఁగా పాపములుగాని దుఃఖములుగాని యగును. వానిని నశింపఁజేయునది యని భావము. (త్ర్యక్షరము.)

౮౬౧. కాంతార్ధవిగ్రహాయై నమః

తా. పరశివునియొక్క సగము శరీరముగాఁ గలదని భావము. (షడక్షరము.)

౮౬౨. కార్యకారణనిర్ముక్తాయై నమః

తా. కార్యములు మహత్తత్త్వాదులు. కారణము మూలప్రకృతి, కార్య, కారణములను ఈ రెండుసంజ్ఞలులేనిది అని కేవల చైతన్య స్వరూపమని భావము. చైతన్యమందు పరమార్థతః ఈ భేదము లేదని. శ్రు. "నతస్యకార్యం కరణం చ విద్యత" ఇది శ్రుతేః. పైరెండింటికి శ్రీదేవియే కారణము. శ్రీదేవికి కారణములేదని భావము. (అష్టాక్షరము.)

౮౬౩. కామకేళితరంగితాయై నమః

తా. కామేశ్వరునియొక్క క్రీడావిశేషములనే పరంపరలుఁగలదని భావము. (అష్టాక్షరము.)

౮౬౪. కనత్కనకతాటంకాయై నమః

తా. ప్రకాశించుచున్న సువర్ణమయములయిన కర్ణాభరణములుగలదని భావము. (అష్టాక్షరము.)

౮౬౫. లీలావిగ్రహధారిణ్యై నమః

తా. శ్రీదేవి అనాయాసముగా శరీరములను ధరించునదనియు, విలాసార్థము శరీరమును ధరించినదనియు భావము. (అష్టాక్షరము.)

౮౬౬. అజాయై నమః

తా. జననధర్మములేనిదని శ్రు. 'అజామేకామితి.' (ద్వ్యక్షరము.)

౮౬౭. క్షయవినిర్ముక్తాయై నమః

తా. జననములేనిదానికి నాశనమునులేదు. కాన శ్రీదేవి నాశరహితమైనదని భావము. (షడక్షరము.)

౮౬౮. ముగ్ధాయై నమః

తా. శ్రీదేవి సుందరమైన ఆకారముగలదని భావము.(ద్వ్యక్షరము.)

౮౬౯. క్షిప్రప్రసాదిన్యై నమః

తా. శ్రీదేవి స్తుతించినవారికి స్వల్పదినములలోపల నే ప్రసన్నురాలగునని భావము. (షడక్షరము.)

౮౭౦. అన్తర్ముఖసమారాధ్యాయై నమః

తా. ఆత్మాభిముఖమైన చిత్తవృత్తిఁగలవారిచేత ఆరాధింపఁదగినదని భావము. (అష్టాక్షరము.)

౮౭౧. బహిర్ముఖసుదుర్లభాయై నమః

తా. బహిర్ముఖమైన చిత్తవృత్తిగలవారికి పూర్తిగా దుర్లభమైనదని భావము. (అష్టాక్షరము.)

౮౭౨. త్రయ్యై నమః

తా. శ్రీదేవి ఋగ్యజుస్సామముల నే వేదత్రయరూపముగా నున్న దని భావము. (ద్వ్యక్షరము.)

౭౭౩. త్రివర్గనిలయాయై నమః

తా. శ్రీదేవి ధర్మార్థకామములకు స్థానముగా నున్నదనియు, లోకమందుఁగల త్రిపుటికి అంతకును స్థానమనియు, తురీయస్వరూపమనియు భావము. (షడక్షరము.)

౭౭౪. త్రిస్థాయై నమః

తా. శ్రీదేవి మూఁడులోకములయందును అభేదముగాఉన్నదనియు, త్రివర్గమువలెను, అగ్నిత్రయము మండలత్రయము మొదలగు త్రిసంఖ్యగల వస్తువులం దున్నదనియు భావము. మార్కండేయపురాణే:— "త్రయోలోకాస్త్రయోవేదా స్త్రైవిధ్యం పావకత్రయం, త్రీణిజ్యోతీంషి వర్గాశ్చ త్రయోధర్మాదయ స్తథా. త్రయోగుణా స్త్రయశ్శబ్దా స్త్రయోదోషా స్తథాఽఽశ్రమాః, త్రయఃకాలాస్తథాఽఽవస్థాః పితరోఽహర్నిశాదయః, మాత్రాత్రయంచ తే రూపం త్రిస్థే దేవి సరస్వతీతి." (ద్వ్యక్షరము.)

౭౭౫. త్రిపురమాలిన్యై నమః

తా. అంతర్దశార చక్రేశ్వరీస్వరూపమని భావము. స్థూలసూక్ష్మకారణశరీరములు పురత్రయము. బ్రహ్మ విష్ణు రుద్రులు త్రిమూర్తులు బాలాబీజత్రయము, పంచదశీకూటత్రయము. ఈ మొదలగు త్రిపురపఙ్క్తి యందున్నదని అట్టి పఙ్క్తిస్వరూపమని భావము. (షడక్షరము.)

౭౭౬. నిరామయాయై నమః

తా. శ్రీదేవి రోగరహితమైనదని భావము. (చతురక్షరము.)

౭౭౭. నిరాలమ్బాయై నమః

తా. శ్రీదేవి సకలమునకు ఆలంబనగా నున్నందున తనకువేఱే ఆలంబనములేనిదని భావము. (చతురక్షరము.)

## ౮౩౯. స్వాత్మారామాయై నమః

తా. శ్రీదేవి స్వాత్మయందే క్రీడనముకలదని, 'స్వాత్మానం ద్వేధా విభజ్య స్త్రీపుంభేదేన క్రీడతీతి.' తథాచ బృహదారణ్యకే. శ్రు. అథవై నరేమే తస్మాదేకాకీ నరమతే సద్వితీయామైచ్ఛత్, సహైవం వా సయథా స్త్రీపుమాంసౌ సమ్పరిష్వక్తౌ స్వయమేవాత్మానం ద్వేధాపాతయత్తతః పతిశ్చ పత్నీచాభవదితి.' జగన్నిర్మాణ సంహారకాలములందు స్వాత్మమాత్రమున్నదని భావము. మార్కండేయే.— శ్లో. 'త్వమక్షరం పరందేవి యచ్చసర్వం ప్రతిష్ఠితం. అక్షరం బ్రహ్మ పరమం జగచ్చైతత్క్షరాత్మకం. దారుణ్యవస్థితో వహ్నిర్భూమౌచ్చ పరమాణవః, తథాత్వయిస్థితం బ్రహ్మ జగచ్చేద మశేషత' ఇతి. (చతురక్షరము.)

## ౮౪౦. సుధాసృత్యై నమః

తా. సహస్రారాంతర్గత చంద్రమండలమునుండి సర్వదా అమృతధార స్రవించుచు చతుర్దశ సహస్ర నాడీసముదాయమును తృప్తిని పొందించుచుండును గనుక, అట్టి అమృతధారాస్వరూపమని భావము. (చతురక్షరము.)

## ౮౪౧. సంసారపఙ్కనిర్మగ్నసముద్ధరణపండితాయై నమః

తా. సంసారమను పఙ్కమందు అత్యంతము మునిఁగియున్న జనులనుపూర్తిగా తరింపజేయడమందు చాలసామర్థ్యముగలదని భావము. కూర్మే:— యే మనాగపి శర్వాణీం స్మరన్తి శరణార్థినః, దుస్తరాపార సంసారసాగరే న పతన్తితే.'' (షోడశాక్షరము.)

## ౮౪౨. యజ్ఞప్రియాయై నమః

తా. శ్రీదేవి యజ్ఞములు ఇష్టముగాఁగలదని భావము. యజ్ఞమనఁగా సోమయాగమనియు, పూజాదికమనియు గ్రహింపవలెను. (చతురక్షరము.)

## ౮౪౩. యజ్ఞకర్త్ర్యై నమః

తా. యజ్ఞకర్తయగు సోమయాజి పరశివస్వరూపుఁడు గాన

యగు పరాశక్తి "యజ్ఞకర్త్రి" యగుచు. భార్యలేనపుడు యజ్ఞాధికారము లేనందున యజ్ఞము చేయునది యని భావము. (చతురక్షరము.)

౨౭౩. యజమానస్వరూపిణ్యై నమః

తా. యజ్ఞదీక్షనుపొందిన ఆత్మగల యజమానునియొక్క స్వరూపము శ్రీదేవియని భావము. సోమయాజి ఈశ్వరుని అష్టమూర్తులలో ఎనిమిదవమూర్తి అనియు, దీక్షయే అతనికి పత్నిఅనియు అనేక శ్రుతిస్మృతులందు గలదు. (అష్టాక్షరము.)

౨౭౪. ధర్మాధారాయై నమః

తా. ఆయాదేశములందు శిష్టపరంపరగా వచ్చుచున్న వైదికాచారములకు అవిరోధముగానున్న ఆచారములు ధర్మము లనిపించుకొనును. అట్టిధర్మములను సంకరముకాకుండను నాశములేకుండను ఉంచుటకు పరాశక్తియే ఆధారముగానున్నదని భావము. తథాచ సనకసంహితాయాం:- "దేశేదేశే య ఆచారః పారంపర్యక్రమాగతః, ఆమ్నాయై రవిరుద్ధశ్చ సధర్మః పరికీర్తిత, ఇతి; ధర్మే సర్వం ప్రతిష్ఠిత మితిశ్రుతేః." (చతురక్షరము.

౨౭౫. ధనాధ్యక్షాయై నమః

తా. శ్రీదేవి ధనమునకు అధిపతియనియు, ధనము లక్ష్మీస్వరూపమనియు, ధనము శ్రీదేవి స్వాధీనమనియు భావము. (చతురక్షరము.)

౨౭౬. ధనధాన్యవివర్ధిన్యై నమః

తా. శ్రీదేవి భక్తులకు ధనమును ధాన్యమును వృద్ధిని పొందించునదియని భావము. (అష్టాక్షరము.)

౨౭౭. విప్రప్రియాయై నమః

తా. వేదశాస్త్రసంపన్నులైన బ్రాహ్మణులు, విప్రులు, అట్టివిప్రులు

శ్రీదేవికి ఇష్టులని భావము. మనుః–"జన్మనా బ్రాహ్మణోజ్ఞేయః సంస్కారైర్ద్విజ ఉచ్యతే, విద్యయా యాతివిప్రత్వం త్రిభిశ్శ్రోత్రియఉచ్యతే." (చతురక్షరము.)

౮౮౮. విప్రరూపాయై నమః

తా. శ్రీదేవి బ్రాహ్మణులే స్వరూపముగఁ గలదని భావము. (చతురక్షరము.)

౮౮౯. విశ్వభ్రమణకారిణ్యై నమః

తా. బ్రహ్మాండముల సృష్టిస్థితిసంహారములకును యాతాయాతములకును కారణస్వరూపమని భావము. (అష్టాక్షరము.)

౮౯౦. విశ్వగ్రాసాయై నమః

తా. సంహారకాలమందు చరాచరాత్మకమైన సకలప్రపంచము గ్రాసముగాఁ గలదనియు, సంహారించునదియని భావము. (చతురక్షరము.)

౮౯౧. విద్రుమాభాయై నమః

తా. శ్రీదేవి పగడపుతీగవలెను అత్యంతము ఎఱ్ఱనికాంతిగలదని భావము. (చతురక్షరము.)

౮౯౨. వైష్ణవ్యై నమః

తా. శ్రీదేవి విష్ణుశక్తి అనియు, లక్ష్మీస్వరూపయనియు భావము. (త్ర్యక్షరము.)

౮౯౩. విష్ణురూపిణ్యై నమః

తా. శ్రీదేవి విష్ణుస్వరూపము గలదనియు, వ్యాపకము గలదనియు, అవ్యక్తస్వరూపమనియు భావము.

# శ్రీ లలితాసహస్రనామావళి

తదుక్తం లలితోపాఖ్యానే:—

"మమైవ పౌరుషం రూపం గోపికాజనమోహనం" ఇతి దేవీవచనమ్. కూర్మపురాణే-హిమవత్కృతదేవీస్తవే:—

"సహస్రమూర్ధానమనంతశక్తిం సహస్రబాహుం పురుషం పురాణం,

శయానమబ్ధౌ లలితే తవైవ నారాయణాఖ్యం ప్రణతోఽస్మి రూపమ్.

శివేనోక్తం స్వప్రభావం నిర్వర్ణ్య తత్రైవ కూర్మపురాణే:—

"మమ సా పరమా మాయా ప్రకృతిస్త్రిగుణాత్మికా,

ప్రోచ్యతే మునిభిశ్శక్తిర్జగద్యోని స్సనాతనీ.

సఏవ మాయయా విశ్వం వ్యామోహయతి విశ్వవిత్,

నారాయణః పరోఽవ్యక్తో మాయారూప ఇతి శ్రుతిః."

## ౯౯౪. అయోనయే నమః

తా. శ్రీదేవి సకలమునకు కారణస్వరూపయనియు, తనకు కారణము లేనిదనియు భావము. (త్ర్యక్షరము.)

## ౯౯౫. యోనినిలయాయై నమః

తా. శ్రీదేవి సకలమునకు లయస్థానము గనుక నిలయము. సర్వకారణవస్తువే నిలయస్వరూపమనియు, శ్రీచక్రమందున్న యోనిచక్రము స్థానముగా గలదనియు, 'త్రికోణరూపిణీ శక్తిర్బిందు రూపశ్శివస్స్మృత' ఇతి. (పంచాక్షరము.)

## ౯౯౬. కూటస్థాయై నమః

తా. కూట మనఁగా అజ్ఞానము. భ్రమాత్మకముగానుండి, ప్రపంచమును నడిపించుచున్నదని భావము. (త్ర్యక్షరము.)

౯౭. కులరూపిణ్యై నమః

తా. 'కుః పృథ్వీతత్త్వం యత్ర లీయతే తత్కులం' మూలాధారమనిగాని, జాత్యాది భేదరూపిణి అనిగాని కౌలమార్గము, కౌలాచారస్వరూపిణిగానుండి లోకమునకు భ్రమను గలుగజేయునది యనిగాని భావము. (పంచాక్షరము.)

౯౮. వీరగోష్ఠీప్రియాయై నమః

తా. వీరులనఁగా, ఉపాసకులలో శ్రేష్ఠులు. వారిప్రసంగమందు ప్రీతిగలదనిగాని; వీరులనఁగా బ్రహ్మాదిత్రిమూర్తులు, వారిగోష్ఠియందు ప్రీతిగలదనిగాని భావము. (షడక్షరము.)

౯౯. వీరాయై నమః

తా. శ్రీదేవి స్వయం పరాక్రమశాలిని యని భావము. (ద్వ్యక్షరము)

౧౦౦. నైష్కర్మ్యాయై నమః

తా. శ్రీదేవి సకలమును తానే చేయుచున్నట్లు తోఁచునుగాని ఏకర్మ సంబంధమును లేనిదని భావము. శ్రు. నపుణ్యాపాపైర్మమేతి.' (త్ర్యక్షరము.)

నవమశతకము సమాప్తము.

—

శ్రీ ర స్తు.

# శ్రీ లలితాసహస్రనామావళి

## ద శ మ శ త క ము.

---

### ౯౦౧. నాదరూపిణ్యై నమః

తా. శ్రీదేవి నాదస్వరూపముగా నున్నదని భావము. జ్ఞానోపనిషది:—అస్తి భాతి ప్రియం రూపం నామ ఇత్యంశపంచకం, ఆద్యత్రయం బ్రహ్మభాగం నామరూపాత్మకం జగ'' దితి. తా. నామరూపములు జగత్తనియు, అస్తి భాతి ప్రియములు బ్రహ్మభాగమనియు చెప్పినందున నామము నాదస్వరూపముగాన నాదము శక్తిభాగమైన విమర్శాంశము, రూపము తత్త్వస్వరూపముగాన ప్రకాశాంశముగా నున్నదిగాన శబ్దబ్రహ్మస్వరూపిణి అని భావము. (పంచాక్షరము.)

### ౯౦౨. విజ్ఞానకలనాయై నమః

తా. బ్రహ్మ సాక్షాత్కారమను స్వాత్మానందానుభవకలాస్వరూపిణి అని భావము. (షడక్షరము.)

### ౯౦౩. కల్యాయై నమః

తా. కల్య అనఁగా సకలవిద్యలందును. పూర్ణస్వరూపమనిగాని నిరోగమనిగాని మంగళప్రదురాలనిగాని భావము. (ద్వ్యక్షరము.)

### ౯౦౪. విదగ్ధాయై నమః

తా. చాతుర్యయుక్తమైన స్వభావము గలదనియు, సకలమందును నేర్పుగలదనియు భావము. (త్ర్యక్షరము.)

## ౯౦౫. బైందవాసనాయై నమః

తా. శాంత్యతీతాకళాత్మికేతివచనమువల్లను "బిందుస్థానం సుధాసింధుః పంచయోన్యః సురద్రుమాః, తత్రైవనీపశ్రేణీచ కదంబవనమేవ చ" తత్ర చింతామణి గృహమిత్యాది వామదేవ సంహితోక్తవచనమువలన శ్రీచక్రమధ్యగతబిందువు సహస్రారకర్ణికాకారచంద్రమండలమనియు, అట్టి బిందుమండలమందు కామేశ్వరాంకోపరిభాగమందు నివసించునది యని భావము. (పంచాక్షరము.)

## ౯౦౬. తత్త్వాధికాయై నమః

తా. తత్త్వమనఁగా ప్రలయాదిధర్మములుగల శబలబ్రహ్మస్వరూపప్రపంచము. శ్రీదేవి దానికంటె ఉత్కృష్టమైనదని షట్త్రింశత్తత్త్వములను నశించినపుడును ఉండునది యని భావము. "తత్త్వనిర్ణయసారే తదుక్తం:— ఆప్రళయం యత్తిష్ఠతి సర్వేషాం భోగదాయిభూతానాం, తత్తత్త్వమితి ప్రోక్తం న శరీరఘటాదితత్త్వమత" ఇతి. (చతురక్షరము.)

## ౯౦౭. తత్త్వమయ్యై నమః

తా. శ్రీదేవి అట్టి తత్త్వస్వరూపమనియు, తత్త్వమనఁగా శివతత్త్వము అట్టిస్వరూపముగలదనియు, అంతకంటె అధికమైనదనియు భావము. అర్థాంతరము:—ప్రజ్ఞానసహితము ప్రజ్ఞానరహితమనే సమాధిద్వయస్వరూపమని. "తదుక్తం జ్ఞానార్ణవే:—స్వయంప్రజ్ఞాతసంజ్ఞస్తు శివాధిక్యేనజాయతే, అసంప్రజ్ఞాతనామాతు శివతత్త్వేన వైభవేత్." తల్లక్షణం తత్రైవ:—"స్వయం ప్రజ్ఞాతభేదస్తు తీవ్రతీవ్రతరో భవేత్, అసంప్రజ్ఞాతభేదస్తు మందమందతరస్తథా, హాస్యరోదనరోమాంచకంపస్వేదాదిలక్షణః. తీవ్రతీవ్రతరో దేవీసమాధి రుపలక్షితః, నిమేషవర్జితే నేత్రే వపుస్తల్లక్షణస్థితం. ఇదంచద్వయం తేజోవిశేషమనోధారణేన భవతీతి." ఆత్మతత్త్వము, విద్యాతత్త్వము, శివతత్త్వము అని తత్త్వత్రయము. శ్రీదేవి దాని నతిక్రమించిన

దని భావము. చతుర్విధతత్త్వములని కొందఱియభిప్రాయము. "మాయాంత మాత్మతత్త్వం విద్యాతత్త్వం సదాశివాంతం స్యాత్, శక్తిశివా శివ తత్త్వం తురీయతత్త్వం సమిష్టిరేతేషామితి." (చతురక్షరము.)

౯౦౭. తత్త్వమర్థస్వరూపిణ్యై నమః

తా. తత్త్వమసి అనే మహావాక్యమందుఁగల, 'తత్, త్వం' అను పదములకు ప్రత్యగాత్మస్వరూపిణియగు సాక్షియు నిగమాగమసిద్ధమైన 'బ్రహ్మము' అని అర్థము. శ్రీదేవి అట్టి సాక్షిబ్రహ్మస్వరూపము గలదని భావము. (అష్టాక్షరము.)

౯౦౮. సామగానప్రియాయై నమః

తా. శ్రీదేవి సామవేదగానమందు ప్రీతిగలదని భావము. (షడక్షరము.)

౯౦౯. సోమ్యాయై నమః

తా. శ్రీదేవి యాగార్హమైన సోమలతాసారస్వరూపముగాను, చంద్రమండలస్వరూపముగాను ఉన్నదని భావము. (ద్వ్యక్షరము.)

౯౧౦. సదాశివకుటుమ్బిన్యై నమః

తా. పంచబ్రహ్మలలో అయిదవమూర్తి సదాశివుఁడు. ఇతఁడే పరశివుఁ డనఁబడును. ఇతనిభార్య రాజరాజేశ్వరి, శ్యామల శుద్ధవిద్య అశ్వారూఢ మున్నగు శక్తులకును, సదాశివుఁడే భర్తగాన, ఆశక్తి సముదాయరూపముగా శ్రీదేవి ఉన్నదని భావము. (అష్టాక్షరము.)

౯౧౧. సవ్యాపసవ్యమార్గస్థాయై నమః

తా. శ్రీవిద్యోపాసన శ్రీచక్రార్చనలలో సవ్యమార్గమనియు, అపసవ్యమార్గమనియు, మార్గద్వయముఁగలదు. సవ్యమనఁగా దక్షిణమార్గము, వేదమార్గసమ్మతము, బ్రాహ్మణార్హము. వామమనఁగా వేదవిరుద్ధాచారముగలది, కేవలతాంత్రికము. కేవలశాక్తమును, ఇది క్షత్రియాది త్రైవర్ణికులకు అర్హ

మైనది. ఈరెండును ఈశ్వరముఖోద్భూతములైనను ఆయావర్ణభేదముగా నాచరింపవలెనను అభిప్రాయముతో ఉత్పన్నమైనవి. వామమార్గమందు నిత్యనైమిత్తికాది సకలకర్మలను ఆయామంత్రోక్తదేవతావరణములును, త్రిపురభైరవీస్వరూపములనియు, సకలకర్మలందును, భైరవీ పద ప్రయోగమును విధిగానున్నది. ఇందువలన, బ్రాహ్మణులకు అట్టి ఆచరణవలన, ఋణత్రయశోధనాభావము సిద్ధించుచున్నది. ఇందు క్రమముక్తిగాని, క్షిప్రముక్తిలేదు. సవ్యమార్గమందు అట్టినిర్బంధములేదు. ఆయాకర్మలు, ఆయాదేవతాప్రీతికొరకు ఉపచరించుచున్నందున ఋణత్రయశోధనము దేవతాప్రీతియు రెండును కలిగినందున ఆజన్మమునందే ముక్తులగుదురని ఋష్యాదులమతము. ఐహికభోగవిరక్తులయిన శిష్టజనులు, మోక్షవిలంబమునకు సహించక దక్షిణమార్గప్రవృత్తిగలవారగుదురని భావము. తదుక్తం కాళికాపురాణే:—"సర్వత్ర దేవీ మన్త్రేషు వైదికేష్వపి భైరవీం, త్రిపురాం చింతయేన్నిత్యం పదమంత్రేషుచ క్రమాత్. దేవనామసు సర్వేషు భైరవేతి పదం సదా, కుర్యాద్విశేషణం నిత్యం నోచ్చార్యం నిర్విశేషణం, ఆపః పునంతు పృథివీముక్త్వా త్రిపురభైరవీం, కుర్యాదాచమనం విప్రో ద్రుపదాయాం తథా చరేత్, ఇదం విష్ణుర్భైరవస్తు విచక్రమ ఇతీరితం, మృదాలంబనకృత్యేషు మంత్రమేతం నియోజయేత్, గాయత్రీం త్రిపురాద్యాస్తు భైరవీముచ్చరేచ్ఛివాం, మార్తాండభైరవాయేతి సూర్యాయార్ఘ్యం నివేదయేత్. తర్పణాదౌ ప్రయుంజీత తృప్యతాం బ్రహ్మభైరవః, ఆవాహనే చ స్వపితౄన్ భైరవానితి తర్పయేత్. తృప్యతాం భైరవిమాతః పితర్భైరవ తృప్యతాం, ఏవంతు వామ్యభావేన యజేత్త్రిపురభైరవీం, ఏషా వామేన మార్గేణ పూజ్యా దక్షిణతాం వినా. దక్షిణమార్గంతు:— ఋషీన్ దేవాన్ పితౄంశ్చైవ మనుష్యాన్ భూత సంచయాన్, యో యజేత్పంచభిర్యజ్ఞైః ఋణానాం పరిశోధనే, విధివత్స్నానదానాభ్యాం సర్వాం యద్విధి పూజనం, క్రియతే న రహస్యంతు తద్దాక్షిణ్యమిహోచ్యతే. చిరేణ లభతే మోక్షం వామేన త్రైపురోనరః. ఋణశోధనజై

పాపైరాక్రాంతత్వేన భైరవః, ఇహాలోకే సుఖైశ్వర్యయుక్తస్సర్వత్రవల్లభః, మదనోపమకాంతేన శరీరేణ విరాజితః, సరాష్ట్రకం చ రాజానం వశీకృత్య నసంశయః. ఇత్యాదయోబహూని ఐహికఫలాని సిధ్యంతీతి. సర్వాశాపూరకోయస్మాద్దక్షిణస్తత ఉత్తమః.'' ఇట్లు దక్షిణ వామమార్గములను గురించి ఆయాగ్రంథములందు వాని వాని ప్రాముఖ్యములను చెప్పఁబడియున్నవి. శ్రీదేవి ఆయావర్ణానుసారముగ జేయు నీయుభయాచారము లందును ప్రీతిగలదని భావము. (అష్టాక్షరము.)

౯౧౩. సర్వాపద్వినివారిణ్యై నమః

శ్రీదేవి సకలవిధములైన ఆపదలను పోఁగొట్టునదియని భావము. వారాహే:— ''శరణం త్వాం ప్రపద్యంతే యే దేవి పరమేశ్వరీం, న తేషామాపదః కాశ్చిజ్జాయన్తే క్వాపి సంకటః' ఇతి. (అష్టాక్షరము.)

౯౧౪. స్వస్థాయై నమః

తా. శ్రీదేవి దుఃఖములవలన గలిగిన చిత్తచాంచల్యములేనిది గాన స్వస్థా అని నామము గలిగినది. (ద్వ్యక్షరము.)

౯౧౫. స్వభావమధురాయై నమః

తా. ౧. ఉపాధ్యంతరము లేనిదనియు స్వయముగా సకలజనులు అపేక్షించుచున్నదనియు భావము. శ్రీదేవి ఆత్మస్వరూపయని భావము.

౨. హాలాస్యపురము పురాణప్రసిద్ధ నామాంతరముగలదక్షిణమధురానగరనివాసినియగు శ్రీమీనాక్షీదేవీస్వరూపిణి యని భావము.(షడక్షరము)

౯౧౬. ధీరాయై నమః

తా. శ్రీదేవి ధైర్యముకలదనియు, సన్మార్గబుద్ధిని ఇచ్చునది యనియు భావము. ''ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనేతి'' స్మృతిః. (ద్వ్యక్షరము.)

౯౧౭. ధీరసమర్చితాయై నమః

తా. పండితులచేత నారాధింపఁబడుచున్నది యని భావము. శ్రు. "తం ధీరాసః కవయ ఉన్నయన్తీతి." (షడక్షరము.)

౯౧౮. చైతన్యార్ఘ్యసమారాధ్యాయై నమః

తా. చిద్రూపమైన ఆత్మ చైతన్యము. అట్టి ఆత్మయే పూజాయోగ్యమైన జలాదికము. దానిచే పూజింపఁదగినదియని భావము. బాహ్యపరికర పూజకన్న బ్రహ్మాత్మైక్యరూపపూజయం దాసక్తిగలదని భావము. 'సోఽహంభావేన పూజయేదితి శ్రుతిః.' (అష్టాక్షరము.)

౯౧౯. చైతన్యకుసుమప్రియాయై నమః

తా. చైతన్యమను పుష్పపూజయందు ఇష్టముగలది, ఆత్మార్పణము పుష్పపూజకంటె ఉత్కృష్టమైనది యని భావము. (అష్టాక్షరము.)

౯౨౦. సదోదితాయై నమః

తా. శ్రీదేవి నిత్యోదయముకలదని భావము. స్వప్రకాశము నాశరహితము భక్తుల స్మరణమాత్రముచేత స్ఫురించుచున్నది. (చతురక్షరము.)

౯౨౧. సదాతుష్టాయై నమః

తా. శ్రీదేవి సర్వదా సంతోషముకలదనియు, నిత్యానంద స్వరూపయనియు భావము. (చతురక్షరము.)

౯౨౨. తరుణాదిత్యపాటలాయై నమః

తా. ఉదయకాల సూర్యునివంటి పాటలవర్ణము గలదని భావము. (అష్టాక్షరము.)

౯౨౩. దక్షిణాదక్షిణారాధ్యాయై నమః

తా. శ్రీదేవి పండితులచేతను, పామరులచేతనుకూడ ఆరాధింపఁబడుచున్నదనియు, దక్షిణాచారముచేతను వామాచారముచేతనుకూడ ఆరాధింపఁబడుచున్నదియని భావము. (అష్టాక్షరము.)

## శ్రీ లలితాసహస్రనామావళి

౯౨౪. దరస్మేరముఖామ్బుజాయై నమః

తా. శ్రీదేవి చిరునవ్వుతోఁ గూడిన ముఖారవిందముకలదని భావము. (అష్టాక్షరము.)

౯౨౫. కౌలినీకేవలాయై నమః

తా. కౌలధర్మస్వరూపముఁ గలదనియు, సకలధర్మరహితమైన కేవల జ్ఞానస్వరూపిణి అనియు భావము. (షడక్షరము )

౯౨౬. అనర్ఘ్యకైవల్యపదదాయిన్యై నమః

తా. అమూల్యమైన మోక్షస్థానము నిచ్చునది యని భావము. (ఏకాదశాక్షరము.)

౯౨౭. స్తోత్రప్రియాయై నమః

తా. నామపారాయణాదిస్తోత్రములచేత సంతోషించునది యని భావము. (చతురక్షరము.)

౯౨౮. స్తుతిమత్యై నమః

తా. స్తోత్రార్హమైనదని స్తోత్రము చేయఁదగిన సుగుణసంపత్తిగలదని భావము. (చతురక్షరము.)

౯౨౯. శ్రుతిసంస్తుతవైభవాయై నమః

తా. వేదములచేత స్తోత్రముచేయఁబడిన వైభవము కలది యని భావము. (అష్టాక్షరము.)

౯౩౦. మనస్విన్యై నమః

తా. స్వాధీనమైన మనస్సుగలదని భావము. (చతురక్షరము.)

౯౩౧. మానవత్యై నమః

తా. విస్తారమైన గౌరవముగలదని భావము. (చతురక్షరము.)

౯౩౨. మహేశ్యై నమః

తా. మహేశ్వరుని పత్నిగాన మహేశీ అని నామము కలిగినది. (త్ర్యక్షరము.)

౯౩౩. మఙ్గళాకృతయే నమః

తా. మంగళప్రదమైన ఆకారము గలది. (పంచాక్షరము.)

౯౩౪. విశ్వమాత్రే నమః

తా. ప్రపంచమును పుట్టించునదియని భావము. (చతురక్షరము.)

౯౩౫. జగద్ధాత్ర్యై నమః

తా. చతుర్దశభువనములను ధరించునదనియు ఆధారముగా నున్నదని భావము. (చతుతక్షరము.)

౯౩౬. విశాలాక్ష్యై నమః

తా. విశాలమైన నేత్రములుగలదని భావము. (చతురక్షరము.)

౯౩౭. విరాగిణ్యై నమః

తా. వైరాగ్యాది గుణసంపత్తిగలదియని భావము. (చతురక్షరము.)

౯౩౮. ప్రగల్భాయై నమః

తా. సృష్ట్యాదికృత్యములందు ప్రాగల్భ్యముగలదని భావము. (త్ర్యక్షరము.)

౯౩౯. పరమోదారాయై నమః

తా. గొప్పనౌదార్యముకలదని స్మరణమాత్రముచేత భక్తులకు మోక్షసామ్రాజ్యము నిచ్చునదియని భావము. (పంచాక్షరము.)

౯౪౦. పరామోదాయై నమః

తా. విస్తారమైన సంతోషముకలదనియు, బ్రహ్మానందస్వరూపమని భావము. (చతురక్షరము.)

# శ్రీ లలితాసహస్రనామావళి

## ౫౪౧. మనోమయ్యై నమః

తా. శుద్ధబ్రహ్మమునకు మనస్సు స్థానముగనుక, మనస్సే ఆకారము గాఁగలదని మనోరూపముగా సకలభూతములందును ఉన్నదని భావము. (చతురక్షరము.)

## ౫౪౨ వ్యోమకేశ్యై నమః

తా. ఈశ్వరుని విరాడ్రూపమందు ఆకాశము కేశములుగా నున్నందున ఈశ్వరుఁడు వ్యోమకేశుఁ డనఁబడును. ఆ వ్యోమకేశుని భార్య గనుక వ్యోమకేశి అనియు శ్రీదేవియు, బ్రహ్మస్వరూపిణిగాన విరాడ్రూపమందు ఆకాశము కేశకలాపముగాఁ గలదని భావము. (చతురక్షరము.)

## ౫౪౩. విమానస్థాయై నమః

తా. అంతరాళమందు సంచరించునది విమానము. అధికలవారు దేవతలు గనుక సకలదేవతాస్వరూపము గానున్న విమానముమీఁదను సంచరించునదనియు, ప్రమాణరహితమైనదనియు, మనస్సునందున్న దనియు భావము. (చతురక్షరము.)

## ౫౪౪. వజ్రిణ్యై నమః

తా. ఇంద్రపత్ని అయిన శచీదేవి రూపముగలదనియు, వజ్రాయుధము కలదనియు, వజ్రరత్నమయభూషణములు కలదనియు, మనస్సునందున్నదనియు భావము. (త్ర్యక్షరము.)

## ౫౪౫. వామకేశ్వర్యై నమః

తా. వామకేశ్వరతంత్రరూపముగా నున్నదనియు, పంచయజ్ఞవిలోపమే వామాచారమని దానియందు ఆచరణగలవారికి ప్రభ్వీకాన వామకేశ్వర ప్రపంచ చక్రభ్రమణము దేవతకు ఇష్టముగాన వామమార్గరతులకు కామ్యము నిచ్చుచు జగద్భ్రమణమందు దాసక్తులనుగాఁ జేయునదియని భావము. (పంచాక్షరము.)

౯౪౬. పంచయజ్ఞప్రియాయై నమః

తా. దక్షిణాచారమందు పంచయజ్ఞము లున్నందున అట్టివారి యందు ప్రేమకలదని భావము. (షడక్షరము.)

౯౪౭. పంచప్రేతమంచాధిశాయిన్యై నమః

తా. బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులు శక్తిరహితులు అయినపుడు వారివారి కృత్యములు చేయ సమర్థులుకారు గనుక అయిదుగురు ప్రేతలని భావము. వారు మంచముగా (పర్యంకముగా) నున్నాగనియు, అందు శ్రీదేవి నివసించుచున్నదనియు భావము. మూలాధారస్వాధిష్ఠానములపైని బ్రహ్మగ్రంథి బ్రహ్మస్థానము మణిపుర అనాహతోపరి విష్ణుస్థానము ఆజ్ఞాకమలోపరి రుద్రస్థానము లలాటోపరి ఈశ్వరస్థానము సహస్రారకర్ణికాకారచంద్రమండలము సదాశివస్థానము అందు కామేశ్వరుఁడు అతని వామోరువునందు కామేశ్వరీదేవి ఉన్నందున శ్రీదేవికి వీరు అయిదుగురు దిగువ నున్నందున ఆమెకు ఆసనప్రాయులైనారని భావము. అది ప్రత్యక్ష ప్రమాణముగా నున్నది. (దశాక్షరము.)

౯౪౮. పంచమ్యై నమః

తా. బ్రాహ్మ్యాద్యష్టమాతృకలలో అయిదవదివారాహీమాతృకాస్వరూపమని భావము. వ్యాఖ్యాతయగు భాస్కరభట్టు ఈ నామవ్యాఖ్యానమందు కౌల వామాచారపరమైన మకార పంచకాదులను ఇఁక స్మరించుటయుఁ గూడ అనర్హమైన సంగతులను వ్రాయుటయేగాక ఈ యంశములు దక్షిణామూర్తి సంహితలోనివనియు, కల్పసూత్రమనియు, వ్రాయుట సాహసము. కల్పసూత్రము సమయాచారులది. పరశురామసూత్రము వామకౌళుల ఆచరణలోనిది. దక్షిణామూర్తిసంహిత వైదికమార్గ నిబంధనగ్రంథము, సమయదక్షిణాచారములను తెలుపుచున్నది. అట్టి సద్గ్రంథములందు నింద్యమైన మకారపంచకప్రసంగము తేజస్తిమిరన్యాయముగానున్నందున ఇతని సాహసపువ్రాతలవలన లోకమునకు

భ్రమకలుగుటయు, తాము వామాచారపరులని వెల్లడిగా తెలియుచున్నది. ఇదివఱకే బ్రాహ్మణులనేకులు సమయాచారార్హులైనను కొన్ని వామమార్గాచారములను ఆచరించుచు శ్రీవిద్యలో నిదియే శిష్టాచారమని లోకమునకు భ్రమను కలుగఁజేయుచున్నారు. శిష్టజనులు సమయాచారమునెఱుఁగనందున నీభ్రష్టాచారమందు నింద్యకృత్యములున్నందున సహింపఁజాలక శ్రీవిద్యకు ఇదియే ఆచారమని దానికి దూరులగుచున్నారు. అందువలన బ్రహ్మవిద్య ప్రకృతమందు ఈభ్రమలమూలముగా లోపించుటకు కారణమైనది. ఈదుర్దశ కొన్ని జిల్లాలలో వ్యాపకము కలిగియున్నది. మిగత ఉత్తరదేశము శుద్ధవామాచారభూయిష్ఠము. దక్షిణపశ్చిమదేశములందు బ్రాహ్మణులలో వామకౌళములందు ప్రవృత్తిగలవారికి బహిష్కారము వెల్లడిగానున్నది. సమయ దక్షిణాచారము బ్రాహ్మణార్హముగా ఆచరణలోనున్నది. ఈవిషయము ఉపోద్ఘాతమందు విరళముగానున్నది. ముక్తికాములు తప్పక ఈభేదమును తెలుసుకోవలెనని భావము. (త్ర్యక్షరము.)

౯౭౯. పంచభూతేశ్యై నమః

తా. పృథివ్యాది పంచభూతములందును సత్తారూపముగా శ్రీదేవి ఉన్నందున వానికి అధికారిణి యని భావము. ఈవిషయము శ్రీవిద్యారణ్యులవారు వేదాంతపంచదశిలో పంచభూతవివేకమునందు వ్రాసియున్నారు. (పంచాక్షరము.)

౯౮౦. పంచసంఖ్యోపచారిణ్యై నమః

తా. చక్రార్చనలో చతుష్షష్ట్యుపచారములు శ్రీదేవికిమాత్రమున్నవి. మిగతా దేవతలకు షోడశోపచారములు గలవు. వానికి అశక్తులైనపుడు పంచోపచారములచేతనైన సంతుష్టిఁగలదని భావము. (అష్టాక్షరము.)

౯౮౧. శాశ్వత్యై నమః

తా. శ్రీదేవి నిత్యమనియు, ధ్రువమనియు భావము. (త్ర్యక్షరము.)

ఆంధ్ర తాత్పర్యసహితము

౯౫౨. శాశ్వతైశ్వర్యాయై నమః

తా. శాశ్వతమైన ఐశ్వర్యముఁ గలదనియు, మోక్షస్వరూపిణి అనియు, చిదానందస్వరూపిణి అనియు భావము. (పంచాక్షరము.)

౯౫౩. శర్మదాయై నమః

తా. సుఖమును ఇచ్చునదనియు, శ్రీదేవి ఉపాసనవలన నిత్యసుఖస్వరూపమైన బ్రహ్మానందప్రాప్తి కలుగుననియు భావము. (త్ర్యక్షరము.)

౯౫౪. శంభుమోహిన్యై నమః

తా. ఈశ్వరుఁడు జితేంద్రియుఁడు. అట్టిఈశ్వరుని మోహింపఁజేసినదని భావము. (పంచాక్షరము.)

౯౫౫. ధరాయై నమః

తా. పృథివీస్వరూపిణి అనియు, సకలమును ధరించినదనియు, సకలమునకు ఆధారభూత యనియు భావము. (ద్వ్యక్షరము.)

౯౫౬. ధరసుతాయై నమః

తా. శ్రీదేవి హిమవంతునికుమార్తె అని భావము. (చతురక్షరము.)

౯౫౭. ధన్యాయై నమః

తా. సంపూర్ణమైన సకలైశ్వర్యములును గలదనియు, సంపూర్ణమైన మోక్షసాధనములు గలదనియు, చిదానందస్వరూపిణి అనియు భావము. (ద్వ్యక్షరము.)

౯౫౮. ధర్మిణ్యై నమః

తా. ధర్మస్వభావము గలదనియు, ఆనందానుభవ నిత్యత్వాది ధర్మము గలదనియు భావము. (త్ర్యక్షరము.)

౯౫౯. ధర్మవర్ధిన్యై నమః

తా. ధర్మమనఁగా ఈశ్వరభక్తియు మోక్షచింతయు, గావున నీరెంటిని వృద్ధిచేయునది యని భావము. (పంచాక్షరము.)

౯౬౦. లోకాతీతాయై నమః

తా. సర్వలోకములను అతిక్రమించి శివలోకమున్నదనియు, ఆపైని దేవీలోకమనియు, అచట మణిద్వీపము సుధాసింధువు చింతామణి గృహములుగలవనియు, పిండాండమందును భ్రూమధ్యమువఱకు బ్రహ్మవిష్ణు రుద్రలోకములనియు, లలాటోర్ధ్వభాగము ఈశ్వరలోకమనియు, సహస్రారాంతర్గతచంద్రమండలము సదాశివలోకమనియు ఆపైని శ్రీదేవి లోకమనియు సదాశివుని తొడపైని కూర్చున్నది అని భావము. (చతురక్షరము.)

౯౬౧. గుణాతీతాయై నమః

తా. సత్వాదిగుణముల నతిక్రమించినదనియు, 'ఆత్మన ఆకాశస్సంభూతః' అను శ్రుతివలననే త్రిగుణాత్మకమైన మూలప్రకృతి గలిగినట్లు శ్రుతులవలన సృష్టిక్రమము తెలియుచున్నది. గుణముకంటె పూర్వమున్నది గాన గుణాతీత అని భావము. (చతురక్షరము.)

౯౬౨. సర్వాతీతాయై నమః

తా. సర్వమనఁగా నామరూపాత్మకమైన పరిదృశ్యమానజగత్తు. దీనిని అతిక్రమించి ఉన్నదని ఆత్మవలననే నామరూపమైన జగదుత్పత్తి గనుక జగత్తుకంటె వేఱై అందు సత్తారూపముగా అదృశ్యమై ఉన్నదనియు, జ్ఞానదృష్టికలవారికి ప్రత్యక్షముగా నుండుననియు భావము. (చతురక్షరము.)

౯౬౩. శమాత్మికాయై నమః

తా. శాంతగుణమే ఆత్మస్వరూపముగాఁ గలదనియు, శాంతగుణము ఉన్నవారియందు శ్రీదేవి గలదనియు భావము. (చతురక్షరము.)

౯౬౪. బన్ధూకకుసుమప్రఖ్యాయై నమః

తా. మంకెనపుష్పముతో సమానమయిన కాంతిగలదనియు, అత్యంతమైన ఎఱుపుకాంతిగలదనియు భావము. (అష్టాక్షరము.)

## ౯౬౫. బాలాయై నమః

తా. బాలాత్రిపురసుందరీ స్వరూపము గలదనియు, అనేక శక్తి మంత్రములున్నను శబ్దబ్రహ్మము సృష్ట్యావిర్భావకాలమందు అవ్యక్తచక్రమందున్న కోణత్రయము బిందురూపమైన బాలాబీజత్రయమును ముందు ఉత్పన్నమైనందున శ్రీదేవి బ్రహ్మశక్తి సృష్టికి ప్రథమావతారముగా నున్నదని భావము. అందువలన నవరాత్రికయందు బాలలీలలు గల కుమారీ స్వరూపమని. శ్రు. "త్వం కుమార ఉతవా కుమారతి త్రిపురోపనిషత్; బాల లీలావినోదిత్వాద్బాలేతి కథితా ప్రియేతి." (ద్వ్యక్షరము.)

## ౯౬౬. లీలావినోదిన్యై నమః

తా. ప్రపంచరూపక్రీడయే వినోదము సంతోషముగాఁ గలదని భావము. (షడక్షరము.)

## ౯౬౭. సుమఙ్గల్యై నమః

తా. పూర్ణమైన మంగళస్వరూపమనియు, సువాసినీస్త్రీస్వరూపమనియు, విష్ణుపురాణే:— "అశుభాని నిరాచష్టే తనోతి శుభసన్తతిం, స్మృతిమాత్రేణ యత్పుంసాం బ్రహ్మ తన్మఙ్గళం విదు" రితి వచనాత్. బ్రహ్మ స్వరూపమనియు స్మృతౌ చ.— "ప్రశస్తాచరణం నిత్యమప్రశస్త వివర్జనం, ఏతద్ధి మఙ్గళం ప్రోక్త మృషిభిర్బ్రహ్మవాదిభి" రితి. (చతురక్షరము.)

## ౯౬౮. సుఖకర్యై నమః

తా. శాశ్వతసుఖము బ్రహ్మాకారవృత్తియే గాన అట్టిబ్రహ్మత్వమును కలుగజేయునదని భావము. (చతురక్షరము.)

## ౯౬౯. సువేషాఢ్యాయై నమః

తా. శుభప్రదమైన వస్త్రాలంకార మాల్యాదిభూషణములు గలదని భావము. (చతురక్షరము.)

౯౭౦. సువాసిన్యై నమః

తా. నిత్యసువాసిని, అనఁగా సర్వకాలమందును జీవించియుండెడి (మృత్యుంజయుఁడగు) భర్తఁగలదని భావము. (చతురక్షరము.)

౯౭౧ సువాసిన్యర్చనప్రీతాయై నమః

తా. శ్రీచక్రార్చనాంతమందు సమీపమందున్న సువాసినీలను దేవతాబుద్ధితో భావించిగంధపుష్పఫలతాంబూలాదులచేత పూజింపవలెననియుఁ, అందువలన పరదేవతకు ప్రీతి గలుగుననియు భావము. (అష్టాక్షరము,)

౯౭౨. ఆశోభనాయై నమః

తా. అత్యంత మంగళప్రదమైనదనియు, అనంతమైన మంగళము ముక్తిస్వరూపము గాన అట్టిముక్తిని కలుగఁజేయు స్వరూపమనియు భావము. (చతురక్షరము.)

౯౭3. శుద్ధమానసాయై నమః

తా. నిర్మలమైన మనస్సుగలదని భావము. పరమాత్మ శుద్ధసత్త్వము గనుక అట్టి శుద్ధసత్త్వమే శ్రీదేవి మనోరూపముగా నున్నదనియు, నిర్మలమైన మనస్సుగల భక్తజనులు శ్రీదేవీస్వరూపులనియు భావము. (పంచాక్షరము.)

౯౭౪. బిన్దుతర్పణసన్తుష్టాయై నమః

తా. శ్రీచక్రమధ్యబిందువు సర్వానందమయచక్రము, తర్పణశబ్దము పూజయందు వర్తించుచున్నందున ఆబిందువు ప్రకాశవిమర్శలగు శివశక్తి సామరస్య స్వరూపమైన బిందువునందు పూజవలన సంతుష్టిగలదని, ఇందువలన ఆవరణపూజ మొదలగు విశేషపూజలను చేయలేక పోయినను, సమష్టిని బిందువునందు పూజించుటమాత్రముచేతనే శ్రీదేవత సంతుష్టిగలది యగునని భావము. 'బిందుస్థానం సుధాసింధుః' అనే సనత్కుమారవచనమువలన పిండాండమందు సహస్రారకర్ణికారూప చంద్రమండలము ద్వాదశాంతము బిందుస్థానమున్ను అచట పూజవలన సంతుష్టిగలదని

అచటి పూజసంవిస్మయము మనోలయభావన యని; పూజాఖండే:-"సంవిన్మయేపరేదేవిపరామృత చరుప్రియే, అనుజ్ఞాం త్రిపురే దేహి పరివారార్చనాయ మే" ఇతి. సూతసంహితయందు పరా యనియు, అపరా అనియుఁ, పరాపరా అనియు, త్రివిధపూజలు చెప్పఁబడినవి. వీనిలో సంవిద్రూపమైన మనోలయము సర్వోత్తమము 'సంవిదేవమనోలయః' ఇతి. ఈనామమునకు విచారణరహితులు అధోముఖులగు కౌలాదులు సురాబిందువుచేత నని అపార్థమును భావింతురుగాని అది సమంజసముకాదు. భ్రమాత్మకమని గ్రహింపవలెను. (అష్టాక్షరము.)

౯ ౭౫. పూర్వజాయై నమః

తా. సృష్ట్యావిర్భావకాలమందు పరమేశ్వరుని ఇచ్ఛాశక్తియే వారి పురోభాగమందు గుణత్రయ సామరస్యస్వరూపమైన అవ్యక్త స్వరూపిణియగు మూలప్రకృతిగా ఆవిర్భవించినందున నామరూపాత్మక ప్రపంచమునకు ప్రథమమందు జనించినదని భావము. 'సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి; స ఈక్షత; అహమస్మి ప్రథమజా ఋతస్య' మున్నగు శ్రుతులచేత సిద్ధమైనదని భావము. (త్ర్యక్షరము.)

౯ ౭౬. త్రిపురాంబికాయై నమః

తా. శ్రీచక్రమం దారోహణక్రమమున దష్టమచక్రాభిమానినియగు దేవతాస్వరూపమనియు, స్థూల సూక్ష్మ కారణములను దేహత్రయమే పురముగాఁ గలవాఁడు జీవుఁడు. అతనికి జనని అనియు, శ్రీచక్రమందున్న నవయోనులకు అధిష్ఠానశక్తులు తొమ్మిది. ఇచ్ఛా జ్ఞాన క్రియా శాన్తాశక్తులు ప్రకాశాంశస్వరూపలు నాలుగు; వామా జ్యేష్ఠా రౌద్రి అంబికా పశ్యంతి అను పంచశక్తులు విమర్శాంశస్వరూపలు. వారు తొమ్మండుగురు కలసి త్రిపురాసంజ్ఞగలవారు, వారికి జనని అనియు భావము. శ్రు. "పురత్రయే క్రీడతియశ్చజీవ" ఇతిశ్రుతేః. తజ్జననీ:—శ్రు. "ద్వేధాఽగ్నే ర్విస్ఫులిఙ్గా వ్యుచ్చరంతీత్యాది శ్రుతేశ్చ సిద్ధమితి."

## ౯౭౭. దశముద్రాసమారాధ్యాయై నమః

తా. 'శ్రీవిద్యాషోడశాక్షరీ' ఉపాసనోక్తములగు సర్వసంక్షోభిణ్యాదిత్రిఖండాంతమైన దశముద్రలచేతను ఆరాధింపఁదగినదని చక్రార్చనలో నవావరణలకు ఆయా ఆవరణపూజాంతమందు ఒక్కొక్కముద్రను ఆరోహణక్రమముగా దేవతకు ఆయాముద్రనుపట్టి ఆయాబీజముల సహితముగా చూపింపవలెను. సర్వసమష్టి త్రిఖండముద్రగా గ్రహించవలెను. ఇది సాధారణము. ఈ దశముద్రలనుపట్టి చూపించుటయే పరదేవతకు పూజ అనియు, ఆయాపరికరములతో చేసిన బాహ్యపూజకంటె వాసనామయమైన ముద్రారూప అంతర్యపూజయందధిక ప్రీతి శ్రీదేవికి గలదనియు భావము. ముద్రాలక్షణము స్వస్వ గురువులవలన ప్రత్యక్షముగా గ్రహింపఁదగినది గాని గ్రంథలేఖనవలన గ్రహింప శక్యముకాదు. ముద్రలయందు చాల రహస్యార్థము గలదు. ముద్రారచనసాధకుల ఉభయహస్తాంగుళుల సమానసామరస్యము ప్రతిముద్రయందును కలుగును. ప్రతిహస్తాంగుళులును, పంచభూతస్వరూపములు దక్షిణహస్తమును, ఆపార్శ్వమును ప్రకాశాంశమును, శివస్వరూపమును వామపార్శ్వమును వామహస్తమును విమర్శాంశము శక్తిస్వరూపము అయినందున ఆయా ముద్రారచన ప్రదర్శనమువలన పరాశక్తి పరశివుల సామరస్యము వారి వారివలన జరుగుచున్న సృష్ట్యాదికృత్యములును సూచన అగుచున్నందున అత్యంతము దేవతాప్రీతి కలుగుచున్నదని భావము. లోకసంభావనలో ముఖనేత్రహస్తాద్యభినయమువలన ఆయా కార్యముల భావద్యోతనము ఎట్లు జరుగుచున్నదో అట్లనే ముద్రారచనవలన దేవతలకు ఆయా భావద్యోతనకలిగి భక్తులయందు పూర్ణానుగ్రహము కలుగును. ముద్ర జీవబ్రహ్మల ఐక్యమును సూచించుచున్నది. కావున బ్రహ్మస్వరూపమని రహస్యము. సాధకులకు ముద్రావిశేషములు తెలియనపుడు యోనిముద్రచేతనే సకలోపచారములను జరుపవలెను. ఈ ముద్రాలక్షణమును ఉపాసకులు తప్పక గ్రహింపవలెను. యోనిముద్ర శ్రీదేవి యొక్క

స్వరూపము నమస్కారముద్రగా మహాత్ములచేత వాడఁబడుచున్నదని భావము. (అష్టాక్షరము.)

౯౭౮. త్రిపురాశ్రీవశంకర్యై నమః

తా. పంచమచక్రాధిదేవత త్రిపురాశ్రీ అనేనామము గలది. ఆ దేవతలను వశముచేయునదనియు, ఆ దేవత తన స్వాధీనము కలదనియు భావము. (అష్టాక్షరము.)

౯౭౯. జ్ఞానముద్రాయై నమః

తా. దక్షిణహస్త అంగుష్ఠ తర్జన్యగ్రముల మేళనము జ్ఞానముద్రాస్వరూపము. శ్రీదేవి జ్ఞానముద్రాస్వరూపురాలని భావము. ఈ ముద్ర యందును జీవబ్రహ్మల ఐక్యము సూచింపఁబడుచున్నది. ఈ ముద్రారచనల వలన మధ్యవృత్తాకారము బిందురూపము సిద్ధమగును. ఆ వృత్తమువలన "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ అఖండాకారపరిపూర్ణం బ్రహ్మ" అనే శ్రుతుల అర్థము ద్యోతనమగుచున్నది. 'ముదం ద్రావయతీతి ముద్రా' అని సంతోషమును పుట్టించునది గాన ముద అని భావము. ఇదియే చిన్ముద్ర యని వాడుక గలదు. 'కరకలితచిన్ముద్రః' అని దక్షిణామూర్తి స్తవమందు ప్రయోగము. (చతురక్షరము.)

౯౮౦. జ్ఞానగమ్యాయై నమః

తా. జ్ఞానముచేత పొందఁదగినదని. స్కాందే:—"యత్తు మే నిష్కళాకారం చిన్మాత్రం కేవలం శివం, సర్వోపాధివినిర్ముక్తం మనన్త మమృతంపరం, జ్ఞానేనైకేన తల్లభ్యం క్లేశేన పరమం పదం, జ్ఞానమేవ ప్రపశ్యంతో మామేవ ప్రవిశన్తితే." ఇతి. (చతురక్షరము.)

౯౮౧. జ్ఞానజ్ఞేయస్వరూపిణ్యై నమః

తా. జ్ఞానము జ్ఞేయము దృశ్యములుగా నున్నవి గాన ఈరెండును మాయాకల్పితములే గాన శ్రీదేవియే రెండురూపములుగా నున్నదని భావము. (అష్టాక్షరము.)

# శ్రీ లలితాసహస్రనామావళి

## ౯౮౨. యోనిముద్రాయై నమః

తా. యోనిముద్రాస్వరూపమని ఇదియే నమస్కారముద్ర అని. ఇది నవవిధముద్రలలో చేరినది. ఈముద్ర శ్రీచక్రమధ్యబిందు వికసనమును పశ్యన్తీ స్వరూపమూలప్రకృతిని సూచించుచున్నది. ఇదియే ప్రథమసృష్టిస్వరూపము. (చతురక్షరము )

## ౯౮౩. త్రిఖండేశ్యై నమః

తా. త్రిఖండాముద్రా స్వరూపమనియు, ఆ ముద్రాధిదేవత అనియు శ్రీవిద్యాపంచదశీమన్త్రము మూఁడుఖండములకు అధిదేవత అని భావము. (చతురక్షరము.)

## ౯౮౪. త్రిగుణాయై నమః

తా. సత్వాది గుణత్రయస్వరూపమని భావము. (త్ర్యక్షరము.)

## ౯౮౫. అమ్బాయై నమః

తా. పైని చెప్పిన గుణత్రయమునకు కారణభూతమని భావము. (ద్వ్యక్షరము.)

## ౯౮౬. త్రికోణగాయై నమః

తా. యోనిచక్రమును పొందియున్నదనియు, మూలప్రకృతి స్వరూపమని భావము. (చతురక్షరము.)

## ౯౮౭. అనఘాయై నమః

తా. దుఃఖములుగాని పాపములుగాని లేనిదనియు, చిదానందస్వరూపమనియు, స్వయం జ్యోతిస్స్వరూపమనియు భావము. (త్ర్యక్షరము.)

## ౯౮౮. అద్భుతచారిత్రాయై నమః

తా. ఆశ్చర్యమైన చరిత్రలుకలదని భండాసురహననాదికము, స్వల్పకాలములో ముక్తిని గలుగఁజేయుటయు మొదలయిన స్వభావము గలదని భావము. (షడక్షరము.)

౯౮౯. వాంఛితార్థప్రదాయిన్యై నమః

తా. భక్తులు కోరిన కోరికలను ఇచ్చునట్టి స్వభావముగలదని భావము. (అష్టాక్షరము.)

౯౯౦. అభ్యాసాతిశయజ్ఞాతాయై నమః

తా. అభ్యాసాతిశయమువలన (చిరకాలోపాసనవలన) తెలియఁబడునదని భావము. (అష్టాక్షరము.)

౯౯౧. షడధ్వాతీతరూపిణ్యై నమః

తా. వర్ణ పద మన్త్రములు మన్త్రాధ్వలు మూఁడు శబ్ద బ్రహ్మస్వరూపములు. విమర్శాంశములు గలవి శక్తిభాగములు. కలాతత్త్వభువనములు, మూఁడుతత్త్వాధ్వలు ప్రకాశాంశము శివభాగము పైరెండుకలసి షడధ్వలు. ఈ రెండుశాఖలు ఆత్మవలనఁ గలుగుచున్నందున వీనికి పైగా నుండిన కారణభూతముగానున్న శ్రీచక్రమధ్యబిందువు అని భావము. (అష్టాక్షరము.)

౯౯౨. అవ్యాజకరుణామూర్త్యై నమః

తా. నిర్హేతుకమైన కరుణాస్వరూపమని భావము. (అష్టాక్షరము.)

౯౯౩ అజ్ఞానధ్వాంతదీపికాయై నమః

తా. అజ్ఞానము అంధకారమునకు దీపకళికవంటిదని భావము. (అష్టాక్షరము.)

౯౯౪. ఆబాలగోపవిదితాయై నమః

తా. అజ్ఞానులలో బాలురవలనను గోపాలకులవలనను కేవల పామరులవలనను కూడ తెలియఁబడుచున్నదని భావము. స్కాన్దే:— "తమహం ప్రత్యయవ్యాజాత్ సర్వే జానంతి జంతవ" ఇతి. నేను నాది అనే అహంకార స్వరూపమని భావము. (అష్టాక్షరము.)

౯౯౫. సర్వానుల్లంఘ్యశాసనాయై నమః

తా. బ్రహ్మరుద్రాదులచేతఁగూడ దాట శక్యముగాని ఆజ్ఞ కలదని భావము. (అష్టాక్షరము.)

౯౯౬. శ్రీచక్రరాజనిలయాయై నమః

తా. సకలచక్రములకు రాజైన శ్రీచక్రము స్థానముగాఁ గలదని భావము. (అష్టాక్షరము.)

౯౯౭. శ్రీమత్త్రిపురసున్దర్యై నమః

తా. బ్రహ్మ విష్ణు రుద్రులు అనే త్రిపురములు. వారియందున్నవాఁడు సదాశివుఁడు. అతని భార్య త్రిపురసుందరి అని శోభాయుక్త త్రిపురసుందరీస్వరూపమని భావము. (అష్టాక్షరము.)

౯౯౮. శ్రీశివాయై నమః

తా. శైవషడక్షరికిఁ గల అర్థమంతయు ఈనామమునకును వర్తింపుచున్నదని భావము. "సర్వమస్మిన్ శేత ఇతి శివః. సర్వస్మిన్ శేత ఇతివా శివః" శివానామము గలిగినది. శివభక్తులకు అభేదము అని భావము. (త్ర్యక్షరము.)

౯౯౯. శివశక్త్యైక్యరూపిణ్యై నమః

తా. శివశక్తుల మేళనస్వరూపముగలదని జీవేశ్వరైక్యరూపమని భావము. ఇదియే బ్రహ్మస్వరూపము. (అష్టాక్షరము.)

౧౦౦౦. లలితాంబికాయై నమః

తా. సుందరమైన అంబిక కావున నీనామము కలిగినది. అంబేవ అంబిక సర్వలోకాతీతమనియు భావము. పాద్మే:—"లోకానతీత్య లలతే లలితా తేన సోచ్యతే" ఇతి. (పంచాక్షరము.)

దశమశతకము సమాప్తము.

---

శ్రీరస్తు.

# శ్రీలలితాసహస్రనామస్తోత్రరత్నము

## ఉత్తరభాగము

---

### తృతీయాధ్యాయము.

అవ. శ్రీవిష్ణుస్వరూపులైన గురువులగు హయగ్రీవులవారు తన శిష్యుఁడైన అగస్త్యునిచేత ప్రార్థింపఁబడి లలితాసహస్రనామముల నుపదేశించి నామపారాయణఫలశ్రుతిని ఉపదేశించుచున్నారు.—

ఇత్యేతన్నామసాహస్రం కథితం తే ఘటోద్భవ,
రహస్యానాం రహస్యం చ లలితాప్రీతిదాయకమ్. ౧

తా. ఓయి అగస్త్యమహర్షి! పరదేవతాస్తోత్రములు రహస్యములుగా నున్నవి. వానిలోనున్న రహస్యమైన లలితాప్రీతికరమైన పూర్వోక్తమైన ఈ లలితాసహస్రనామములు నీకొఱకు చెప్పఁబడినవి.

సర్వాపమృత్యుశమనం కాలమృత్యునివారణం,
సర్వజ్వరార్తిశమనం దీర్ఘాయుష్యప్రదాయకమ్. ౨

తా. సకల అపమృత్యువులను పోఁగొట్టునదియు, కాలమృత్యువును గూడ నివారణచేయునదియు, సకలజ్వరముల నశింపఁజేయునదియు దీర్ఘాయుర్దాయము నిచ్చునదియు నని భావము.

అనేన సదృశం స్తోత్రం న భూతం న భవిష్యతి,
సర్వరోగప్రశమనం సర్వసమ్పత్ప్రవర్ధనమ్ 3

తా. ఈ లలితాసహస్రనామస్తోత్రముతో సమానమయినస్తోత్రమిదివఱకుఁ జేయఁబడిన స్తోత్రములలో లేదు. ఇఁకమీఁదట జేయఁబడు స్తోత్రములలోకూడ నుండనేరదు సర్వరోగములను పోఁగొట్టుననియు, సకలైశ్వర్యములను వృద్ధిచేయుననియు భావము.

పుత్రప్రదమపుత్రాణాం పురుషార్థప్రదాయకం,
ఇదం విశేషాచ్ఛ్రీదేవ్యాః స్తోత్రం ప్రీతివిధాయకమ్. ౪

తా. పుత్రులులేనివారికి పుత్రుల నిచ్చునదియు, ధర్మార్థకామమోక్షముల నిచ్చునదియు. ఈశ్రీదేవిస్తోత్రము అమ్మవారికి సంతోషమును వృద్ధిచేయున దనియు భావము.

జపేన్నిత్యం ప్రయత్నేన లలితోపాస్తితత్పరః,
ప్రాతస్స్నాత్వా విధానేన సంధ్యాకర్మ సమాప్య చ. ౫

తా. లలితోపాసనయం దాసక్తిగలవారు శ్రద్ధాపూర్వకముగా ఈ స్తోత్రము పాఠము చేయవలెను. ప్రాతఃకాలమందు విధిపూర్వకముగా వైదికతాంత్రికస్నానములను చేసి వైదికతాంత్రిక సంధ్యావందనములను చేసి.

పూజాగృహం తతో గత్వా చక్రరాజం సమర్చయేత్,
పద్యాం జపేత్సహస్రం వా త్రిశతం శతమేవ చ.

తా. తరువాత పూజాగృహమందు ప్రవేశించి నవావరణార్చనపూర్వకముగా శ్రీచక్రార్చన సమయాచారోక్త కల్పసూత్రప్రకారము వేదమార్గ సమ్మతముగా నాచరించి, శ్రీవిద్యా పంచదశాక్షరినిగాని, షోడశాక్షరినిగాని సహస్రముగాని మూఁడువందలుగాని అష్టోత్తరశతముగాని జపము చేయవలయును.

రహస్యనామసాహస్రమిదం పశ్చాత్పఠేన్నరః,
జన్మమధ్యే సకృచ్చాపి య ఏతత్పఠతే సుధీః. ౬

తా. పూజాజపాంతమందు సహస్రనామస్తోత్రమును పఠనచేయవలెను. ఏవిద్వాంసులు జన్మమధ్యమందు ఒకపర్యాయము అయినను ఈ విధముగా పఠించినయెడల.

తస్య పుణ్యఫలం వక్ష్యే శృణు త్వం కుంభసంభవ,
గంగాది సర్వతీర్థేషు యస్స్నాయా త్కోటిజన్మసు. ౮

తా. అట్టివారి పుణ్యఫలమును చెప్పుచున్నాను వినుము. గంగాదిపుణ్యనదులయందు కోటిజన్మములయందు స్నానముచేసినఫలము వారికిలభించును.

కోటిలింగప్రతిష్ఠాం చ యః కుర్యా దవిముక్తకే,
కురుక్షేత్రే తు యో దద్యాత్కోటివారం రవిగ్రహే. ౯

తా. కాశీక్షేత్రమందు కోటి శివలింగప్రతిష్ఠలు చేసినఫలము లభించుననియు, కురుక్షేత్రమందు సూర్యగ్రహణకాలమందు కోటి పర్యాయములు సకలదానములు చేసిన ఫలము లభించునని భావము.

కోటిః సువర్ణభారాణాం శ్రోత్రియేషు ద్విజన్మసు,
యః కోటిం హయమేధానా మాహరే ద్గాంగరోధసి. ౧౦

తా. సద్బ్రాహ్మణులకు కోటిసంఖ్యగల సువర్ణదానము చేసిన ఫలమును, గంగాతీరమందు కోటి అశ్వమేధయాగములు ఎవరు చేయుదురో వారితో సమానమైనఫలమును పొందుదురని భావము.

ఆచరే త్కూపకోటీర్యో నిర్జలే మరుభూతలే,
దుర్భిక్షే యః ప్రతిదినం కోటిబ్రాహ్మణభోజనమ్. ౧౧

తా. జలరహితమైన ఊషరప్రదేశమందు కోటినూతులు త్రవ్వించిన ఫలమును, దుర్భిక్షమందు కోటిబ్రాహ్మణులకు అన్నముపెట్టినఫలమును పొందునని భావము.

శ్రద్ధయా పరయా కుర్యా త్సహస్రం పరివత్సరాన్,
తత్పుణ్యాం కోటిగుణితం భవే త్పుణ్య మనుత్తమమ్. ౧౨

తా. అట్టి అన్నదానమును శ్రద్ధతో వేయిసంవత్సరములు ఎవరు చేయుదురో, వారిపుణ్యమును కోటిచేత గుణింపఁగా వచ్చినసంఖ్యగల ఫలమును పొందుదురని భావము.

రహస్యనామసాహస్రే నామ్నోఽప్యేకస్య కీర్తనాత్,

తా. ఈ రహస్య నామములలో ఒక నామమైనను పఠించినయెడల వెనుక చెప్పిన పుణ్యఫలమును పొందుదురని భావము.

రహస్యనామసాహస్రే నామైకమప యః పఠేత్. ౧౩
తస్య పాపాని నశ్యంతి మహాంత్యపి న సంశయః,
నిత్యకర్మాననుష్ఠానాన్నిషిద్ధకరణా దపి. ౧౪
యత్పాపం జాయతే పుంసాం తత్సర్వం నశ్యతి ధ్రువం.

తా. రహస్యనామములలో ఒక నామమును స్మరించినను మహాపాతకోపపాతకములు నశించుచున్నవనియు, నిత్యము విధిగా చేయవలసినకర్మలను చేయనందునను చేయకూడనిపనుల చేసినందునను వచ్చిన పాపములన్నియు నశించునని భావము.

బహునాఽత్ర కిముక్తేన శృణు త్వం కలశీసుత. ౧౫
తత్రైవ నామ్నో యా శక్తిః పాతకానాం నివర్తనే.
తన్నివర్త్య మఘం కర్తుం నాలం లోకాశ్చతుర్దశ. ౧౬

తా. ఓయీ అగస్త్యఋషీ! విస్తరించి చెప్పనేల. సముదాయము మీఁద చెప్పుచున్నాను వినుము. పాపములను పోఁగొట్టుటకు ఈ సహస్ర

నామములలో ఒక నామమునకు ఉన్నశక్తి పదునాలుగులోకములందున్న జనసమూహమంతయుఁ గలసి రాత్రింబగల్లు మహాపాపము లెన్ని చేసినను ఒక్క లలితా నామపారాయణముచేత పోఁగొట్టఁజాలని పాపమునొనర్ప శక్తులు కాఁజాలరు.

యస్త్యక్త్వా నామసాహస్రం పాపహానిమభీప్సతి,
స హి శీతనివృత్త్యర్థం హిమశైలం నిషేవతే. ౧౭

తా. ఈ సహస్రనామములు విడిచిపెట్టి పాపములు పోఁగోరువాఁడు సీతబాధ పోఁగోరువాఁడు హిమవత్పర్వతసేవ చేసినవానివంటి వాఁడని భావము.

భక్తో యః కీర్తయే న్నిత్యమిదం నామసహస్రకం,
తస్మై శ్రీలలితాదేవీ ప్రీతాఽభీష్టం ప్రయచ్ఛతి. ౧౮

తా. ఏభక్తుఁడు నిత్యము ఈనామపారాయణ చేయునో వానికి శ్రీలలితాదేవి సంతోషించి సకలకోరికలను ఇచ్చునని భావము.

అకీర్తయ న్నిదం స్తోత్రం కథం భక్తో భవిష్యతి ?
నిత్యం సంకీర్తనాశక్తః కీర్తయే త్పుణ్యవాసరే. ౧౯

తా. నామపారాయణ చేయనివారలు దేవీభక్తులు కాఁజాలరు. నిత్యము పారాయణచేయ సమర్థతలేనపుడు పుణ్యదివసములందయినను పారాయణచేయవలెనని భావము.

సంక్రాంతౌ విషువే చైవ స్వజన్మత్రితయేఽయనే,
నవమ్యాం వా చతుర్దశ్యాం సితాయాం శుక్రవాసరే ౨౦

తా. సంక్రాంతులందును విషువత్పుణ్యకాలములయందును, తన

యొక్కయు, భార్యయొక్కయు, పుత్రులయొక్కయు, జన్మనక్షత్రమందును, నవమి చతుర్దశి శుక్లపక్ష శుక్రవారములయందును అవశ్యము చేయఁదగినది.

కీర్తయే న్నామసాహస్రం పౌర్ణమాస్యాం విశేషతః,
పౌర్ణమాస్యాం చంద్రబింబే ధ్యాత్వా శ్రీలలితాంబికామ్.

తా. పూర్ణిమయందును చంద్రమండలమందును లలితాదేవిని ధ్యానించి సహస్రనామస్తోత్రమును ముఖ్యముగాఁ జేయవలెను.

పంచోపచారైస్సంపూజ్య పఠేన్నామసహస్రకం-
సర్వే రోగాః ప్రణశ్యంతి దీర్ఘాయుష్యం చ విందతి. ౨౨

తా. ఇఁక కామ్యప్రయోగవిధిని చెప్పుచున్నాఁడు:-పూర్వోక్త దేవిని గంధాదిమానసోపచారములచేత పూజించి ఈస్తోత్రము చేసినపుడు సకలరోగములు నశించి దీర్ఘాయుష్మంతుఁ డగుచున్నాఁడని భావము.

అయమాయుష్కరో నామ ప్రయోగః కల్పచోదితః,
జ్వరార్తం శిరసి స్పృష్ట్వాపఠేన్నామసహస్రకమ్. ౨౩
తత్క్షణా త్ప్రశమం యాతి శిరస్తోదో జ్వరోఽపిచ,

తా. జ్వరముకలవారి శిరస్సును స్పృశించుచు ఈ నామపారాయణము చేసినయెడల జ్వరము హరించును. ఈ ప్రయోగము ఆయుష్కరమని శిల్పములందు చెప్పఁబడినది. ఇందువలన శిరోబాధాజ్వరము తత్క్షణమే శాంతించుచున్నది.

సర్వవ్యాధి నివృత్త్యర్థం స్పృష్ట్వా భస్మ జపేదిదమ్. ౨౪
తద్భస్మధారణాదేవ నశ్యంతి వ్యాధయః క్షణాత్,

తా. సకలవ్యాధులకు భస్మమును అభిమంత్రించి యిచ్చిన శాంతించుచున్నది. ఆభస్మమును ధరించినమాత్రముచేతను సకలవ్యాధులు నశించును.

జలం సమ్మంత్ర్య కుంభస్థం నామసాహస్రతో మునే ౨౫
అభిషించే ద్గ్రహ గ్రస్తాన్ గ్రహా నశ్యంతి తత్క్షణాత్,

తా. జలముతో నిండియున్న కలశమును ఈనామసాహస్రముచేత అభిమంత్రించి ఆజలమును స్నానమును చేయించినయెడల సకలగ్రహ బాధలు శాంతించును.

సుధాసాగరమధ్యస్థాం ధ్యాత్వా శ్రీలలితాంబికామ్ ౨౬
యః పఠే న్నామసాహస్రం విషం తస్య వినశ్యతి,

తా. సుధాసముద్ర మధ్యమున్న శ్రీలలితాదేవిని ధ్యానించుచు ఈ సహస్రనామపారాయణ చేసినయెడల సకల విషపరిహారమగుననిభావము.

వంధ్యానాం పుత్త్రలాభాయ నామసాహస్రమంత్రితమ్. ౨౭
నవనీతం ప్రదద్యాత్తు పుత్త్రలాభం భవేద్ధ్రువం,

తా. వంధ్యాస్త్రీలకు సుపుత్రప్రాప్తికొఱకు ఈ సహస్రనామపారాయణచేయుచు నవనీతము అభిమంత్రించియిచ్చిన పుత్రప్రాప్తి యగును.

దేవ్యాః పాశేన సంబంధా మాకృష్టా మంకుశేన చ. ౨౮
ధ్యాత్వా ఽభీష్టాం స్త్రియం రాత్రౌ జపే న్నామసహస్రకం,
ఆయాతి స్వసమీపం సా యద్యప్యంతఃపురంగతా. ౨౯

తా. తనకు ఇష్టమైనస్త్రీని దేవీపాశముచేత బద్ధురాలుగాను అంకుశముచేత ఆకర్షింపఁబడినదానినిగాను రాత్రి ధ్యానించుచు సహస్రనామ జపము చేసినయెడల అంతఃపురమందున్న స్త్రీఅయినను వానిసమీపమునకు వచ్చునని భావము.

రాజాకర్షణకామ శ్చేద్రాజావసథదిఙ్ముఖః,
త్రిరాత్రం య పఠే దేతత్ శ్రీదేవీధ్యానతత్పరః. ౩౦

తా. రాజవశ్యమును కోరినవారు ఆరాజగృహాభిముఖముగా కూర్చొని దేవీధ్యానముకలవారై మూఁడురాత్రులు ఈనామపారాయణ మును చేయువలెను.

స రాజా పారవశ్యేన తురంగం వా మతంగజం.
ఆరుహ్యాయాతి నికటం దాసవత్ప్రణిపత్య చ. 31

తా. ఆరాజు గుఱ్ఱమునుగాని ఏనుఁగునుగాని యెక్కి పరవశుఁడై ఉపాసకుని సమీపమునకు వచ్చి దాసునివలె వశుఁడగునని భావము.

తస్మై రాజ్యం చ కోశం చ దదాత్యేవ వశంగతః,
రహస్యనామసాహస్రం యః కీర్తయతి నిత్యశః. 32

తా. అట్టి వశమైనరాజు కోరినధనమునుగాని రాజ్యమునుగాని తప్పక యిచ్చును.

తన్ముఖాలోకమాత్రేణ ముహ్యేల్లోకత్రయం మునే,
యస్త్విదం నామసాహస్రం సకృత్పఠతి భక్తిమాన్. 33

తా. ఈ రహస్యనామసాహస్రమును నిత్యమును ఎవరు బఠింతురో వారిముఖావలోకమాత్రమున మూఁడులోకములవారును మోహితు లగుదురని భావము.

తస్య యే శత్రవస్తేషాం నిహంతి శరభేశ్వరః,

తా. ఏభక్తుఁడు ఈ లలితాసహస్రనామపారాయణ ఒకమాఱు చేయునో వాని శత్రువులను శరభేశ్వరుఁడు సంహరించునని భావము.

యోవాఽభిచారం కురుతే నామసాహస్రపాఠకే. 34
నిర్వర్త్యతత్క్రియాం హన్యాత్తంవై ప్రత్యంగిరాస్స్వయం,

తా. ఈ నామసాహస్రపాఠకులపైని ఎవరు దుష్టప్రయోగములను

చేయుదురో ఆప్రయోగములను ప్రత్యంగిరాదేవి నశింపఁజేసి వారిని సంహరించుచున్నదని భావము.

యే క్రూరదృష్ట్యా వీక్షంతే నామసాహస్రపాఠకమ్, 3౫
తానంధా న్కురుతే క్షిప్రం స్వయం మార్తాండభైరవః,

తా. ఈ సహస్రనామపాఠకులను ఎవరు క్రూరదృష్టిచేఁ జూచుచున్నారో వారిని మార్తాండభైరవుఁడు అంధులనుగాఁ జేయునని భావము.

ధనం యో హరతే చోరైః నామసాహస్రజాపినః, 3౬
యత్రయత్ర స్థితంవాఽపి క్షేత్రపాలో నిహంతి తం,

తా. ఈనామపాఠకునిధనము నేచోరుఁడు హరించునో వాఁడెచటనున్నను క్షేత్రపాలకుఁడు వానిని నశింపఁజేయునని భావము.

విద్యాసు కురుతేవాదం యో విద్వా న్నామజాపినా, 3౭
తస్య వాక్ స్తంభనం సద్యః కరోతి నకులేశ్వరీ,

తా. ఈ నామపారాయణపరులతో ఏవిద్వాంసులు సభలలో విద్యయందు వాదముచేయుదురో వారికి నకులేశ్వరి వాక్స్తంభనచేయునని భావము.

యో రాజా కురుతే వైరం నామసాహస్రజాపినా, 3౮
చతురంగబలం తస్య దండినీ సంహరే త్స్వయం,

తా. ఏరాజు నామపారాయణపరులతో విరోధపడునో వానిని చతురంగబలముతో వారాహీదేవి నశింపఁజేయునని భావము.

యః పఠే న్నామసాహస్రం షణ్మాసం భక్తిసంయుతః, 3౯
లక్ష్మీ శ్చాంచల్యరహితా సదా తిష్ఠతి తద్గృహే,

తా. ఎవరు ఈనామపారాయణమును ఆఱుమాసములు చేయుదురో వారియింట లక్ష్మీదేవి స్థిరముగా ఉండునని భావము.

మాసమేకం ప్రతిదినం త్రివారం యః పఠేన్నరః. ౪౦
భారతీ తస్య జిహ్వాగ్రే రంగే నృత్యతి నిత్యశః.

తా. ఒకమాసము ప్రతిదినమందు మూఁడు పారాయణముల చొప్పున విరళముగా నెవరు చేయుదురో వారి జిహ్వాగ్రమందు సరస్వతీ దేవి నివసించుచున్నదని భావము.

యస్త్వేకవారం పఠతి పక్షమాత్ర మతంద్రితః. ౪౧
ముహ్యంతి కామవశగా మృగాక్ష్యస్తస్య వీక్షణాత్,

తా. ఒకపక్షము ప్రతిదినము ఒక్కొక పారాయణముచొప్పున ఎవరు చేయుదురో వారి దృష్టిమాత్రముచేత స్త్రీలు మన్మథోద్రేకము కలవారై మోహింతురని భావము.

యః పఠే న్నామసాహస్రం జన్మమధ్యే సకృన్నరః. ౪౨
తద్దృష్టిగోచరా స్సర్వే ముచ్యంతే సర్వకిల్బిషైః,

తా. జన్మమధ్యమందు సహస్రనామపారాయణము నెవరు చేయుదురో వారి దృష్టిమాత్రముచేతను వారి దర్శనముచేతను ఇతరుల సకల పాపములు నశించుచున్నవని భావము.

యో వేత్తి నామసాహస్రం తస్మై దేయం ద్విజన్మనే. ౪౩
అన్నం వస్త్రం ధనం ధాన్యం నాన్యేభ్యస్తు కదాచన,

తా. ఏ బ్రాహ్మణు లీ నామపారాయణపరులో వారి కన్నవస్త్రధన ధాన్యాది దానములను చేయవలెను. వారు సత్పాత్రులని భావము.

శ్రీమంత్రరాజం యో వేత్తి శ్రీచక్రం యస్సమర్చతి. ౪౪
యః కీర్తయతి నామాని తం సత్పాత్రం విదుర్బుధాః,
తస్మై దేయం ప్రయత్నేన శ్రీదేవీప్రీతి మిచ్ఛతా. ౪౫

తా. శ్రీవిద్యను ఎవరు ఉపాసింతురో శ్రీచక్రార్చనను నిత్యము ఎవరు చేయుదురో ఈసహస్రనామపాఠమును ఎవరు చేయుదురో వారు సత్పాత్రులని విద్వాంసులు తెలిసికొందురు. శ్రీదేవి ప్రీతికొఱకు ఎవరు ఏదానము చేసినను శ్రీదేవిభక్తులగువారికి చేసినప్పుడు శ్రీదేవి సంతోషించుచున్నదని భావము.

న కీర్తయతి నామాని మంత్రరాజం న వేత్తి యః,
పశుతుల్యస్స విజ్ఞేయ స్తస్మై దత్తం నిరర్థకమ్. ౮౬

తా. శ్రీవిద్యోపాసనము ఎవరికిలేదో యీసహస్రనామపారాయణను ఎవరు చేయరో వారు పశువులతో సమానులనియు, వారికి చేసినదానాదులు వ్యర్థములనియు భావము.

పరీక్ష్య విద్యావిదుష స్తేభ్యో దద్యా ద్విచక్షణః,
శ్రీమంత్రరాజసదృశో యథామంత్రో న విద్యతే. ౮౭

తా. వివేకముగల దాతలు దానము చేయునపుడు శ్రీవిద్యావేత్తలనుచూచి వారికి దానములు చేయవలెను.

దేవతా లలితాతుల్యా యథా నాస్తి ఘటోద్భవ,
రహస్యనామసాహస్రతుల్యా నాస్తి తథా స్తుతిః. ౮౮

తా. లోకమందు శ్రీవిద్యతో సమానమయినవిద్య ఎట్లులేదో లలితతో సమానదేవత ఎట్లు లేదో అటువలెనే దేవీస్తోత్రములలో నీలలితారహస్యనామ సహస్రస్తోత్రముతో సమానమయిన స్తోత్రములేదని భావము. ఇట్లు అగస్త్య మహర్షికి హయగ్రీవదేవుఁడు చెప్పెను.

లిఖిత్వా పుస్తకే యస్తు నామసాహస్రముత్తమం,
సమర్చయేత్సదా భక్త్యా తస్య తుష్యతి సుందరీ. ౮౯

తా. ఈ సహస్రనామస్తోత్రమును పుస్తకమం దెవరు వ్రాసినిత్యమును

పూజచేయుదురో వారియందు శ్రీదేవి యనుగ్రహము కలదగుచున్నదని భావము.

బహునాఽత్ర కిముక్తేన శృణు త్వం కుంభసంభవ,
నానేన సదృశం స్తోత్రం సర్వతంత్రేషు విద్యతే. ౫౦

తా. ఓ అగస్త్యఋషీ! విస్తరించి చెప్పనేల? సకలతంత్రములందును ఈలలితాసహస్రనామస్తోత్రముతో సమానమైనస్తోత్రము అగుపడదు.

తస్మా దుపాసకో నిత్యం కీర్తయే దిద మాదరాత్,

తా. అందువలన శ్రీవిద్యోపాసకు లీ స్తోత్రమును శ్రద్ధతో పఠింపవలెను అని భావము.

ఏతన్నామసహస్రైస్తు శ్రీచక్రం యోఽర్చయే త్సకృత్.
పద్మైర్వా తులసీపుష్పైః కల్హారై ర్వాకదంబకైః,
చంపకై ర్జాతికుసుమై ర్మల్లికాకరవీరకైః. ౫౨
ఉత్పలై ర్బిల్వపత్రై ర్వాకుంద కేసరపాటలైః,
అన్యై స్సుగంధికుసుమైః కేతకీ మాధవీముఖైః. ౫౩

తా. పద్మములచేతను తులసీ పుష్పగుచ్ఛములచేతను కలహారములచేతను సంపెంగలచేతను జాజిపువ్వులచేతను మల్లెలు కరవీరములచేతను ఉత్పలములచేతను బిల్వదళములచేతను కుందకుసుమములచేతను కేసరి కుంకుమపువ్వు పాటలీపుష్పము ఈ మొదలగు పరిమళముగల పువ్వులచేతను మొగలిపువ్వుచేతను వసంతఋతువునందు పుష్పించు నితర సుగంధపువ్వులచేతను ఈరహస్య సహస్రనామములచేత ప్రత్యేకముగా శ్రీచక్రార్చన చేయవలెను.

తస్య పుణ్యఫలం వక్తుం న శక్నోతి మహేశ్వరః,
సా వేత్తి లలితాదేవీ స్వచక్రార్చనజం ఫలమ్. ౫౪

తా. ఇటుల శ్రీచక్రార్చనముచేసిన కలిగెడిపుణ్యఫల మింతయని చెప్పుటకు ఈశ్వరుఁడును సమర్థుఁడు కాఁడు. తనస్వరూపమైన శ్రీచక్రార్చనఫలమును శ్రీ లలితాదేవిమాత్రమే ఎఱుఁగును.

అన్యే కథం విజానీయుః బ్రహ్మాద్యాస్స్వల్పమేధసః,

తా. బ్రహ్మాదులును ఈ శ్రీచక్రార్చనఫలము నెఱుఁగరు.

ప్రతిమాసం పౌర్ణమాస్యా మేభి ర్నామసహస్రకైః ౫౭
రాత్రౌ యశ్చక్రరాజస్థా మర్చయేత్పర దేవతాం,
స ఏవ లలితారూప స్తద్రూపా లలితా స్వయమ్. ౫౮

తా. ప్రతిమాసమందును పూర్ణిమనాఁడు రాత్రియందు చంద్రోదయ కాలమందు శ్రీచక్రార్చన చేసినయెడల వారు లలితాస్వరూపులనియు, లలితాదేవి వారిరూపముగా నుండుననియు భావము.

న తయో ర్విద్యతే భేదో భేదకృత్పాపకృ ద్భవేత్,

తా. శ్రీచక్రార్చనచేసిన శ్రీవిద్యోపాసకులకు శ్రీలలితాదేవికిని గొంచెమైనను భేదము లేదు. వారిరువురకు భేదమును భావించినవారు సకలపాపములు చేసినవారని భావము.

మహానవమ్యాం యో భక్తః శ్రీ దేవీం చక్రమధ్యగామ్.
అర్చయే న్నామసాహస్రై స్తస్య ముక్తిః కరే స్థితా,

తా. శరత్కాలాశ్వయుజ శుక్లాష్టమీ నవములకు మహాష్టమీ మహానవమి అని సంజ్ఞ కలుగుగాన అట్టి నవమిరాత్రియందు శ్రీచక్రమధ్యస్థమైన శ్రీలలితాదేవిని ధ్యానించి పూజను ఈనామములచేత చేసిన వారికిని, మహానవమి అనఁగా శ్రీచక్రమధ్యనున్న ఆరోహణక్రమమున మధ్యబిందువు మహానవమి అనిపించుకొనును గాన అట్టి బిందుస్థానమందు లలితాదేవిని ధ్యానించి ఈసహస్రనామములచేత పూజను చేసినవారికి

ముక్తి అనునది కరతలమందున్నదనియు, వారికి ఇహలోకఫలములు స్వల్ప ములనియు, ఇతరులకు అసాధ్యమైన ముక్తి వారికి సులభముగా లభించుననియు భావము. మహానవమియందు మహావేధవలన అని మోక్షసాధనములలో నున్నది. ఆచటిమహానవమీపదమునకు మహావేధపదమునకు రహస్యార్థము శ్రు. "అష్టాచక్రా నవద్వారా" అనే శ్రుతి శ్రీచక్రపరముగను పిండాం డపరముగను వర్తించుచున్నది. బిందువు, త్రికోణము, అష్టకోణము, దశార యుగ్మము, మన్వస్రము, అష్టదళము, షోడశదళము భూపురము ఈ ఎని మిదియు శ్రీచక్రమందున్న ఎనిమిదిచక్రములు. ఊర్ధ్వకోణములు నాలుగును స్వాభిముఖకోణములలోని అయిదును నవద్వారములనియు, బిందుస్థానము, దశారద్వయము వేరుచేసినపుడు తొమ్మిదవచక్రము గనుక మహానవమి అనియు, శారీరపక్షమందు మూలాధారాదికమలములు సహస్రారాంతము సప్తకము. విశుద్ధకమలకర్ణికయందొకచక్రము కలదనియు, అదికలసి అష్టచక్రములనియు, సహస్రారకర్ణికారూపచంద్రమండలము ద్వాద శాంతకమలమునకు బిందుస్థానమునకు మహానవమి అని సంకేతము. మహా వేధ యనగా సుషుమ్నారూపపరానాడి మూలాధారమందు నివాసము కలది గాన ఆనాడి పరాస్వరూపము గనుక ఆరోహణక్రమముగా షట్చక్రములను గ్రంథిత్రయమును భేదించుకొని (అతిక్రమించి) సహస్రారాంతర్గత చంద్రమండలమందు ప్రవేశభావనయే మహావేధ అని రహస్యార్థము. చంద్రమండలము ప్రకాశాంశము, బ్రహ్మస్వరూపము సదాశివస్థానము, సుషుమ్నారూపపరానాడియే శక్తిస్వరూపము, విమ ర్శాంశము దాని వేధబిందువందు మేళనభావము. జీవబ్రహ్మల సామరస్య స్వరూపభావనయే మహావేధ యని రహస్యము.

యస్తు నామసహస్రేణ శుక్రవారే సమర్చయేత్. ౮౦
చక్రరాజే మహాదేవీం తస్య పుణ్యఫలం శృణు,
సర్వాన్ కామానవాప్యేహ సర్వసౌభాగ్యసంయుతః. ౮౧

పుత్రపౌత్రాదిసంయుక్తో భుక్త్వా భోగాన్యథేప్సితాన్,
అంతే శ్రీలలితాదేవ్యాః సాయుజ్య మతిదుర్లభమ్. ౬౦
ప్రార్థనీయం శివాద్యైశ్చ ప్రాప్నోత్యేవ న సంశయః,

తా. ఏ పుణ్యపురుషుఁడు శుక్రవారమందు శ్రీచక్రమందు లలితాదేవిని సహస్రనామములచేత పూజచేయునో వానిపుణ్యమును వినుమని హయగ్రీవుఁ డగస్త్యునితో చెప్పుచున్నాఁడు.

ఈజన్మమున సకలసంపదలుకలవాఁడై సకలకోరికలను పొంది పుత్రపౌత్రాది సకలభోగముల ననుభవించి అంతమందు ఈశ్వరాదుల చేతను కూడ కోరఁదగిన దుర్లభమైన లలితాదేవి సాయుజ్యమును పొందుచున్నాఁడు.

యస్సహస్రం బ్రాహ్మణానా మేభిర్నామసహస్రకైః. ౬౧
సమర్చ్య భోజయే ద్భక్త్యా పాయసాపూపషడ్రసైః,
తస్మై ప్రీణాతి లలితా స్వసామ్రాజ్యం ప్రయచ్ఛతి. ౬౨
న తస్య దుర్లభం వస్తు త్రిషు లోకేషు విద్యతే,

తా. ఎవరు బ్రాహ్మణసహస్రమును ఈ సహస్రనామములచేత గంధపుష్ప ధూపదీపాదులతో పూజచేసి ఆయా నామదేవతలనుగా భావించి భక్ష్యభోజ్య షడ్రసయుక్తముగాను, దక్షిణతాంబూలాదులతో నివేదన చేయుదురో, వారికి శ్రీలలితాదేవి సామ్రాజ్యమును ఇచ్చుచున్నదని భావము. ఆచరణవిధికి సహస్రబ్రాహ్మణసమారాధన మేకదినమున జరిగించుట దుర్లభముగాన దినత్రయ షోడశదిన షట్త్రింశద్దినములచేఁ బ్రత్యేకముగా యథాసంభవముగాఁ జేయవలెనని భావము.

నిష్కామముగా చేయునప్పుడు ఎట్టినిర్బంధములును లేవు. దేవత క్షమించునని భావము. ఇది దక్షిణమార్గము సమయాచారవిధి. ఇచటఁ గొందఱు వ్యాఖ్యాతలు వామాచారపరముగా తిథినిత్యాపూజాదికము

షోడశ బ్రాహ్మణభోజనాదికము ముందుచేసి తరువాత సహస్ర బ్రాహ్మణ భోజనసంకల్పమును అర్చనను చేయవలయుననియు, 'పూజయామి తర్పయామి' అనియు, 'సంస్కృతైః స్వహేతుకైః సంతర్ప్య' అనియు, స్నానాచమన వస్త్రాభరణాంతమందు పుష్ప ధూపదీపాదికము నిత్యారూప బ్రాహ్మణునకు సంస్కృత హేతుకలశ ద్రవ్యము తర్పణమును జేయుమని తమ వ్యాఖ్యానమందు వ్రాసిరి. సమయమతముచేత తర్పణశబ్దము పూజాపరము తాంబూలదక్షిణాంతమందు విశేషార్ఘ్యపాత్రస్థ క్షీరముచేతగాని, సామాన్యార్ఘ్యోదకముచేతగాని, 'మూలేన త్రిస్సంతర్ప్య' అని కల్పసూత్ర పూజాఖండమందు నిత్యపూజ సమష్టిగా నిర్దేశించియున్నందున దేవతకు పూజాంతమందు తర్పణము చేయవలెను. ఎటుల రుద్రన్యాస పూజాంతమందు 'భవం దేవం తర్పయామి' భవస్యదేవస్యపత్నీం స్తర్పయామీతి, 'ప్రసిద్ధం తథైవ సమయమతేఽపి' కౌలమతముగా చెప్పిన వ్యాఖ్యాతల తాత్పర్యమువలన పూజింపఁబడు బ్రాహ్మణులకు తర్పణము సజీవులకుఁ ఉండునా? పితృతిథినాఁడు అర్చనమువలెనయిన వారివారి సంబంధులా' ఉపాసకులా? తర్పణమును వారికిఁ జేయవలెను. ఈతర్పణము తిలసహితమా? అక్షతసహితమా? సంస్కృతహేతుకలశద్రవ్యమును తర్పణము చేయుటయా ఆబ్రాహ్మణులకు ప్రాశనచేయించుటయా ప్రాశనపక్షమందు ఆబ్రాహ్మణులకు ధర్మశాస్త్రరీతిగా సురాపానప్రాయశ్చిత్తము ఉన్నదా లేదా సంస్కృతద్రవ్యమైన ఆద్రవ్యమందు దుర్గుణ దుర్వాసనలు వదలినవా ఈసంశయములు కలుగుచున్నవి. ఇట్టివ్రాతలవలన వీరు వామ కౌలాచారపరులని స్పష్టమగుచున్నది. ఇవి బ్రాహ్మణుల కనర్హములని శ్రీగౌడపాదాచార్య శ్రీశంకరాచార్య శ్రీవిద్యారణ్యాచార్య విరచిత సుభగోదయ సౌందర్యలహరీ సదాచారదీపికలను, వారివారిచే రచింప బడిన గ్రంథస్థవచనములును సనకాది సంహితావచనములును బ్రాహ్మణేతరులకు వామకౌలాచారము లని తెలుపుచున్నవి. బ్రాహ్మణులకు కౌల వామాచారము లుండుట తేజస్తిమిరన్యాయము అప్రసిద్ధము. పైని చెప్పిన వైదికాచార్యమతవిరుద్ధముగా నాచరించిన బ్రాహ్మణులు పంక్తిబాహ్యులు. సురాపాన ప్రాయశ్చిత్తార్హులు అట్టివారు బ్రాహ్మణులచేత

బహిష్కారార్హులుగా నున్నారు. అని నిస్సంశయముగాఁ దెలియఁబడు చున్నది. ఆగమము వేదావిరుద్ధము వేదబాహ్యము అని రెండువిధములు. వేదావిరుద్ధము మంత్రశాస్త్రము బ్రాహ్మణార్హములు. వేదబాహ్యములు పాంచరాత్రము పాశుపతము కేవలశాక్తములో వామకౌల మతములు మొదలగునవి బ్రాహ్మణేతరులకు విహితములుగా నున్నవిగనుక బ్రాహ్మణులకు తంత్రములును తదనుసారమైనకౌల గ్రంథవచనములును ప్రమాణములుగా నేరవు. 'పశ్చాత్తాపేన శుధ్యతి, అను వచనమువలన ప్రాజ్ఞులయిన వారు అజ్ఞానకృతమైన దురాచారమువలన పశ్చాత్తప్తులై సదాచారావలంబనను పొందుదురని ఈ వ్యాఖ్యాతప్రార్థనము కులాచారత్యాగము అన్యమతావలంబనము ఇహపర ఫలహానికరము.

శ్లో. "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"

అని గీతావచనము.

ఇచట నిధనమనఁగా ఉభయము మాని తూష్ణీంభావము అని భావము. పశ్చాత్తప్తులైనట్టివారికి తిరిగి సద్యమార్గావలంబనకు విధి ఉపోద్ఘాతమందు లిఖింపఁబడుచున్నది. దానిని మాచి శ్రేయస్సును పొందుదురని పరదేవతను వ్యాఖ్యాత ప్రార్థించుచున్నాఁడు.

ఈ నామసాహస్రపాఠము కామ్యముగాని, నిష్కామముగఁ గాని చేయు ఉపాసకులకు మూఁడులోకములంగును అసాధ్యము లేదని భావము.

నిష్కామః కీర్తయేద్యస్తు నామసాహస్రముత్తమమ్. ౬౩
బ్రహ్మజ్ఞానమవాప్నోతి యేన ముచ్యేత బంధనాత్
ధనార్థీ ధనమాప్నోతి యశోఽర్థీ చాప్నుయాద్యశః. ౬౪

తా. నిష్కామముగాఁ బారాయణము చేసినపుడు బ్రహ్మజ్ఞానము కలుగుచున్నదనియు, ధనార్థి నామపారాయణ చేసినచో గొప్పధనవంతుఁ డగునని భావము,

విద్యార్థీ చాప్నుయా ద్విద్యాం నామసాహస్రకీర్తనాత్,
నానేన సదృశం స్తోత్రం భోగమోక్షప్రదం మునే. ౬౫

తా. విద్యను కోరువారికి విద్యయును ఉపాసకులకు మోక్షమును భోగమును ఇచ్చుటకు ఈనామ సహస్రస్తోత్రమువంటిది మఱియొకటి లేదు. అని అగస్త్యునకు హయగ్రీవుఁడు చెప్పెనని భావము.

కీర్తనీయ మిదం తస్మా ద్భోగమోక్షార్థిభి ర్నరైః,
చతురాశ్రమనిష్ఠై శ్చ కీర్తనీయమిదం సదా. ౬౬

తా. ఇహసుఖములను మోక్షమును గోరువారు అవశ్యము ఈనామ పారాయణము చేయవలెను. బ్రహ్మచారి గృహస్థు వానప్రస్థుఁడు సన్యాసి ఈనాలుగు ఆశ్రమములవారికిని ఈనామపారాయణ ఆవశ్యకమని భావము.

స్వధర్మసమనుష్ఠాన వైకల్యపరిపూర్తయే,
కలౌ పాపైకబహుళే ధర్మానుష్ఠానవర్జితే. ౬౭
నామసంకీర్తనం ముక్త్వా నృణాం నాన్యత్పరాయణం,

తా. బ్రహ్మచారి మొదలు నాలుగాశ్రమములవారును తమతమఆశ్రమ ధర్మలోప పూర్తికొఱకు ఈ నామపారాయణ చేయవలెనని భావము.

పాపకర్మలయం దాసక్తియు, పుణ్యకర్మలయం దశ్రద్ధయుఁగల ఈకలియుగమందు లలితాసహస్రనామపారాయణకంటె మనుష్యులను తరింపఁ జేయునది మఱియొకటిలేదని భావము.

లౌకికా ద్వచనా న్ముఖ్యం విష్ణునామానుకీర్తనమ్, ౬౮
విష్ణునామ సహస్రాచ్చ శివనామైక ముత్తమం,
శివనామ సహస్రాచ్చ దేవ్యా నామైక ముత్తమమ్, ౬౯

తా. లోకమందున్న వాక్యములకంటె విష్ణునామస్మరణ ముఖ్యము.

విష్ణుసహస్రనామస్మరణకన్న ఒకశివనామము శ్రేష్ఠము. శివనామసహస్ర పారాయణకంటె దేవీనామమును ఒకమాఱు స్మరణచేయుట ముఖ్యమని భావము.

దేవీ నామసహస్రాణి కోటిశ స్సంతి కుంభజ,
తేషు ముఖ్యం దశవిధం నామసాహస్రముచ్యతే. 20

తా. ఓ అగస్త్యఋషీ! దేవీనామములు అనేకసహస్రములు అనేక శక్తుల ప్రీతికొఱకు ఉత్పన్నమైనవి. వానిలో పదివిధములుమాత్రము ముఖ్యపక్షములుగా నున్నవి.

గంగా భవానీ గాయత్రీ కాళీ లక్ష్మీ సరస్వతీ,
రాజరాజేశ్వరీ బాలా శ్యామలా లలితా దశ. 21

తా. శక్తినామములు అనంతములుగా నున్నవి. వానిలో గంగా, భవాని, గాయత్రి, కాళి, లక్ష్మి, సరస్వతి, రాజరాజేశ్వరి, బాల, శ్యామల లలిత యను ఈపదిదేవతల సహస్రనామస్తోత్రములు ఉత్తమములు.

రహస్యనామసహస్ర మిదం శస్తం దశస్వపి,
తస్మాత్సంకీర్తయే న్నిత్యం కలిదోషనివృత్తయే. 22

తా. పైనిచెప్పిన దశవిధసహస్రనామములలో ఈ లలితారహస్య నామ సహస్రస్తోత్రము ముఖ్యమైనది గనుక కలిదోషము పోవుటకు నిత్యము ను ఈ రహస్యనామస్తోత్రమును పారాయణచేయవలెనని భావము.

ముఖ్యం శ్రీమాతృనామేతి న జానంతి విమోహితాః,
విష్ణునామపరాః కేచిచ్ఛివనామపరాః పరే. 23
న కశ్చిదపి లోకేషు లలితానామతత్పరః,

తా. లోకమందు జనులు అజ్ఞానముగలవారై శ్రీదేవియొక్క నామములు ముఖ్యమని తెలియక కొందఱు విష్ణునామపరులుగాను కొందఱు శివ

17

నామపదములుగాను ఉన్నారు. అన్నిటికంటె లలితాసహస్రనామములు ఇహాపరములకు ముఖ్యమయినవి. ఈలలితానామపారాయణమందు లోకమందు ఎవరికి శ్రద్ధలేదు.

యైశ్చాన్యదేవతానామ కీర్తితం జన్మకోటిషు. 24
తస్యైవ భవతి శ్రద్ధా శ్రీదేవీనామకీర్తనే,

తా. ఎవరు ఇతర దేవతానాములను కోటిజన్మములయందు పారాయణచేయుదురో వారికి ఆ పుణ్యాఫలముచేత నీ లలితానామములందు భక్తి కలుగును.

చరమే జన్మని యథా శ్రీవిద్యోపాసకో భవేత్. 25
నామసాహస్రపాఠశ్చ తథా చరమజన్మని,

తా. ఎట్లు శ్రీవిద్యోపాసన చరమజన్మమందు లభించుచున్నదో అటులనే లలితానామములయందు శ్రద్ధయు కడపటిజన్మమందే లభించుచున్నది. శ్రీవిద్యోపాసకులకును శ్రీదేవీనామపారాయణులకును ఈజన్మతో మరల జన్మారంభముసమాప్తి అనియు, అట్టిజ్ఞానోదయమై ముక్తిని పొందుదురనియు భావము. శ్రీవిద్యయే బ్రహ్మవిద్యయనియు లలితానామ సహస్రము బ్రహ్మజ్ఞాన సాధనగ్రంథములలో ముఖ్యమైనదని భావము.

యథైవ విరళా లోకే శ్రీవిద్యాచారవేదినః. 26
తథైవ విరళా లోకే నామసాహస్ర పాఠకాః,

తా. శ్రీవిద్యోపాసకులు 'లోకమందు ఏరీతిని తక్కువగానున్నారో ఆరీతినే ఆ ఉపాసకులలోను నామపారాయణశ్రద్ధ కలవారు కూడ చాలతక్కువగానే యున్నారని భావము.

మంత్రరాజజపం చైవ చక్రరాజార్చనం తథా. 27
రహస్యనామపాఠశ్చ నాల్పస్య తపసః ఫలం,

తా. శ్రీవిద్యోపాసనయు, శ్రీచక్రార్చనయు, రహస్యనామ పారాయణయు, అల్పతపస్సుగలవారికి లభింపవనియు, గొప్పతపఃఫలము చేతనే ఈమూఁడును లభించుననియు, ఈమూఁడును బ్రహ్మప్రాప్తికి సాధనములనియు, వీరు జీవన్ముక్తులనియు భావము.

అపఠన్నామసాహస్రం ప్రీణయేద్యో మహేశ్వరమ్. ౨౮
స చక్షుషా వినా రూపం పశ్యేదేవ విమూఢధీః,

తా. ఈరహస్యనామ సహస్రపారాయణచేయక శ్రీదేవికి సంతోషము కలుగఁజేయుట నేత్రములులేనివాఁడు రూపమును చూచినట్లని భావము నామపారము లేనిది శ్రీదేవికి అనుగ్రహము కలుగదని భావము.

రహస్యనామసాహస్రం త్యక్త్వా యస్సిద్ధికాముకః. ౨౯
స భోజనం వినా నూనం క్షున్నివృత్తి మభీప్సతి,

తా. ఈ రహస్యనామపారాయణలేక మంత్రసిద్ధిని కోరుట భోజనములేక క్షుద్బాధ పోవుటకు ప్రయత్నించుటవంటిదని భావము. నామపారాయణచేయుట లలితాప్రీతికి ముఖ్యసాధనము.

యో భక్తో లలితాదేవ్యాస్స నిత్యం కీర్తయే దిదమ్ ౩౦
నాన్యథా ప్రీయతే దేవీ కల్పకోటిశతైరపి,
తస్మా ద్రహస్యనామాని శ్రీమాతుః ప్రయతః పఠేత్. ౩౧

తా. ఎవరు లలితాభక్తులో వారు నిత్యము రహస్యనామపారాయణ చేయవలెను. వందలకొలఁది కోట్లకొలది ఇతరపుణ్యములుచేసినను శ్రీదేవియొక్క అనుగ్రహములు పొందలేరని భావము. అందువలన శ్రీదేవియొక్క భక్తులు శ్రద్ధతో ఈ రహస్యనామపారాయణ తప్పక చేయవలెనని భావము.

ఇతి తే కథితం స్తోత్రం రహస్యం కుంభసంభవ,
నావిద్యావేదినే బ్రూయా న్నాభక్తాయ కదాచన. ౩౨

తా. ఓ అగస్త్యమునీ! ఈరహస్యమైన లలితాసహస్రనామస్తోత్రమును నీకొఱకుం జెప్పితిని. శ్రీ దేవియొక్క ఉపాసకులుకానివారికి భక్తిలేనివారికిని నీవెప్పుడును ఉపదేశింపంగూడదు. బాలామన్త్రమైన నుపదేశము లేనిదే యీరహస్యనామపారాయణమున కధికారములేదని భావము.

శ్రీచక్రార్చనకు షోడశీమంత్రదీక్ష ఎటుల ప్రధానమో, అటులే బాలామంత్రపరులకుంగాని నామపారాయణయం దధికారములేదని భావము.

యథైవ గోప్యా శ్రీవిద్యా తథా గోప్యమిదం మునే,
పశుతుల్యేషు న బ్రూయాజ్జనేషు స్తోత్ర ముత్తమమ్. ౮3

తా. శ్రీవిద్య యేరీతిని గోప్యమో, అటులే ఈ రహస్యనామములును గోప్యముగా నుంచవలెను. పశుతుల్యులైన మూర్ఖుల కుపదేశింపంగూడదని భావము.

యో దదాతి విమూఢాత్మా శ్రీవిద్యారహితాయ చ,
తస్మై కుప్యంతి యోగిన్య స్సోఽనర్థ స్సుమహా న్స్మృతః.

తా. తెలియనివాండై శ్రీవిద్యారహితులకు ఉపదేశించినయెడల వానియందు యోగినుల కాగ్రహము వచ్చును. గొప్పయనర్థముజరుగునని భావము.

రహస్యనామసాహస్రం తస్మా త్సంగోపయే దిదం,
స్వాతంత్ర్యేణ మయా నోక్తం తవాపి కలశీసుతే. ౮౫
లలితాప్రేరణేనైవ మయోక్తం స్తోత్ర ముత్తమం,

తా. అందుచే నీరహస్యనామస్తోత్రమును గోప్యముగా నుంచవలెను. నీకుం గూడ నేను స్వతంత్రించి చెప్పలేదు. శ్రీదేవియొక్క ఆజ్ఞాప్రకారమే నీకు నేను ఉపదేశించినాను. కావున నీవును పూర్తిగా విచారించియే తగినవారి కుపదేశింపవలెనని హయగ్రీవు లగస్త్యుల కాజ్ఞాపించినారు.

కీర్తనీయ మిదం భక్త్యా కుంభయోనే నిరంతరమ్. ౮౬

ఆంధ్రతాత్పర్యసహితము

తేన తుష్టా మహాదేవీ తవాభీష్టం ప్రదాస్యతి,

తా. అగస్త్యమునీ! నిత్యము నీవు ఈ లలితా సహస్రనామస్తోత్రమును పారాయణము చేయుము. దానిచే శ్రీదేవి సంతోషించి నీకు సకలాభీష్టములను యిచ్చును.

సూత ఉవాచ :-

ఇత్యుక్త్వా శ్రీహయగ్రీవఃధ్యాత్వా శ్రీలలితాంబికామ్.౮౩
ఆనందమగ్నహృదయ స్సద్యః పులకితోఽభవత్,

తా. ఇట్లు చెప్పి హయగ్రీవుడు శ్రీలలితాంబికను ధ్యానించినవాడై బ్రహ్మానందమందు లీనమైన అంతఃకరణగలవాడై ఆనందముచేత రోమాంచముఁ గలవాడయ్యె నని సకలఋషులకు సూతుడు చెప్పెను.

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే ఉత్తరఖండే శ్రీహయగ్రీవాగస్త్య సంవాదే శ్రీలలితారహస్య నామసహస్రఫలనిరూపణంనామ తృతీయోఽధ్యాయః.

శ్రీలలితారహస్యనామసహస్రస్తోత్రరత్న సమాప్తమ్.

ఇది శ్రీమత్పదవాక్య ప్రమాణ పారావారపారీణధురీణ సర్వతన్త్రి స్వతన్త్రి త్రిలింగ దేశస్థ సమయాచారజీర్ణోద్ధారక ప్రకాశానన్ద నాథగురు చరణారవిన్ద సేవాపరాయణ సత్యానన్ద నాథకరకమల సంజాతాన్తేవాసులును, శ్రీమత్కౌశిక సగోత్రోద్భవ భాగీరథీరాయశాస్త్రిలవారి ద్వితీయపుత్రులును జ్ఞానానన్ద నాథ దీక్షానామవిరాజితులును అగు బ్రహ్మశ్రీ సింహంభట్ల రామమూర్తి శాస్త్రిలవారిచే వ్రాయఁబడిన బ్రహ్మాణ్డ పురాణాన్తర్గత హయగ్రీవాగస్త్యసంవాదరూప శ్రీలలితాదివ్యనామ సహస్రస్తోత్ర రత్న ఫలకథనమను మూఁడవయధ్యాయమునకు పరిమళమను నాంధ్రభాషాభాష్యము సంపూర్ణముగా వ్రాయఁబడినది.

శ్రీలలితా పరదేవతార్పణమస్తు

# శ్రీచక్ర మందుగల రహస్యార్థములు.

లోకమందు సకల దేవతలకు మంత్రములు, వారి పూజకు యంత్రములు గలవు గాని శ్రీవిద్యా శ్రీచక్రములు మాత్రము అట్టి సామాన్య మంత్ర యంత్రములు కావు. శ్రీవిద్య అన్ని మంత్రాధిదేవతలకు ప్రభువగు బ్రహ్మవిద్యగా నున్నది. దీనిపైని విద్యలు లేవు.

శ్రీచక్రము పరాశక్తి భక్తరక్షణార్థములను సగుణస్వరూపమును పొందిన స్థూలశరీరమందుగల రహస్యార్థములను తెలుపుచున్నది. పరాశక్తి సృష్ట్యాదిని బిందుస్వరూపముల ఆ బిందువు శివశక్తి సామరస్యము అదియే పరబ్రహ్మస్వరూపము. ఏకాకారముగా నున్నది. సృష్ట్యావిర్భావ కాలమందు అందున్న మాయా స్వరూప ఇచ్ఛాశక్తి యొక్క ఉద్రేకముచే బిందువు స్ఫుటితమై పశ్యంతీ-మధ్యమా-వైఖరీలను పొందినది. సృష్టి క్రమమందు పరాబిందువు ప్రథమావస్థ-వైఖరీ నాలుగవది. ప్రపంచము వైఖరిలోనున్నందున పరావస్థను పొందుటకు ఆరోహణక్రమము కలిగినది.

నాలుగవదైన వైఖరీ అకారాది హకారాంత మైన పంచాశద్వర్ణ స్వరూపమాతృకా శక్తిగా నున్నది. అట్టి మాతృకయే శ్రీచక్రాకారముగా భక్తరక్షణార్థము పరిణమించినది.

శ్రీచక్ర మధ్యబిందువు పరాస్వరూపము; బిందు వికసనము, త్రిభుజా చక్రము పశ్యంతీ స్వరూపము; అష్టకోణచక్రము, మధ్యమా స్వరూపము; మిగిలిన చక్రములు వైఖరీ స్వరూపములు.

శ్రీచక్ర మధ్యబిందువు, బీజము. అందు రెంటుదళము, జత అంకురము ఇమిడియున్నవి. మధ్య త్రిభుజమందు కోణ బిందువులు మూడును,

మధ్యబిందువు కలసి నాలుగు బిందువులు కలది. ఈ చక్రమందు ౧ బీజము, ౨ దళములు, ౩ గుణములు, ౩ మండలములు, ౪ బిందువులు, ౫ భూతములు, షడధ్వలు, సప్తధాతువులు, అష్టప్రకృతులు, నవయోగులు, అష్ట చక్రములు, ౨౮ మర్మములు, ౧౮ సంధులు, ౮ దమరుకములు, ౪౫ యోనులు, ౨౫ దళములుకలది. దళములుకలవి కమలములు, ప్రకాశాంశము శివభాగము కోణములుగలవి చక్రములు. శక్తి భాగము బిందువు, అష్టదళము షోడశదళము భూపురము, నాలుగు, శివస్వరూప ములు కమలములు, త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్ద శారము, నాలుగు శక్తి చక్రములు, కమలచక్ర మేళనమువలన నాలుగు ద్వందములు కలది. బిందుత్రికోణములు ఆది ద్వంద్వము, తక్కిన మూఁడును త్రిమూర్తి ద్వంద్వములుగా నున్నవి.

మాతృకయందు దనేక సంకేతార్థము లున్నవి. అన్నియు శ్రీచక్ర మందు గలవుగాన శ్రీచక్రము పరదేవత శారీరసంకేతములను బ్రహ్మాండ సంకేతములను తెలుపుచున్నది గనుక బ్రహ్మజ్ఞానమునకును తన నిజ రూపమును తెలుసుకొనుటకును ముఖ్య సాధనముగా నున్నది. ముందు స్థూలాకారముగా నున్న చక్ర సంకేతములను తెలుసుకొని శ్రీచక్రమును సాధక జనులు తమ శరీరమందున్న మూలాధారాది సహస్రాంతము గల స్థూల చక్రములందును భ్రూమధ్యమునుంచి ఉన్మన్యంతముగల సూక్ష్మ చక్రములందును, కేవలబిందువందే శ్రీచక్రమంతయు మూఁడు విధములుగా సామరస్యమును భావించి భావనోపనిషత్ప్రకారము ధ్యానించుటయే సమయాచారము. అంతర్యాగము అనియు, నట్టివారు బ్రహ్మవేత్తలగు దురనియు అందునిమిత్తము శ్రీవిద్యా శ్రీచక్రములు యీశ్వరునిచే నిర్మించ బడినవి.